భాగవత కథా గ్రంథమాల 52, 53 వ పుష్పము

# భక్తకుచేల



గ్రంథకర్త :

శ్రీ సంత ప్రభుదత్త బ్రహ్మచారిగారు

అనువాదకుడు :

శ్రీ [illegible] కొండమూర్తి వేంకట నరసయ్య

ప్రకాశకులు :

భాగవతకథా గ్రంథమాల,

బు[illegible] P. O. (గుంటూరు జిల్లా)

బ్రాంచీలు: [illegible], [illegible], లక్ష్మీపురం.

 1969 [వెల : 14-50

సోల్ డిస్ట్రిబ్యూటర్సు :

నటరాజు పబ్లికేషన్సు

ఏలూరు రోడ్ * విజయవాడ-2

శ్లో॥ వ్యాసశాస్త్రోప వనతః సుమనాంసి విచిన్వతా,
కృతా వై ప్రభుదత్తేన మాలా భాగవతీ కథా॥

శ్రీ కొండపల్లి ముద్రాశాల, రాజమండ్రి.

# విషయ సూచిక

—— // ——

# భాగవత కథ

## వివిధసాధనలు
## సారసిద్ధాంతము

శ్లో॥ యస్యాం నమే పావనమంగ కర్మ
స్థిత్యుద్భవ ప్రాణ నిరోధమస్య ।
లీలావతారేప్సిత జన్మ వా స్యాత్
వంధ్యాం గిరం తాం బిభృయాన్న ధీరః ॥

శ్రీభాగ. ౧౧ స్కం. ౧౧ అ. ౨౦ శ్లో॥

వ. ఏవాక్కుతో సంసారము యొక్క ఉత్పత్తి, స్థితి, గతి, ప్రళయరూపమగు నా పావనకర్మములను, లీలలను, అవతారములలోని నా జన్మలను వర్ణింపని ఆ వంధ్యావాణిని ధీరవీర పురుషుఁడెన్నిటికిని ధారణపోషణ లొనర్పఁడు.

సమస్త వేదశాస్త్రములు నొకే విషయమును గూర్చి చెప్పుచున్నవి. సంసార చింతనముచే సంసారప్రాప్తికలుగును. బ్రహ్మ, పరమాత్మ, భగవంతుఁడగు హరి చింతనముచే నాతని ప్రాప్తి కలుగును. ఎవఁడు దేనినిఁ జింతించునో, అతఁడా రూపమును జెందును. కావున నసత్తును, నశ్వరము

నగు సంసార చింతనమును వదలి సచ్చిదానందస్వరూపుఁడగు సర్వేశ్వరునే చింతింపవలయును.

సూతుఁ డిట్లనెను :- "మునులారా! భగవానుఁ డుద్ధవున కవధూతగీత నుపదేశింపఁగా నుద్ధవుఁ డిట్లనెను - "ప్రభూ! ప్రపంచమున మానవుని కర్తవ్యమేమి ?"

భగవానుఁడిట్లనెను :- "తమతమ వర్ణాశ్రమ, కులాగతాచారములను నిష్కామభావముతో నాచరణమొనర్చుటయే అందఱకును ముఖ్య కర్తవ్యము"

ఉద్ధవుఁడిట్లనెను :- "దీనిచే నేమగును ?"

భగవానుఁడిట్లనెను :- "స్వధర్మమును నిష్కామభావముతో ననుష్ఠించుటచే నాత్మశుద్ధి కాఁగలదు. అంతఃకరణము పవిత్రము కాఁగలదు. పవిత్రాంతఃకరణముచేతనే బ్రహ్మసాక్షాత్కారము కాఁగలదు. పూర్ణజ్ఞానము కలిగినచో విధినిషేధములంతగాఁ చాటింపవలసిన పనియుండదు."

ఉద్ధవుఁడు :- "ప్రభూ! భక్తియొక్క కర్తవ్యమును గూర్చియును జెప్పుఁడు."

భగవానుఁడు :- "భక్తుఁడు సదా అహింస, సత్యము, శౌచము మొదలగు యమములు, సంతోషము మొదలగు నియమములను యథాశక్తిగఁ బాలింపవలయును. గురువు

నం దీశ్వరబుద్ధి నుంచవలయును. సద్గుణధారణము కావింప వలయును. పరనిందను బూర్తిగ వదలవలయును. గృహ, ద్వార, కుటుంబాదులయందు మమకారములను ద్యజింప వలయును. శరీరమునకు విలక్షణమగు సాక్షిరూపమగు నాత్మను అనుభవింపవలయును."

ఉద్ధవుఁడిట్లడిగెను :- "ఆత్మ శరీరమునకు వేఱుగ నెట్లున్నది ?"

భగవానుఁడిట్లనెను :- "ఇంధనములోని కగ్ని ప్రవేశించినచోఁ గాలుచుండిన కట్టెను అగ్ని అందుము. వాస్తవమున వెలుఁగుచున్నది అగ్ని. ఇంధనములో నగ్ని లేదు. ఇంధనమును గాల్చి అగ్ని తన సమిష్టి అగ్నిలోఁగలిసిపోవును. జనులగ్ని ఆఱిపోయినదనుచుందురు. అగ్ని ఆ కట్టెకు వేఱైనది. ఇదేవిధముగా స్వయంప్రకాశమగు నాత్మస్థూల సూక్ష్మ కారణ శరీరములకు అత్యంత భిన్నమైనది. ఈ రహస్యమును సద్గురువు వలనఁ దెలిసికొనవలయును. ఆత్మవిషయమున భిన్నభిన్నములకు భిన్నా భిన్నాభిప్రాయములు కలవు. అందఱును నాకే ఆత్మలు భిన్నభిన్న ప్రక్రియలలో నిరూపించుచుందురు. కొందఱు దేవుఁడు సత్యమందురు. కొందఱు స్వభావాదులు, ధర్మ వేదములే నిఃశ్రేయసమునకుఁ గారణమను చుందురు. ఇవన్నియును నాకే పేర్లు. గుణవిషమత ఉన్నంత

వలసిన భయముండును. పరాధీనతయుండును. కావునఁ త్రిగుణాతీతులము కావలయును. అప్పుడు సమస్త శోక మోహములు దూరమగును. అప్పుడు నాయొక్క యథార్థ జ్ఞానము కలుగును.

ఉద్ధవుఁడిట్లనెను :- స్వామీ! ప్రాణి పుణ్యాపాపములొనర్చును. వానికి సుఖదుఃఖములను ఫలముల ననుభవించుచుండును. వీని నుండి బయట పడుటెట్లు? ఏలననఁగా నెవఁడును గర్మచేయకుండఁ జాలఁడు. కర్మ శుభా శుభములలో నేదైనను ననుభవించి తీరవలసినదే జీవుఁడు గుణములచే బద్ధుఁడై యున్నాఁడు. అతఁడు బంధములోఁబడి తీరును. గుణముల కావల నుండినచో జీవుని బంధించుటెట్లు? శాస్త్రములలోఁ జెప్పఁబడిన మోక్షోపాయములు వ్యర్థములగును. బంధనమే లేకుండినచో ముక్తి ప్రయత్నము వ్యర్థము కాదా?"

ఇది విని భగవానుఁడు నవ్వి యిట్లనెను :- "ఉద్ధవా! ఆత్మను నేనే. నాలో బంధనము లేనే లేదు. బంధనమే లేకుండిన మోక్షప్రశ్నయే లేదు. కేవలము గుణ సంసర్గము చేతనే ఆత్మకు బద్ధ ముక్తత్వములు వచ్చుచున్నవి. వాస్తవమున బంధమును లేదు, ముక్తియును లేదు. గుణము మాయా మూలకమైనది, ప్రపంచ ప్రతీతి స్వప్న సదృశము,

స్వప్నములలోఁ గనఁబడు పదార్థములు వాస్తవముగ నసత్పదార్థములు. కాని స్వప్న మున్నంత వఱకు సత్యము వలె స్వప్నమందు సుఖ దుఃఖము లొసంగు చుండును. మేల్కాంచిన తరువాత నా పదార్థములు కనఁబడవు. వాని వలనఁ గలుగు సుఖ దుఃఖములు నుండవు. స్వప్నావస్థనుండి లేచిన వ్యక్తివలె విద్వాంసుఁడగు వాఁడు దేహములో నుండి నను నాతఁడు దేహాభిమాన శూన్యుఁడై దేహము తనకు వేఱైనదిగ ననుభవ పూర్వకముగఁ దెలిసికొనును. దేహ మందలి సుఖ దుఃఖములను స్వప్నము వలె మిథ్యగా భావించును. స్వప్నములోని మిథ్యాపదార్థముల వలనఁ దనకేమి యును సంబంధము లేకుండినను అజ్ఞాని సుఖ దుఃఖముల ననుభవించును. విద్వాంసుఁడగు జ్ఞాని తినుచున్నను, త్రాగు చున్నను లేచుచుండినను, కూర్చుండినను, నవ్వుచున్నను, ఆడుచుండినను, చదువుచుండినను, వ్రాయుచుండినను, ఇత రులు నమస్కార మొనర్చుచుండినను, సమస్త వ్యవహారము లొనర్చు చుండినను దాను మాత్రము వీని కంట కుండును. కర్తృత్వాభిమానమును బొందఁడు. ఈ కార్యములనే అజ్ఞాని యొనర్చినచో నాతఁ డహంకార కారణమున బంధములోఁ బడిపోవును. అజ్ఞాని దైవాధీనమగు శరీరము ద్వారా గుణ ప్రేరణచే, స్వతః జరుగుచుండిన కార్యములకు కర్తృత్వ మారోపించుకొని తదభిమానమున బంధింపఁ బడుచున్నాఁడు.

పర్వతములపై నెన్నియో ఆమ్రవృక్షములు పుట్టి పెరుగును, వాని కవియే ఫలించును. ఎవఁడైనను వానినిఁ దినవచ్చును. ఫరవాలేదు. ఆ టెంకయే మన యింటిలోఁబడి, చెట్టు పుట్టి పెరిగిన, దానిని మనము వేసిన చెట్టుగా భావించెదము. దానిపై మమకారమును జెందెదము, ఎవరైనను నొక పచ్చికాయను గోసినచో దుఃఖము కలుగును. రాత్రి యంత యును మేల్కొని కోఁతులను రానీయక పారద్రోలును. ఎవ రైన దొంగిలించినచో దుఃఖించెదము. పండిన పండ్ల నమ్ము కొని సంతోషించెదము. ఇతరుల పిల్లలు తినిన సంతో షింపము. తన పిల్లలు తినిన సంతోషించెదము. వాస్తవ ముగఁ జూచినచో మామిడి ముట్టె కొండమీఁద నెట్లు పడినదో, మన పెరటిలోను నట్లేపడి మొలిచినది. అచ్చట స్వభావమున నెట్లు పండ్లు పండినవో అట్లే యిచ్చటను బండ్లు పండినవి. ఇచ్చట ఫలములను దొంగిలించిన కర్తృత్వాభి మానముచే మనకు దుఃఖము కలిగినది. జ్ఞానిలోగల విశేష మేమనఁగా నీ కార్యము లన్నిటిని కర్తృత్వాభిమానము లేక చేయుచుండును.''

ఉద్ధవుఁ డిట్లడిగెను :- ''స్వామీ! మాకు జ్ఞానిని గుర్తించు టెట్లు? అతఁడేమి గ్రహించును. దేనిని విడుచును. ఎట్లు లేచును? ఎట్లు కూర్చుండును? ఎట్లు నడుచును?''

భగవానుఁ డిట్లనెను :- "జ్ఞాని కార్యములను సాధారణ పురుషుని వలెనే చేయుచుండును. కాని ఆతని వృత్తి సుఖ దుఃఖము లందును, మానావమానముల యందును, జయ పరాజయము లందును, హానిలాభము లందును, జీవన మరణము లందును, కీర్త్యపకీర్తుల యందును, నిందాస్తుతులందును, సమస్తదశలయందును సమానముగ నుండును. హింసకుఁడీతని శరీరమును గోసినను, ప్రారబ్ధవశమునఁ బూజాదులొనర్చినను నాతనికి రెండును సమానములే, ఆతనికిః ప్రాణ, మన, ఇంద్రియ, బుద్ధులందు సంకల్ప శూన్యమై యుండును. కావున నీవు నీ చిత్తవృత్తిని నాయందు లగ్నమొనర్పుము. నాకు భక్తుఁడవైనచో నీకన్ని స్థితులును వాని కవియే ప్రాప్తించును."

ఉద్ధవుఁడిట్లడిగెను:- "స్వామీ! మీ భక్తియెట్లు ప్రాప్తింపఁ గలదు ?"

భగవానుఁడిట్లనెను:- "నాభక్తి కలుగుటకు మూఁడు పాయములు కలవు."

ఉద్ధవుఁడిట్లనెను:- "స్వామీ! ఆ మూడింటిని నాకు విస్తార పూర్వకముగఁ జెప్పుఁడు."

భగవానుఁ డిట్లనెను :- "విస్తారముగఁ జెప్పుటకు వ్యవధి లేదు. నేను నేఁడే అందఱను దీసికొని ప్రభాసమునకుఁ బోవలయును. సంక్షేపముగ నీకు జెప్పెదను."

నాభక్తి కలుగుటకై సర్వప్రథమమగు నుపాయము సాధుపురుషుల సమీపమునకుఁ బోయి నాభాగవత కథలను శ్రద్ధా సహితముగ శ్రవణ మొనర్పవలయును. నాకథలను వినుచుండినచో నాయందు. నాభక్తుల చరిత్రములందును ననురాగము కలుగును కావున భక్తినిఁ బొందఁదలఁచిన వారు మునుముందుగా నిత్య నియమముతో సమస్తలోకము లను బావన మొనర్చి నాకథలయందు మనస్సును లగ్న మొనర్పవలెను.''

రెండవ ఉపాయము - నాదివ్య జన్మకర్మలను గూర్చి గాన మొనర్చుట. నాయొక్క సుమధుర పరమనిర్మల నామ ములను తాళస్వరాదులతోఁ గీర్తింపవలెను. నాయవతార చరిత్రలను గాన మొనర్చవలయును. లిఖించి ప్రచార మొనర్పవలయును. ఇతరులు గానము చేయుచుండిన వాని నను మోదింపవలయును. నా నామములను, గుణములను, రూపమును స్మరింపవలయును. నా చరిత్ర నాటకములాడ వలెను. అభినయ మొనరింపవలయును. లీలలొనర్పవలెను. అట్లు జరిపింపవలయును.

మూఁడవ ఉపాయము - ఏ ధర్మమాచరించినను, అర్థోపార్జన మొనరించినను, ఏపని చేసినను, నన్నాశ్రయిం చుచు, నాప్రసన్నతకొఱకు చేయవలయును. ఈఉపాయముల

ద్వారా సచ్చిదానందుఁడను, సనాతనుఁడను, సర్వేశ్వరుఁడను, శర్వాధారుఁడను, సర్వనియంతనగు నాయందు అవిచల భక్తి ప్రాప్తింపఁగలదు. నాభక్తినిఁ బొందుటకు పరమోపాయము సత్సంగము. సత్సంగమొనర్పఁగా, సాధుసజ్జన సమాగమము కలుగఁగా అంతఃకరణము శుద్ధమగును. దానియందు భక్తిబీజములు నాటబడును. సాధకుఁడు నాకనన్యోపాసకుఁడు కాఁగలఁడు. అట్టివానికి పరమపదము ప్రాప్తించుటలో నేశ్రమము నుండఁబోదు. సాధుసంగము ముక్తికి ద్వారము."

ఇది విని ఉద్ధవుఁడిట్లడిగెను :- "ప్రభూ ! ప్రపంచమున మీరే పరమకీర్తిశాలియగు సర్వశ్రేష్ఠులు. సాధువని యెవరినందురో చెప్పవలయును. ఏలక్షణములను గాంచి మనమీతఁడు సాధువని భావించెదము ? దయతో నాకు మీయొక్క పరమభక్తుల లక్షణములను జెప్పఁగోరుచున్నాను."

ఇది విని భగవానుఁడిట్లనెను :- "మంచిది, ఉద్ధవా! ఇప్పుడు నేను నాభక్తుల లక్షణములను గూర్చి చెప్పెదను. ఈ లక్షణములచే నా భక్తులెవరో తెలిసికొన వచ్చును."

సూతుఁడిట్లనెను :- "మునులారా ! ఇప్పుడు భగవానుని శ్రీముఖమున వర్ణింపబడిన భక్త లక్షణములను గూర్చి చెప్పెదను. మీరు శ్రద్ధతో శ్రవణమొనర్పుఁడు."

# పరమ భక్తుల లక్షణములు

శ్లో॥ జ్ఞాత్వాజ్ఞాత్వాథయే వై మాం యావాయశ్చాస్మి
యాదృశః

భజన్త్యనన్య భావేనతే మే భక్తతమా మతాః॥

శ్రీభాగ. ౧౧ స్కం. ౧౧ అ. ౩౩ శ్లో॥

వ. భగవదాయత్తంబైన యేకచిత్తంబునం బ్రసన్న చిత్తులైన వారు ముక్తులగుదురు. కావున నవిద్యా విద్యలు నామాయగా విచారించి కేవల ముపమార్గులు కాక షడ్గుణై శ్వర్య సంపన్నులైన యోగీశ్వరుల పగిది సుఖంబుగ నుండు వారలు ముక్తులగుదురు."

— * —

ప్రపంచమున నన్నియును సులభములే. ఒకరిని మించిన ధనికులొకరున్నారు. బలవంతులకును గొదువ లేదు. సింహములను బట్టుకొని చీల్చఁగలవారును, ఏనుఁగులతోఁ బోరాడఁ గలవారును, పర్వతములను మూలముతోఁ బెల్ల గింపఁ గల బలవంతులును గలరు, సంభవము నసంభవము గను, అసంభవమును సంభవముగను జేయుఁగల విద్వాంసులు కలరు. తనపిల్లలను, స్త్రీలను, ధనమును, తన శరీరము నైనను దానము చేయఁగల దాతలున్నారు. తేజస్వులుగను,

దపస్వులుగను, యశస్వులుగను నుండుటయును సులభమే; కాని సాధువులను గలిసికొనఁగలుగుట దుర్లభము, నిజమగు సాధువు సర్వత్ర లభింపఁడు.

సూతుఁడిట్లనెను :- "మునులారా! ఉద్ధవుఁడు భగవానుని సాధులక్షణములను గూర్చి అడుగఁగా భగవానుఁడిట్లనెను :- "ఉద్ధవా! సాధువులలో ననంత గుణములుండును. వారిగుణములను లెక్కింపఁగలవారెవరు నుండరు. సుమేరు కణములను లెక్కింపవచ్చును. కాని సాధువుల గుణములను లెక్కించుట అసంభవము. అయినను నేను కొన్ని గుణములను వర్ణించెదను. ఎవరిలో నీ యిరువది యెనిమిది గుణములుండునో వారిని నిస్సందేహముగ సాధువులని తెలిసికొనవచ్చును."

ఉద్ధవుఁడిట్లడిగెను :- "స్వామీ! ఆ కొన్ని గుణములనే చెప్పుడు. ఆ యిరువది యెనిమిది గుణములను వివరింపుఁడు."

శ్రీకృష్ణుఁడిట్లనెను :- "నేనీ యిరువది యెనిమిది గుణములను గూర్చి వ్యాఖ్యానించినచోఁ జాల విస్తారమగును. సంక్షేపముగ దాని నుల్లేఖించెదను."

1. కృపాళుత :- సాధువు గొప్ప కృపాళువుగ నుండును. తల్లిదండ్రులు తమ పిల్లలమీఁదను, సంబంధుల

మీఁదను గృపను జూపెదరో, అట్టులనే సజ్జనుఁడు ప్రాణి మాత్రుని మీఁదఁగృప జూచును. వారు కొందఱమీఁదఁ గృపజూపుటయును, గొందఱిమీఁదఁ జూపక పోవుటయు ననుమాట లేదు. ఆతని కృపాద్వారమందఱకును దెఱచియే యుండును. అందువలన నాతండకృత ద్రోహి యగును.

2. అకృత ద్రోహము :- సాధు వెవరితోడను వైరభావమును గలిగియుండఁడు. వైరభావము స్వార్థము వలనఁ గలుగును. మనమొక వస్తువును గ్రహింపఁగోరి, దానినే యితరులును గోరినచో, దానిని మన మీయకుండినఁ బరస్పరము ద్రోహము కలుగును. సాధు వే వస్తువును గోరఁడు. ఆతఁడా వస్తువును లెక్కపెట్టనే పెట్టఁడు. ఇంక నాతఁడు ద్రోహమేమి యొనర్చును ?

3. క్షమాశీలత :- సాధువులలో క్షమ అధిక ముగ నుండును. తన కపకారము చేసినవానికి మరల నప కారము చేయవలయునను భావన మానవునకు స్వాభావిక ముగ నుండును. మనలను హింసించినవారికి ప్రతిహింస చేయ వలయునను సంకల్పమేర్పడును. సాధువులలో నిట్లుండదు. వారు చందనము వలె నుందురు. దాని నెంతగా నూరిన నంతటి సుగంధము దాని నుండి వెలువడును. అగ్నిలోఁ గాల్చినను నది దాని సుగంధమును వెలువరచును. గొడ్డలి

తోఁ గొట్టినను దాని ముఖమునకు సుగంధము నొసంగును. సాధువు చెఱకువలె నుండును. నెంతగా నొత్తిన నంతటి రసము వచ్చును. అదే విధముగ సాధువు అపకారికిని ముఖమునకుఁ దీపి కలిగించును. వీనికిని రసము నొసంగును. సాధువు వృక్షమువలె నుండును, దానినిఁ దెగఁగొట్టు వానికిని ఛాయ నొసఁగును. రాళ్లు విసరి కొట్టువానికి ఫలముల నొసఁగును. తెగఁగొట్టు వారికిని అన్నము వండు కొనుటకు గట్టెల నొసఁగును. సాధువు పసువువలె నుండును. దానినిఁ బిండిగాఁ గొట్టువాని చేతినిఁ బచ్చగ నొనర్చును. సాధువునకు ఇతరుల కపకార మొనర్చుట తెలియదు.

4. సత్యశీలత :- సాధు స్వభావము సత్యమును బలుకుట. ఆతఁ డెన్నడును నసత్య భాషణ మొనర్పఁడు. దేనినిఁ జూచునో, వినునో, అనుభవించునో దానినిఁ జెప్పును. ఆతని మనస్సున ఛల కపటము లుండవు. ఆతఁడు మాటను దాచుట యెఱుఁగఁడు. సత్యమును అమాయకపు బాలుని వలెఁ జెప్పివేయును.

5. శుద్ధచిత్తము :- సాధువుల చిత్తము విశుద్ధముగ నుండును. ఆతఁడు మోసపు మాటలను లోపలకు రానీయఁడు. ఏమాత్రపు చెడ్డలోనికి వచ్చినచో భయపడును. ఉపాసన చేయఁగా నాతని చిత్తము శుద్ధమగును. ఆతనిలో మలినతా గంధ మేమియు నుండదు.

6. సమదర్శిత్వము :- మానవ స్వభావము ఎవరి మీఁద మమకారముండునో, వారికి నొసంగుటకు విశేష ధ్యానముంచెదరు. మనకు మమకారముండిన వస్తువును మనము గ్రహించెదము. ఇతరులకేదైన నీయవలసి వచ్చిన దానిలో మనకుఁ బనికిరాని వస్తువు నొసంగెదము. సాధువులలో నీ వస్తువుండదు. వారికి వీరు ధనికులు, వీరు బీదవారు, వీరు పెద్దలు వారు చిన్నలను భేదముండదు. అందఱ మేలును గోరుచుందురు.

7. సర్వోపకారకము :- సాధువుల సమస్త కార్యములును బరోపకారము కొఱకే యుండును. గృహస్థుడు తానేదైన గృహమును నిర్మించుకొనినచో నీ గదిలో మాకుమారుఁ డుండఁగలఁడు, ఇచ్చట మా కోడలుండును, ఇచ్చట మా కూఁతురుండునని భావించును. కాని సాధువేదైనను గృహమును నిర్మించిన నందఱ కొఱకును నిర్మించును. గృహస్థు తోట వేసినచోఁ దన కొఱకే వేసికొనును. సాధువు తోట వేసినచో నందఱ కొఱకును, పరోపకారము కొఱకును, భగవత్సేవ పూజలు కొఱకును వేయును. దాని వలన సుఖ సంతోషములను బొందుట కందఱు నధికారులే. ఆతఁడు దానిని గనిపెట్టువాఁడ ననుకొనును. ఆతని సమస్త కార్యములు పరోపకారభావన కొఱకే యుండును.

8. నిష్కామము :- మనస్సులోనికి గామవాసన వచ్చినచో బుద్ధిభ్రష్టమగును. సదసద్వివేక ముండదు. లజ్జా, శీల, సంకోచము లన్నియును నశించును. కాని సాధుపురుషుఁడు దీని కపవాదముగ నుండదు. అసలాతనికిఁ మనస్సులో గామవాసన యుండనే యుండదు. ఒక వేళ కామవాసన కలిగినచో నాతని బుద్ధి చెడిపోదు. ఆతని జ్ఞానము చెడిపోదు.

9. సంయమము :- సాధు పురుషుని యొక్క జీవిత మంతయును సంయమముగ నుండును. ఆతని కార్యము లన్నియును సంయమ పూర్వకముగ నుండును. వారు సంయమముతో నుందురు. సంయమముతో భుజించెదరు. సంయమముతో మాటలాడెదరు. సంయమముతోఁ గార్యము లొనర్చెదరు. సంయమముతో నిద్రించెదరు. సారాంశ మేమనఁగా వారి కార్యము లన్నియును సంయమ పూర్వకముగ నుండును.

10. మృదుల స్వభావము :- సాధువుల స్వభావము కఠోరముగ నుండదు. పరదుఃఖమును గాంచిన వెంటనే వారు కరిగిపోవుదురు. వారి స్వభావ మత్యంత కోమలముగ నుండును. భగవంతుని కథలను వినినను, భగవన్నామ కీర్తన మొనర్చినను వారి హృదయము కరిగి, నీరు నీరై

నేత్రముల ద్వారా వెలువడును. వారెవరితోనైన మాట లాడుచుండిన వారిపై నమృతము గ్రుమ్మరించు చున్నాఁడా యనునట్లుండును. పరదుఃఖములను గాంచినచో వారు దయార్ద్రహృదయములగుదురు. వారేమి చేసినను, చేయ వలసి యుండినను వెనుకాడక సహాయ మొనర్చెదరు.

11. సదాచారము :- సాధువుల ఆచారము సత్పురుషులకు వలె నుండును. వారుత్తమాచారములను సదా పాలించుచుందురు. దురాచారముల వైపు కన్నెత్తి యైనను జూడరు. పరస్త్రీని దల్లివలెఁ జూచెదరు. పరధనములను మృత్తికవలెను, తన యాత్మ సర్వభూతాత్మగను జూచు కొనును. సాధువు సదాచారి.

12. అకించనత్వము :- తనవారెవరైన నుండినచో వానికి గర్వము కలుగును. నావద్ద ఇంత ధనమున్నది. నేనింతటి విద్వాంసుడననుకొనును. కావున సాధువులు సమస్తమును భగవదర్పణమొనర్చెదరు. తమ సర్వస్వమును భగవదర్పణము కావించి తాము అకించనులగుచుందురు. కోశాధికారివద్ద కోట్లకొలఁది రూప్యములున్నను, అవి తనవని స్వప్నమందైనను ననుకొనఁడు. భగవదనుగ్రహమునఁ దన నిర్వాహము కొఱకెంత లభించునో దానితోడనే తృప్తిం జెంది తన నిర్వాహమును గావించుకొనును. అతని చిత్తము చంచల

మైనపుడు స్వామి ధనమును దనదే యనుకొని తన స్థానము నుండి చ్యుతుఁడగును. పట్టుబడి కారాగృహావాసమును బొందును లేదా యమలోకమునకుఁ బోయి యమయాతనలను బొందును. అందువలన సాధువు తనదనున దేదియును నుంచుకొనఁడు. సమస్తమును భగవానున కర్పించి తాను నిష్కించనుఁడగును.

13. నిస్పృహః- కోరిక వలననే దీనత్వము వచ్చును. మన మన్యులసమ్ముఖమున దీనుల మేల కావలయును ఏల తలవంచవలయును? ఎందువలననఁగా నేదియో కోరుచున్నాము కాఁబట్టి. ఒక ధనికునిఁగాంచిన నీతఁడు మన కేదైన నిచ్చిన బాగుండునని ఆతని గాంచఁగనే దీనుఁ డగును. ఏదో బులిబుచ్చికపు కపటపు పలుకులను బలికి ఆతనిఁ బ్రసన్ను నొనర్చుకొనఁదలఁచును. ఆతని సమ్ముఖమున విశ్వంభరుని మహిమమును మఱచును. ఈతని దగ్గఱ నుండిన లక్ష్మి భగవంతుని యైశ్వర్యముముందు సముద్రము లోని ఒక బిందువువంటిది సాక్షాల్లక్ష్మీపతి నేల నేను శరణు జొచ్చఁగూడదు? ఆతనికడ దీనత్వము నేల ప్రకటించుకొనఁ గూడదు? ఇట్టి వానికి లోకమునేలు చక్రవర్తియును, అతి దరిద్రుఁడైనను నొకటిగనే కనఁబడుచు. అన్నిటియెడల నిస్పృహుఁడై నిరంతరము నారాయణస్మరణ మొనర్చుచు నాతని శరణమునకుఁ బోవును.

14. మితాహారి :— జిహ్వా వశము నలేనివాఁడు నిరంతరము తినుచునే యుండును. ఏదైన మంచి రుచిగల వస్తువులు కనఁబడినచో రుచికొఱకు అధికముగఁ దినును. అప్పుడు కూర్చుండను లేఁడు. కాళ్ళుచాపి వేసికొనఁ జాలఁడు. పరుండియే యుండును ఉదర వ్యాధులు కలుగును. మాటి మాటికిని విరేచనములకుఁ బోవలసివచ్చును. నిరంతరము పొట్టచింతయే యుండును. చిత్తరోగమయమగును. దీని వలన జీవితములో నాహారప్రభావము పడును. కావున సాధువగువాఁడు సదా మితాహారిగ నుండవలయును. అతని భోజనసమయమున నియమముండును. పరిమాణము నియమముగ నుండును. దానిని జేయు విషయములోను, సదాచారములోను నియమముండును. అతఁడు సంయమముగఁ బరిమాణానుసారముగఁ దినును. అతఁడు భోజనము కొఱకు జీవనధారణ మొనర్పఁడు. కాని కేవలము శరీరధారణము కొఱకే మితముగను హితముగను భోజన మొనర్చును.

15. శాంతచిత్తము :— ఎవని చిత్తములో నానాకామనలుండునో వాని చిత్తమెన్నటికిని శాంతముగ నుండదు. జాగ్రత్తలో నానావిషయ చింతనమున నుద్విగ్నుఁడగును. స్వప్నమునను వీనినే కాంచుచు దుఃఖితుఁడును చింతితుఁడునగును. సాధువుయొక్క చిత్తము ఈశ్వర

సంఘటనములచే నుద్విగ్నము కాడు. ఆతఁడగాధ సము
ద్రమువలె సదా గంభీరముగ శాంతచిత్తుఁడై యుండును.

16. స్థి ర బు ద్ధి :- లక్ష్యము స్థిరముకాని వానికి బుద్ధియును స్థిరముగనుండదు. ఇప్పు డీ పనిని జేయును. దీని వలన లాభముండదని భావించుచు నింకొక పనినిఁ జేయ నారంభించును. నేఁడొక సాధనచేసి రేపింకొక సాధనను ప్రారంభించును. నేఁడొకనిమీఁద భక్తినుంచి, రేపింకొకనిపై భక్తినిఁ జూపుచు వీనిని ద్వేషించును, సాధువుయొక్క బుద్ధి స్థిరముగ నుండుటచే, నీతఁడొకే సాధనను దృఢముగ నొనర్చును. దానియందే ఆతనిబుద్ధి స్థిరముగనుంచును.

17. శ ర ణా గ తి :- సాధువు నాకు శరణాగతుఁడగును. ఆతఁడెంతటి గొప్పవానినైనను శరణువేఁడఁడు. సంసారవిరక్తుఁడై మాధవుఁడనగు నన్నే సమస్తముగ భావించి నన్ను శరణు జొచ్చును. నన్ను శరణు వేఁడినచో నాతనికి శోకమోహము లన్నియును దూరము లగును. ఏలననఁగా నాకు శరణాగతుఁడైన వానికింకఁ జేయవలసిన దేమి యుండును.

18. ము ని :- సాధారణులు లోకవ్యవహారములను నిరంతరము నోటఁ బలుకు చుందురు. పశువులు తమ సమ్ముఖమునకు వచ్చిన మేఁతను ముందుగా నమిలి మ్రింగి, తర్వాత

తీరిక చిక్కినపుడొకచోటఁ బఱుండి నెమరు వేయును. ఇదే విధముగ సాధారణులు లోక వ్యాపారములను జేయుచుండెదరు. ఏకాంతమునకు బోయినపుడును వారి మస్తిష్కమున నీ విషయములే తిరుగుచుండును. ఎప్పుడైన భజనమునకుఁ గూర్చుండినఁ జేతిలో మాల తిరుగుచుండును. మనస్సు లెక్క చూచుచుండును. వ్యాపారమును జేయుచున్నప్పుడు మనస్సెక్కడికిని బాఱిపోదు. కాని యేకాంతమున భజన మొనర్చునపుడది యెచ్చటికో జారిపోవును. ఎవఁడే కార్యము నొనర్చుచుండునో, అతఁడు నడచుచుండినను, నిలుచుండినను, కూర్చుండినను నే పనినిఁ జేయుచున్నను నా పనికే చింతించుచుండును. ఇదేవిధముగ సాధువు నిరంతరమాత్మతత్త్వమునన మొనరించుచుండును. ఆతఁడు బయటకే పనినిఁ జేయుచుండినను లోపలమదన మోహానుని మాధుర్యము నందే ఆతని మనస్సు నిమగ్నమై యుండును. మనన శీలుఁడగుట చేతనే సాధువునకు మునియను పేరు వచ్చినది.

19. ప్రమాద రాహిత్యము :– మృత్యువు సదా ప్రమాదము చేతనే కల్గును. కాలమెల్లప్పుడును నప్రమత్తముగ నుండును. ఈ జీవి విషయములలోఁ బడుటచేఁ బ్రమాదమును బొందినవాఁ డగుచున్నాడు. ఈతఁ డప్పుడాతని లక్ష్యమును మఱచి సంసారమునఁబడి తిరుగుచుండును. సాధు

ప్రమాద శూన్యుఁడై ప్రభు చింతనము నందే కాలమును గడుపును. ఆతఁడు మృత్యువును గాలఁదన్ని హరిపదమును బొందును. కావున సాధువు దగ్గఱకు ప్రమాదము రానేరాదు. ఆతఁడు నిరంతరము ప్రమాద రహితుఁడై యుండును.

20. గంభీరాత్మ :- సాధువు గొప్ప గంభీర స్వభావము కలవాఁడుగ నుండును. ఆతనిలో నెంతటి తేజస్సు, తపస్సుండునో, ఎంత గుణముండునో, దానిలోతు నెవరును నెఱుఁగఁ జాలరు. తన్నుఁ గూర్చిన ప్రశంసను దన నోట నెన్నడును జెప్పుకొనఁడు. ఎవరైన తన త్యాగ, తప, సదాచారములను గూర్చి అందఱ యెదుటఁ బ్రశంసించు కొనిన నాతఁడు క్షుద్రుడు, ముఖప్రీతిగ మాటలాడువారు. దంభుఁడు. ఆతని లోతు కనుఁగొనవచ్చును. గంగలోఁ గొంచెముగఁ బారుచుండిన శబ్దమెక్కువ చేయును. అగాధ జలమున్న చోట గంభీరత వచ్చును. అచ్చట శబ్దముండదు. ప్రశాంతముగ నుండును.

21. ధైర్యవంతుఁడు :- మనష్యుని యొక్క స్వభావము, తన యెదుటకు వికారమును గలిగించు వస్తువు వచ్చిన యెడల చిత్తము చంచల మగును. కాని సాధు స్వభావ మట్లుండదు. సుందరాతి సుందరవస్తువు ఎదుటకు వచ్చినను నాతని చిత్తము చంచలింపదు. రుచిగల భోజన

మెదుట నుంచినను నాతని నోట నీరూరదు. సుందర సంగీత
శబ్దము శ్రవణేంద్రియమునఁ బడినచోఁ జిత్తమున నే వికార
మును గలుగఁబోదు. కోమలాతి కోమల వస్తువాతని స్పర్శించి
నను నాతని చిత్తమున నేవిధముగను వికారము కలుగదు.
ఆతఁడు ధీరతతో నాతని స్వరూపమున నుండును.

22. షడ్గుణజితుఁడు :- అందఱ అంతఃకరణము
లందు తరంగము లుబుకుచునే యుండును. వానిలో నాఱు,
ముఖ్యములు. వానిని షడూర్ములందురు. ఆఁకలి, దప్పిక,
శోక, మోహ, జనన, మరణ చింతల మీఁద సాధువు
విజయమును బొందును. ఆతని నీయూర్ములు క్లేశమును గలి
గింపఁ జాలవు.

23. అమాని :- మానవుఁ డెచ్చటికిఁ బోయినను
మానమును గోరును. గొప్ప గొప్ప వారీ భయమున నెచ్చటి
కినిఁ బోరు. బయలు దేరరు. ఎవరి తోడను గలిసి మెలసి
యుండరు. ఏల ననఁగా వారి కెచ్చటనైనను నవమానము
కలుగునని భయము. సభకుఁ బోయినచోఁ బది సార్లు
ముందుగా మనుష్యులను బంపి యేర్పాటులను జేయించు
కొందురు. ఆసనములను నేర్పాటు చేయించు కొందురు.
సన్మానము జరుగక పోయినచో నచ్చటికి బోయి, తిరిగి
వచ్చెదరు. సన్మాన కాంక్షవలన మానవుఁడు తన్ను దాను

బుద్ధిపూర్వకముగ బంధించుకొనును. ఆతఁడు విచ్చలవిడిగ నెవరినిఁ గలిసికొనఁడు. స్వచ్ఛందముగఁ జరింపఁజాలఁడు. ఇచ్ఛానుసారముగ నవ్వఁడు. సదాశంకితుఁడై యుండును. సాధువులు మానమునకుఁ జోటీయరు. వారు బాలకులవలె నమానితులై అటునిటుఁ జరించుచుందురు. ఎవరైనఁ బది తిట్లు తిట్టినచోఁ గిలకిల నవ్వెదరు. వాని నంగీకరించినవారికే తిట్లు తగులును. సాధువా తిట్లనంగీకరింపఁడు. లక్ష్యపెట్టఁడు. ఎవరైన వచ్చి మనకు విషముకలిపిన లడ్డు నొసంగినచో దానినిఁ దినఁగానే మరణించెదము. ఎన్నిటినైనను నూర్ల కొలఁది విషపులడ్లు నెదుటఁబెట్టినను స్వీకరింపకుండినచో నవి మననేమి చేయఁగలవు? ఆతని నెవరైన గౌరవించిన దానిని గూడ అంగీకరింపఁడు. ఏదైన నున్నతాసనమునఁ దీసికొని పోయి కూర్చుండఁబెట్టినఁ గూర్చుండును. ఎవఁడైనఁ జెప్పుల వద్ద క్రిందఁ గూర్చుండ పెట్టినఁ గూర్చుండును. ఈ విధముగ సాధువు స్వభావమమానిత్వముగ నుండును.

24. మానద :- సాధువు తాను అమానియై, యితరులకు మానము నొసంగును. ఆతఁడెవరిని అవమానింపడు. అవమానించుటెవరిని? ఆతఁడు చరాచరజగత్తును దన యిష్టరూపముగఁ జూచును. ఆతఁడెవరి నవమానమొనరించినను దనయిష్టమునే అవమానించినవాఁడగుచున్నాఁడు.

కావున నాతఁడందఱను సన్మానించెదరు. అందఱను సన్మానించుటచే సాధారణులందఱు నాతనిఁ దక్కువ వాఁడని అనుకొందురు. కాని వాస్తవమున నందఱను సన్మానించువాఁడే అందఱకంటె గొప్పవాఁడు. కృపణుఁడెవరికిని ధనము నెట్లొసంగఁడో, అట్లే గర్వముగలవాఁడు హృదయపూర్వకముగ నెవ్వరిని ఆదరింపఁడు. దరిద్రులకు ధనమునొసంగిన గ్రహించినవాఁడు గొప్పవాఁడా? లేక యిచ్చినవాఁడు గొప్పవాఁడా? యనిన నిచ్చినవాఁడు గొప్పవాడగుచున్నాడు. న్నిదేవిధముగ నితరులకుమానమొసంగువాఁడు తన మానమును వృద్ధిచేసికొను వాఁడగుచున్నాఁడు. అతఁడే సన్మాన పాత్రుఁడగును కావున సాధువందఱకును మానమొసంగును.

25. సమర్థుఁడు :- సాధువు తానసహాయుఁడననుకొనఁడు. ఒకానొక రాజపుత్రుఁడు చాల చిన్నవాఁడైనను, బలవంతుఁడును బెద్దవాఁడునగు ప్రహరిని గాని, మంత్రినిగాని ఆజ్ఞాపించును. అందఱు నాతని యాజ్ఞలను పాలించుచుందురు. తాను సమర్థుఁడగు తండ్రికి పుత్రుఁడననియు, తనకును నట్టి సామర్థ్యము కలదనియు నాతని విశ్వాసము. కావున నాతఁ డెవరికిని భయపడఁడు.

26. మైత్రి .- సాధువు ఈర్ష్యాళువు కాఁడు. అతఁడందఱను ప్రేమతోఁ గలిసికొనును. అతని నెవరు కలిసి

కొన్నను నీతఁడు మానకు మిత్రుఁడును, సుహృదుఁడు నను కొనును. ఆతనిఁ గలిసికొనిన నెవరికిని నుద్వేగము కలుగదు. అందఱాతని శ్రద్ధాభక్తులతోఁ జూచుచుందురు. ఏలనఁగా నాతని స్వభావము మిక్కిలి ఆనందకరముగ నుండును. ఆతఁ డందఱను నత్యంత నిష్కపటభావముతో హృదయమును విప్పికొని కలిసికొనును.

27. కరుణామయుఁడు :- సాధువు హృదయము కరుణాభరితమై యుండును. నిండిన పాలకుండలోని పాలు ఏమాత్రము కదలినను జిలుకునటుల ఆతని హృదయమునఁ గరుణాభరితమై జిందుచుండును. ఆతని కరుణకు అంతు ఉండదు. ప్రతిప్రాణిని నాతఁడు కరుణతోఁ జూచును. సాధువు వలెఁ గారుణికుఁడీ ప్రపంచమున నింకెవఁడుండును ? సాధువు కరుణామూర్తిగ నుండును.

28. కవి :- సాధువు కవిగా నుండును. కవిత్వము చేయువాడే కవి కాఁడు. కవి అనఁగా సమ్యక్ జ్ఞానము కలిగిన ముఖ్యుఁడు. సాధువుయొక్క జ్ఞానము విశుద్ధముగ నుండును. ఆతనికి స్వార్థపరమార్థము లందేమియును సందేహ ముండదు. ఆతఁడు విద్యావిద్యల యొక్కయు, జ్ఞానాజ్ఞానముల యొక్కయు బంధముక్తుల యొక్కయు రహస్యమును తెలిసికొని యుండును.

కృష్ణచంద్రుఁడు ఉద్ధవునితో నిట్లనెను :- "ఉద్ధవా! ఈ విధముగా ఈ 28 గుణములు కలవాఁడు నిజముగు సాధువు."

"ఉద్ధవుఁడిట్లనెను. స్వామీ! మీరు సామాన్యముగా సాధు లక్షణములను గూర్చి చెప్పితిరి. నే నిప్పుడు సర్వ శ్రేష్ఠుఁడగు సాధులక్షములను గూర్చి వినఁగోరుచున్నాను."

నవ్వి శ్రీకృష్ణుఁ డిట్లనెను. "అనన్య భావముచే నాభజనమును జేయువాఁడే సర్వశ్రేష్ఠుఁడగు సాధువు. నాలుగు వర్ణములను, నాలుగు ఆశ్రమములను నేనే సృష్టించితిని. వేదము నా వాణియే. వేదమందు నేను నాలుగు వర్ణముల యొక్కయు, నాలుగు ఆశ్రమముల యొక్కయు ధర్మములను వేఱు వేఱుగా జెప్పితిని. ఈ ధర్మములను పాలించిన యే యే గుణములో నున్నదియు, త్యజించిన యే దోషము లున్నవి నేను వానిలో విస్తారముగాఁ జెప్పియుంటిని. కాని నిస్త్రైగుణ్యుఁడగు భగవద్భక్తుఁడయిన వాఁడు మూఁడు గుణములను దాటిన వాఁడగుచున్నాఁడు. నిరంతరము నా భజనమందే లగ్నమై యుండు వాఁడు వర్ణాశ్రమ ధర్మములను ఉపేక్షించుచున్నాఁడు".

అంత వుద్ధవుఁ డిట్లనియె :- "స్వామీ! వర్ణాశ్రమ ధర్మత్యాగమును బతితుఁడును జేయుచున్నాఁడు. ఏదైనఁ

దనకు వ్యతిరేకముగ మాటవచ్చిన నిట్లనుచుందురు. "లోక మును లేదు, వేదమును లేదు, సురయును లేదు, యజ్ఞమును లేదు, "వర్ణాశ్రమోనైవ కులం నజాతి" అన్నిటిని వదలి సర్వభక్షి యగును. అన్ని పనులను జేయుచుండును. అతఁడు మీ కనన్య భక్తుఁడేనా?"

భగవానుఁడిట్లనెను :- "కాదు, కాదు. అతఁడు సరిగా నరకమునకుఁ బోవును. ఆ పతితులు వర్ణాశ్రమ ధర్మ ములను దెలిసికొనఁ జాలరు. నేను వర్ణాశ్రమ ధర్మములను జక్కఁగాఁ బాటించు చుండు భక్తులను గూర్చి చెప్పు చున్నాను. కాని వారు నా ధ్యానములోఁ దల్లీనులగుటచే సంధ్యాగ్ని హోత్రములను గూడ మఱచిన వారగుచున్నారు. ఎల్లప్పుడును నా ధ్యానములో నిమగ్నులైన వారు సమస్త సాధువులలో శ్రేష్ఠులు, నే నెంతటి గొప్పవాఁడనో, నా మహిమ యెంతయో వారికిఁ దెలియును. ఎంత కృపాళుఁ డనో, భక్తవత్సలుఁడనో తెలియును అందువలన వారు లోక ధర్మములను గూర్చి చింతింపక నాధ్యానమునఁ దన్మయు లగుదురు. వారి కేమియును గర్తవ్య ముండదు."

ఉద్ధవుఁ డిట్లనెను :- "స్వామీ! మీ రెంతటి మహాత్మ్య కలవారో ఎట్లున్నారో ఈ విషయమును దెలిసి కొనిన మీ కనన్య భక్తుఁడును, ననన్యోపాసకుఁడును బరమ

పదమున కధికారి కాఁగలఁడు. కాని నీ మహిమమును దెలిసి కొనక మిమ్మనన్య భావముతో భజించిన వాని కేమిగతి కలుగును ?"

భగవానుఁ డిట్లనెను :- "అతనికిని సన్నుతిఁగ్ భజించిన వాని కేమి గతి కలుగునో అదే గతి కలుగును. కలకండను దెలిసి తిన్నను, తెలిసికొనక తిన్నను నది నోటికిఁ దీపిగనే యుండును. అమృతమును దెలిసి త్రాగినను, తెలియక త్రాగినను నది అమరునిఁగాఁ జేయును. విషమును దెలిసి తిన్నను, దెలియక తిన్నను దాని ప్రభావమును నది చూపించును. అగ్నినిఁ దెలిసి తాఁకినను, దెలియక తాఁకినను నది కాల్చి తీరును. ఇదే విధముగ నా మహిమమును దెలిసి యైనను, దెలియక అయినను అనన్య భావముతో భజించినచోఁ బరమ పదమున కధికారి యగును. ఈ ధ్యానము నాధ్యానము తప్ప అన్యధ్యానము పనికిరాదు. భజన మనన్యభావముతోఁ జేయవలయును. ఇట్లు భజన మొనర్చు వాఁడు సాధకులందఱిలో సర్వశ్రేష్ఠుఁడు. ఇట్టి స్థితి భాగవత ధర్మ పాలనము చేతను, నా పూజచేతను బ్రాప్తించును."

ఉద్ధవుఁ డిట్లనెను :- "స్వామీ ! ఆ భాగవత ధర్మము లేవి ! ఏ విధముగ మీ పూజచే నిట్టి స్థితి ప్రాప్తించును.

కృపతోఁ గొన్ని భాగవత ధర్మములను గూర్చి చెప్పుడు. ఆ భాగవత ధర్మములచే మీ మీఁద ననన్యభక్తి కలుగవలయును.''

ఇది విని భగవానుఁ డిట్లనెను :- ''మంచిది ఉద్ధవా! ఇప్పుడు నేను దాని ఉపాయమును గూర్చి చెప్పెదను. దాని వలన నా మీఁద ననన్యభక్తి యేర్పడఁగలదు.''

నైమిశారణ్య నివాసి శౌనకాది మహా మునులతో సూతుఁడు చెప్పుచున్నాఁడు :- ''మునులారా! భగవానుఁ డుద్ధవున కనన్య భక్తిని గూర్చి చెప్పెనో దానిని నేను మీ కిప్పుడు చెప్పఁబోవు చున్నాను. వినుఁడు.''



# సంసారతరణమునకు సరళసాధనము

శ్లో॥ ప్రాయేణ భక్తియోగేన
సత్సంగేన వినోద్ధవ।
నోపాయో విద్యతే సమ్యక్
ప్రాయేణ హి సతామహమ్ ॥

శ్రీభాగ. ౧౧ స్కం. ౧౧ అ. ౪౮ అ.

వ. "ఉద్ధవా! సత్సంగము, భక్తియోగము గాక వేఱొండుపాయము నన్నుఁబొందుట కింకొకటి లేదు. ఏల ననఁగా నేను సాధువులకు సహగామిని. ఏకమాత్రావలం బుఁడను."

ఏకర్మములచే భగవంతుని యొక్క స్మరణము కలుగునో, చింతనము కలుగునో, నామగుణకథనము నుండునో, అవన్నియును గర్మభక్తికి అంతర్గతములు. భజ సేవాయామ్, భజధాతువునకర్థము సేవించుట, భజన, భక్తి, అర్చా, పూజ, ఉపాసన ఇవన్నియును బర్యాయపదములు. ఎవఁడు సమస్తకార్యములను శ్యామసుందరుని కొఱకే యొనర్చునో, అట్టి అదృష్టవంతుఁడగు భగవద్భక్తుఁడు త్రిభువనములకు బావనము చేయువాఁడగును.

సూతుఁడిట్లనెను :- "మునులారా! ఉద్ధవుఁడు భక్తినిఁ బ్రాప్తించుట కుపాయమడుగఁగా భగవానుఁడిట్లనెను :- ఉద్ధవా! నా భక్తులసంఖ్య విధములుగ నున్నారు. వారిని నేనెంతవఱకని లెక్కింతును? సంక్షేపమున నేను చెప్పున దేమనఁగా నేవిధమగు కర్మ చేసినను నా ఆరాధనముకొఱకే చేయవలయును. ఏ కర్మవలన సంసారమంతయును మఱచి పోయి, నాయొక్కయు, నా భక్తులయొక్కయు స్మరణము నిలిచియుండునో అదియే భక్తులకు ముఖ్యమగు సాధనము."

ఉద్ధవుఁడిట్లనెను :- "ప్రభూ! నేను మిక్కిలి అజ్ఞుఁడను. మీరు నాకు కావలసిన సాధనముల పేర్లను జెప్పుఁడు. నేను జేయుదును."

నవ్వి భగవానుఁడిట్లనెను :- ఉద్ధవా! నీ కార్యములన్నియును నాకొఱకే యుండును. నీవు నాకు బాహ్యప్రాణమవు, నీవు లోకహితముకొఱకీ ప్రశ్న నొనర్చుచున్నావు. మంచిది. నీకు నేను గొన్ని విషయములను జెప్పెదను. వినుము."

1. దర్శనము :- భక్తిమార్గమునఁ బ్రథమోపాయమునఁగా దేవాలయములకుఁ బోయి నా అర్చామూర్తులను దర్శించుటయును, నా భక్తులను దర్శించుటయును, మందిరములలో నున్న భగవన్మూర్తులు భగవంతునకుఁ బ్రతీకములే. త్రిశంకును సశరీరముగ స్వర్గమునకుఁ బంపుటకై వశిష్ఠుని మీఁద పంతముచే విశ్వామిత్రుఁ డాతనిచేత నొక యజ్ఞమును జేయించెను. ఆ యజ్ఞమున కేఋషియును, మునియును, దేవతలును రాలేదు. ఋషులును, మునులును దరువాత విశ్వామిత్రుఁడు శాపమును బెట్టునేమోనను భయమున వచ్చిరికాని దేవతలు రాలేదు. విశ్వామిత్రుఁడు తన తపః ప్రభావముచేఁ ద్రిశంకుని సశరీరముగ స్వర్గమునకుఁ బంపెను. దేవతలాతని స్వర్గమునుండి ద్రోర్లించిరి. అప్పుడాతఁడు కేకలు

వేయఁగా విశ్వామిత్రుఁడు తన మంత్రప్రభావముచే నాతని నాపెను. ఇప్పుడాతనికి గొప్ప కోపమువచ్చెను. నా తపః ప్రభావమును ఈ దేవతలు గమనింపలేదని ఆతఁడు తెలిసికొనెను నూతన సృష్టి నొనరించెదను. క్రొత్త యింద్రునిఁ జేసెదను. క్రొత్తదేవతలను జేసెను, సృష్టినంతను క్రొత్తగా నొనర్చెదను. స్త్రీలవలనఁ బిల్లలు పుట్టునట్లు కాక, చెట్ల నుండి పండ్లవలెఁ బిల్లలను బుట్టునట్లొనర్చెదను." ఇట్లాలోచించి కొబ్బరికాయను నిర్మించెను. పశువులలో నొంటెను జేసెను. ధాన్యములలో మొక్క-జొన్న మొదలగు ధాన్యములను నిర్మించెను. నూతనదేవతలను, సప్తర్షులను, లోకపాలకులను నాతఁడు సృష్టించెను. ఆతని కార్యమును గాంచి దేవతలు భయపడిరి. వారు భగవానుని సమీపమునకుఁ బరుగెత్తుకొని పోయిరి. ఆతని సమాచారము నంతను జెప్పిరి. భగవానుఁడు దేవతలనందఱను వెంటఁబెట్టుకొని విశ్వామిత్రుని సమీపమునకువచ్చెను. భగవానుఁడిట్లనను — "మునివరా ! నీవేమి చేయుచున్నావు? నీవీ సృష్టిలోఁ గ్రొత్త సృష్టినేల జేయుచున్నావు?

విశ్వామిత్రుఁ డిట్లనెను :- "స్వామీ! సృష్టింపక యేమిచేయుదును ? నా మాటను వినువారే లేరు. నేను త్రిశంకునిచే యజ్ఞమును జేయించితిని. దేవతలు గర్వముచే రాలేదు. నేనాతని స్వర్గమునకుఁ బంపితిని. దేవతలాతని

గ్రిందకు ద్రొబ్బించిరి. ఇప్పుడు నూతన సృష్టి నొనర్పక యేమి చేయుదును ?"

భగవానుఁడిది విని నవ్వి యిట్లనెను :- "మునివరా! నీవు మిక్కిలి అమాయకుఁడవు. గురుశాపముచేఁ జండాలుఁడైన రాజు స్వర్గమున కెట్లు పోఁగలఁడు ? పైఁగా సశరీరముగ నెవఁడును స్వర్గమునకుఁ బోఁడు."

విశ్వామిత్రుఁడిట్లనెను :- "ఏమైనగానిందు స్వామీ! నా హఠము నెఱవేరి తీరవలసినదే."

భగవానుఁడిట్లనెను :- "మంచిది. త్రిశంకుఁ డెచ్చట నాకాశమున వ్రేలాడుచున్నాఁడో అచ్చట నేనాతని కొఱకై స్వర్గమును నిర్మించెదను. ఇప్పుడు సృష్టిచేయుటను మానుము.

విశ్వామిత్రుఁ డిట్లనెను :- "స్వామీ! నేనిందఱ దేవతలను జేసినానే వారేమికావలయును ?"

భగవానుఁడిట్లనెను :- "వీరికిని నే నేర్పాటు జేసెదను. స్వర్గమునకుఁబోయి దేవతలను సాక్షాత్తుగ దర్శింపఁజాలనివారు దేవతామూర్తులను నిర్మించి వానినిఁ బ్రతిష్ఠించి నచో నాదేవతలా ప్రతిమలం దెల్లప్పుడును నిత్యనివాస మొనర్పఁగలరు. అప్రతిష్ఠిత మూర్తులను గాంచిన సాక్షాత్తుగ దేవతలను దర్శించిన ఫలము లభించుచున్నది. నేనును

నర్చావతారవిగ్రహములందు నిత్యనివాస మొనర్చెదను. మందిరములందు ప్రతిష్ఠించిన ప్రతిమలయందు నేను సదా నివాస మొనరించెదను."

అప్పటినుండి భగవానుని యొక్క ఒక్క అవతారము అర్చావిగ్రహముగ నెన్నఁబడుచున్నది. గొప్ప గొప్ప ధామములందు భగవానుఁడు నిత్యనివాస మొనరించును. మందిరములను నిర్మించి భగవంతుని అన్య దేవతలను విగ్రహములుగఁ జేసి స్థాపించిన నచ్చటికి వచ్చి భగవానుఁడు నివసించును. కావున మందిరములకు బోయి భగవంతుని యొక్క అర్చావిగ్రహములను నిత్యమును దర్శింపవలయును. దీనిచే భక్తివృద్ధినిఁ బొందును."

సాధు దర్శనము :- భగవంతుని ప్రతిమలలో నొకటి అచల ప్రతిమ. అది మందిరములో స్థిరముగ నుండును. రెండవది చలనప్రతిమ. అది సాధురూపమును ప్రపంచమునందు దిరుగుచుండును. మందిరములోఁ బ్రతిష్ఠింపఁబడిన ప్రతిమను భక్తితోఁ బూజలొనర్చుచు చల ప్రతిమలగు సాధుసజ్జనుల పూజలొనరన్పి వారు ప్రాకృత భక్తులు. కావున భగవదర్చామూర్తికిని, సాధువునకును భేదము నెంచరాదు. ఇద్దరను సమానముగ నెంచి యిద్దరిని దర్శింపవలయును. భగవద్భక్తుఁడు భగవానునికంటె

గొప్పవాఁడు. పూర్వజన్మపుణ్యము ఉదయించినపుడు సాధు సజ్జనుల దర్శనము లభించును. సాధుసజ్జనులను దర్శింపఁగానే వారియందు భక్తి కలిగెనా ఆతఁడు తరించినట్లే. ఒక సాధువు చెట్టుక్రిందఁ గూర్చుండియుండెను. ఒక పెండ్లికొడుకు పల్లకీలోఁ గూర్చుండి పోవుచుండెను. సాధువు శాంతముగ నేకాంతమునఁ గూర్చుండుటను గాంచి, పెండ్లికొడుకు ఆతని దర్శింపఁదలఁచెను. పల్లకీనాపి అతఁడు సాధుదర్శనమునకై పోయెను. ఆతనికి భాగ్యోదయమైనది. ఆతఁడు సంసారమును దరింపవలసియుండెను. దర్శనము చేయఁగనే అతనికి సంసారము మీఁద వైరాగ్యము కలిగెను. ఆతఁడు వివాహ వస్త్రములను దీసిపాఱవైచి తాను సాధువు వెంటబడి పోయెను. చివరకాతఁడు గొప్పపేరు ప్రతిష్ఠలుగల సాధువయ్యెను. సారాంశ మేమనగాఁ సాధుదర్సన మెన్నటికిని వ్యర్థముకాదు. కొందఱకు తత్క్షణము ఫలము లభించును. కొందఱకు గొంత కాలమునకు లభించును.

౨. స్పర్శపూజనము:- నారెండు ప్రతిమలను తాకుటచేతను, బూజించుటచేతను భక్తి వృద్ధినిఁబొందును. సాలగ్రామము, తన పూజాప్రతిమములను దాఁకుటచే, సాధుసజ్జనుల చరణస్పర్శ నొనర్చుటచే భక్తి వృద్ధినిఁ బొందును. మానవుని సమస్తాంగములందును దేవతలు వచ్చియుండఁగా, ఒక్కొక్క అంగమున కొక్కొక్క అధిష్ఠాన

దేవతలు వచ్చి ఆయా యవయవములమీఁదఁ గూర్చుండఁగా నప్పుడు భగవానుఁడు వచ్చెను. దేవతలందఱిట్లనిరి :- "స్వామీ! మీరు శిరస్సుపై నుండుఁడు.

భగవానుఁడిట్లనెను:- "నేను చరణములందే యుండె దను. అచ్చటనే ఉండి అందఱ పూజలను గ్రహించుచుందును. అందువలన నప్పడినుండి చరణముల కధిష్ఠాత్ర దేవత విష్ణువు. సాధు, సజ్జన, గురుజన, బ్రాహ్మణుల చరణములందు సం తోషముతో నివసించును. ఎవరు వీరి చరణములను దాఁకెదరో వారికి భగవంతునిఁ దాఁకిన పుణ్యము లభింపఁ గలదు. దేవతా, ద్విజ, గురు, విద్వాంసులు, తల్లిదండ్రులు, జ్యేష్ఠభ్రాత మొదలగు పూజ్యులు చరణములను స్పర్శించిన భక్తి వృద్ధియగును.

3. సేవాశుశ్రూష :- స్నాన పాద్యార్ఘ్యాదులచే భగవంతుని యొక్కయు, భగవద్భక్తుల యొక్కయు సేవా శుశ్రూష లొనర్చినచో భక్తివృద్ధినిఁ బొందును. సేవ వలనఁ గాని కార్యము, ప్రపంచమున నుండనే యుండదు. సేవచే సమస్తమును బ్రాప్తించును. శబరి సేవచేతనే జగత్పూజ్య యైనది. సేవచేఁ బాషాణమును గరిగిపోవును. ఇఁక సహృ దయ పురుషుల యొక్కయు, భగవంతుని యొక్కయు హృదయములు కరుగుటలో నాశ్చర్య మేమున్నది?

4. స్తుతి, గుణ, కర్మకీర్తనములు :- స్తోత్రముల ద్వారా భగవంతుని భగవద్భక్తులను వినయ భావముతో స్తుతించుట. భగవంతుని గుణములను, ఆతని కమనీయ కర్మలను, శ్రుతమధుర సుందర నామములను నిత్య నియమముతోఁ గీర్తించుట ఇవి భక్తిని వృద్ధి పొందించుటకు సర్వ శ్రేష్ఠ సాధనము. ఎవరి గుణములను గూర్చి మనము కీర్తించెదమో ఆ గుణములు మన హృదయములోనికి వచ్చును, ఎవని కర్మలయొక్క చింతనమును, అనుకరణమును మనము చేసెదమో వారి కర్మలయందు మనకు సహజముగ నను రాగము కలుగును. గజరాజు మునిఁగి పోవునపుడు తొండమునఁ గమలమును ధరించి స్తుతించెను. దాని వలన నది సంసార సాగరమునుండి బయటపడెను. గోపికలు భగవంతుని యొక్క గుణకర్మలను గీర్తించి వారు పరమభక్తికి అధికారిణు లైరి. స్తుతి, కీర్తనములు భక్తిని వృద్ధి బొందించుటకు గొప్ప ఉపాయములు.

5. భగవత్కథలయందు శ్రద్ధ :- భగవంతుని కథలయందు శ్రద్ధ నుంచుటయే మొదటి యుపాయమును, ఇదియే అంతిమోపాయమును. సాధుదర్శనము చేసిన తరువాత మును ముందుగా భాగవత కథలను విను నవకాశము చిక్కును. కథలను వినఁగా వినఁగా భక్తుల యొక్క శరీరము లంతము లగును. వీరు కథాశ్రవణ మొనర్చుచుఁ గాలక్షేప

మొనర్చెదరు. పరిక్షిన్మహారాజు తన కాయువు ఏడు రోజులు మాత్రమే యున్నదని వినఁగానే ఆతఁడు సర్వస్వమును త్యజించి గంగా తటమునకుఁ బోయి, అచ్చట శుకమహర్షి నోట భగవత్కథలను వినుచు శాశ్వతముగ సంసార విముక్తుఁడయ్యెను. కావున భగవద్భక్తి కావలయునను కొనువారు నిత్యనియమ పూర్వకముగఁ గథా శ్రవణ మొనర్ప వలయును.

6. భగవద్ధ్యానము :- నా భగవత్స్వరూపమును నఖము మొదలు కొని శిఖ వఱకును, శిఖ మొదలుకొని నఖము వఱకును సంపూర్ణ అంగములను ధ్యానింప వలయును. ఏదో సంబంధ ముండినచే ధ్యానము వచ్చును, భగవంతునితో నే విధమగు సంబంధ ముండినను, నే భావముతో నుండినను ఆతని ధ్యానము కలుగును. ఇఁకఁ దరించుటలో సందియము లేదు మనము ధ్యానము చేసినచో మన వైపున కాకర్షింపఁ బడక పోవుట అనునది యుండదు. ధ్యానమనునది ఒక త్రాడు. అది ధ్యేయ వస్తువును దగ్గఱకు లాగి తీయును. వంశీ ధ్వనిని విని గోపికలు నాదగ్గఱకు రాసస్థలికి రాఁగనే నేను వారినిఁ దిరిగి వెడలి పొమ్మంటిని. అప్పు డత్యంత కరుణా స్వరమున గోపిక లిట్లనిరి :- "ప్రియుఁడా ! నీవు మమ్ములను నీవారలముగాఁ జేసికొనుము. కాలఁదన్నవలదు. నీవు స్వీక రించి తీరవలసినదే. నీవీ శరీరముతో మమ్ములను గ్రహించ

కుండినచో, మేము మా మనస్సులతో, నీపాదధ్యానమొనర్చి నీపాదసన్నిధినిఁ జేరఁగలము. ఈ విధముగ నాభక్తిగొలుకు ధ్యానము ఉత్తమ సాధనము.

7. సర్వలాభోపహారణము :- తనకేది లభించినదో దానిని నాకర్పింపుము. నీది యని అనుకొనకుము. అన్నాదులను జక్కఁగా పక్వమొనర్చి నాకు నివేదించుము. తోటలో పండ్లుపండిన సర్వమును నాకర్పించుము. సారాంశమేమనఁగా నాకర్పింపక జలమునైనను గ్రహింపరాదు. భగవంతున కర్పించిన దానివలనఁ గర్మబంధనము కలుగదు. ఒక బాల భక్తుఁ డుండెడువాఁడు. ఆతనికి లభించినది భగవంతుని కర్పించి తినుచుండెడువాఁడు. ఒకదినమున మార్గమునఁ బోవుచుండెను. అచ్చట నొక మంచి పక్వమైన రేఁగుపండు లభించెను. దానినిఁగోసి బాలస్వభావమున దినివైచెను. ఆ పండు కంఠముక్రిందకు బోఁగానే అతనికి జ్ఞాపకము వచ్చెను. అయ్యో దీనిని భగవానున కర్పింపక యేతింటినే అనుకొనెను. చాల ప్రయత్నము చేసెను. కాని ఫలము కంఠమునుండి బయటకురాలేదు. అప్పుడు కంఠమునుండి దానిని వెలువరించుట కాలేఁదు గట్టిగా ఁవోకుకొనఁగానే అప్పుడు నేను ప్రత్యక్షమైతిని. ఆతని యీ సర్వ లాభోపహారణ కర్మవలన నేను సంతుష్టుఁడ నైతిని. అప్పుడు నేనాతని నా పాదముల కడకు లాగుకొంటిని. సారాంశ మేమనఁగా భక్తిమార్గ

మున నీవేమిచేసినను, తిన్నను దానిని 'శ్రీకృష్ణార్పణమస్తు' అని అనవలెను.

8. దాస్యభావముతో నాత్మసమర్పణ : "ఉద్ధవా! శాంత, దాస్య, సఖ్య, వాత్సల్య మధురములను నైదుభావములు కలవు. అన్నిటిలోను దాస్యభావము ఓతప్రోతమైనది. శాంతభావమునఁ బ్రపంచమును సచ్చిదానంద రూపమునఁ జూచెదరు. చూచువాఁడు వేఱుగనే యున్నాఁడు. దాస్యభావమునఁ దాను సేవకుఁడననియు, తన యిష్టదైవము స్వామి అనియు భావించును. వాత్సల్యభావమున భగవానుఁడు బాలకుఁడనియుఁ దాను రక్షకుఁడనియు భావించును. తాను తల్లియో, తండ్రియో, గురువో అనుకొనును తల్లిదండ్రులకు తాను రక్ష్యుఁడైనను వారిలో దాస్యభావముండితీరును. అతని సేవ మిక్కిలి గౌరవముతో నొనర్చును. అతని వస్త్రములను ఉదుకును. చిన్నవి పెద్దవి సమస్తకార్యముల నొనర్చును. వాత్సల్యమున దాస్యము నిహితమై యున్నది.

ఇదేవిధముగ సఖ్యభావమందు భగవానునిఁ దనకు సమానునిఁగా భావించినప్పటికిని, అతనిఁ గొట్టుచుండినను, అతనితోఁ గలహించినను దానిలోను దాస్యభావము దాగి యున్నది. సఖునికొఱకు ప్రాణముల నర్పించుటకైనను సిద్ధపడెదరు. మధురభావము దాస్యభావము లేకున్న నిలువదు.

దానిలోని దాస్యభావము శిష్టాచార విహీనమై యుండును. ఇద్దరి హృదయములందును దాస్యముండును. ఆ దాస్యభావమే మధురరసము నభివృద్ధినిఁ గావించును. కావున దాస్యభావముతో నాత్మసమర్పణ మొనర్చుట సర్వోత్కృష్ట సాధనము.

9. నా జన్మకర్మ కథనము :- పరస్పరము చర్చించుకొనుచో నా జన్మకర్మలను గూర్చి చర్చించుము. ఏ నామములలో జన్మకర్మస్మృతి యుండునో ఆ నామములను మాత్రమే స్మరించుము. నందనందన, యశోదానందన, దేవకీనందన, వాసుదేవ, మురళీధర, గిరిధర, కాళీహా, కంసారి, మధుసూదన, గోవింద, మురారి మొదలగు నామముల నుచ్చరింపుము. నీ పిల్లల కిట్టి నామములను పెట్టుకొనుము.

10. మమపర్వాను మోదనము :- రామనవమీ, నృసింహజయంతి, కృష్ణాష్టమి, బలరామషష్ఠి, పరశురామజయంతి, వామనద్వాదశి, మొదలగు వ్రతములొనర్పవలయును. అందఱను వానినిఁ జేయుటకుఁ బ్రోత్సహింపవలెను.

11. ధార్మికోత్సవములు :- నా సంబంధమున భక్త సమాజములను సంఘటిత మొనర్చి ఉత్సవము లొనర్పవలయును. దూరదేశములనుండి భక్తిరస రసికులగు భక్తులను బిలిపింపవలయును. భగవంతుని సన్నిధానమున నాతని

యశోమునకు సంబంధించిన గానము నొనర్పవలయును. వాద్యములు వాయింపవలయును, నృత్యమొనర్పవలయును. ఉత్సవమున లీలాభినయము నొనరింపఁ జేయవలయును. ఈ విధముగ నుత్సవము లొనర్చుటచే జనులలో ధార్మికభావ సంచారము కలుగఁగలదు. నెమ్మది నెమ్మదిగాఁ జిత్తమందు ప్రభావము పడుచుండును. ఈ సాంసారిక కార్యములనుండి ఉపరమించి, చిత్తము భగవత్సేవా సంబంధములగు కార్యములందు లగ్నమగును.

12. వార్షిక పర్వయాత్ర :- నా పుణ్యస్థలములందు వార్షిక పర్వోత్సవములు అనఁగా నయోధ్యలో శ్రీరామనవమీ, వ్రజమునఁ గృష్ణాష్టమి, ఇంకను బర్వతిథులయందు మహోత్సవములు జరుగుచుండును. అచ్చటికి దమ సంబంధులతోఁబోయి, పూజార్చనల నొనర్చి, ఆస్థానములలోఁ బ్రదక్షిణ మొనర్చి, ఇంకను జేయవలసిన లౌకిక వైదిక కర్మల నొనర్పవలయును.

13. దీక్ష :- నాకు సంబంధించిన దీక్షను దీసికొనవలయును. దీక్షలు రెండు రకములు. వైదిక దీక్ష - తాంత్రిక దీక్ష. తన అధికార యోగ్యతల ననుసరించి, గురుదేవుని ఆజ్ఞప్రకారము, ఎవరికి శాస్త్రీయమంత్రమునుగైకొను నధికారము కలదో వారు సద్గురువు నాశ్రయించి దీక్షను

దీసికొనవలెను. దీక్షను గైకొని మంత్రమును జపించుటచే మంత్రశుద్ధి కలుగును. దీక్ష దీసికొనినచో దృఢమగు విశ్వాసము కలుగును. ఇంటిలో సజాతీయమగు కుమారియుండి, దానికి సంతానము కలిగినను దానిని బత్నియని యెవరు ననఁజాలరు. అందఱును దానిసుంపుడుకత్తె అందురు. ఒక పురోహితుని బిలిపించి శాస్త్రీయముగ వివాహ మొనర్చుకొనినచో నామె పత్ని కాఁగలదు. వారిద్దరును భార్యాభర్తలగుదురు తాము భార్యాభర్తలమను భావమీ సంస్కారమున దృఢపడును. కావున వైదిక, తాంత్రిక దీక్షలేర్పడినవి. దీక్షలభించుట పునర్జన్మమే. ఏమంత్రము నెవరికడ తీసుకొనునో ఆతఁడా మంత్రమునకును, గురువునకును సంబంధించిన వాఁడగును.

14. వ్రతధారణము :- ఏవ్రత నియమముల నాచరించినను నానిమిత్తముగఁ గైకొనుము. నా పర్వములందు వ్రతమును గైకొనవలయును. నా ప్రాప్తికొఱకు విశేషవ్రతమును గైకొనుము. ఫలానిసమయము వఱకు లేక జీవిత పర్యంతము ఫలానిదానిని దినను, ఫలాని కర్మ చేయను, ఫలానివస్తువు నుపయోగింపను. ఇట్టి వ్రతములను బెట్టుకొనుటచే సర్వథా నాస్మృతి యుండును.

15. శ్రీవిగ్రహశ్రద్ధ :- నా మందిరములలో నెంతటి ప్రచార ప్రసారములు జరుగునో అంతే ప్రపంచము

నందు నాయశము వ్యాపించును. నా భక్తి విస్తారము కలుగును. కావున నా మందిరములను గట్టించు వారికిని, నా ప్రతిమలను స్థాపించు వారికిని సహాయ మొనరింప వలయును. ఎచ్చట నైనను బ్రతిష్ఠ జరిగినచో నచ్చటికిఁబోయి దర్శనము చేయవలయును. యథాశక్తిగ సహాయ మొనర్పవలెను.

16. మందిర నిర్మాణము :- నామందిరములు జీర్ణములైనచో జీర్ణోద్ధారము కావింపలయును. క్రొత్త మందిరములను నిర్మించు ప్రయత్న మొనర్పవలయును. మందిరములలో నిత్యమును బూజించుటకై పుష్పముల కొఱకు పుష్ప వాటికలను వేయవలయును. దానిలో మంచి మంచి సుగంధిత పుష్ప జాతులను నాటుటకు మొక్కలను బ్రోవుచేయ వలయును. ఆ పుష్పజాతి మొక్కలను నీరు పోయవలయును. ఉపవనములను ఫల వృక్షములను నాటవలయును. నిత్యమును నాకొఱకు ఫల వృక్షములను నాటి వానికి నీరు పోయవలయును. భగవానునకు క్రీడాగృహములను, ఏకాంత మందిరములను నిర్మింపఁ జేయవలెను. తన దగ్గఱ బాగుగా ద్రవ్యముండినచో వానిని స్వయముగ నిర్మింప వలయును. అట్లు లేకుండిన వారిని వీరిని అడిగి తెచ్చి చేయింప వలయును. అట్టి సార్వజనిక ధనముచే మందిరములను వనోప వనములను నిర్మించి, జనముల వాని రక్షణకై నియమింప వలయును.

17. మందిర సేవ :- నా మందిరములకుఁ బోయి అభిమానమును వదలి, యెంతటి చిన్న సేవనైనను జేయ వలయును. భగవంతునకుఁ జేయు కార్యము లన్నియును సమానములని తెలియవలెను. నా కొఱకు చేయు కార్య మేమున్నదో అదియే గొప్పది. కావున సమస్త సేవలను యథాశక్తిగ, యథా సామర్థ్యముగ స్వయముగఁ జేయ వలయును. మనస్సున సంకోచము గాని లజ్జగాని పనికిరాదు. మందిరము అలుకుట, మెత్తుట, నీరు చిలుకుట, చిమ్ముట, తుడుచుట మొదలగునవియు, సర్వతోభద్రాదులను రచించుట, విగ్రహములను దోముట, ఇంక నేసేవనైనను జేయ వలయును.

18. నిర్మానతా, నిష్కపటతా :- అభిమానముచే మానము కలుగును. దంభముచేఁ గపటముండును. క్షుద్రుఁ డైనవాఁడు దంభ మొనర్చును. అతఁడు నిజమగు సాధువు కాఁడు. సాధు వేషమును వేసికొనినవాఁడు. మోసపు మాటలను జెప్పి లోకులను దనవైపునకు లాగుకొనును. అతని వ్యవహారము లన్నియును గపట పూర్ణముగ నుండును. అతఁడు పరమార్థ వాక్యములను బలుకును, కాని వాని మనస్సులో స్వార్థము నిండియుండును. ఆ యీ మాటలను జెప్పి లోకుల వద్ద ధనమును లాగును. ఏదో విధముగఁ దలను గొరిగించు కొనును. ఇట్టి దాంభికుఁడు నాభక్తికి అధికారి కాఁడు,

నా భక్తునకు మానవేచ్ఛ యుండనే యుండదు. జగత్తంత యును నా స్వరూపముగ భావించు వాఁడెవని వలన మాన మును గోరుడు. ఆతఁడే చరాచర జగత్తు నాదరించును. ఆతనికి దాపరిక మేమియు నుండదు. ఆతఁడు కపట మొనర్చి యేమి చేయఁగలఁడు? కపట మొనర్చిన నెవరికి చేయును. తన స్వామి తన విషయముల నన్నిటినిఁ జూచుచున్నాఁడని భావించును. ఆతఁడు సమస్త ఘటములలోని విషయములను జూచుచున్నాఁడని తెలిసికొనును. ఆతఁడు నిర్మానియు, నిష్కపటుఁడగును.

19. ఆత్మప్రశంస లేకుండుట :— తానేదైన శుభకా ర్యము నొనర్చినచో నితరులతోఁ జెప్పుకొనుట మనుష్యుల స్వభావము. వారి చేసిన పనులను గూర్చి చెప్పుకొనిన వారి కానందము కలుగును. కాని ఆత్మప్రశంసను జేసికొనినఁ బుణ్యము క్షీణించును. యయాతి మహారాజు తన పుణ్య ప్రభావముచేఁ జాల దినములు స్వర్గలోకమున నుండెను. ఆతఁ డప్పుడప్పుడు బ్రహ్మలోకమునకును బోవుచుండెడు వాఁడు. ఒక దినమున నింద్రుఁ డిట్లడిగెను :— "రాజా! నీవు ఇల్లు వాఁకిలిని వదలిపెట్టి తపస్సు చేసికొనుటకు వనము నకు బోఁగా నప్పుడెవరితో సమానముగఁ దప మొనరించి తివి?"

ఇది వినఁగానే యయాతికి అహంకారము వచ్చెను. అతఁడు తన తపస్సును, పుణ్యకర్మలను జ్ఞాపక మొనర్చుకొని యిట్లనెను:- "దేవేంద్రా! మనుష్యుల సంగతి యెందులకు? నాతో సమానముగ ఘోరతపస్సును నేఁటి వఱకే దేవత గాని, గంధర్వులు గాని, ఋషులు గాని చేయలేదు. నాకు నాతో సమానముగఁ దప మొనర్చిన వాఁడు కనఁబడనే కనఁబడలేదు."

ఇది వినఁగానే దేవేంద్రుఁడు నవ్వి యిట్లనెను :- "రాజా! ప్రపంచమున నొకరికి మించిన తపస్వులొకరు కలరు. అయితే వారి పేర్లు నీకు తెలియక పోవచ్చును" అని చెప్పి నాతో సమానముగఁ దప మొనరించిన వాఁడెవఁడును గనఁబడ లేదని చెప్పి నీవు తపస్వుల నవమానించితివి. నీ తపస్సును గూర్చి నీ నోటనే చెప్పుకొన్నావు. కావున నీ పుణ్యమంతయును క్షీణించెను. ఇప్పుడు నిన్ను స్వర్గము నుండి పతనము గావించెదము. భగవానుఁ డిట్లనెను :- "ఉద్ధవా! యయాతి కొంచెముగ నాత్మ ప్రశంసను జేసి కొనుటచేఁ దపము క్షీణించెను." అట్టియెడ నువ్వు గింజంత కార్యమైనను జేయనివారు తమకుఁ దాము ప్రశంసించు కొనిన వారిగతి యేమి కాఁగలదు? వారవశ్యము నరకమున కధికారులగుదురు. కావునఁ దాను జేసిన తపస్సును, పుణ్య కార్యములను బొరపాటుననైన నితరులకుఁ జెప్పరాదు."

ఉద్ధవుఁడిట్లనెను :- "స్వామీ! ఇదిగాక యింక విశేష నియమమును గూర్చి చెప్పుఁడు.

భగవానుఁడిట్లనెను :- ఉద్ధవా! నాకు దీపము మొదలగు వస్తువుల నర్పించిన దానిని నీ యవసరమునకు వినియోగించుకొనరాదు. నాకొఱకు వెలిఁగించిన దీపమును ఉపయోగమునకు వినియోగించుకొనరాదు. అంధకారమును బోఁగొట్టుటకును, పుస్తకములు చదువుకొనుటకును వేఱు దీపమును వెలిగించుకొనవలెను. లేక ఆ దీపమునందే రెండు వత్తులను వెలిఁగించుకొనవలెను. ఇదేవిధముగ నన్యవస్తువుల విషయమునను భావింపవలయును."

ఉద్ధవుఁడిట్లనెను :- "స్వామీ! నీకు నైవేద్యమును బెట్టెదరుకదా! దానినిఁ గూడ తినరాదా?"

భగవానుఁడిట్లనెను :- అట్లుకాదు. అది మహాప్రసాదము. దానినిఁ దినుటవలన జన్మ జన్మాంతరము లందలి పాపములు పారిపోఁగలవు. కాని దానిని లోభబుద్ధిచేఁ దినరాదు. మహాప్రసాదమను భావమునుతోఁ దినవలెను. నాకొఱకని అర్పించిన గ్రామములోని ఆదాయమును గృహకార్యములకు వినియోగింపవలయును. నా సేవకొఱకే ఆ యాదాయమును వినియోగింపవలయును. ఇదిగాక నాకే వస్తువు నర్పించినను దానిమీఁద నందఱకును నధికారము కలదు. తోఁటలో

మామిడిపండ్లు పండిన వానిని నాకు నైవేద్యమున కర్పించినఁ బ్రసాదమగును. ఇప్పుడు వానియందు బంచుటకును నధికారము కలిగినది."

ఉద్ధవుఁడిట్లనెను :- "స్వామీ! నీ కేయే వస్తువుల నర్పింపవలయును"? భగవానుఁడు నవ్వుచు నిట్లనెను :- "ఉద్ధవా! వస్తువులు చాలగలవు. ఎన్నని చెప్పఁగలను? నీవీమాత్రమును గ్రహించుము. ఈవస్తువు లేవేని నీకు బ్రపంచమున నిష్టముగనుండునో, వానినే నాకర్పించుము. నా కర్పించుటచే నావస్తువనంతమును నక్షయమును గాఁగలదు. ఒక వరిగింజ ఉన్నదనుకొనుఁడు. దానిని మనముతిందుము. దానిని మనము తినినచో అలాగే కడుపులోనికి పోవును. దానిని భూమిలో పెత్తుము. ఉచితక్షేత్రములోఁ బడవేయుము దానివలన పంవలకొలఁది గింజలువచ్చును. ఆ నూరు గింజలును మరల నుత్పన్నమొనర్చుసామర్థ్యము కలవగును. అవి యెన్ని కలవో వానికన్నిటికిని నట్టి శక్తి వచ్చును. కావున నాకు విధ్యుక్తముగఁ బూజలొనర్చి యిష్ట పదార్థములను అరిపుచుము."

ఉద్ధవుఁ డిట్లనెను :- "స్వామీ! మీ పూజను సేవల మర్చా విగ్రహములలో జేయవలయునా? లేక మీ పూజ లెచ్చటనైన స్థానములు కలవా?"

భగవానుఁ డిట్లనెను :- "ఉద్ధవా! నా పూజకన్ని యును స్థానములు కలవు. కాని పదునొకండు స్థానములు ముఖ్యములు."

ఉద్ధవుఁ డిట్లనెను :- "స్వామీ ! ఆ పదునొకండు స్థానముల పేర్లను నాకుఁ జెప్పుఁడు. ఏయే స్థానములం దేయే వస్తువుతోఁ బూజింపవలయునో ఆ విషయమును గూడ చెప్ప వలయును."

భగవానుఁడు సంతోషమును బ్రకటించుచు నిట్లనెను- "మంచిది, నేను నాపూజాస్థానములను గూర్చి పరిచయ మొనరించెదను."

సూతుఁడు శౌనకాది మహార్షులతో నిట్లనెను :- "మునులారా ! ఇప్పుడు భగవానునిఁ బూజించుట కేర్పడిన పదునొకండు స్థానములను గూర్చి వినుఁడు."



# భగవత్పూజకు పదునొకండాశ్రయములు

శ్లో. సూర్యోఽగ్నిర్బ్రాహ్మణో గావో వైష్ణవః ఖం మరుజ్జలం ।
భూరాత్మా సర్వభూతాని భద్రపూజా పదాని మే ॥

శ్రీ భాగ. ౧౧. స్కం. ౧౧ అ. ౪౨ శ్లో॥

వ॥ సూర్యుఁడును, అగ్నియు, బ్రాహ్మణుఁడును, గోవును, వైష్ణవుఁడును, ఆకాశమును, వాయువును, జలమును, భూమియు, నాత్మయు, సర్వభూతము లను నీ పదునొకండును నాపూజకాశ్రయములు.

భగవానుఁడీ ప్రపంచమును జిత్రవిచిత్రముగ నొనర్చినాఁడు. కావున సాధారణముగఁ బ్రకృతియంతయును భిన్నభిన్నముగ నుండును. ప్రపంచము నొకేవిధమగు వస్తువులు లేనేలేవు. ఎందఱు భక్తులుండినను వారి రుచులలో భిన్నత్వముండితీరును. ఆకృతి; ప్రకృతి, రూపము, రంగు, వాక్కు, అన్నిటియందును నేదియో భేదముండితీరును. రేఖాశాస్త్రము నెఱిఁగినవారు బొటనవ్రేలియందలి రేఖలు భిన్నభిన్నములుగ నుండునని చెప్పిరి. చేతి చేవ్రాలు అందఱివి ఒకే విధముగ నెట్లుండవో అట్లే బొటనవ్రేలి ముద్రలొకే విధముగనుండవు. అందువలనఁ జేవ్రాలు చేయఁజాలని వారిచే వ్రేలిముద్రలను వేయించుచుందురు. అందఱి కన్నులలోని రేఖలొక్కటిగ నుండవు. సూక్ష్మరూపమునఁ జూచినచో అన్నివస్తువులును విభిన్నములుగనే యుండును. అట్లే అందఱి యొక్క ఉపాసనలును భిన్నభిన్నములుగ నుండును. భగవంతుఁడు సర్వవ్యాపకుఁడు. ఆతని నెచ్చట భజించిన నచ్చట ప్రత్యక్షమగును. ఏ వస్తువున నాతని నుపాసించెదమో ఆ వస్తువు

సందు దర్శనమొసంగును. ఆయని నెవ్వఁడెట్లు భజించునో, ఆతనికట్టి భావముతోఁ బ్రచయు నొసంగును.

సూతుఁడిట్లనెను:- "మునులారా! ఉద్ధవుఁడు భగవానుని నాతఁడుండు ఆశ్రయములను గూర్చి అడుగఁగా నప్పుడు భగవానుఁడిట్లనెను :- "ఉద్ధవా! నా పూజకు ముఖ్యాశ్రయములు పదునొకండు. సూర్య, అగ్ని, బ్రాహ్మణ, గోవు, వైష్ణవుఁడు, ఆకాశము, వాయువు, జలము, పృథివి, అంతరాత్మ, సమస్త చరాచరప్రాణులు. ఈ స్థానములలో నాపూజను జేయవలయును."

ఉద్ధవుఁడిట్లనెను :- "స్వామీ! ఈ స్థానములలో మీ పూజ నెట్లు చేయవలెను? ఆకాశమునకుఁ బుష్పమును వేయుటెట్లు?"

నవ్వి భగవానుఁడిట్లనెను :- "ఉద్ధవా! పూలు వేయుటయే పూజకాదు. దేవత యెట్లుండునో పూజ అట్లే చేయవలయును. దేశ, కాల, పాత్ర, పరిస్థితి ననుసరించి పూజ భిన్నభిన్న ప్రకారములుగ నుండును. చలికాలమైనచో వీవనతో విసరుటయు శీతలచందనమును లేపనమొనర్చుటయును, శీతల జలములతో స్నానమొనర్చుటయును బూజ కాదు. చలికాలములో నగ్నిని కాచుకొనుట, ఉష్ణజలములతో స్నానమును జేయించుటయు, వేడివేడి పదార్థములను నివే

దించుటయు నీ కాలమున జేయవలసిన పూజ, ఇదేవిధముగ దేశకారణముననుబూజలో భిన్నత గోచరించును. ఉష్ణదేశమైనచో నచ్చట శీతల వస్తువుల వ్యవహార మధికముగ నుండును. శీతల ప్రధాన దేశమగుచో నచ్చట ఉష్ణవస్తువుల నుపయోగించవలయును. ఇదేవిధముగఁ బాత్ర భేదముచేతను బూజా భేదముండును. సూర్యోపాసన మన్యవస్తువులతోఁ జేయఁబడును. ఆకాశపూజయు నన్యవస్తువులచేఁ జేయఁ బడును."

ఉద్ధవుఁడిట్లడిగెను :- స్వామీ! ఏ ఆశ్రయమునకు సంబంధించిన పూజ యే వస్తువులతోఁ జేయవలసియుండును. ప్రథమమున సూర్యోపాసనమును గూర్చి చెప్పవలయును. ఆతని ఉపాసనలో విశేషత యేమికలదు?"

భగవానుఁడిట్లనెను :- ఉద్ధవా! పాద్య, అర్ఘ్య, ఆచమనీయ, స్నానజలము, వస్త్రము, యజ్ఞోపవీతము, ధూప, దీప, నైవేద్యాదులు సమస్త పూజలందును నావశ్యకములే. కాని భిన్నభిన్న పూజలలో భిన్నభిన్న వస్తువులు వినియోగింపఁబడును. సూర్యోపాసనమున వేదమంత్రములు వినియోగపడును. ప్రాతఃకాలమునను, మధ్యాహ్న సాయంకాలములందును నుపస్థాన మొనర్పవలయును. త్రికాల సంధ్యోపాసనమును, గాయత్రీజపమును ఇవన్నియును సూర్యోపాసన

మునకు సంబంధించినవే. ప్రాతఃకాలమున నిలుచుండి, ముద్రలను బ్రదర్శించుచు నుపస్థాన మొనరింపవలయును, మధ్యాహ్న కాలమందు సింహామువలె రెండుచేతులనెత్తి ఉపస్థానమొనర్పవలయును. సాయంకాలమున రెండుచేతులను జోడించి నిలుచుండి ఉపస్థాన మొనర్పవలయును. ఈవిధముగ వేదత్రయీద్వారా సూర్యమండలమందు నన్నుపాసింపవలయును.

ఉద్ధవుఁడిట్లడిగెను:- "స్వామీ! అగ్నిలో మీ ఉపాసన యెట్లు చేయఁబడును. దానిలో నే విశేషము కలదు?"

భగవానుఁడిట్లనెను :- "అగ్నిలో వేదమంత్రముల ద్వారా ఘృతాహుతులనొసంగుటయే ఇందులోఁగల విశేషోపాసనము. ఋషులయొక్క అగ్నిశాలలో సదా అగ్ని ప్రజ్వలించుచుండును. వారు ప్రాతస్సాయంకాలములందు ఘృతాహుతుల నొసంగి పూజించుచుందురు. బ్రహ్మచారి అగ్నిలో సమిధాధానమును జేయును. గృహస్థుఁడు సదా రెండు వేళలందును నగ్నిహోత్రము నొనర్చి అగ్నిపూజన మొనర్చును. వానప్రస్థుఁడు గృహామును విడిచినను, సౌకర్యములను బరిత్యజించినను, ఇంటిలో నుండకుండినను, సంసారసుఖము ననుభవింపకుండినను, అతఁడును నగ్న్యుపాసనను బరిత్యజింపఁడు, వనములందలి కందమూల ఫలములద్వారా అతఁ

డగ్ని నారాధించును. అగ్ని రక్షణము కొఱకాతఁడు కుటీర మును నిర్మించుకొనును. అగ్ని దేవతలయొక్క ముఖము. దానిలో నే దేవత నుద్దేశించి ఆహుతి యీయఁబడునో, అగ్ని వెంటనే దాని నాయా దేవతలకడకుఁ జేర్చును. అగ్న్యుపాసన మొనర్చుటచే ద్విజులు తేజస్వులగుదురు. విధ్యుక్తముగ నగ్ని నుపాసించినవారు వారి కగ్ని ప్రత్యక్షమై ఫలము నొసంగును. ఒక బ్రాహ్మణుఁడింకొక బ్రాహ్మణుఁడు పాద లేపనమును జేయించుకొని, ఎగిరి హిమాలయ ప్రదేశము నకుఁ జేరుకొనెను. అచ్చట నుంచుమీఁద నడచుటచేతను, చిత్రవిచిత్ర విషయములను గాంచు మత్సాహముతో నాతని పాదలేపము కఱఁగిపోయెను. అగ్నిహోత్రసమయము సమీ పించెను. బ్రాహ్మణుఁడు చాలచింతలోఁ బడిపోయెను. చివర కాతఁడిట్లు ప్రార్థించెను:- "నేను సవిధిగ నగ్న్యుపాసనమును జేసి యుండినచో నేను వెంటనే నాయింటిలో నుందునుగాక!' వెంటనే అగ్ని అచ్చట ప్రత్యక్షమై ఆ బ్రాహ్మణునిఁ దన యింటికి జేర్చెను."

ఉద్ధవుఁ డిట్లనెను:- "భగవాన్! బ్రాహ్మణుని మీ స్వరూపముగ భావించి యెట్లు పూజింపవలయును?"

భగవానుఁడిట్లనెను:- "ఉద్ధవా! నావాక్కు వేదము బ్రాహ్మణుఁడు దానిని ధరించును. అందువలల బ్రాహ్మ

ణుఁడు నా స్వరూపుఁడు. నే నే దేహ రూపమును ధరింపవలసి యుండినచో నేను వృద్ధ బ్రాహ్మణరూపమును ధరించెదను. బ్రాహ్మణులను నేనును బూజించెదను. కావున జనులు నన్ను బ్రహ్మణ్య దేవుఁడందురు. బ్రాహ్మణుల కొఱకే నేనవనిపై నవతరించుచుందును. బ్రాహ్మణులను సేవించువారి యశము ప్రపంచమున వ్యాపించును. నాకింతటి యశము కలుగుటకు కారణము బ్రాహ్మణులను సేవించుటచేతనే. మయూర ధ్వజుఁడు బ్రాహ్మణులకెంతో భక్తుఁడు. అతఁడు బ్రాహ్మణుని యొక్క సింహము కొఱకు తనపుత్రుని అంపముతోఁ గోసెను. శిబిచక్రవర్తి బ్రాహ్మణుఁడు యాచింపఁగాఁ దన పుత్రుని మాంసమును వండెను. కర్ణుఁడు దానవీరుఁడనఁ బడుటకు గారణము బ్రాహ్మణుఁడు వచ్చి యేది అడిగిన దానిని వెంటనే యొసంగెడువాఁడు. నేను జరాసంధుని భయముచే అతనికోడి మథురను వదలిపోలేదు. అతని బ్రాహ్మణ భక్తి ననుసరించి నేను నాపైతృక రాజధానియగు మథురను వదలిపెట్టితిని ఉద్ధవా! నాకు జ్ఞాపకము లేదు కాని బ్రాహ్మణు నుపాసించి ప్రపంచమున దుఃఖితుఁడైనవాఁడు లేఁడు. క్షత్రియులును బ్రాహ్మణులును నిద్దరు కాఁగానే బ్రాహ్మణ పత్నులతో క్షత్రియులు వ్యభిచారము చేయసాగిరి. ధనాపహరణము నొనర్చిరి. అప్పుడు నేను పరశురాముఁడనై వారినందఱను సంహరించితిని. బ్రాహ్మణులు నాకు శరీరము

బ్రాహ్మణుఁడు బాలకుఁడైనను నాతఁడు పూజనీయుఁడే. అన్యవర్ణములవారెంతటి పెద్దవారైనను బ్రాహ్మణుఁడు బాలకుఁడైనను వారి నాశీర్వదింపఁగలఁడు. బ్రాహ్మణుఁడు జన్మచేతనే పూజనీయుఁడు. ఎందఱో రాజులుదయించిరి. సత్య హరిశ్చంద్రున కింతటికీర్తి యేలవచ్చినది? ఆతఁడు బ్రాహ్మణుని ఋణమును దీర్చుటకై పత్నీ పుత్రులనమ్ముకొని, తానును జండాలున కమ్ముడువోయెను. ఆ చండాలుఁ డెవఁడోకాఁడు. నేనే చండాలుఁడనైతిని. ఇన్ని కష్టముల ననుభవించుచుండినను ఆ రాజు బ్రాహ్మణుని యెడల నశ్రద్ధను జూపలేదు. ఉద్ధవా! ఎన్నని లెక్కింపఁగలను? ఎందఱు తేజస్వులును, యశస్వులు నగు రాజులుండిరో వారి వారియశస్సును, తేజస్సును బ్రాహ్మణుల కృపవలననే వృద్ధి పొందినది. సూర్యవంశమున నెందఱో పరాక్రమశాలురగు రాజులుదయించిరి. కాని సూర్యవంశము రఘువంశమను పేర విఖ్యాతినిఁ జెందినది. ఏలననఁగా రఘుమహారాజు బ్రాహ్మణ భక్తుఁడు. ఒకసారి నేనాతని కడకు స్వయముగా బ్రాహ్మణ రూపమునఁ బోయి పరీక్షించితిని. ఆతఁడు పరీక్షలో నుత్తీర్ణుఁడు కాఁగానే ఆతనికి వరమొసంగితిని

అంత నుద్ధవుఁడిట్లడిగెను :- "స్వామీ! మీరు రఘు మహారాజు నెట్లు పరీక్షించితిరి?" భగవానుఁడిట్లనెను :- "ఉద్ధవా! రఘుమహారాజు బ్రాహ్మణ భక్తుఁడను కీర్తి

దశదిశలు వ్యాపింపఁగనే రాజును బరీక్షింప వలయునను కొంటిని. నేనవరినిఁ బరీక్షించినను వారి కీర్తి నినుమడించుటకే పరీక్షించెదను. రాజు గొప్ప బ్రాహ్మణభక్తుఁడు, ఆతని దగ్గఱకు వచ్చిన వాఁడెవఁడును నిరాశతోఁ దిరిగిపోఁడు. రాజు పెద్దవాఁడైనను వివాహమును జేసికొనలేదు. ఆతఁడు తన ధర్మ కార్యములం దనుకూలముగ నుండు ఆమెను వివాహము చేసికొందునని ప్రతిజ్ఞ నొనర్చెను. బ్రాహ్మణభక్తి, అతిథిపూజ యందామెకు ఆసక్తి, ఆనందము కలుగవలెను. బ్రాహ్మణులు వెదకి వెదకి ఒక రాజకుమారి సర్వసులక్షణ సంపన్నయు, త్రైలోక్యసుందరియు, సద్గుణఖనియు గలదని చెప్పిరి. రాజామెను వివాహమాడుటకు నిశ్చయించుకొనెను. ఎంతో వైభవముగ వివాహము జరిగెను. వివాహమొనర్చుకొని, రాజకుమారుని వెంటఁబెట్టుకొని రఘుమహారాజు తిరిగి వచ్చుచుండఁగా మార్గమందొక వృద్ధబ్రాహ్మణుఁడు రాజునకు జయకారము లొనర్చెను.

రాజు పరమ బ్రహ్మణ్యదేవుఁడు. ఆతఁడు రథము నుండి దిగెను, బ్రాహ్మణునకు నమస్కరించి చేతులను జోడించుకొని యిట్లనెను:- "స్వామీ! నాకేమి యాజ్ఞ ?"

బ్రాహ్మణుఁ డిట్లనెను:- "రాజా! నేను నీఖ్యాతిని గూర్చి వినియుంటిని నేను నిన్ను యాచించుటకు వచ్చియున్నాను."

రాజిట్లనెను :- "స్వామీ ! ఆజ్ఞాపింపుఁడు, నా సర్వ స్వమును బ్రాహ్మణుల కొఱకే. నేను వారికి రక్షకుఁడను మాత్రమే. మీకు ధన, రత్న, గజ, తురగ, రథ, గ్రామా దులలో నేది కావలయునో దాని నడుగుఁడు."

బ్రాహ్మణుఁడిట్లనెను :- "నాకీ వస్తువు లేమియు నక్కఱలేదు. నాకొక్క వస్తువు కావలెను. కాని అది దుర్ల భము," నవ్వి నృపతి ఇట్లనెను:- "స్వామీ! బ్రాహ్మణులకు దుర్లభమేమున్నది ? మీ రాజ్ఞాపింపుఁడు. సంకోచించు టెందులకు?"

బ్రాహ్మణుఁడిట్లనెను :- "రాజా ! నేనింతవఱకు తప స్సును జేసికొనుచుంటిని. నేనిప్పుడు గృహస్థసుఖము లనుభ వింపఁ దలఁచు చున్నాను. ఇప్పుడు నీవు తీసికొని వచ్చుచున్న రాణి మంచి గుణవతి యనియును, అందమైనదనియు విని యున్నాను. ఆమెను నాకిచ్చి వేయుము."

రాజు సంతోషమును బ్రకటించుచు నిట్లనెను :- "మంచిది, స్వామీ ! ఇందు సంకోచింపవలసిన పని యేమున్నది ? నేనిప్పుడే రాణి నడిగెదను." అని పలికి రాజు పాలకి నాపెను. రాణి పాలకీ నుండి దిగి చేతులను జోడించు కొని నిలుచుండెను. అప్పుడు రాజిట్లనెను:- "రాజకుమారీ! ఈ బ్రాహ్మణుఁడు నిన్నుఁ గోరుచున్నాఁడు. నాకు నిన్నియ

నేటి నుండి యీ వంశము రఘువంశమను పేర విఖ్యాతము చెందుగాక యని వరమొసంగితిని. కావున నింతటి గొప్ప రాజులుద్భవించినను సూర్యవంశమునకు రఘువంశమను బేరు వచ్చెను. ఉద్ధవా! బ్రాహ్మణభక్తిని గూర్చి అనేకోదాహరణములు కలవు. అవన్నియును వేద పురాణములలో గలవు. కావున బ్రాహ్మణ శరీరమందు నా పూజను ఉత్తమ ఆతిథ్య రూపమున నొనర్పుము.''

ఉద్ధవుండిట్లడిగెను :- ''గోపూజనే విశేషరూపము చేఁ జేయవలసియుండును ?''

భగవానుండిట్లనెను :- ''ఉద్ధవా! గోవు నా స్వరూపమే, నేను గోవులను రక్షించుచుండెదను. వానిని బాలించుచుండెదను. అందువలన నాకు గోపాలుండను పేరువచ్చినది. గోపూజ చేసినవారిని గాంచి నేను ప్రసన్నుండ నయ్యెదను. గోవులను జూడఁగనే ప్రణామ మొనరింపవలయును. దిలీప మహారాజు సురభిని గాంచి నమస్కరింపలేదు. అందువలన నాతనికి సంతానము కలుగలేదు. వశిష్ఠుని యాజ్ఞచే నాతఁడు కామధేను పుత్రియగు నందినీ దేవిని బూజించెను. ఈ కారణమున నాతనికి రఘువంటి యశస్వుఁడగు బుత్రుఁడుదయించెను. గోవుయొక్క శరీరమందు సమస్త దేవతలు నివసించుచుందురు. దాని వేడలో లక్ష్మీదేవి నివసించుచుండును.

రాజు వస్త్రాలంకృతయగు దన పత్నిని సవిధిగ దాన మొనర్చెను. బ్రాహ్మణుఁడు ముంజగడ్డితోఁ జేయఁబడిన మేఖలను, మృగచర్మమును, జేతిలోఁ గమండలువును ధరించి ముందు పోవుచుండెను. త్రైలోక్య సుందరియగు నారాణి కాళ్ళతో నడువనే లేదు. అట్టి ఆమె ఆతని వెనువెంట బయలుదేరెను. దీనినిఁ గాంచి రాజు పరువెత్తుకొని పోయి యిట్లనెను :- "స్వామీ ! ఈ వేషముతో మీరు రాణితోఁ గలిసి పోవుచుండిన బాగుండ లేదు. ఒక దానమును మీరు మీ కోరికతోఁ దీసికొంటిరి. ఇంకొక దానమును నాకోరిక ననుసరించి గైకొనుఁడు."

బ్రాహ్మణుఁ డిట్లనెను :- "రాజా ! నీవే దానమును నాకీయఁ దలఁచినావు ?"

రాజిట్లనెను :- "స్వామీ ! నేను జాలకాలము రాజ్య మొనర్చితిని. మీరు చాల దినములు తపమును జేసితిరి. ఇప్పుడు మీరు రాజ్య మొనర్పుఁడు. నేను దపము నొనర్చు కొందును. మీకు గృహస్థ సుఖములను బొందవలయునన్న గాంక్ష యుండినచో యథేష్టముగ ననుభవింపుఁడు."

శ్రీకృష్ణుఁడిట్లనెను :- "ఉద్ధవా ! నేనే బ్రాహ్మణ రూపమును ధరించితిని. రాజు యొక్క యీ యుదారతను గాంచి నేను నా చతుర్భుజ రూపముతో దర్శన మొసంగి,

వలయుననియే యున్నది. ఇప్పుడు నేను నీ కోరికను గూడ తెలిసికొనఁ గోరుచున్నాను. నీ కీతని వెంటఁబోవుట కిష్ట మున్నదా ! లేదా ?"

రాణి అత్యంతానందమును బ్రకటించుచు నిట్లనెను :- "మహారాజా ! ఇందులో నడుగవలసిన దేమున్నది ? మీరు నాకు స్వాములు. మీరు నాకేది ఆజ్ఞాపించిన దానిని నేను శిరసావహించెదను. ఆతఁడు బ్రాహ్మణుఁడు. సత్పాత్ర భూదేవుఁడు. మీరు నన్నెవరి కప్పగించెదరో వారి వెంటఁ బోయెదను."

రాజు బ్రాహ్మణునితో నిట్లనెను :- "స్వామీ ! మీ మనోరథము పూర్ణమైనది. నా రాజధాని యిచ్చటికి సమీపముననే కలదు. అచ్చటికిఁ బోయిన తరువాత విధ్యుక్త ముగ స్వీకరింప వచ్చును."

బ్రాహ్మణుఁడిట్లనెను :- "రాజా ! నా చేతిలో దర్భల కట్ట ఉన్నది. నా కమండలువు నందు సరయూజలము కలదు. జలమును గుశలను జేతులలోనికిఁ దీసికొనుఁడు. నేను సంక ల్పమును జెప్పెదను. శుభకార్యములందు విలంబన మొన ర్చుట మంచిది కాదు. శుభకార్యముల కనేక విఘ్నములు వచ్చుచుండును."

రాజిట్లనెను :- "చాల బాగున్నది. స్వామీ ! సంక ల్పమును జెప్పుఁడు."

గోవులు లోకమాతలు. గోవులకు ముఖ్యముగఁ జేయవలసిన పూజ వానికిఁ బచ్చని గడ్డి నొసంగుట. వానిని గోకవలెను. సమస్త సేవలను జేయవలయును."

ఉద్ధవుఁడిట్లడిగెను:- "ప్రభూ! వైష్ణవులకు విశేష పూజ నెట్లు చేయవలసి యుండును?"

నవ్వి భగవానుఁడిట్లనెను:- "ఉద్ధవా! నీకెట్లు చెప్పఁగలను? ఇంటికి అల్లుఁడు వచ్చినచో నాతని నెట్లుసత్కరించెదరు? ఇంటిలో నేయి లేకుండినచో నిరుగుపొరుగిండ్లలో నప్పు తెచ్చెదరు. పిండివంటలను జేయుదురు. క్షీరాన్నము లొనర్చెదరు. సమస్త విధముల నాతని సత్కరించెదరు. మనస్సునకుఁ జాల ఉత్సాహము కలుగును. వైష్ణవు లింటికి రాఁగానే యెవరికిట్టి యుత్సాహముండునో ఆతఁడే నిజమగు భగవద్భక్తుఁడు. వైష్ణవులను బంధువులవలె నాదరించుట చేతనే భక్తి వృద్ధినిఁ బొందును.

ఒక వైష్ణవుఁడుండెను. ఆతఁడు చాల గొప్ప భగవద్భక్తుఁడు. కాని ఆతని భార్య మిగులఁ గర్కశ. ఇంటికెవ రైనను వైష్ణవుఁడు వచ్చినచో మండిపడుచుండును. వీని కొఱకె అన్నము వండవలసి వచ్చుచున్నదనుకొనును. వైష్ణవులు చాల సరళముగ నుందురు. వారు తాము తినక వైష్ణవులకుఁ బెట్టుచుందురు. ఒక దినమున నాతని అల్లుఁడు

వచ్చెను. ఆతని కొఱకాతఁ డెచ్చటనో నేతినిఁ దెచ్చెను. ఎక్కడనో పాలను దెచ్చెను. క్షీరాన్నమును బిండివంటలను జేసెను. ఇంతలోనే ఒక వైష్ణవుఁడు వచ్చెను, ఆమె మండి పడి యీతనికొఱకు నన్నమును వండవలసి వచ్చుచున్నదని విసుగుకొనెను. అల్లుఁడు రాకయుండినచో నాలుగుతిట్లు తిట్టి పంపెడిది. జామాతముందు తిట్లెట్లు తిట్టఁగలదు ? ఆమె తిట్టఁగలదు ? ఆమె వైష్ణవుని కొఱకు ముడిబియ్యపు అన్నమును, పచ్చడిని జేసెను. ఆమెవంట యింకను జేయుచు భర్తను వడ్డించమనెను. ఆతఁడిట్లనెను:- ముందుగా నతిథులకునుఁ అల్లునికిఁ బెట్టిన తరువాత నా వైష్ణవులకును బెట్టవలయును. వైష్ణవుఁడిట్లనెను:- "ఇప్పుడిద్దరకును వేఱు వేఱుగఁ బెట్టవలయును."

ఆతఁడిట్లనెను:- "మంచిది. అల్లుని వంటయింటివద్దను, వైష్ణవుల నచ్చటనే యింకొకచోటునను కూర్చుండఁ బెట్టవలెను."

వైష్ణవుఁడిట్లనెను:- "సరే, అట్లే చేసెదను. నీవు విస్తళ్ళలో వడ్డించుము, ఆమె ఒక విస్తరిలో, నన్నము, కూరలు, పప్పు, పరమాన్నము, పిండివంటలు వడ్డించెను. ఒక విస్తరిలో ముడిబియ్యపుటన్నమును పచ్చడిని వడ్డించెను. అల్లుని విస్తరిలోఁ బెరుగును వడ్డించి, వైష్ణవుని విస్తరిలో

మజ్జిగ వడ్డించెను. ఈ విస్తరిని వైష్ణవబాబునకుఁ బెట్టి, ఆ పిండివంటలను వడ్డించిన దానినల్లునికిఁ బెట్టుమనెను.

వైష్ణవుఁడు రెంటిని దీసికొని పోయెను. ఆతఁడు పిండివంటలు కూరలతో నుండు దానిని వైష్ణవసాధువునకు వడ్డించి, పచ్చడిమెతుకుల విస్తరిని అల్లునికి వడ్డించెను. ఇద్దరును దినుచుండిరి. ఆతనిభార్య క్రీగంటితోఁ జూడఁగనే ఆమె క్రోధమునకు మేర లేకపోయెను. కాని అల్లునిముందేమైనఁ బతినిగూర్చి పలికినచో నపకీర్తి కలుగును. ఆమె లోలోనఁ బండ్లుపటపట కొఱుకుచుఁ జేతులతోఁ దన ముక్కును గోయుచున్నట్లు సైగ జేసెను.

నవ్వి వైష్ణవుఁడిట్లనెను:- "నీ ముక్కును గోసియుండిన బాగుగనే యుండెడిది. నీవొకేసారి వచ్చిన వీరికి వేలు వేలు భోజనమును బెట్టితివి. నేను నీవు చెప్పినట్లు వడ్డించియుండినచో నాముక్కు కోసినదానవయ్యెదవు. ఇప్పుడు నాముక్కు తెగకుండ జూచుకొని నీముక్కు తెగునట్లు చేసితిని. ఏమియును ఫరవా లేదు."

ఇది విని అతనిభార్య లజ్జించెను. ఇందు సారాంశమేమనఁగా వైష్ణవసాధువు మహాత్ములను దన అల్లునికంటె కూడ మిక్కిలి ఆదరముగఁ జూచును. వైష్ణవులను నారూపముగ భావించి వారినిఁ బూజింపవలయును."

ఉద్ధవుఁడిట్లడిగెను: "ఆకాశమందు బూజించుటెట్లు?"

భగవానుఁడిట్లనెను :- "ఉద్ధవా ! నేను సమస్త ప్రాణుల హృదయకమలమందు నివసించెదను. హృదయ కమలమందు నివసించెదను. హృదయ కమలమందు విష్ణువగు నన్ను ధ్యానించుటయే ఆకాశమున నన్నుఁ బూజించుట. ఆకాశ మెట్లు సర్వవ్యాపకముగ నున్నదో, అట్లే నేనును సర్వవ్యాపకముగ నున్నాను."

ఉద్ధవుఁడిట్లనెను:- "ప్రభూ ! వాయువునందు మిమ్ముఁ బూజించుటెట్లు?"

భగవానుఁడిట్లనెను :- "ఉద్ధవా ! ప్రాణము పది విధములుగ నుండును. వానిలోఁ బ్రధానమగు ప్రాణివాయువు ముఖ్యము, మంత్రపూర్వకముగఁ బ్రాణాయామ మొనర్చుటయే వాయువుయొక్క ముఖ్యపూజ !"

ఉద్ధవుఁడిట్లనెను :- "జలమందు మిమ్ముఁ బూజించుట యెట్లు ?"

భగవానుఁడిట్లనెను:- గంగాది పుణ్యనదులయందును, పుణ్యసరోవరము లందును, గొప్ప గొప్ప జలాశయములందును జలపుష్పములచేఁ బూజలొనర్పవలయును. క్షీణము లను సమర్పించి ప్రార్థింపవలయును అదియే జలపూజ."

ఉద్ధవుఁడిట్లనెను :- "స్వామీ! భూమియందు మీ పూజను జేయుటెట్లు ?"

భగవానుఁడిట్లనెను :- "మంత్రములతోఁ బృథివియందు వేదినేర్పఱచి దానియందు నేనుండినట్లు భావించి పూజింపవలయును."

ఉద్ధవుఁడిట్లనెను:- "స్వామీ! ఆత్మపూజచేయుటెట్లు?"

భగవానుఁడిట్లనెను :- "వివిధ విధములగు నైవేద్యములను గనుఁగొని తన అంతరాత్మను దృప్తికావింప వలయును. మంచి అన్నమును నోటిద్వారా అంతరాత్మకు ఆహుతుల నీయవలయును. కన్నులతో సుందరరూపములను జూడవలయును. చెవులతో మంచి భక్తిపూర్ణములగు గీతములను శ్రవణ మొనర్పవలయును. ఈ విధముగ నంతరాత్మకు సంతుష్టినిఁ గావింపవలయును."

ఉద్ధవుఁడిట్లడిగెను :- "స్వామీ! సమస్తప్రాణులలో మీ పూజను జేయుటెట్లు ?"

భగవానుఁ డిట్లనెను :- " ఉద్ధవా! నేను దృణము మొదలు బ్రహ్మ పర్యంతము సచరాచరము లన్నిటి యందును సమానముగ వ్యాపించియున్నాను. భేదభావ మొనర్చువాఁడు భయమును బొందును. కావున నన్నిటియందును సమానభావము కలిగియుండవలయును. కావున నెవరిని

అవమానింపరాదు. మనస్సులోనైన నితరుల కపకారమును గావింపరాదు అన్నిటిలో నేనున్నాననియును. అన్ని రూపములును నా రూపములే యనియు భావింపవలయును సూర్యుని యందును, అగ్నియందును, బ్రాహ్మణుని యందును గోవునందును, వైష్ణవుని యందును, ఆకాశమందును, వాయువునందును, జలమునందును, పృథివియందును, ఆత్మ యందును, సమస్త ప్రాణులయందును క్షేత్రజ్ఞుఁడనగు నన్నుఁ బూజించి, అచ్యుత శంఖ, చక్ర, గదా, పద్మయుక్తుఁడ నగు నన్ను ధ్యానింపవలయును. సూర్యమండలము నందును నన్ను భావింప వలయును, సమాహిత చిత్తముతో సర్వత్ర విష్ణుఁడ నగు నన్ను బూజింపవలయును. యజ్ఞాది శుభకర్మ లను వేనినిఁ జేసినను, వాపీ, కూప, తటాక, ధర్మశాలా వనాదులను నిర్మించినను, ఇష్టాపూర్తి కర్మల నొనర్చినను సమస్త కర్మలందును సమాహిత చిత్తముతో నన్నారా ధించుము. ఈ విధమగు పూజచే నాభక్తినిఁ బొందవలెను. నిరంతరము సాధుసేవచే నా స్వరూప జ్ఞానము కలుగును."

ఉద్ధవుఁ డిట్లనెను :- "స్వామీ! సాధన లనేకములు కలవు. వానిలో నాకు సుగమమును, సర్వశ్రేష్ఠమును, శీఘ్ర ఫలప్రదము నగు సాధనమును జెప్పవలయును."

భగవానుఁ డిట్లనెను :- "నాయనా! నేనిదివఱకే చెప్పితిని నామాటను జ్ఞాపకముంచు కొనుముని, అసారమగు

నీ సంసారమును సుగమముగ దాటుటకై సత్సంగ సహిత మగు భక్తియోగము కంటె వేఱుమార్గము లేదు. నా కందఱికంటెఁ బ్రియుఁడు సాధువు. సాధువు నాహృదయమని భావింపవలయును. ఆతని చరణధూళికొఱకై ఆతని వెంటఁ బరువిడుచుందును. సాధు వెన్నడును నాస్మరణమును విడు వఁడు. నే నాతని నెన్నటికిని విడువను. సాధువులకు నే నొక్కఁడనే అవలంబనము. నన్ను వదలి వారింకొక ఆశను బెట్టుకొనరు. ఆశ సంగతి నట్లుంచుఁడు. వారు నన్నుఁగాక యింకేమియు నెఱుఁగరు. నా మీఁద నింతటి మమకార మును బెట్టుకొనిన వానిని నేనెట్లు వదలఁగలను? ఆతని నేనెట్లు మఱవఁ గలను?''.

ఉద్ధవుఁడిట్లనెను:– ''స్వామీ! నేను నీప్రాప్తి కొఱ కనేకోపాయములను వినియుంటిని. కొందఱు ఋషులు నిన్ను సాంఖ్యయోగము ద్వారా ప్రాప్తింపఁ గలరనుచున్నారు. మఱికొందఱు ధర్మకర్మల వలననే పొందవచ్చుననుచున్నారు. కొందఱు వేదాధ్యయనముచేఁ బొందవచ్చుననుచున్నారు. కొందఱు తపముచేతను, త్యాగముచేతను, దక్షిణాసహిత ముగ యజ్ఞము లొనర్చుటచేతను, ఇష్టాపూర్తి, తీర్థవ్రత, యమ నియమాదులచే నిన్నుఁ బొందవచ్చు ననుచున్నారు. నాకు వాస్తవవిషయమును జెప్పుఁడు. వీనిలో దేనిద్వారా

మిమ్ములను సులభముగఁ బొందవచ్చును? వీనిలో నేమార్గము సరళమును సులభమునై యున్నది ?"

ఇది విని భగవానుఁడు నవ్వి యిట్లనెను:- "ఉద్ధవా! శాస్త్రము లనంతములు. మహర్షులెందఱు కలరో మతము లన్ని కలవు. అవన్నియు వేఱువేఱుగ నున్నవి. నన్నుఁ బ్రాప్తించు నుపాయములు చాలకలవు. కాని సరళ, సుగమ, సర్వోపయోగకరమగు సాధనము సత్సంగము కంటె వేఱు లేదు."

ఉద్ధవుఁ డిట్లనెను :- "స్వామీ! మీ వాక్కులను వినిన కొలఁది నాకు తృప్తిజనించుటలేదు. నేను మీనోట సత్సంగ మహిమమును గూర్చి వినఁగోరుచున్నాను. సత్సంగ మనఁగా అర్థమేమి ?"

భగవానుఁ డిట్లనెను :- "ప్రపంచమునందన్నిటికంటె 'సత్' పదార్థమును నేనే. నామీఁద నాసక్తి కలుగుటయే సత్సంగము. నామీఁద నాసక్తి పెరిగినకొలఁది సంసారము నందాసక్తి తగ్గును. ప్రపంచ విషయములం దాసక్తి తగ్గి, నామీఁద నాసక్తి పెరిగినచో భవసాగరమును దాటినవాఁడే అగుచున్నాఁడు. నేనిప్పుడు నీకు సత్సంగమహిమమును గూర్చి విశేషముగఁ జెప్పెదను. దానిని నీవు దత్తచిత్తుఁడవై శ్రవణ మొనర్పుము."

సూతుఁ డిట్లనెను :- "మునులారా ! భగవానుఁ డుద్ధవునకు సత్సంగ మహిమమును గూర్చి యేమిచెప్పెనో దానిని నేను మీకు జెప్పెదను. ఇది అత్యంత గూఢ గోపనీయ రహస్యము."

# సత్సంగ మహిమ

శ్లో ॥ మత్కామా రమణం జారమస్వరూపవిదోఽబలాః ।
బ్రహ్మమాం పరమం ప్రాపుః సంగాచ్ఛత సహస్రశః॥
శ్రీభాగ. ౧౧ స్కం. ౧౨ అ. ౧౩ శ్లో॥

వ :- గోపిక లోపికలు లేక భక్తియోగంబునఁ జింతించి ముక్తులై రిదిభక్తియోగ ప్రకారంబు ॥

శ్రీమదాంధ్ర భాగవతము.

ఈ ప్రాణి ఆసక్తిచేఁ జిక్కుపడిపోవును. దీనిని మనస్సున గట్టిగఁ బట్టుకొంటిమో మనము దానివార మగుచుందుము. సంసార మేల నడచుచున్నది ? కేవల మాకర్షణ బలమున, పురుషుని మనస్సు స్త్రీమీఁదకుఁ బోవును. స్త్రీ మనస్సు పురుషుని మీఁదకుఁ బోవును, స్త్రీపురుషు లిద్దరి మనస్సులు పుత్రపుత్రికలవైపున కాకర్షింపఁబడును. ఈ ఆకర్షణము తగ్గదు. చచ్చునపుడు స్త్రీకి పురుషుని స్మరణ

మును, బురుషునకు స్త్రీ స్మరణమును, బిల్లల స్మరణమును గలుగును. దీనివలన నే జన్మవచ్చినను వారికి భార్య, పిల్లలు లభించుచుందురు. తన కేదియును లేకుండిన సంకోక దాని మీఁద మమకారమును బెట్టుకొనును. జడభరతుని మనస్సు హరిణశాబకముపైఁ బడెను. అందువలన నాతఁడు హరిణము కావలసివచ్చెను. జపతపములచేతను, సంయమ నియమముల చేతను నీ మనస్సు నెంత ఆపినను నాగదు. ఊహింపలేని చోటునకైనను బోవునట్టి నీచమైన వస్తు వీ మనస్సు. భరత చక్రవర్తి త్రైలోక్యసుందరలగు దన పత్నులను విడిచి, పుష్పములవంటి రాజకుమారులమీఁద మోహమునుద్యజించి వనమునకుఁ బోయి సమాధి స్థితినిఁబొందెను. అత్యుచ్చమగు స్థితినిఁ బ్రాప్తించెను. చివరకు దయ ఆతని వెంటఁబడెను. హావన మొనర్చునపుడు చేయికాలెను, మనస్సు ఒక పశువు మీఁదకుఁబోయెను. ఇదేవిధముగ మనస్సొక మహాపురుషుని యొక్క పాదారవిందములమీఁదకుఁ బోయినచో సమస్త దుఃఖములును దూరములగును. ఈ క్షుద్రమనస్సు మహా పురుషుల చరణములమీఁద లగ్నము గాక కామినులమీఁద లగ్నమగును. దీనివలనఁ కామమయుడగును. భగవానుఁడు నిష్కాముఁడు, ఆతనిమీఁదకు గామముతోనైనను జేరినచో నాతని కడకు బోఁగానే కామము పారిపోవును. ఏలననఁగా నాతఁడు కామారి.''

సూతుఁడు శౌనకాది మునులతో నిట్లనెను :- "ఋషులారా! ఉద్ధవుఁడు భగవంతునిఁ బొందుటకు సుగమ సరళోపాయమును గూర్చి భగవానుని అడుగఁగా నప్పుడు భగవానుఁ డాతనితో నిట్లనెను :- "ఉద్ధవా! ఒకటి అత్యంత సరళ, సుగమ, గూఢ, గోపనీయసాధనమున్నది. అదేదనఁగా - అది దేనిచేతను జేయను. అందఱముందు కనఁబడు వస్తువు కాదు. కాని నీవు సర్వసాధారణ పురుషుఁడు వంటివాఁడవు కావు. నీ వనన్యసేవకుఁడవు. నేను మథురకు వచ్చినప్పటినుండి నీవు నా సేవ చేసితివి. నీ జీవితమంతయును నా సేవలోనే గడిపితివి. నీవంటి సేవకుఁడింకొకఁడు లేనే లేఁడు. నీవు సేవకుఁడవే కాదు. నాకు సుహృదుఁడవు. నా హృదయమును నీహృదయమును నొక్కటియే. నీ వత్యంత ప్రేమమయ హృదయము కలవాఁడవు. నీవు నాకు సఖుఁడవును, ప్రపంచములో నేదియైనను గొలఁదిగనో గొప్పగనో దాపరిక ముండును. కాని సఖునికడ దాపరికముండదు పతివ్రత అందఱ సమ్ముఖమునఁ దలవంచుకొని యుండును. ఎవరి చూపులలోను జూపులను గలుపదు. కాని పతికడ దాపరిక మేమియు నుండదు. కావున నేను నీకు రహస్యవిషయమును జెప్పెదను."

యోగముద్వారానైన నా ప్రాప్తికలుగును. చిత్తవృత్తి నిరోధమునకే యోగమని పేరు. ఆసన, ప్రాణాయామ,

ధారణ, ధ్యాన, సమాధి వీనిద్వారా చిత్తమును వశపఱచు కొందురు. కాని యిందులోఁ జాల క్లేశముకలదు. ఒక్కొక్కప్పుడు యోగారూఢుఁడైన వాఁడును బతనమగుచుండును. సాంఖ్యజ్ఞానముద్వారా కూడ నా ప్రాప్తి కలుగును. సాంఖ్యజ్ఞానములో తత్త్వసంఖ్యను లెక్కించెదరు. ఎవఁడు ఇరువదియాఱు తత్త్వముల నెఱిఁగినవాఁడో ఆతఁడు జటీ, ముండి, వానప్రస్థ, గృహస్థులలో నెవ్వరైనను ముక్తుఁడగును. ఇట్టి నిష్ఠ కఠినతతోఁ గలుగును. ధర్మము చేతను నన్నుఁ బొందవచ్చునని ఋషులును, మునులును జెప్పుచుందురు. జప, తప, త్యాగ, ఇష్టాపూర్తి దక్షిణ, వ్రత, వేద, తీర్థ, యను, నియమాది సాధనములద్వారా విని అన్నిటివలన నేను వశపడెదను. కాని సర్వసంగ నివారకమగు సత్సంగము ద్వారా నేను వశీభూతుఁడనైనట్లు, ఇంకే సాధనద్వారా వశపడను."

ఉద్ధవుఁడిట్లనెను :- "స్వామీ! సత్సంగమననేమి? సాధువుల మధ్యను కూర్చుండి, వారి ఉపదేశములను వినుటయే సత్సంగముకదా!"

భగవానుఁడిట్లనెను :- "ఉద్ధవా! మహాపురుషుల యొక్క సాంగత్యమునకును సత్సంగమందురు. బలముచే ధూర్తులు తమ స్వార్థసిద్ధికొఱకును, ధనసంపాదనముకొఱకును

సత్సంగమను నెపమును బెట్టుకొందురు. వారి యుద్దేశ్యమే మనఁగా నేదో విధముగఁ బ్రజలను బ్రోవుచేసి, వారుకూడిన తరువాత వారిని మోసగించి ఔషధాలయు, పాఠశాలలను బేర ద్రవ్యమును గ్రహించుచుందురు. వారి సత్సంగము వ్యాపారము. దీనివలనఁ బరలోకసంబంధమగు లాభమేమి యును లేదు. ఏ సాంగత్యమున భగవానునియందు ప్రేమ కలుగునో అట్టి మహాపురుషుని సాంగత్యమే సత్సంగము. కాని యిచ్చట సత్సంగముయొక్క అర్థము వేఱు. ప్రపంచ మున నేకైక సత్ను నేనే. నాయందే విధముగనైన నాసక్తి కలిగినచో నింక సాధనతోఁ బనిలేదు. నాయందాసక్తినిఁ జెందిన సాత్త్వికపురుషులే ఉద్ధారమును జెందిరనుటకాదు. దైత్య, రాక్షస, మృగ, పక్షి, గంధర్వ, అప్సర, నాగ, సిద్ధ, చారణ, గుహ్యక, విద్యాధర, వైశ్య, శూద్ర, స్త్రీ, అంత్య జాదులైనను ఘోరరాజసతామస స్వభావము కలవారైనను నాసంగమునను నా యందాసక్తినిఁ జెందుట చేతను దరించెదరు."

ఉద్ధవుఁడిట్లనెను :- "ప్రభూ ! దైత్యులు ఘోర తామసులుగ నుందురు. వారిలో నెవరు మీ భజనమొనర్చి తరించిరి ?"

భగవానుఁడిట్లనెను :- " ఉద్ధవా! వృత్రాసురుఁడు దైత్యుఁడే. దైత్యశ్రేష్ఠుఁడై ఆతఁడు దేవతలతోఁ ఘోరా

డెను, ఆతడింద్రుని పీచమడంచెను. ఆతఁడయ్యును నాయం దాసక్తి కలిగియుండెను. ఆతఁడు తన హృదయమున దృఢ మగు భక్తిని నెలకొల్పుకొని యుండుటచే నీ సంసారసాగరము నుండి తరించెను.''

ప్రహ్లాదుఁడు దైత్యరాజగు హిరణ్యకశిపునిపుత్రుఁడు. నాయందాసక్తి కలిగియుండుటచే భక్తాగ్రగణ్యుఁడయ్యెను. దేవతాసభలయందును భక్తులప్రశంసవచ్చినచో ముందుగాఁ బ్రహ్లాదుని గూర్చి చెప్పుకొందురు.

వృషపర్వుఁడను దైత్యుఁడే అసురగురువగు శుక్రాచార్యుఁడాతని పురోహితుఁడు. ఇట్లయ్యును నాతనికి నా యందు భక్తి కలదు. ఆతఁడు నాయం దనురాగముంచెడు వాఁడు.

ప్రహ్లాదుని పుత్రుఁడు విరోచనుఁడును నాభక్తుఁడే. ఆతని పుత్రుఁడగు బలి తనభక్తిచే నన్నుఁ ద్వారపాలకునిగ నొనర్చుకొనినాఁడు. బలిచక్రవర్తిని మోసగించుటకై నేను వామనుఁడనై పోయితిని గాని ఆతఁడే నన్ను మోసగించినాఁడు. ఇప్పుడు నేనాతనికి ద్వారపాలకుఁడనై నిరంతర మాతని రక్షించుచుందును.

ఆతనికి పుత్రుఁడు బాణాసురుఁడు. ఆతని పుత్రి ఉష. నా పౌత్రుఁడగు ననిరుద్ధుని హరింపఁజేసి తన దగ్గఱకుఁ బిలి

పించుకొనెను. అంత నాతఁ డనిరుద్ధుని బంధించెను. మే మందఱమును బాణాసుర నగరమగు శోణితపురమునకుఁ బోయి, ఆతనితో యుద్ధమొనర్చితిమి. ఆతనికి వేయిచేతు లుండెను. అందులో నాలుగుచేతుల నుంచి మిగిలినవాని నన్నిటిని ఖండించితిని, ఆతఁడు తనభక్తిచే శంకరుని ముఖ్య గణములలోఁ జేరెను. నాకును భక్తుఁడయ్యెను."

ఉద్ధవుఁ డిట్లడిగెను :- "దానవులలోను నెవరైన భక్తులు గలరా?

భగవానుఁ డిట్లనెను :- "భక్తులకేమియును జాతి యుండదు. నామీఁద నాసక్తియుండినచో నాతఁడు భక్తుఁ డగును. దానవులలో మయదానవుఁడు నాకు గొప్పభక్తుఁడు. నన్నుపాసించుటచేతనే ఆతఁడనేక విధములుగ రచనచేయు శక్తిని సంపాదించెను."

ఉద్ధవుఁ డిట్లనెను :- "రాక్షసులలో నిట్టిగొప్పభక్తుఁ డెవఁడైనఁ గలఁడా?"

భగవానుఁ డిట్లనెను :- "ఎందులకు లేరు. రాక్షసు లలో విభీషణుఁడు నాకు గొప్పభక్తుఁడు. నాయం దత్యంతాస క్తినిఁ జెందియుండుటచేఁ బ్రపంచమున నందఱకును బూజనీ యుఁడగు భక్తుఁడైనాఁడు. ఆతఁడు తన కుటుంబ పరివారము నంతను విడి నా శరణమునకు వచ్చినాఁడు. నేనాతనికి శరణ

మొసంగితిని. ఆతఁడు నాతో స్నేహ మొనర్చెను. అందువలన నాతఁడు రాక్షసుఁడయ్యును నాపూజలో నాతఁడునుబరివార దేవతగాఁ బూజింపఁ బడుచున్నాఁడు."

ఉద్ధవుఁడిట్లడిగెను :- "స్వామీ! వానరులలోను మీకిట్టి సత్సంగ భక్తుఁడున్నాఁడా?"

భగవానుఁడిట్లనెను :- "ఏల లేరు? వానరులంద ఱును నాభక్తులే. నాభక్తి కారణముననే వారిల్లు వాఁకిలిని వదలి, పరివారమందలి మమతను త్యజించి నాతో లంకా పురికి యుద్ధమొనర్ప వచ్చిరి. అందులో హనుమంతుఁడు భక్తాగ్రగణ్యుఁడు. హనుమంతునకును నాకును భేదము లేదు. ఆతఁడు నావలెనే పూజింపఁబడు చున్నాఁడు. సుగ్రీవుఁడును బరమ భక్తుఁడే. వీరందఱకును నాయందత్యంతాసక్తి కలదు. వానర భల్లూకము లన్నియును నాయందు మిక్కిలి అను రాగమును గలిగియుండిరి. జాంబవంతుఁడు నా భక్తివలననే భక్తాగ్రగణ్యుఁడయ్యెను. ఈ కృష్ణావతారమందును యుద్ధ మొనర్చి నేనాతని కోరికను దీర్చితిని. ఆతని పుత్రికను జాంబ వతినిఁ బెండ్లాడితిని."

ఉద్ధవుఁడిట్లడిగెను :- స్వామీ! పశువులందును మీకు భక్తులు కలరా?"

భగవానుఁడిట్లనెను :- "ఉద్ధవా! గజేంద్రుఁడు పశువే కదా! మకరము దాని పాదమును బట్టుకొనఁగా నది నన్నుఁ

గేకవైచెను. నేనుగరుడుని మీఁదనెక్కి వెంటనేపోయి, చక్ర ముచే నక్రము యొక్క వక్త్రమును ఖండించి గజరాజు నుద్ధరించితిని. నా మీఁద నాసక్తి యుండుట చేతనే ఆతఁడు తామసమగు గజశరీరమును వదలి ముక్తుఁడయ్యెను. వ్రజమందలి హరిణ, పశు, పక్షులే కాక, యమళార్జునములను వృక్షములును నాసంగముచేఁ బవిత్రములయ్యెను.''

ఉద్ధవుఁడిట్లడిగెను :- ''స్వామీ! పక్షులలో నెవరైనను గలరా ?''

భగవానుఁడిట్లనెను :- ''పక్షులలో గృధ్రరాజు జటాయువు కలఁడు కదా! సత్సంగ ప్రభావముచే నాతఁడు నాధామమును బొందెను. రామరూపమున నేనాతని పుత్రుని వలె నాతనికి దహనసంస్కారాదు లొనర్చితిని.''

ఉద్ధవుఁడిట్లనెను :- వైశ్య శూద్రులలో నిట్టి వారెవరైనఁగలరా ?''

భగవానుఁడిట్లనెను :- ''అనేకులు కలరు. తులాధారుఁడను వైశ్యుఁడు నాయందాసక్తి నుంచుటచే ధర్మజ్ఞుఁడయ్యెను. ధర్మవ్యాధుఁడు నాప్రేమ ప్రభావము చేతనే సిద్ధుఁడైనాఁడు. నేనెందఱను వర్ణింపఁగలను ? వ్రజమందలి తృణ, వృక్ష, ఖగ, మృగ, గో, గోపికాదు లందఱును నసారమగు నీ సంసారమును సుగమముగ దాటి పరబ్రహ్మనగు నన్నుఁ బొందిరి.

ఉద్ధవా! నన్ను వైదిక మార్గమునఁ బ్రాపింప వలయుననిన బ్రహ్మచర్యవ్రత మవలంబించి, గురుగృహమున నుండి, నియమపూర్వకముగ వేదాధ్యయనము కావింప వలయును. ఆశ్రమ వ్యవస్థాను సారముగ ధర్మమున నడువ వలెను. యోగ సాంఖ్య, దాన, వ్రత, తప, యజ్ఞ, శాస్త్ర శ్రవణ, మనన, నిదిధ్యాసన, సన్న్యాసాది అనేకోపాయము లచే నన్నుఁ బొందఁగలరు. కాని నేనిప్పుడు చెప్పిన వారెవ రును విధ్యుక్తముగ బ్రహ్మచర్య మవలంబించి వేదాధ్యయన మును జేయలేదు. మహాత్ములుపురుషుల నుపాసింపలేదు వ్రత, జప, తప, యజ్ఞానుష్ఠానములను జేయలేదు. కేవలము భక్తి భావము చేతనే యీసంసారమును దాటి బయట పడిరి. ఈ వ్రజగోపిక లేమియును జదువలేదు. వీరి భావమును వేరే. అయినను వీరు నా అనన్య భక్తికి అధికారిణులైరి.''

ఉద్ధవుఁడిట్లనెను :- ''స్వామీ! గోపికల దశ విచిత్ర మైనది. మీరు నాచే వారికి సందేశమును బంపినపుడు వారి భావములను గాంచి నేను నిర్ఘాంతుఁడనైతిని. దయతో వారి భక్తిభావమును గూర్చి నాకు విశేషముగఁ జెప్పవలయును.''

సూతుఁడిట్లనెను :- ''మునులారా! గోపికలు జ్ఞాపక మునకు రాగానే భగవానుని యొక్క హృదయము ముప్పొంగెను. ఆతని కంఠము గద్గదిక మయ్యెను. ప్రేమావేగమున

నాతఁడేమియును మాటలాడఁజాలక పోయెను. ఉద్ధవుఁడును నాతని ముఖమువైపు చూడ నారంభించెను. ఆతని నేత్రము లందును నీరు పెల్లుబికెను. ఇప్పుడు గోపికల యొక్క ప్రేమ వృత్తాంతమును గూర్చి భగవానుఁ డేది చెప్పెనో దానిని వర్ణింపఁ బోవుచున్నాను. శ్రద్ధాళువులై వినుఁడు.''

## ప్రభువుపై గోపికల ఆసక్తి

శ్లో॥ రామేణ సార్థం మధురాం ప్రణీతే ।
శ్వాఫల్కినా మయ్యనురక్త చిత్తాః
విగాఢ భావేన న మే వియోగా
తీవ్రాధయోఽన్యం దదృశుః సుఖాయ ॥

శ్రీభాగ. ౧౧ స్కం. ౧౨ అ. ౧౦ శ్లో ॥

వ॥ శాస్త్రాచారచోదితులు గాక భక్తిభావనా విశే షంబున నేమఱక నిత్యంబును జింతనాయత్తలై యెఱింగిరి - మధురాపురంబునకు హలాయుధ సమేతుండనై యేనరుగుచో గోపికలోపికలు లేక భక్తి యోగంబున జింతించి ముక్తలైరి-

సంయోగ విరహములందు రసికులు విరహమే శ్రేష్ఠమని చెప్పిరి. సంగమమునఁ గేవలము ప్రియతముని శరీరమందే ఆతని అనుభూతి కలుగును; కాని విరహమందు

చరాచర జగత్తంతయును నాతని స్వరూపముగనే కనం బడును. మనస్సు నెవరైనను బట్టుకొనం గలిగినచో యోగ, వైరాగ్య, జపతపాదులన్నియును వ్యర్థములే. సమస్త సాధనలు చంచలమగు మనస్సును బట్టుకొనుటకే చేయంబడుచున్నవి. నిరోధింపంబడిన మనస్సు దానిస్థితిలోనే యుండును. కాని మనస్సును దనవైపునకు లాగుకొని దానికి తన రంగును రాచిన నింక సాధన లవసరమేమున్నది ? మనస్సు నొక్క కృష్ణుండే తనవైపునకు లాగుకొనం గలండు. ఏలననంగాం గర్షణమొనర్చువాండే కృష్ణుండని కలదుకదా! ప్రపంచము వైపున కేర్పడిన నాకర్షణ క్షణికము. అస్థాయి యగును."

సూతుం డిట్లనెను :- "మునులారా ! గోపికల ప్రేమను గూర్చి ప్రశంసించుచు భగవానుం డిట్లనెను :- "ఉద్ధవా ! ఎందఱో యోగులు కన్నులను, చెవులను మూసికొని వ్రతోపవాస ప్రాణాయామాదులొనర్చి నాధ్యానము జేయుదురు. వారికి నేను క్షురస్యధారగా నయ్యెదను. ఇది అతిదుర్లభమార్గమనియు ననుచుందురు. కాని వ్రజగోపికలేమియును జదువలేదు. వారివద్ద శౌచాచార విచారములు లేవు. వారికి ద్వైతాద్వైత విచారములేమో తెలియదు. వారికి నాయందాసక్తి కలిగెను. ఒకవేళ నాయథార్థరూపమేమైనను దెలియునందమా వారికి నేను బరబ్రహ్మనను

జ్ఞానము లేదు. వారు నా త్రిభువన మోహనమగు శ్యామ సుందర రూపమును గాంచి, ఆరూపమందే మనస్సులను నిలిపిరి. వారికి నేను వారి పతులకంటెను ప్రియుఁడనైతిని. స్త్రీలు తమ జారపతినిఁ దన పతికంటె నెక్కుడుగఁ ప్రేమింతురు. చాలమంది జారపతి కొఱకు తమపతిని హత్యను గూడ చేయుదురు. వారు నన్ను జారపతులకంటెను నెక్కుడుగఁ ప్రేమించిరి. వారు నన్నుఁ బరమ రమణశ్రేష్ఠునిఁగను, మనోహరునిగను భావించి ప్రేమించెడు. వారు ఎట్లైనఁ గానిండు, ఎఱిఁగిగాని, యెఱుఁగక గాని వారి ఆసక్తి సర్వాంతర్యామియగు నామీఁద నేర్పడెను. కలకండను దెలిసి నోటిలో వేసికొన్నను, తెలియక వేసికొన్నను నది తీఁపిగనే యుండును. అగ్నిని తెలిసి తాకినను, దెలియక దాకినను నది కాలితీరును. అదే విధముగఁ దెలియకుండినను దైవవశమున వారికి సత్స్వరూపుఁడనగు నాతో సంగము కలిగినది. వారు తమ తను, మన, ధన, సర్వస్వములను నాకర్పణము కావించిరి. దమకేమియును మిగుల్చుకొనలేదు. నేనును వారిని నవ్వించుచుంటిని. సరసక్రీడలొనర్చుచుంటిని. వారు నామీఁద నాసక్తినిఁ జెందుటచే సమస్తమును మఱచి పోయిరి. నేనెల్లప్పుడు నిట్లే వారిని నవ్వించుచుందునని వారి విశ్వాసము. నేనెల్లప్పుడును వారితోనుండి క్రీడింతునని తలఁచిరి. కాని అట్లు జరుగలేదు.

ఒకదినమున మా పినతండ్రియగు నక్రూరుఁడు మా అన్న బలరాముని నన్ను రథము మీఁదఁ గూర్చుండఁ బెట్టుకొని మధురకు దీసికొని వచ్చెను. ఆ సమయమున నున్న గోపికల స్థితి నొక్కసారి తలఁచుకొనిన హృదయము బ్రద్దలై పోవును. వారేమియును దెలియక వడగండ్ల వానచే దెబ్బతిన్న లతలవలెఁ గన్నుల నీరుగార్చుచు నట్లే నిలుచుండిరి. రథము కనుమరుగు కాగానే పెద్దగనేడ్చి తెగఁగొట్టఁబడిన వృక్షమువలెఁ గ్రిందఁబడిరి. ఆ సమయమున వారికి ప్రపంచమే తోచకుండెను. వారికెచ్చటజూచిన నా నీలమేఘశ్యామల స్వరూపమే గోచరించుచుండెను. వారి చిత్తములు నా యందనురక్తములై యుండెను. అందువలన వారునన్ను స్మరించుచు నేడ్వ నారంభించిరి.

రాసవిలాసమా తాఱు నెలలు జరుగుచుండెడివి నాతోఁ గ్రీడించుచుండ నీ కాలమంతయును నర్ధక్షణముగఁ దోఁచెడిది. ప్రాతఃకాలమైన దనఁగానే వారులికిపడి, అయ్యో మేమిప్పుడే కదా వచ్చినదనుచుండెడువారు. ఉద్ధవా ! సుఖసమయములు త్వరగా గడచిపోవును. ఇప్పుడు వారికా రాత్రులు కల్పము వలె దీర్ఘముగఁ దోచుచున్నవి. ఇప్పుడు వారు నన్ను స్మరించుచు వెక్కి వెక్కి యేడ్చుచుందురు వారి కాహారపానీయములును, దీపావళియు, శ్రావణమాసమును బాగుం

డదు పూర్వము హోళికకు ముందే యెన్నో ప్రయత్నము లొనర్చెడువారు. ఇప్పుడు హోళీ దాటిపోవుచున్నది కాని ఒక్కబిందు వసంతము కానిండు, చిటికెడు గులాలుతోఁ బని లేనేలేదు. ఇప్పుడు వారు నిరంతరము నా ధ్యానమందే మగ్నులై యున్నారు. వారికిఁ బ్రపంచము కనఁబడుటలేదు. ఉద్ధవా! ఇప్పుడు నీవే చెప్పుము. దీనికి మించిన సమాధి యింకెక్కడ ఉండఁగలదు! నదులన్నియును సముద్రమును జేరిన తరువాత వాని నామరూపముల నెట్లు విడుచునో, సమాధిలో నుండినవాఁడు తన యుపాధిని మఱచినట్లు వారు నా ప్రేమలో మునిఁగి సమస్తమును మఱచిరి. వారికి కేవలము నా స్మృతి తప్ప యింకొకటేమియును లేదు. వారికి తమ శరీర స్పృహ లేదు, గృహస్పృహ లేదు. ప్రపంచ స్పృహ లేదు. కేవలము నా స్మృతి మాత్రము కలదు."

ఉద్ధవుఁడిట్లనెను:- "ప్రభూ! నేను స్వయముగఁ బోయి వారి స్థితినిఁ జూచివచ్చితిని. వారి స్థితిముందు సహస్ర సమాధులను దిగదుడుపు పెట్టవలసి యుండును. "స్వామీ! వారికట్టి స్థితి యెట్లు ప్రాప్తించినదో నాకుఁ జెప్పవలయును."

భగవానుఁడిట్లనెను:- "ఉద్ధవా! నీవింతవఱకు చాల విధినిషేధములను బాటించితివి. ఇప్పుడు నీవు శ్రుతి, స్మృతి, ప్రవృత్తి, నివృత్తి, శ్రోతవ్య, శ్రుతములన్నిటినిఁ బరిత్యజించి

కేవల మనన్యభావమున నన్ను స్మరింపుము. నన్ను శరణు జొచ్చుము. నేనే సమస్తదేహధారుల కాత్మను నేనే అందఱ కాధారమను, నా శరణముననే సుఖము కలదు. నా శరణము ననే శాశ్వత శాంతికలదు. నన్నాశ్రయించి నీవు సర్వథా సుఖశాంతులను బొందు నిర్భయుండవై యుండుము. నీవు సాధారణ జీవుఁడనని అనుకొనకుము. సర్వసమర్థుఁడవగు శివుఁడ ననుకొనుము."

ఉద్ధవుఁ డిట్లనెను :- "ప్రభూ! మీరు చెప్పుటలో నే లోపమును లేదు. కాని నేను మందబుద్ధి నగుటచే మీరింతగాఁ జెప్పినను గ్రహింపఁజాలక పోవుచున్నాను. నా సందేహము లింకను దీర లేదు. నా చిత్తము భ్రమించుచున్నది. నేను జీవుఁడననుకొనక శివుఁడనని యెట్లనుకొనఁగలను? నే ననన్య భావముతో మీ ఉపాసన నెట్లు చేయఁగలుగుదును? కృపతో నీ విషయమును బాగుగా బోధింపవలయును."

ఇది విని భగవానుఁ డిట్లనెను :- "మంచిది, ఉద్ధవా! ఈ విషయమును చాల గూఢమైనది. నీవు సమాహిత చిత్తుఁ డవై కర్మత్యాగవిధిని గూర్చి శ్రవణ మొనర్చుము."

సూతుఁ డు శౌనకాది మునులతో నిట్లనెను:- "మును లారా! భగవానుఁ డుద్ధవునకుఁ గర్మత్యాగమును గూర్చి యును, గుణాతీతుఁడగు విషయమును గూర్చి యేమి చెప్పెనో దానిని మీకుఁ జెప్పెదను వినుఁడు."

# గుణాతీతుఁడగు నుపాయము

శ్లో ॥ వేణుసంఘర్షజో వహ్నిర్దగ్ధ్వా శామ్యతి తద్వనమ్ ।
ఏవం గుణవ్యత్యయజో దేహః శామ్యతి తత్క్రియః॥
శ్రీభాగ. ౧౧ స్కం. ౧౩ అ. ౭ శ్లో ॥

వ. ఉద్ధవా! వేణు సంఘము పరస్పరము రాచుకొనుటచే నగ్ని యుత్పన్నమై దానినంతను దగులబెట్టు నట్లు, గుణ వైషమ్యముచే నుత్పన్నమైన దేహము క్రియలచే శాంతించును.''

వృక్షములోని వస్తువు లన్నియును బీజము చేతనే ఉత్పన్నమైనవి. జడ, మూల, కాష్ఠ, శాఖ, పత్ర, ఫల, పుష్ప, అంకురాదు లను నామములు తరువాత వచ్చినవి. ఇవన్నియును సూక్ష్మరూపమున బీజమందే సన్నిహితమై యున్నవి. ఇదే విధముగ జగత్తు నందలి స్థూల సూక్ష్మ వస్తువులన్నియును బరమాత్మ పరబ్రహ్మము నుండియే ప్రకటమైనవి. చివరకన్నియు నాతనిలోనే పర్యవసించును. ఈ విషయము తెలిసికొనిన వారికి ద్వైతభావము నశించును. అట్టి వాఁడు శోక మోహముల నుండి బయటపడి సంసార సాగరమును దాటిపోవును.

సూతుఁడిట్లనెను :- ''మునులారా! ఉద్ధవుఁడు కర్మత్యాగము విషయమును గూర్చి ప్రశ్నింపఁగా భగవానుఁ

డిట్లనెను :- "ఉద్ధవా! నాకు రెండు రూపములు కలవు. ఒకటి శబ్ద బ్రహ్మ, రెండవది శబల బ్రహ్మ. ఇవి భిన్న భిన్నములు కావు. పరబ్రహ్మనుండియే శబ్దబ్రహ్మ పుట్టినది. సమస్త ప్రాణులకును జీవనదాతయగు నీశ్వరుఁడే శబ్దరూపమునఁ బ్రకటమైనాఁడు."

ఉద్ధవుఁడిట్లనెను :- "స్వామీ! ఇది నాకర్థము కాలేదు. దీనిని స్పష్టముగ నాకు వివరింపుఁడు."

భగవానుఁడిట్లనెను :- "సరే, దీనిని వినుము. మనము వాక్కుతో శబ్దమును బలుకుచున్నామే, దాని నెట్లు పలుకుచున్నాము?

ఉద్ధవుఁడిట్లనెను :- స్వామీ! మనస్సులోనికి వచ్చిన విషయమును వాక్కుతోఁ బలికినాము."

భగవానుఁడిట్లనెను :- "అట్లు కాదు, దీనిని సూక్ష్మరూపమున విచారించుము. వాక్కు నాలుగు విధములుగ నుండును. పరా, పశ్యంతీ, మధ్యమ, వైఖరీ. మనము మాటలాడు మాటలు వైఖరీవాణితోఁ బలుకుదుము."

ఉద్ధవుఁడిట్లడిగెను :- "స్వామీ! పరా, పశ్యంతి, మొదలగు వానినిఁ బలుకుటెట్లు?

భగవానుఁడిట్లనెను :- "ఈ వాక్కులు పలుకఁబడవు. వీని కభివ్యక్తి కలుగును. నీవే కాగ్రచిత్తముతో

ధ్యానములో నుండి యేదైన శబ్దమును జాల నెమ్మదిగా సంయమ పూర్వకముగఁ బలుకుము. ఏమి జరుగును ?''

ఉద్ధవుఁడిట్లనెను :- ''స్వామీ! ఏమి శబ్దమును బలుకుదును ?''

భగవానుఁడిట్లనెను :- ''ఏదైనఁ బలుకవచ్చును. లేదా 'ఓమ్' అనుము. పూర్తిగా దానిమీఁద ధ్యానముంచవలయును.''

సూతుఁడిట్లనెను :- ''మునులారా! ఇది విని అత్యంత ఏకాగ్ర చిత్తముతో నుద్ధవుఁడు 'ఓమ్' అని పలికెను.

భగవానుఁడిట్లడిగెను :-''ఈ శబ్దమెచ్చట పుట్టినది?'',

ఉద్ధవుఁడిట్లనెను:- ''స్వామీ! పలుకునపుడు నాపొట్ట నకుఁచించుటజరిగినది. అందువలన నీశబ్దము నాభివద్ద పుట్టినదని తోఁచుచున్నది.''

ఇది విని భగవానుడు నవ్వి యిట్లనెను :- ''అవును సత్యమే. నీవు మనస్సు నేకాగ్రమొనర్చితివి. కాని ఇంకను నతి సూక్ష్మము కాలేదు. ధ్యానపూర్వకముగఁ జూడుము.

ఉద్ధవుఁడు చాలసేపటి వఱకు ధ్యాన మొనర్చుచు మాటిమాటికిని 'ఓమ్' శబ్దమును లోలోనఁ బలుకుచుండెను. అంత నులికిపడి యిట్లనెను :- ప్రభూ ! ఏదియో వాయువు

నాభిక్రింద స్పృశించుచున్నట్లును, అది తగిలి యేదోవస్తువును నాభిపైపునకు నెట్టినట్లున్నది.

పకపక నవ్వుచు భగవానుఁడిట్లనెను :- "ఇప్పుడు నీవనున్న సూక్ష్మమైనది. నీకేదో తగిలినట్లు చెప్పుచుంటివే అదియే ఆదిపశ్యంతి భాష, ప్రథమమున దాని అభివ్యక్తి గుదస్థానమున నుండు చతుర్దళములు గల ఆధారచక్రమున నైనది. అచ్చట నతి సూక్ష్మ శబ్దము కలుగును. కమల తంతువునకు శిరీషపుష్పదళముతోఁ గొంచెముగఁ దాఁకును. దానిచేఁ దాఁకుటచే శబ్దము కలుగును. కాని సర్వసాధారణునకది గోచరింపదు. సహస్రకముల పత్రములను నొక దానిపై నొకటి ఉంచి, అత్యంత సూక్ష్మముగు మొనగల సూదితో దానిపై గ్రుచ్చుము. వెంటనే అన్నిటికిని రంధ్ర మేర్పడి సూది బయటకు వచ్చును. ఒకపత్రమును గ్రుచ్చుట కెంత కాలము పట్టినదో చెప్పుము. నీవూహింపఁజాలవు. ఏమి యును బట్టలేదందువు. కాని అట్లుకాదు. సూది మొన ఒక పత్రమునుండి యింకొక పత్రము, దాని తరువాత నింకొక పత్రము క్రమముగ నిట్లు ప్రవేశించినది. ఒక్కదానికి చిల్లి పడుట కేమియును వ్యవధి లేదంటివి. కాని నీవు ఆ సమయమును వ్యక్తము చేయఁజాలక పోవుచున్నావు. ఇదేవిధముగ నాధార చక్రమున నేశబ్దము కలిగినదో, అది కలిగి తీరినది,

కాని అది అతి సూక్ష్మమగుటచే నీవు. వినఁజాలక, పోవు చున్నావు. సమస్తమునకును జీవనదాన మొనరించుచుఁ బర మేశ్వరుఁడే పరావాణితోఁగూడుకొని ప్రథమమున నాధార చక్రమునఁ బ్రవేశించెను. అనంతర మాతఁడు అష్టదళ పద్మముగల మణిపూరక చక్రమునకు. వచ్చెను. అచ్చట మనోమయ సూక్ష్మరూపముచే నాతని అభివ్యక్తి గలుగును. అప్పుడా వాణికి పశ్యంతి యను పేరువచ్చినది. దానిని మనస్సుతోఁ జూడఁ గలుగుదుము. దానికే 'పశ్యంతి' యను పేరు. అది మనస్సు ద్వారా తెలిసికొనఁబడును. ఏశబ్దమును మాటలాడినను బొట్ట అక్కలింపఁబడును. అనఁగా బరా వాక్కుకంటె నది స్థూలమగుటచేతను, దానిని తెలిసికొను చున్నాము. అనంతరమా శబ్దము కంఠమూలమున నుండి షోడశదళములుగల విశుద్ధ చక్రమునకు వచ్చెను. అ, క, ఖ, గ, ఘ, జ, హ ఇవి మాటలాడునపుడు స్పష్టముగా గంఠమునుండి వెలువడును. అనఁగా వీనిని బలుకునపుడు కంఠము మీఁద విశేషబలము పడును. శబ్దము లన్నియును నాభికడ పుట్టి కంఠమూలమందుండిన విశుద్ధ చక్రమందు మధ్యమవాణీ రూపమునఁ బరిణతినిఁ జెందుచున్నది. దాని స్థూలము మనకు గనఁబడును. మూలాధారమున బీజరూప మున నుండి, మణిపూరకమున నంకురమై, విశుద్ధ చక్రమున

(కంఠ దేశము) వ్యక్తమై, వైఖరీవాక్కుతో వ్యక్తమై ఫల రూపమును జెందినట్లగును. మొదట పరారూపమున నతి సూక్ష్మముగను, పశ్యంతీరూపమున సూక్ష్మముగను, మధ్యమారూపమున స్థూలముగను, వైఖరీ రూపమున నతి స్థూలముగను వ్యక్తమైనది. ఈ దృష్టాంతమున బాగుగా నర్థము చేసికొనుము; యజ్ఞమందు రెండు కొయ్యలను మథించి అగ్నినిఁ దీయుదురు. మథించుటకు బూర్వమా రెండు కొయ్యలందును సూక్ష్మరూపమున నగ్ని యున్నది. ఆ కొయ్యలలోనే కాదు. ఆకాశమందావిరిరూపమున సర్వత్ర అగ్నియున్నది. కాని అది వ్యక్తముకాలేదు. రెండు కొయ్యలను బలపూర్వకముగ మథించినచో వాయువు దానికి సహాయము కావించినది. రెండు కొయ్యలును వేడెక్కినవి. వానిలోనికి ఊష్మ వచ్చినది. ఇప్పుడా ఊష్మయే మథింపఁగా మథింపఁగా రవ్వలరూపమున వ్యక్తమైనది. ఆ రవ్వలను దూదిలో నుంచి విసరినచో నది పెరుగును. అప్పుడు చిన్న చిన్న చిదుకులువైచి ప్రజ్వలిత మొనర్చెదరు. ఘృతాహుతులు వానిలో వేయంగానే అవి ప్రచండ రూపమును ధరించినవి. సూక్ష్మాగ్ని యిప్పుడు స్థూలాగ్ని యయ్యెను. ఇట్లు వ్యక్తమైన అగ్ని ఆకాశమందు ఊష్మరూపమున సర్వత్ర వ్యాపించిన నగ్నికి భిన్నమైనదికాదు. ఆ సూక్ష్మాగ్ని సూల రూపమును జెందినది. ఇదేవిధముగఁ బరా, పశ్యంతి,

మధ్యమా, వైఖరీ వాణీరూపమున నాయొక్క అభివ్యక్తి అయినది. సర్వవ్యాపకరూపమున నేనే పరబ్రహ్మనైనాను. వాణీరూపమున వ్యక్తము కాఁగానే శబ్దబ్రహ్మగఁ బిలువఁ బడుచున్నాను. కేవలము వాక్కే కాదు, ఎన్ని కర్మలున్నవో, అవన్నియును నా కార్యములే. అన్నియును నావలన నుత్పత్తియైనవి. నాలుగు విధముల వాక్కును నావలననే కలిగినవి. చేతుల పనియగు నెత్తుట, పట్టుకొనుట తీసికొనుట, యిచ్చుటయును, పాదముల కర్మయగు నడుచుట, తిరుగుట, గుదకార్యమగు మల విసర్జన మొనర్చుటయును, నాసికా కార్యములగు వాసన చూచుటయును ఆఘ్రాణించుటయును, జిహ్వాకార్యమగు రుచిచూచుటయును, కన్నుల విషయమగు జూచుటయును, త్వగింద్రియ కార్యమగు కఠినమృదుల, శీతోష్ణ స్పర్శానుభవమును, శ్రవణేంద్రియ కర్మయగు మంచి, చెడ్డ, నీరస శబ్దములను వినుటయును, మనస్సు విషయమగు సంకల్ప మొనర్చుటయును, బుద్ధి విషయమగు విచారణ మొనర్చుటయును, అభిమాన కర్మయగు నహంకారమును, మహత్తత్త్వము యొక్క విషయము సూత్రాత్మయును, సూక్ష్మమువలన మహత్త్వ మొనరించుటయును, సత్త్వగుణ కర్మయగు జ్ఞానమును, రజోగుణ విషయమగు గర్మ ప్రవృత్తినిఁ జెందుటయును, తమోగుణ కర్మయగు నిద్రాలస్య ప్రమాదములను జెందుటయు

నగుచున్నవి. ఉద్ధవా! ఇవన్నియును నా యొక్క కార్యములే. నావలననే యివన్నియును జరుగుచున్నవి. నావలననే సమస్త ప్రపంచము సృష్టింపఁబడినది."

ఉద్ధవుఁడిట్లడిగెను :- "స్వామీ! మీ నుండి యింత గొప్ప ప్రపంచమెట్లు పుట్టినది ?"

భగవానుఁ డిట్లనెను :- నాకు రమణేచ్ఛ కలుగఁగా నేను నా మాయనాశ్రయించి మాయోపాధికుఁడనగుటచేతనే యీ త్రిగుణ బ్రహ్మాండ కమలమునకుఁ గారణమైతిని. ఆది పురుషుఁడగు నేనే అందఱకును జనకుఁడను"

ఉద్ధవుఁడిట్లనెను :- ఒక్కఁడవగు నాది పురుషుఁడ వనేకములుగ నెట్లైతివి ?"

భగవానుఁడిట్లనెను :- "ఉద్ధవా! ఆదిపురుషుఁడు మొదట ఒక్కఁడేనని నేను మాటిమాటికిని జెప్పుచున్నాను. సర్వవ్యాపకమగు నగ్నివలె నతఁడు వ్యక్తుఁడుగనున్నాఁడు. ఈతఁడు మాయనాశ్రయింపఁగనే కాలగతిచే, శక్తులయొక్క విభాగము కలుగఁగానే, ఈ ఆదిపురుషుఁడగు బరమాత్మయే నానారూపములందు భాసించెను. దానినే జగత్తనిపలికెదరు."

ఉద్ధవుఁడిట్లనెను :- "జగత్తైన తరువాత భగవానుఁడు వేఱుగనుండెను. జీవుఁడు వేఱయ్యెను. ప్రపంచము వేఱయ్యెను."

పిమ్మట భగవానుఁ డిట్లనెను :- "వాని నొక్కటి యనుటయు, వేఱనుటయు, రెండును భ్రమయే. ఆతని నేకమనియు ననేకమనియు ననరాదు. ఏ యుపమానమును నీయవీలు లేదు. జగత్తు నాతఁడే, పరమాత్మయు నాతఁడే. వస్త్రము దారముచే నేర్పడును. దానిని నేయునపుడును, వడుకునపుడును దారమే పైనను దారమే, క్రిందను దారమే. కాని వస్త్రమును దారమని యెవఁడు ననఁడు. అన్నిటిని నూలువస్త్రమనియు, నున్నివస్త్రమనియు ననుచుందురు. వానికి రంగులు వైచినచో నారంగు పేరుతోడనే పిలిచెదము. ఎఱ్ఱరంగు వైచిన నెఱ్ఱగుడ్డ అనియు, పచ్చరంగు వైచినఁ బచ్చగుడ్డ యనియు నందుము. వస్త్రమును శిరస్సునకుఁ జుట్టుకొనినఁ దలగుడ్డయనియు, శరీరమునకు ధరించినఁ జొక్కాయనియుఁ, కట్టుకొనిన ధోవతియనియు, నేలమీఁదఁ బఱచుకొనినఁ బరదా లేక పక్కయనియు, పైన వేసికొనిన నుత్తరీయమనియు, నందుము. దానినే స్త్రీ ధరించినఁ జీర యందురు. రంగు వైచుకొని పైఁటవేసికొనినఁ బైఁటపావడా అందురు. ఇంతకు అన్నిటిలో నున్నది దారమే. అదేవిధముగ నీ ప్రపంచమంతయును నా భగవానునిచేతనే యేర్పడినది. ఆతనిలో నిది ఓతప్రోతమైయున్నది. ఆతనిలోనే కనఁబడుచున్నది. ఈ ప్రపంచమంతయును నొకవృక్షమువలెనున్నది. ప్రవాహరూపమున సనాతనమైనది."

ఉద్ధవుఁడిట్లనెను :- "స్వామీ! ఈ జగత్తు వృక్షమెట్లు ?"

భగవానుఁడిట్లనెను :- "వృక్షమెట్లు కొయ్యరూప, అట్లే యీ ప్రపంచమంతయును కర్మమయము. వృక్షమును గొయ్యను దొలఁగించినచో నింకేమియు నుండదు. అదే విధముగఁ బ్రపంచమునుండి కర్మను దీసివైచినచోఁ బ్రపంచమే నశించును. కాష్ఠముచేతనే వృక్షముయొక్క అస్తిత్వమున్నది. అట్లే కర్మచే జగదస్తిత్వమున్నది."

ఉద్ధవుఁడిట్లనెను :- "స్వామీ! వృక్షము బీజముచే నుత్పన్నమగును. ఈ సంసారవృక్షమునకు బీజమేది ? ఇది దేనివలన నుత్పన్నమైనది ?"

భగవానుఁ డిట్లనెను :- "పాపపుణ్యములు రెండే సంసారము నుత్పన్నమొనర్చు బీజములు. బీజమును రాతిమీఁద నాటినచో నది మొలవనే మొలవదు అదేవిధముగ జ్ఞానిదృష్టిలోఁ బాపపుణ్యములు లేవు. కావున నాతనికి సంసారముండదు. ఆతఁడు గుణములతోఁ దిరుగుచుండినను గుణాతీతుఁడై చరించుచుండును. బీజము పదును చేసిన భూమియందే యుత్పన్నమై శాఖ, పత్రం పుష్పాది రూపమును ధరించును. అదే విధముగ మాయయందే ఈ రెండు బీజములును వృద్ధినిఁ జెందును."

ఉద్ధవుఁడిట్లనెను:- "బీజమందు మొదట వేరుపుట్టును. అంత నంకురముత్పన్నమగు నంటిరి. ఈసంసార వృక్షమునకు జడ మేది ?"

భగవానుఁడిట్లనెను :- "జీవునియొక్క అనంత వాసనలే యీ సంసారవృక్షమునకు జడములు."

ఉద్ధవుఁడిట్లనెను:- "వృక్షమందు ముందుగా నంకురముత్పన్నమగును. అదియే పెద్దదై మానుగా నేర్పడును. ఈ సంసార వృక్షమునకు మానేది ?"

భగవానుఁడిట్లనెను :- "సత్వ, రజ, స్తమములను నీమూఁడు గుణములే సంసారవృక్షమునకు వ్రేళ్లు, యీ మూఁడిఁటి యాధారమున వృక్షము పెరుగును. మాను వ్రేళ్ళను గొట్టినచో వృక్షమంతయును గొట్టఁబడును. ఇదే విధముగ మూఁడు గుణములును సమభావమున నుండినచో బ్రలయమగును."

ఉద్ధవుఁడిట్లనెను:- "వృక్షమునకు గొప్ప గొప్ప స్కంధములుండును. ఈసంసార వృక్షమునకు స్కంధ మేది?"

భగవానుఁడిట్లనెను:- "పృథివీ, జల, తేజ, వాయు రాకాశములను నవియే ఈ సంసారవృక్షమునకు స్కంధము. ఈ స్కంధమువలననే యిది యింతగాఁ బెంగినది. విస్తృతమైనది."

ఉద్ధవుఁడిట్లనెను :- "స్వామీ! వృక్షమునకు చాల శాఖలుండును. ఈ సంసార వృక్షమునకు శాఖలేవి?"

భగవానుఁ డిట్లనెను :- "మనస్సుతో సహా పదునొకండింద్రియములు దీనిశాఖలు. వీనిచేతనే యిది దట్టముగ నైనది."

ఉద్ధవుఁడిట్లనెను:- "స్వామీ! వృక్షమునం దొకటి స్థూలమును, ఒకటి సూక్ష్మమును, ఇంకొకటి అతిసూక్ష్మము నగు వల్కలములుండును. ఈ సంసారవృక్షమున కీమూఁడు వల్కలము లేవి?"

భగవానుఁడిట్లనెను:- "వాత, పిత్త, శ్లేష్మములే ఈ సంసారవృక్షమునకు వల్కలములు. శరీరమంతయును, వాయు, స్నిగ్ధతా, ఉష్మా వీనిచే నేర్పడి అంటుకొని యున్నవి."

ఉద్ధవుఁడిట్లనెను :- "వృక్షమునకుఁ జాల ఆకులుండును, ఈ సంసార వృక్షమునకు ఆకులేవి?"

భగవానుఁడిట్లనెను :- "ఈ యెనుఁబది నాలుగు లక్షల యోనులే యీ సంసారవృక్షమునకు ఆకులు. ఆకు లెట్లు రాలి మరలఁ బుట్టుచుండునో, అట్లే ఒకటి తర్వాత నింకొకటి, దానితరువాత మఱియొకటి ఇట్లు తిరుగుచుండును.

ఉద్ధవుఁడిట్లడిగెను:- "స్వామీ! వృక్ష మూలముల నుండి రసము బయలుదేరి శాఖోపశాఖలయందు సరసతా

సంచారమును గావించుచుండును. వృక్షములలో రసమే లేకుండినచో నవి ఒక్క దినమువంటే జీవింపక యెండి పోవును. ఈ సంసారవృక్షమునకు రసమేది ?"

భగవానుఁడిట్లనెను:- "ఉద్ధవా! శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములే యీ సంసారవృక్షమునకు రసములు. వాని చేతనే యిది సరసమై పచ్చపచ్చగానున్నది. ఈ యైదువిషయములు లేకుండినచో సంసారము నీరసమై పోవును. అప్పు డిందులో నాకర్షణమేమియు నుండదు. ఈవిషయములచే నిది పల్లవిత, పుష్పిత, ఫలితమగుచున్నది."

ఉద్ధవుఁడిట్లడిగెను:- "స్వామీ! వృక్షములకు ఫల పుష్పములుండును. ఈ సంసారవృక్షమునకు ఫల పుష్పము లేవి ?"

భగవానుఁడిట్లనెను ;- "కర్మభోగమే ఈ వృక్షమునకుఁ బుష్పము సుఖదుఃఖములే యీ సంసారవృక్షమునకు ఫలములు. ఈ సంసారవృక్షము సాధారణమైనది కాదు. అత్యంత విశాలమైనది. సూర్యమండలము వఱకు వ్యాపించి యున్నది."

ఉద్ధవుఁడిట్లనెను:- "స్వామీ! వృక్షమీఁదఁ బక్షులు గూళ్ళు కట్టుకొని నివసించుచుండును. ఈ సంసారవృక్షము మీఁదను నేవైనఁ బక్షులుండునా ?"

భగవానుఁ డిట్లనెను – "జీవేశ్వరులిద్దఱు నీ సంసార వృక్షమునఁ బక్షులుగనున్నారు. అందులో నొకఁడు ఫలమనుభవించుటచే బాధింపఁబడినాఁడు. రెండవవాఁడు తినకుండుటచే విముక్తుఁడై యున్నాఁడు. ఈ సంసారవృక్షమునకు పచ్చిది, పండునను రెండు పండ్లు కలవు. పచ్చికాయ పుల్లగ నీరసముగను, జేదుగను నుండును. వానిలోఁ గొన్ని తియ్యగను నుండును. వానిలోభముని నీ గృహస్థులను బక్షులు వానినిఁ దినుచుందురు. తరువాత దుఃఖమును బొందుచుందురు. అందులో బాగుగా పక్వమైన సంసస్వాదిష్ట ఫలములను రాజహంసరూపులగు వనవాసులును, యతులును, సన్న్యాసులును, త్యాగులును, భక్తులును నానందముతోఁదిని తృప్తులగుచుందురు. ఉద్ధవా! నీవు పక్షివి కాఁగోరుచున్నావా? రాజహంసవు కాఁగోరుచున్నావా?"

ఉద్ధవుఁ డిట్లనెను :- "స్వామీ! మీరెట్లు చేసిన నట్లు, నేనేమని చెప్పఁగలను?"

భగవానుఁ డావేశముతో నిట్లనెను! ఉద్ధవా! నీవు రాజహంసవే. నీవీ మాయామయమగు సంసారమునందు నన్నొకనినే కాంచుము. నన్నే తెలిసికొనుము నన్నే గుర్తింపుము. సద్గురూపాసనచే నీ సంసారముయొక్క రహస్యము నెవరెఱుఁగుచున్నారో, వారే వాస్తవమును

దెలిసినవారగుచున్నారు. ఈ కర్మమయ సంసారవృక్షోత్పత్తి భోగమోక్షముల కొఱకే. అజ్ఞానులు భోగములలోఁబడి యెనుబది నాలుగులక్షల యోనులలోఁ దిరుగుచుందురు. జ్ఞానులు జ్ఞానరూపమగు ఖడ్గముచే నీ సంసారవృక్షమును మూలముతో ఖండించి పాఱవై చెదరు."

నా భక్తియే ఖడ్గమునకు సానబెట్టు యంత్రము. ఆ యంత్రముమీఁద ఉపాసనారూపమగు ననన్యభక్తిద్వారా విద్యారూపమగు గుతారమును దీక్ష మొనరింపవలయును. అంత ధీరుఁడవును, నప్రమత్తుఁడవునై జీవభావమును చ్ఛేదము కావింపుము. నీ యథార్థస్వరూపమును గుర్తించి అనంతర మా విద్యారూపమగు నస్త్రమును గూడ త్యజించుము. సమస్త కర్మలనుండి ముక్తుఁడవై నిర్ద్వంద్వుఁడవును, నిర్భయుఁడవును గమ్ము. గుణాతీతుఁడవై కర్మబంధమునుండి బయటపడుము."

ఉద్ధవుఁడిట్లనెను :- "స్వామీ! త్రిగుణము లనాదివి. ఆత్మ నంటిపెట్టుకొని యున్నవి. ఈమూడుగుణముల నుండి ముక్తినిఁ బొందుటెట్లు ?"

భగవానుఁ డిట్లనెను :- అట్లు కాదు. సత్వరజస్తమో గుణములు ఆత్మ గుణములు కావు. ఇవి బుద్ధి గుణములు, పరమాత్మ బుద్ధికావలివాఁడు. కావున నీత్రిగుణములను జయింపవచ్చును."

ఉద్ధవుఁడిట్లడిగెను.- "స్వామీ! ఈ త్రిగుణములను జయించుటెట్లు?"

భగవానుఁడిట్లనెను :- "త్రిగుణములు లేని మానవుఁడే లేఁడు. ఒకొక్కరియం దొక్కొక్క గుణమధికముగ నుండును. ఘోరతమోగుణమధికముగ గలవానికి సత్వరజోగుణము లణఁగియుండును. రజోగుణ మధికముగఁ గలవాని సత్వతమోగుణము లణఁగియుండును. సత్వగుణ మధికముగ నుండిన రజస్తమములణఁగియుండును. సాధకుఁడగు వాఁడు సత్వగుణమును వృద్ధిపొందించు కొనవలయును. దానివలన రజస్తమో గుణములణఁగును. అనంతరము శుద్ధ సత్వము వలన మిశ్రమ సత్వమును శాంతింపజేయవలెను. ఇప్పుడు విశుద్ధ సత్వమే మిగులును. వృత్తి శుద్ధ సత్వప్రధాన మైన నో నాభక్తియుత్పన్నము కాఁగలదు."

ఉద్ధవుఁడిట్లడిగెను :- "స్వామీ! సత్వగుణ మెట్లు వృద్ధి కాఁగలదు?"

భగవానుఁడిట్లనెను :- "సత్వగుణవృద్ధి సాత్వికవృత్తి సేవనముచేఁ గలుగును. సాత్వికాహారము, సాత్విక విహారము, సాత్వికులతో సంగము సాత్విక వేషభూషలు, సాత్విక వృత్తి, సాత్వికప్రవృత్తి, యుండవలెను. ఈ అన్నిటి వలన భక్తిరూపమగు నా ధర్మమందు, ప్రవృత్తి కలుగును."

ఉద్ధవుఁడిట్లనెను ! "మీ భక్తి రూపధర్మమందుఁ బ్రవృత్తినిఁ జెందిన ఫలమేమి కలదు?"

భగవానుఁడిట్లనెను :- "ఉద్ధవా! సత్వగుణాభివృద్ధి కలిగినచో, నా ధర్మముచే రజస్తమములు రెండును నశించును. రజస్తమములు నాశమైనచో వానివలనఁ బుట్టు కామము, ఆసక్తి, లోభము, అశాంతి, విషయలోలుపత ప్రమాదము, ఆలస్యము, నిద్రా, వ్యర్థచేష్టలు మొదలగు నవియు, నంతఃకరణమందలి మోహినీవృత్తులును శీఘ్రముగ నశించును.

ఉద్ధవుఁ డిట్లడిగెను :- "గుణావిర్భావ కారణము లేముండును. సత్వ, రజ, స్తమగుణము లెట్లు కలుగును."

భగవానుఁ డిట్లనెను :- "గుణ ప్రాదుర్భావమున కనేక కారణములు కలవు. అందులోఁ బది ముఖ్యములుగఁ జెప్పఁబడినవి."

ప్రథమకారణము శాస్త్రము, నీవెట్టి శాస్త్రశ్రవణ, మనన నిదిధ్యాసన మొనర్చిన నట్టి గుణములే పుట్టును. వేదములలో త్రిగుణములే కలవు. చాల శాస్త్రములు సత్వప్రధానములు. చాల రజోగుణ ప్రధానములు, చాల తమోగుణ ప్రధానములు. సత్వగుణ శాస్త్రములను జదువుటచే నాత్మజ్ఞానమునకు సంబంధించిన పూజా,

పాఠ, జప, తపములందు బ్రవృత్తి కలుగును. రజోగుణ శాస్త్రములచే యశో, వైభవములు, రాజస యజ్ఞములందు బ్రవృత్తి కలుగును. తమోగుణశాస్త్రములవలన మారణ, మోహన, ఉచ్చాటనాది హింసలు ప్రధానములుగ నుండు యజ్ఞయాగాదులందు ప్రవృత్తి కలుగును.

ఇంకొక కారణ మేమనఁగా— అన్నపానములు-ఎట్టి అన్నమును దినెదమో, ఎట్టిజలమును త్రాగెదమో అట్టి మనస్సేర్పడును. అట్టి వృత్తియే యేర్పడును. సాత్త్వికాన్న పానముచే సాత్త్వికవృత్తి యేర్పడును. రాజస తామసము లచే రాజసతామస వృత్తులేర్పడును. అన్నపానములే ప్రాణు లకు జీవనము.

మూఁడవ కారణము కుటుంబము, తల్లి, తండ్రి సోదరుఁడు, బంధువులు మొదలగు వారే ప్రవత్తిలో నుండె దరో, అట్టి ప్రభావము మనమీఁదఁ బడును. అచ్చటచ్చట దానికపవాదమును గలదు. ప్రహ్లాదుని మీఁద నాతని కుటుంబప్రభావము పడలేదు. కాని సామాన్య నియమము నకు విశేషనియమము భిన్నముగ నుండును. సామాన్యముగఁ గుటుంబమువారెట్లుండెదరో అట్టి గుణ ప్రాదుర్భావము కలుగును.

నాల్గవ కారణము దేశము, దేశమునుబట్టి వేషమను సామెత కలదు. సాత్త్విక దేశమగుచో జనులకు సాత్త్విక ప్రవృత్తి కలుగును. రాజస తామస దేశములైనచో రాజస తామస వృత్తి కలుగును. అందుకనియే సముద్రమును దాటి యాత్రచేయఁకూడదని యాత్రావిషయమున నియమ మేర్పఱచిరి. మన దేశములోఁ దీర్థయాత్రకుదప్ప అంగ, వంగ, కళింగాది కీకట దేశములలో నుండినచో మరల సంస్కారమును గావించుకొనవలయును. దేశప్రభావము పడకతప్పదు. ఉష్ణదేశములలో నుండువారెట్టి యాచారములతో నుండినను శీతల దేశములకుఁ బోయినచో నాచార విచారములలో శిథిలత వచ్చితీరును."



అయిదవ కారణము కాలము. అయిదవదే ముఖ్య కారణము. కాలమును బలాబలములతో నుండును. కృతయుగమున నందఱకును సాత్త్విక ప్రవృత్తి కలుగును. త్రేతయందు రాజసవృత్తి, ద్వాపరమున రాజసమును దామసమును గలిసియుండును. కలియుగమున మంచి మంచి వారికినిఁ దామసవృత్తి యుండును. సిద్ధుఁడు కానిండు, యోగి కానిండు, సత్క్రియ లొనర్చువారు కానిండు, అందఱను గలికాలము వశపఱచుకొని తీరును. అందఱును వివశులై కలికాలమున కధీనులగుదురు. ఎండకాలమున నున్ని వస్త్రములను దాల్చిన చీదర వేయును. చలికాలమున నవియే యెంతో

బాగుండును. ఎండకాలమున నగ్నికి దూరమున నుందుము. చలికాలమున నదియే బాగుండును. దగ్గఱ కూర్చుందుము. కావున గుణముల ప్రాదుర్భావమునకుఁ బ్రధాన కారణము కాలము.

ఆఱవ కారణము కర్మము. ఎట్టి కర్మ నొనర్చిన నట్టి గుణములు ప్రాదుర్భావములగును. సాత్త్విక కర్మలొనర్చి నచో వృత్తి సాత్త్వికమగును. రాజసతామస కర్మలవలన రాజసతామస వృత్తి యేర్పడును. కావున సత్త్వగుణాభివృద్ధి కొఱకు కర్మలొనర్పవలయును.

ఏడవ కారణము జన్మము. ఎట్టి తల్లి దండ్రులచే జన్మించెదమో ఏ సమయమున జన్మించితిమో, అట్టి ప్రవృత్తియే కలుగును. రజోవీర్యముల ప్రభావము శరీరముపైఁ బడును తండ్రి వీర్యముచేతను, దల్లి రజస్సుచేతను శరీర మేర్పడును. ఒక్కొక్కప్పుడు జన్మముల ప్రభావ మీ శరీరము మీఁదఁ బడును. సాత్త్విక వంశమందు జన్మించినచో సాధారణముగ వృత్తి సాత్త్వికమగును. రాజస తామస వంశములందు జన్మించిన రాజస తామస వృత్తి యేర్పడును.

ఎనిమిదవ కారణము ధ్యానము. సాధారణముగ జనము దేనిని ధ్యానించెదరో అట్టి వృత్తియే యేర్పడును.

యోగులను ధ్యానించినచో మనస్సు శుద్ధము నగును, కామిను లను, విషయాసక్తులను ధ్యానించినచో మనస్సు కామమయ మగును. గర్భాధాన సమయమునఁ వల్లి దేనిని ధ్యానించునో, గర్భస్థ బాలునిపై నా ప్రభావము పడితీరును. సాత్విక ధ్యానమువలన సాత్విక వృత్తి కలుగును. ఇతర ధ్యానమున నితరవృత్తి కలుగును. కావున సాత్వికాభివృద్ధినిఁ జేసికొనఁ దలఁచినవారు సదా సాత్విక పురుషులయొక్కయు, సాత్విక వస్తువులయొక్కయు ధ్యాన మొనర్పవలయును. సాత్విక దేవతలను ధ్యానించినచో వారు సత్వమును వృద్ధికావించె దరు. యక్షరాక్షస, భూత, ప్రేత, పిశాచాది రాజస తామస దేవతలను ధ్యానించినచో వారుతమ గుణములను వృద్ధిచేయుదురు.

తొమ్మిదవ కారణము మంత్రము, మంత్రమునను స రించి గుణమువచ్చును. సాత్వికమంత్రములను జపించుటచే భావములందు సాత్వికత వచ్చును. రాజస తామస మంత్ర ములచే రజోగుణమును, దమోగుణమును నాధిక్యమగును. మంత్ర ప్రభావము పరంపరగాఁబడును. కొందఱు ధూర్తులు ప్రజలను మోసగించుటకై మంత్రవ్యాపార మొనరించెదరు. వారా యీ మంత్రములను విని, పఠించి, జ్ఞాపకము పెట్టు కొందురు. కొందఱకు రామమంత్రమును, కొందఱకు కృష్ణ మంత్రమును, కొందఱకు చండీమంత్రమును, కొందఱకు కాళీ

మంత్రమును, కొందఱకు భైరవమంత్రమును జెప్పుచుందురు, ఈ మంత్రములవలనఁ బ్రయోజనమేమియు నుండదు. మంత్రమిచ్చువానికి జీవనము జరుగును. ఇచ్చినవాఁడును, పుచ్చుకొనినవాఁడును నరకమునకే పోవుదురు. కావున బాగుగా విచారించుకొని మంత్రమును సాత్త్విక గురువువలన, వంశపరంపరగ ప్రాప్తించిన మంత్రమునే తీసికొనవలయును, సాత్త్విక బుద్ధికలవాఁడు శుద్ధసాత్త్విక మంత్రమును గ్రహింపవలెను, రుద్ర, భైరవ, భూత, ప్రేతాదులు మంత్రములను సాత్త్విక వృత్తికలవారు గ్రహింపరాదు.

పదవ కారణము సంస్కారము. జీవితము సంస్కారమున గొప్ప ప్రభావము పడును. అందువలననే ద్విజులకు షోడశ సంస్కారములు ముఖ్యములైరి. సంస్కారము ననుసరించి భావములుండును.

ఈ విధముగ గుణప్రాదుర్భావమందు శాస్త్ర, జల, కుటుంబ, దేశ, కాల, కర్మ, జన్మ, ధ్యాన, మంత్ర, సంస్కారములను నీపదియును ప్రధాన కారణములు.''

ఉద్ధవుఁడిట్లడిగెను :- ''స్వామీ ! సాత్త్విక, రాజస, తామసములను దెలిసికొనుట కేదైన గుర్తున్నదా ? ఏకార్యములు సాత్త్వికంలో, ఏవి రాజసములో నేవి తామసములో ఎట్లు తెలియఁగలవు ? ఎవరెట్టివారో తెలిసికొను టెట్లు ?

భగవానుఁడిట్లనెను:- "దీనికొక్కటియే గుర్తుకలదు. జ్ఞానులును, వయోవృద్ధులును జ్ఞానవృద్ధులును నెవరినిఁ బ్రశంసించెదరో వారు సాత్వికులని తెలియవలయును. వారేకార్యములను సాత్వికము లందురో అవి సాత్విక కార్యములు వారెవరని నిందించెదరో. ఏపనులను నిందించెదరో అవి తామసములని తెలిసికొని, ఉపేక్షించు కార్యములను రాజసములని తెలియవలయును."

ఉద్ధవుఁడిట్లనెను :- "స్వామీ! ఋషులును, మునులును గుణాతీతులను బ్రశంసించెదరు. త్రిగుణాతీతులు కావలయునని వారు మాటిమాటికిఁ జెప్పుచుందురు."

భగవానుఁడిట్లనెను :- "సోదరా! గుణాతీతుఁడగుట ఆటలు కాదు. తీసిపారవేయుటకు గుణములు వస్త్రము కాదు అది మన శరీరమునకుఁ జర్మమువలె నంతఃకరణమున కంటుకొని యున్నది. దానిని నెమ్మది నెమ్మదిగాఁ దీసి వేయవలయును ఆత్మ తత్త్వము యొక్క అపరోక్ష జ్ఞానము కలుగనంత వఱకు, స్థూల సూక్ష్మ దేహములను, దానికిఁ గారణ భూతమగు గుణములును బాగుగా నివృత్తి కావు' అంతవఱకు సత్వగుణ వృద్ధికొఱకు సతతము ప్రయత్నమొనర్పవలయును. సాత్విక శాస్త్రములను అధ్యయనమొనర్పవలయును. సాత్విక ప్రకృతి గలవారి దగ్గఱఁ

గూర్చుండ వలయును. సాత్త్విక కర్మ లాచరింప నగును. సాత్త్వికాహారమును దీసికొన వలయును. నిరంతరము సత్త్వ సేవన మొనర్చుటచే ధర్మవృద్ధి కలుగును. అనంతరము దాని వలన జ్ఞానము కలుగును. జ్ఞానము కలిగినచోఁ ద్రిగుణాతీతుఁడగును.'

ఉద్ధవుఁ డిట్లనెను :- "స్వామీ! సత్త్వమును నొక గుణమే కదా! గుణసేవనముచే గుణాతీతుఁడగు టెట్లు?"

భగవానుఁ డిట్లనెను:- "కాలిలో ముల్లు గ్రుచ్చుకొనినచో దానిని దీయవలయుననిన నొక దృఢమగు వేఱొక కంటకమును దీసికొని దానితోఁ గుట్టి గ్రుచ్చుకొనిన ముల్లును దీసివేయుఁగనే రెండు ముళ్లను బారవైచెదము. వనమున వెదుళ్ళు పరస్పరము రాచుకొనును. అప్పు డగ్ని యుత్పత్తి యగును. ఆ యగ్ని వెదురు వనమునంతను గాల్చివేయును. అంతయును గాలిపోయిన తరువాత అది శాంతించును. ఇదేవిధముగ రజస్తమములు నశించును. నిరంతరము సత్త్వసేవన మొనర్చుటచే జ్ఞానరూపమగు నగ్ని యుత్పన్నమగును. చివరకది సత్త్వమును గూడ కాల్చి గుణాతీత స్థితినిఁ బ్రాప్తింపఁ జేయును. తనలో నుండి ఉత్పన్నమైన జ్ఞానముచే గుణముల కార్యమంతయును లయమగును. యథార్థమున కీదేహము గుణవైషమ్యము చేతనే ఉత్పన్నమైనది.

కావునఁ బూర్ణసత్వము వృద్ధి అయినచో జ్ఞానము కలుగును దానిచేఁ ద్రిగుణములు సమాప్తములగును. కావునఁ ద్రిగుణాతీతుఁడగుటకు ముందుగా సత్వసేవన మొనర్పవలయును. విషయ సేవన మెన్నటికిని జేయరాదు.''

అంత నుద్ధవుఁడిట్లనెను :- ''స్వామీ! నా కొక్క గొప్ప శంక కలదు. ప్రపంచముననందఱను జూచుచున్నాను. వారందఱును సాంసారిక విషయములు దుఃఖమయములని చెప్పుచున్నారు. మూర్ఖుని మొదలు విద్వాంసుని వఱకును నేకకంఠమునఁ గామమును నిందించుచుందురు. దాని నను ష్ఠానములోనికిఁ బెట్టువారు చాల తక్కువగ నున్నారు. సభలలో వినువారి శరీరములు పులకించునట్లుగఁ గామమును నిందించుచుందురు. నరకభయమును జూపెదరు. విస్తృతముగ శాస్త్రి వ్యాఖ్యానమును గావించెదరు. వ్యభిచారులగు స్త్రీ పురుషులను నరకములలో నెన్నో బాధలు పెట్టెదరు. వారిని దిగంబరులుగ నొనర్చి తప్తలోహస్తంభముల నాలింగన మొనరింపఁ జేయుదురను విశదవ్యాఖ్య నొనరించెదరు. కాని వారుమాత్రము కామమునకు వశీభూతులగుచుందురు ఆడుకుక్క వెంబడి మగకుక్కయును, ఆడు గాడిదె వెంబడి మగగాడిదెయును వెఱ్ఱెత్తినట్లు పోవుచుండును అవి కఱచినను, కాలితోఁ దన్నినను వానిని విడువవు. అట్లే

వీరును గామినీ వెంటఁబడి తిరుగుచుందురు. కామినికి దాసులగుచుందురు. ఏ విషయములను గూర్చి వారు నిందించిరో, ఆ విషయములనే సేవించుటేమి పని? సాంసారిక విషయముల వలన దుఃఖమును బొందుచుండినను వానినిఁద్యజింపరు. చెరుపు చేసినను దామువానినిఁ బరిత్యజింపరు. ఈ విషయమున జ్ఞానులును మూర్ఖులును నొక్కటిగనే యున్నారు. విషయసేవనము వలనఁ దృప్తి కలిగినదనినవాఁడును విషయములలో సుఖమున్నదనియు ననినవాఁ డింతవఱకు లేఁడు. మనకు కనఁబడలేదు. క్షణకాలము సుఖాభాసము కలుగుగాక, వీని ననుభవించుట వలనఁ జివరకు దుఃఖమే జనులకీయనిత్య క్షణభంగుర సుఖములం దిట్టి అన్యథా బుద్ధి యేల యేర్పడినది?

ఇది విని భగవానుఁడు నవ్వి యిట్లనెను :- "ఉద్ధవా! నా మాయ యనఁగా నిదియే. లేకున్నను నున్నట్లుండుటయే మాయ. వాస్తవముగ దుఃఖమైనది సుఖముగఁ దోచుటయును, అనిత్యమైనది నిత్యమనుటయును మాయయే. అజ్ఞాన వశమున ననేక వాసనలు హృదయమున నుత్పన్నములగుచుండును."

ఉద్ధవుఁడిట్లనెను :- "ప్రభూ! అంతఃకరణమందు వాసన లెట్లు ఏల ఉత్పన్నము లగును. వీని క్రమమేది? విషయ మంతఃకరణము నందెట్లు హత్తుకొనును?

భగవానుఁడిట్లనెను :- 'మంచిది ఉద్ధవా! నేను నీకీ పరమగూఢ రహస్యమును జెప్పెదను. దీనిని నీవు సావధానముగ వినుము.''

సూతుఁడిట్లనెను :- ''మునులారా! భగవానుఁడంతఃకరణ మందు వాసన లెట్లుద్భవించునో చెప్పిన వర్ణనమును నేను జెప్పెదను వినుఁడు.''

## అంతఃకరణమున విషయవాసనా ప్రవృత్తి

శ్లో॥ అహమిత్యన్యథా బుద్ధిః ప్రమత్తస్య యథా హృది ।
ఉత్సర్పతి రజో ఘోరం తతో వైకారికం మనః ॥

శ్రీభాగ. ౧౧ స్కం. ౧౩ అ. ౯ శ్లో॥

వ॥ ఉద్ధవా! ప్రమత్తుని హృదయమందు అహంకారముచే నన్యథాబుద్ధి యుదయించుటచే సత్వప్రధానమగు మనస్సు రజోగుణమునందు బ్రవృత్తమగును. (దానివలన నవశుఁడై చేయరాని పనులను జేయును)

చిత్తము రజోగుణమంటుకొనునో లోభము పెరుగును. రజోగుణమునకు ముఖ్యమగు లక్షణమిదియే. భగవద్భజన

మందు లోభము వృద్ధిపొందుట నిర్గుణావస్థయే. కాని సాంసారిక కార్యములందు లోభము పెరిగినచో రజోగుణము వృద్ధియైనదని తెలిసికొనవలయును. ఒకానొక సాత్త్విక ప్రకృతిగల సాధకుని వద్దకు శిష్యుఁడు కావలయునని ఒకఁడు వచ్చి ప్రార్థన చేయఁగా దీక్షనొసంగును. అతఁడు ధనముచేతను, మనస్సుచేతను సేవనారంభించును. ధనము రాఁగానే దానితో నాశ్రమమును ప్రారంభించును. తృష్ణకు అంతమేమియును లేదు. ఇటుకలు, రాళ్ళతోఁ బనినిఁ బ్రారంభింపకుండినంతవఱకు సంతోషము, ఆరంభమయ్యెనా అది పెరుగుచునే యుండును. ధనము కావలసివచ్చును. ఏదియో ఉపదేశ మొనర్చును. ఇప్పుడిఁకఁ బరమార్థ లక్ష్యమునుండి చ్యుతుఁడగును. రజోగుణము వాని హృదయములోనికి వచ్చి తిష్ఠవైచుకొన్నదన్నమాటే. రజోగుణము లేక కర్మప్రాబల్యముండనే యుండదు. దానికి గుర్తు లోభము. లోభి పరమార్థదృష్టితో సేవనియును జేయఁడు. అతని కార్యములన్నియును స్వార్థదృష్టితోఁ బ్రారంభమగును. ఎవరికైన నేదైన ఫలమొసంగినచో దీనివలన నాకేమి కార్యము నెఱవేరునని తలఁచును. స్వార్థములేక యెవ్వరితోనైన మాటలాడఁడు. రజోగుణము వృద్ధిపొందిన విషయభోగాపేక్ష కలుగుచుండును. చిత్తము చంచలముగ నుండును. ఎచ్చట ధనము లభించునా యని చూచుచుండను, లోకులెండఱు

మందు లోభమువృద్ధిపొందుట నిర్గుణావస్థయే. కాని సాంసారిక కార్యములందు లోభము పెరిగినచో రజోగుణము వృద్ధియైనదని తెలిసికొనవలయును. ఒకానొక సాత్త్విక ప్రకృతిగల సాధకుని వద్దకు శిష్యుఁడు కావలయునని ఒకఁడు వచ్చి ప్రార్థనచేయఁగా దీక్షనొసంగును. ఆతఁడు ధనముచేతను, మనస్సుచేతను సేవనారంభించును. ధనము రాఁగానే దానితో నాశ్రమమును ప్రారంభించును. తృష్ణకు అంతమేమియును లేదు. ఇటుకలు, రాళ్ళతోఁ బనిని ప్రారంభింపకుండినంత వఱకు సంతోషము, ఆరంభమయ్యెనా అది పెరుగుచునే యుండును. ధనము కావలసివచ్చును. ఏదియో ఉపదేశ మొనర్చును. ఇప్పుడిఁకఁ బరమార్థ లక్ష్యమునుండి చ్యుతుఁడగును. రజోగుణము వాని హృదయములోనికి వచ్చి తిష్ఠవేచుకొన్నదన్న మాటే. రజోగుణము లేక కర్మప్రాబల్యముండనే యుండదు. దానికి గుర్తు లోభము. లోభి పరమార్థదృష్టితో సేపనియును జేయఁడు. ఆతని కార్యములన్నియును స్వార్థదృష్టితోఁ బ్రారంభమగును. ఎవరికైన నేదైన ఫలమొసంగినచో దీనివలన నాకేమి కార్యము నెఱవేరునని తలఁచును. స్వార్థములేక యెవ్వరితోనైన మాటలాడఁడు రజోగుణము వృద్ధిపొందిన విషయభోగాపేక్ష కలుగుచుండును. చిత్తము చంచలముగ నుండును. ఎచ్చోట ధనము లభించునా యని చూచుచుండను, లోకులందఱు

నందఱును నాతనిఁ బ్రేమింప నారంభించెదరు. అందఱాతని యెడల భక్తిని జూపెదరు. ఇంతవఱకు సాధన నొనర్చుచుం చిన్నవానియందును బెద్దవానియందును నాత్మను గాంచినచో, ఆతఁడు త్రిగుణాతీత మార్గమున బోవుచున్నాఁడని తెలిసి కొనవలయును. కాని తానీశ్వరుఁడననియు, సిద్ధుఁడననియు, సమర్థుఁడననియు అహంకారమును జెందినచో రజోగుణము మెల్లఁగా వచ్చి ప్రవేశించినదని భావింపవలెను. ఆతని బుద్ధి భ్రష్టమైనది. ఇప్పుడు సత్వగుణ మణఁగిపోయి రజో గుణ ప్రాబల్యమును జెందును. మనస్సు విషయముల వైపు ఆకర్షింపఁబడును. విషయములు మనస్సును గొట్టుకొనిపోవును. రజోగుణమునకు సంబంధించిన మనస్సు విషయములందంటు కొనుటకు బరువిడుచుండును. చిత్తమునకు రజోగుణమంటు కొనినచో దానిలోని యనేక సంకల్పవికల్పములు వచ్చి చేరును. నానావిధానము లేర్పడును. కీర్తికాంక్షచే నానా విధములగు కళాప్రదర్శనలొనరించును. నిరంతరము గుణ చింతనముచే మనస్సును బరువెత్తించుచుండును. ఎవరివలన నా పనులు సిద్ధించును. ఎవనివలన నా కోరికలు నెఱవేరునని చూచుచుండును. ఎవని నాశింపరాదో, మందమతియగు నాతఁ డాతనినే ఆశ్రయించును. ఈ రజోగుణప్రవాహమున నెవఁడైనఁ బడినచో నిఁకఁ గొట్టుకొనిపోవును. ఆతనికి రక్షణాశ లేకుండపోవును. గుణప్రవాహమునఁ బతితుడగు

పోవుచునే యుండును. త్రిగుణములనుండి బయటపడువాఁ డెవఁడును నుండఁడు. ఎంతటి వివేకినైనను రజస్తమోగుణములు పడఁగొట్టి తీరును."

భగవానుఁడిట్లనెను:- "ఉద్ధవా! త్రిగుణములయొక్క ప్రభావ మందఱపైఁ బడుననుట సత్యమే. ఒక్కొక్కప్పుడు పరమవివేకి పురుషునైనను రజస్తమోగుణములు చిత్తవిక్షిప్తము కలుగఁజేయును. కాని వాని వివేకము బొత్తుగాఁ దప్పఁబడదు. విషయ సమ్ముఖమునకు వచ్చినపు డాతని బుద్ధి క్షణకాలము విచలితమగును, కాని తన వివేకము ద్వారా సావధానపూర్వకముగఁ జిత్తమును సమాహిత మొనర్చుకొనును. వానియందు నితాంతమాసక్తి యుండదు. దాని పరిణామమును గ్రహించి దానినుండి ఉపరతినిఁ జెందు చుండు."

ఉద్ధవుఁడిట్లడిగెను :- "స్వామీ! చిత్తమున కెప్పుడైన నిట్టి చంచలతకలిగి, మనస్సు విక్షిప్తము చెందినచో నేమి చేయవలయును?"

భగవానుఁడిట్లనెను :- "ఏ విషయమందు మనస్సు లగ్నమైనదో ముందుగా దానియందు దోషదృష్టినిఁ గావింపవలయును. ఈ విషయసేవనముచే మనకే హాని కలుగఁగలదు? అంత సావధానుఁడవై ఆ విషయ చింతను

ద్యజింపుము. ఆ విషయమును మనస్సులోనికి రానీయరాదు. మాటి మాటికి దానినిఁ దీసివేయు చుండవలెను. నియత సమయమున నాసనము పైచుకొని నెమ్మది నెమ్మదిగా ప్రాణాయామము ద్వారా ప్రాణములను సంయమ మొనరింప వలయును. ఆసనమును జయించి చిత్తము నావిషయము నుండి దీసి నాయందుంచవలయును. నిరంతరము దృఢముగ యోగాభ్యాస మొనరింపవలయును. చిత్తము స్వాభావిక ముగ విషయముల వైపునకుఁ బోవుచుండును. పోఁగానే విషయములు దానిని గట్టిగాఁ బట్టుకొనును. యోగాభ్యాస ముచేఁ గ్రమక్రమముగఁ జిత్తమును లాగుకొనవలయును. దీనినే యోగమందురు. దీనిని నావలన సనక, సనందన, సనత్కుమారులు గ్రహించిరి. ఆ నల్గురు సోదరులకు నేనీ యోగదీక్షను శిక్షణమును నొసంగితిని.''—

ఉద్ధవుఁడిట్లనెను :- "స్వామీ ! నేనెల్లప్పుడును నీ సేవలోనే ఉన్నాను, ఎప్పుడును మీరు సనకాదులకు దీక్ష నొసంగుటను జూడనే చూడలేదు. నేను వ్రజమునకుఁ బోయి నపుడేమైన మీ వద్ద వారు దీక్షను దీసికొనిరేమో !"

భగవానుఁ డిట్లనెను :- "నాయనా! నేనీ కృష్ణావ తారమున వారికి దీక్షనీయలేదు. బ్రహ్మలోకమున నింకొక యవతారమున దీక్ష నొసంగితిని."

ఉద్ధవుఁడిట్లడిగెను :- "స్వామీ! మీరే రూపమున సనాతనాదులకీ యోగదీక్ష నొసంగితిరి. ఎప్పు డొసంగితిరి? ఎట్లొసంగితిరి. దీనిని వినవలయునను కోరిక జనించుచున్నది. నేను యోగ్యుఁడనని తోఁచినచో నాకీ ప్రశ్నకు ప్రత్యుత్తర మొసంగుడు. ఆయోగ శిక్షను నాకును జెప్పుఁడు."

భగవానుఁ డిట్లనెను :- "ఉద్ధవా! నేను సనకాదులకు హంసరూపమున బ్రహ్మలోకమునందు చాల దినములకు పూర్వమీ యోగ శిక్షణ నొసంగితిని. పరమ త్యాగులును, విరాగులునగు బాల బ్రహ్మచారుల ప్రశ్నలకుఁ బ్రత్యుత్తర మొసంగుటకై నేను పరమ శుభ్రమగు హంసావతారము నెత్తవలసి వచ్చినది. ఆయవతారమున నేను కుమారుల కుపదేశించితిని. వారు తమ తండ్రియగు బ్రహ్మను బ్రశ్నించిరి. వారి ప్రశ్నలకు బ్రహ్మ జవాబీయఁ జాలకపోయెను. అప్పుడు నేనవతరింపవలసి వచ్చినది."

ఉద్ధవుఁ డిట్లనెను :- "స్వామీ! బ్రహ్మను వేదగర్భుఁ డందురు. ఆతఁడు సమస్త వేదములకును భాండారము. ఆతని నాలుగు ముఖముల నుండియును నాలుగు వేదములుద్భవించినవి. అట్టి వేదమయుఁడగు బ్రహ్మయును బ్రత్యుత్తర మీయఁజాలని ఆ ప్రశ్నయేమి! స్వామీ! నేఁటి ఉపదేశములకే ప్రశ్ననైన నొసఁగుఁడు. వారికి తెలిసినను దెలియ

యుండినను వెంటనే సమాధాన మొసంగెదరు. తాము సర్వ జ్ఞులమనియు, జ్ఞానులమనియు ఋజువు చేసికొను చుందురు. తన పుత్రులు ప్రశ్నించినను బ్రహ్మ ప్రత్యుత్తర మీయఁ జాలకపోయిన నాతని హేళన మొనరించియుందురు కృపతో నీ సంవాదమును నాకవశ్యము చెప్పవలయును."

భగవానుఁ డిట్లనెను :- "ఉద్ధవా! దాంభికులగు వారు సత్యాసత్య విచారమును గావింపరు. తమ పదప్రతిష్ఠ కొఱకు అసత్యమునైనఁ జెప్పివేయుదురు. బ్రహ్మ అట్టివాఁడు కాఁడు. సనకాదుల ప్రశ్న త్రిగుణముల కతీతమైనది. బ్రహ్మ రజోగుణ ప్రధానుఁడు, దీనికాతఁడు సమాధానము చెప్ప లేకపోఁగా నేను శుక్లరూపమగు హంసనై అవతరించితిని. నాఉపాఖ్యానము హంసగీత యనుపేరఁ బ్రసిద్ధినిఁ జెందినది. ఇప్పుడు నేను నీకా హంసగీతనే చెప్పెదను."

సూతుఁ డిట్లనెను :- "మునులారా! ఇప్పుడు నేను హంసగీతను మీకు వినిపించెదను. మీరీ గూఢ జ్ఞానమయ మగు నుపాఖ్యానమును ప్రేమ పూర్వకముగ శ్రవణ మొనర్పుము."

—॥—

# హంసగీతోపోద్ఘాతము

శ్లో॥ స మామచిన్తయద్దేవః ప్రశ్నపారతితీర్షయా ।
తస్యాహం హంసరూపేణ సకాశమగమం తదా ॥

శ్రీభాగ. ౧౧ స్కం. ౧౩ అ. ౧౯ శ్లో॥

వ॥ వారలు చతుర్ముఖు నడిగిన నతండు నేనును దెలియనేరననిన వారలు విస్మయం బందుచుండ నేనా సమయంబున హంసరూపుండనై వారల కెఱింగించిన తెఱంగు వినుము.

శ్రీమదాంధ్ర భాగవతము

సమస్త విధముల విసుగును జెందినవానికి విద్యాబుద్ధు లేమియును బనిచేయవు. అప్పుడాతఁడు భగవానుని శరణు వేఁడును. భగవంతుని స్మరించును. స్మరింపఁగనే భగవానుఁడు సమస్త విపత్తులను దొలఁగించును. అప్పుడు సమస్త సంశయములుతొలఁగిపోవు బుద్ధియోగమును బ్రసాదించును. భగవానుఁడు భక్తవత్సలుఁడు. ఆతని భక్తులపైఁ గృప జూచి, వారి కొఱకు—నానావతారములను ధరించును. భగవానునకు చిన్న పెద్ద భేదములేదు. ఆతఁడెప్పుడెట్టి అవతారమును ధరింపఁ దలఁచిన నట్టి అవతారమును ధరించును. ఒక్కొక్కప్పుడర్ధ నరావతారమును, ఒక్కొ

కృష్ణుడు దర్ధసింహావతారమును ధరించును. ఒక్కొక్కప్పుడు హయగ్రీవావతారమును, క్రింద భాగము మనుష్యునివలె నగును.

సూతుఁ డిట్లనెను :- "మునులారా! ఉద్ధవుఁడు భగవానుఁడు హంసావతారమును ధరించుటకు కారణ మడుగఁగా భగవానుఁ డిట్లనెను :- 'ఉద్ధవా! నేను సనకాది మునులకు యోగోపదేశము నేల చేసినదియును, ఎప్పుడు చేసినదియు దానికి సంబంధించిన కథను జెప్పెదను.'

ఒక దినమున బ్రహ్మ తనలోకమున దివ్యసభయందు విరాజమానుఁడై యుండెను. ముఖ్యాముఖ్య దేవగణము, అసురగణము, గుహ్యక, సిద్ధ, చారణ, గంధర్వ, నాగ, అప్సర, కిన్నర, కింపురుష, ఋషి మనుష్య, పశు, పక్షి జాతులు దివ్యరూపములను ధరించి, ఆతని నుపాసించు చుండిరి. సభ నిండుపేరోలగమున నుండెను. దివ్యాప్సరసలు నృత్యమొనర్చుచుండిరి. ఆసమయమున దిగంబరులైన సనక, సనందన, సనాతన, సత్కుమారులనువా రచ్చటికి వచ్చిరి. వారురాఁగానే సభాసదు లందఱును లేచినిలుచుండిరి. నాట్య మొనర్చుచుండిన సప్సరసలును, గాన మొనర్చు చుండిన గంధర్వులును వారి నాట్యగానముల నాపి ఒక ప్రక్కకు బోయి కూర్చుండిరి. నల్గురు కుమారులును దమకు తండ్రి

యును, సమస్తలోకములకుఁ బితామహుండునగు బ్రహ్మకు నమస్కరించిరి. బ్రహ్మ ప్రేమతో నాలింగనము కావించు కొనెను. కుశల ప్రశ్నానంతరము, ప్రక్కన కూర్చుండుట కాసనముల నొసంగెను. అందఱును దండ్రియొక్క యాజ్ఞచే వారివారి ఆసనములపైఁ గూర్చుండఁగా బ్రహ్మ యిట్లనెను:- పుత్రులారా! ఈ సమయమున మీ రెచ్చటినుండి వచ్చు చున్నారు? అన్ని విధముల నానందముగ నున్నారా? మీ ముఖాకృతినిఁ జూడఁగా మీరేదో అడుగఁ దలఁచినట్లు తోఁచుచున్నది.''

ఇది విని కుమారులిట్లనిరి :- ''తండ్రీ! మాకొక శంక కలిగినది. మేము మిమ్మొక ప్రశ్న నడుగఁగోరుచున్నాము.''

బ్రహ్మ యిట్లనెను :- ''అడుగుఁడు. సంకోచింప వల సిన పని యేమున్నది? మీరడుగఁ దలఁచినది నిర్భయులై అడుగుఁడు''

కుమారులిట్లనిరి :- ''తండ్రీ! చిత్తము యొక్క స్వభావము అది స్వాభావికముగ విషయముల వైపునకుఁ బఱువిడు చుండును. విషయములో నవి వాసనా రూపమున, జిత్తములోనికిఁ బ్రవేశించును. చిత్తము నిర్విషయము కానంతవఱకు మనస్సుగుణములను వదలివైచి గుణాతీతము కాఁజాలదు. గుణాతీతుఁడు కానంతవఱకు సంసారసాగరము

నెవఁడును దాఁటఁ జాలఁడు. ముక్తిపదమును గాంక్షించు వ్యక్తి విషయములనుండి చిత్తమునెట్లు తొలఁగింపఁగలడు ? ఈ రెంటికిని బరస్పర మాకర్షణము కలదు. ఏదో ఒకటైనచో నెట్లయినఁ దొలఁగింపనగును.

భగవానుఁడిట్లనెను :- "ఉద్ధవా! ఈ ప్రశ్న చాల గంభీరమైనది. యోగమందలి సూక్ష్మ పరాకాష్ఠకు సంబంధించినది. యోగసంబంధము చిత్తవృత్తి నిరోధముననే కలదు. ఎవరో సాధారణుఁడడిగియుండిన నవియు నివియును జెప్పు వక్తయు నుండఁగలఁడు. సత్యాసత్యముల నేవియో నోటికి వచ్చినవాటిని జెప్పి పంపి వేయును. ఇప్పుడట్లు కాదు, ప్రశ్నించువారలు మాయాతీతులును, త్రిగుణాతీతులును, ఆజన్మ బ్రహ్మచారులునగు కుమారులు, అడుగఁబడినవాఁడా సమస్త భూతభావనుఁడును, జగత్పితామహుఁడునగు బ్రహ్మదేవుఁడు. ఆతఁడేదో చెప్పి యెట్లు పంపగలఁడు ? ఆతఁడట్లు చేయఁదలచినను సనకాదులేల అంగీకరించెదరు ? ప్రశ్న చాలగూఢమైనది. బ్రహ్మ చాల చిక్కులోఁబడెను. నిండు సభలోఁ దగిన ప్రత్యుత్తరమీయకుండినచో నవ్వులపాలు కాఁగలడు. అందఱిట్లనఁగలరు:- "వేదగర్భుఁడును, లోకపితామహుఁడు తన పుత్రుల ప్రశ్నలకు ప్రత్యుత్తరమీయలేక పోయినాఁడు" కుమారులేమని ప్రశ్నించిరి ? వారు

బ్రహ్మ నగాధ ప్రశ్నసాగరమున ముంచివైచిరి. ఆతఁడు తనబుద్ధితో నాలోచించెను. తలను నిమురుకొనెను. చేతులు నలుపుకొనెను. కాని ప్రశ్న సాగరమునుండి బయటపడుట కేయుపాయమును గనఁబడలేదు."

ఉద్ధవుఁడిట్లనెను :- "ప్రభూ ! బ్రహ్మ దీనికి ప్రత్యుత్తర మీయకుండుటకిది యేమంతటి పెద్ద ప్రశ్న ? అన్నిటిని సృష్టించిన వాఁడాతఁడేకదా !"

భగవానుఁడిట్లనెను :- "ఉద్ధవా ! బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు నాఅంశములే. వీరికిని నాకును నేమియును భేదములేదు. సృష్టి చేయవలయునను నిచ్ఛ పొడమి నప్పుడు మాయ నాశ్రయించి నేను గుణానుసారముగ నేనే రూపము ధరించెదను. రజోగుణమయమగు నామురూపము నకు బ్రహ్మయని పేరు. బ్రహ్మ సృష్టిచేయును. రజో గుణము లేకున్నఁ బని జరుగదు. కావున బ్రహ్మయొక్క బుద్ధి నిరంతరము కర్మలందే లగ్నమై యుండును. ఆతని కెల్లప్పుడును సృష్టిని వృద్ధిని జేయవలయునని యుండును. ఈ ప్రశ్న విశుద్ధ సత్త్వమయమైనది. కావున దీనికి ప్రత్యుత్త రమును నేను విశుద్ధ సత్త్వమయమును, పరమ శుభ్రరూపము ననే యీయఁగలుగుదును. బ్రహ్మకు త్రైగుణ్య విషయ ములు తెలియును. ఏలననఁగా వేదములు త్రైగుణ్య విషయ

ము లే. నిస్త్రైగుణ్యామును నేనే. అందువలన బ్రహ్మకీ విష యము స్ఫురణకే రాలేదు."

ఉద్ధవుఁడిట్లనెను :- "అయితే స్వామీ! తరువాత నేమైనది ? బ్రహ్మకిది చిక్కు తెచ్చి పెట్టినదా యేమి ?"

శ్రీకృష్ణ భగవానుఁడిట్లనెను :- లేదు, లేదు. చిక్కేమున్నది ? నా భక్తుల కెన్నటికినిఁ జిక్కులు రావు. వారి కేదైన సంకటము సంభవించినను, ఏవిషయ మైనను వారి శక్తికి మించినదైనచో వారు నన్ను స్మరించెదరు. వారు స్మరింపఁగనే నేను వారి సమ్ముఖమునఁ బ్రత్యక్షమై, వారి సమస్త దుఃఖములను దూర మొనర్చెదను. బ్రహ్మ కా ప్రశ్నకు సమాధాన మొసంగుటకు తోఁచక పోఁగా నాతఁడు నన్ను ధ్యాన మొనర్చెను. నేను వెంటనే హంస రూపమును ధరించి ఆతని సమ్ముఖమునఁ బ్రత్యక్షమైతిని.

నన్నుఁగాంచి బ్రహ్మయును, సనకాదిమునులును, సమస్త సభాసదులును లేచి నిలుచుండిరి. అందఱును బ్రహ్మను ముందుపెట్టుకొని, నాచరణముల కెరగిరి. పాద్య అర్ఘ్యాదుల నొసంగి నన్ను విధ్యుక్తముగఁ బూజించిరి. సుందరమగు నాసనమున నన్నుఁ గూర్చుండఁ బెట్టిరి."

ఉద్ధవుఁడిట్లడిగెను:- "ప్రభూ! లోకపితామహుఁడగు బ్రహ్మ ఒకపక్షినిఁ గాంచి యేల నిలుచుండెను ? మీరు

మీ స్వరూపమును బ్రకటపరచలేదు కదా ! పక్షియై వచ్చి తిరిగదా ! పక్షిపాదముల కెవరును బ్రణామ మొనరింపరు. బ్రహ్మ మిమ్ములను గుర్తించినాఁడా ?

భగవానుఁడిట్లనెను — "బ్రహ్మ నన్ను గుర్తింపలేదు. కాని నేను పశుపక్షులలో నేరూపమునఁ బోయినను నా తేజస్సు దాగదు. నేను బాలకుఁడనై కంస సభకు బోఁగానే నన్నుఁ జూడఁగనే అందఱును నిలువఁబడిరి. మిథిలకు విశ్వామిత్రునితోఁ గూడి రామరూపమునఁ బోఁగా, నన్నెఱుఁగక పోయినను నా తేజస్సును గాంచి సమస్త మునులును, ఋషులును, రాజులును, మహారాజులును నిలువఁబడిరి. నేను హంసరూపమునఁ బోయినపుడు నా తేజమునుగాంచి బ్రహ్మయును, కుమారాదులును నీతఁడెవరో అసాధారణ ప్రాణియని గ్రహించి, వారందఱును నన్నాదరించి, శ్రద్ధతో పాదాభివందనమును గావించిరి."

ఉద్ధవుఁడిట్లడిగెను :- "స్వామీ ! మిమ్ము సనకాది మునులేమని ప్రశ్నించిరి. వారు మిమ్మును నదేవిధముగ బ్రహ్మను బ్రశ్నించినట్లే ప్రశ్నించిరా ?"

భగవానుఁడిట్లనెను:- "పరిచయము లేక వారు నన్ను హఠాత్తుగ నెట్లు ప్రశ్నింపఁగలరు ? కావున వారు ప్రణామము గావించి నన్నుఁగూర్చి అడిగిరి. ఆ మునులు వచ్చి

యిట్లడిగిరి :- "హంసావతంసా! నీవెవరు?" ఈ ప్రశ్నతో నాకు ప్రత్యుత్తర మీయవలసిన అవసరమేర్పడినది. ఈ ప్రశ్న నాధారముచేసికొని నేను బ్రహ్మకు వేసిన ప్రశ్నకుఁ బ్రత్యుత్తర మొసంగుట కారభించితిని."

ఉద్ధవుఁడిట్లడిగెను :- "స్వామీ! మీ పరిచయ ప్రశ్నచేతనే వారి ప్రశ్నకు సమాధాన మొసంగుట యెట్లు జరిగినది ముందుగ మీరు మీ విషయమును జెప్పిన తరువాత వారు ప్రశ్నించినదానికిఁ బ్రత్యుత్తర మొసంగుట జరుగును. వారడిగినదొకటి మీరు చెప్పినదొకటి కాలేదా?",

ఇది విని భగవానుఁడు నవ్వి యిట్లనెను :- ఉద్ధవా! అన్యమేమియును లేదు. అంతయు నొక్కటియే. కలకండ ముక్కను నేమూల కొఱికినను దీపియే. పక్షి యెచ్చట యెగిరినను నాకాశముననే యెగురును. కావునఁ బ్రశ్న నేది వేసినను నాత్మ విషయముననే వేయఁబడును. ఏల ననఁగా నాత్మ కతిరిక్తమైనది యింకొకటి లేనేలేదు. అంతయు నాత్మయైనపు డింకొక టేమి యుండఁగలదు? సరే, మునులడుగఁగా నేను వారికేమి చెప్పితినో నీకును నదియే చెప్పెదను. నీవీ పుణ్యప్రసంగమును బ్రేమపూర్వకముగ శ్రవణ మొనర్పుము."

సూతుఁడిట్లనెను :- "మునులారా! ఇప్పుడు మీరు హంసగీతములోని జ్ఞానమును జెవులార వినుఁడు."

# హంసగీత

శ్లో॥ మనసా వచసా దృష్ట్యా గృహ్యతేఽన్యైరపీంద్రియైః।
అహమేవ నమత్తోఽన్యదితి బుధ్యధ్వ మంజసా ॥

శ్రీభాగ. ౧౧ స్కం. ౧౩ అ. ౨౪ శ్లో॥

వ॥ మనో వాక్కులచే దృష్టిచేతను గ్రహించు సర్వము నన్నుగా భావించి యుండెదుంగాక నన్నే తలంచు మానవునకు భుక్తి ముక్తి ప్రదాయకుండనై యుందుదు.''

సంసార బంధనము జ్ఞానము వలననే కలుగును. అసత్తు మీఁద సద్భ్రమ కలిగినది. విస్మృత మగు నహంకారము మాఁదున్నర మూరల శరీరమున సీమిత మైనది. దీని వలన జనన మరణ దుఃఖము కలుగుచున్నది. సంసార చక్రమున భ్రమింప వలసి వచ్చినది. ఈ క్షుద్రమగు 'అహం' ను, మహా దహంకారమునఁ గలిపినచో వ్యష్టి జ్ఞానమును సమష్టిలోఁ జేర్చినచో నింక మోహ ముండదు. ఆతఁడు సంసార బంధనము నుండి శాశ్వతముగ విముక్తుఁడై పోవును. కావున వ్యష్టి సమష్టులను భేదమును నాశన మొనర్చి క్షుద్రమగు 'స్వ' ను, మహత్ 'స్వ' లోఁ గలిపిన నిర్ద్వంద్వుఁడేఁ సుఖి యగుచున్నాఁడు.

సూతుఁడిట్లనెను :- ''మునులారా! ఉద్ధవునితో శ్రీకృష్ణభగవానుఁడిట్లు చెప్పుచున్నాఁడు :- "ఉద్ధవా!

బ్రహ్మ సభకు నేను హంసరూపమున రాఁగానే, బ్రహ్మను ముందు పెట్టుకొని కుమారులు తేజస్వియగు హంస తేజము నకుఁ బ్రభావితులై ప్రణామము కావించిరి. పరిచయము కావించు కొనుటకై కుమారులు 'నీవెవర' వని అడిగిరి.

హంసభగవానుఁడిట్లనెను :- "ఎవరవు? అనుటకు మీ తాత్పర్య మేమి?"

కుమారులిట్లనిరి :- "మేము మీ పరిచయమును బొందఁ గోరు చున్నాము."

హంసయిట్లనెను :- "పరిచయము అపరిచితుని విష యమున నడుగఁ బడును."

కుమారులిట్లనిరి :- "మాకు నీ వపరచితుఁడవే"

హంసయిట్లనెను :- "నీవు, అనఁగా నభిప్రాయ మేమి? శరీరమునే 'నీవు' అనినచో శరీరముచే నపరిచయుఁ డను గాను. పృథివి, జలము, తేజస్సు, వాయువు, ఆకాశ ముచే నిర్మితమైన రస, రక్త, మేధా, మజ్జా, అస్థి, శుక్ర ములతోఁ గూడిన శరీరము మీ దెట్టిదో నాదియు నట్టిదే. అన్ని శరీరము లొక్కటే, ఇంక శరీర పరిచయ మెందులకు? రక్తమునకు బదులుగా నా శరీరమునఁ బాలుండినచో లేదా పంచభూతములు గాక యింకేమైన నిచ్చట నుండిన దానినిఁ గూర్చి చెప్పవచ్చును."

కుమారులిట్లనిరి :- "శరీరము లన్నియు నొక్కటిగనే యుండును. అన్నియును బంచభూతములచే నిర్మింపఁబడుటచే నభిన్నములు. అయినను నందలి కభిమానమగు నాత్మ భిన్నభిన్నములు."

హంసయిట్లనెను :- "ఆత్మలో భిన్నత్వము లేదు. ఆత్మ వస్తువు సదా సర్వదా ఒక్కటే. అద్వయమైనది. సజాతీయ, విజాతీయ, స్వగతభేద రహితమైనది. ఆత్మ ఒక్కటియే యైనప్పుడు 'నీ వెవరవను ప్రశ్న కుదురనే కుదురదు. ఆత్మలో ద్వైతమే లేకున్న నేనే యాశ్రయమును గైకొని మీ ప్రశ్నకు ప్రత్యుత్తర మొసంగుదును? ఆత్మకు జాతిలేదు. అట్టి యెడ నేను ఫలాని జాతివాఁడనని యెట్లు చెప్పఁగలను? ఆత్మకు గుణములు లేవు. నిర్గుణము. కావున నేను ఫలాని గుణము కలవాఁడనని చెప్ప వీలు లేదు. ఆత్మయందు సామాన్య, విశేష వ్యక్తిత్వములం లేవు. అందువలన నేను ఫలాని వ్యక్తినని చెప్ప వీలులేదు. దేహమునకు నీ, నా యను భేదభావములు లేవు. అన్నియు నొకే వస్తువుచే నిర్మింపఁబడినవి. ఆత్మయును నొక్కటియే కావున నీ ప్రశ్న వాక్కు యొక్క ఆరంభము మాత్రమే. అది వ్యర్థాడంబరమే.

కుమారులిట్లనిరి :- "నీవు దేహరూపమునను నీపరిచయము నీయక, ఆత్మరూపమునను నీయకుండిన నీ వింకెవఁడవో అయి యుండవలయును."

హంసరూపమున నే నిట్లంటిని :- "మనస్సుచే మనసము చేయఁబడునది నేను. వాక్కుతోఁ బలుకంబడు నదంత యును నేనే. ఘ్రాణముచే వాసనఁ జూడఁబడు నదంతయును నేనే నాలుకతో నాస్వాదించునదంతయు నేనే. చెవులతో వినఁబడు నదంతయును నేనే. స్పర్శేంద్రియముచే స్పర్శింపఁ బడునదంతయును నేనే. ఎన్నని చెప్పుదును? అన్నిటిలో నేనే యున్నాను. నాకన్యముగ నేదియును లేదు."

కుమారులిట్లనిరి:- "ప్రభూ! ఇప్పుడు మేము తెలిసి కొంటిమి. నీవు భగవానుఁడవు. హంసరూపమున నీవు ప్రకటమైనావు. దయతో నీవు మాయెడల నెట్లు కృప జూపితివి!"

నేనిట్లంటిని :- "మీరు బ్రహ్మనడిగిన ప్రశ్నకు సమాధాన మొసంగుటకై యిచ్చటికి వచ్చియున్నాను. నేను హంసరూపమున మీయెదుటకు వచ్చితిని."

కుమారులిట్లనిరి :- "స్వామీ! నీవే మా ప్రశ్నకు సమాధాన మీయవలయును. చిత్తము స్వభావమున విషయముల మీఁదకుఁ బోవుచుండును. వాసనారూపమున విషయము చిత్తమునఁ బ్రవేశించును. అట్టియెడ నీ రెంటిని వేఱుచేసి సంసారసాగరము నుండి ప్రాణి బయటపడు టెట్లు?"

నేనిట్లంటిని:- "పుత్రులారా ! మీరు చెప్పినది సత్యమే. అవశ్యము చిత్తము విషయముల ననుసరించును. ఏ విషయమున కే యింద్రియము కలదో ఆ విషయమందు చిత్తము వానిద్వారా ప్రవేశించును. ఇటువిధముగ విషయములును జిత్తమందు బ్రవేశించును. కాని యివి పరస్పరము సంశ్లిష్టమై యున్నను జీవస్వరూపములు కావు."

సనకాది మునులిట్లనిరి :- "స్వామీ ! చిత్తము విషయవాసనా పూర్ణమగుచోఁ బురుషుఁడునను నట్లే యగునా ?"

హంస భగవానుఁడిట్లనెను:- నేను జిత్తమునకును, విషయములకును నతిరిక్తుఁడను. నాలో నీ రెండును లేవు. అట్టి యెడ నాకు స్వరూప భూతుఁడగు జీవునకిట్టి స్వరూప స్వభావములెట్లు కలుగఁగలవు ? దానికి విషయ స్పర్శ యెట్లు కలుగఁగలదు ?"

సనకాదులిట్లడిగిరి :- "జీవునకు స్వరూపస్వభావములు లేకుండిన నాతఁడు విషయములందెట్లు పడఁగలఁడు ?"

హంసభగవానుఁ డిట్లనెను :- "విషయములలోఁ బడుటయును, చిత్తమున కధీనుఁడగుటయును జీవుని స్వరూపము కానే కాదు, కాని ఉపాధి అవశ్యమున్నది. ఘట

స్వరూపము మృత్తికే. కాని నామరూపములు దాని ఉపాధి మాత్రములే. అవి మృత్తికను స్పర్శింపఁ జాలవు."

సనకాదులిట్లనిరి:- "అయితే స్వామీ! విషయములం దింతటి ఆకర్షణ యేల కలదు?"

హంసభగవానుఁడిట్లనెను:- "ఇదంతయును మిథ్యాభినివేశము మాత్రమే కాగలదు. నిరంతరము విషయములను సేవించుటచేఁ జిత్తము వానితో నావిష్టమగుచున్నది. లోహముయొక్క స్వభావము ఉష్ణము, ఎఱుపు కాదు. కాని నిరంతర మగ్నిలోవైచి కాల్చుటచే ఉష్ణమును, నెఱుపును వచ్చుచున్నది. అగ్నినుండి దానిని వేఱు చేసినచో నది యథాప్రకారముగ నగును. జలముయొక్క స్వభావము ఉష్ణముకాదు. కాని కాగుక్రింద మంటను బెట్టినచోఁ గొంచెము సేపటికి వేడెక్కును. వేఱుచేసినచో దాని యథార్థపు స్వభావమునకు వచ్చును. అంతయును శీతల మగును. మంచి సుగంధపు లడ్డు ఉన్నదనుకొనుఁడు. దానిని గన్నులు చూచినవి, ముక్కు మూచూచినది, స్పర్శేంద్రియము స్పర్శించినది. దానినిఁ దినవలయునని చిత్తము కోరినది. తినఁగానే బాగుగారుచించినది. మరలఁ జూచెను. మరల మరల తినెను. ఇంకను నాతని చిత్తమున నిచ్ఛయుండనే యున్నది. లడ్డు ఎదురుగా లేకుండిన దానిమీఁదకు

బుద్ధి పోఁగూడదు. అది వాసనారూపమునఁ జిత్తములోనికిఁ బ్రవేశించినది. కావున లద్దు లేకుండినను జిత్తమందు దాని అభివ్యక్తి కలుగుచునేయుండును."

సనకాదు లిట్లనిరి :- "అయితే యీ వాసన నివృత్తి యగు టెట్లు ?"

నవ్వి హంసభగవానుఁడిట్లనెను:- "నాయనా ! దాని కంటుకొని యుండిన నివృత్తి ఇది ఒక మిథ్యాభినివేశము. ఈ విషయమున నొక దృష్టాంతమును వినుఁడు."

ఒక సింహముపిల్ల, ఏదో కారణమునఁ దన తల్లినుండి వేఱుపడెను ఒక గొల్లవాఁడు దానినిఁ బెంచెను. ఇప్పుడా సింహముపిల్ల గొఱ్ఱెలతోఁగలిసి తిరుగుచుఁ దానును నొక గొఱ్ఱెననుకొనుచుండెను. అది వాని గుణములనే అనుకరించుచుండెను. నిజమునకది గొఱ్ఱెకాదు. సింహమున కా భ్రమకలిగెను. ఒక దినమున నొక సింహము వచ్చెను. దానినిఁగాంచి గొఱ్ఱెలన్నియును బాఱిపో నారంభించెను. ఈ సింహమును బారిపోవ నారంభించెను. సింహమిట్లనుకొనెను. ఇది సింహకిశోరము. నా స్వరూపముగనే యున్నది. ఇది నన్నుగాంచి భయపడుచున్నదేల ?" సింహముపోయి దానినిఁ బట్టుకొని యిట్లనెను :- "నీవు నాకు భయపడనేల ?"

అది యిట్లనెను:- "నేను గొఱ్ఱెను. మావాళ్ళందఱును బారిపోవుచున్నారు. కావున నేనును బారిపోవుచున్నాను."

సింహమిట్లనెను :- "అన్నియును భయపడును. నీవు నాస్వరూపమవే కదా! నీవు సింహమవు. నీవు జలములో నీ ముఖములు జూచుకొనుము."

ఇది విని అది జలములోఁ దన ముఖమును జూచుకొనెను. సింహముఖమును దనముఖమును నొక్కటిగనే యుండెను. తాను సింహమునని దానికి నిశ్చయమయ్యెను. వెంటనే దాని భయమును విడిపోయెను. తాను గొఱ్ఱె కాదనియు సింహముననియు నిశ్చయమయ్యెను వాస్తవమున నది గొఱ్ఱెయును గాదు. సింహమునుగాంచి భయపడవలసిన పనియును లేదు. అయినను భ్రమవశమున నది తాను గొఱ్ఱెననుకొని అనేక బాధలుపడినది. ఇదేవిధముగ జీవుఁడెంతవఱకు విషయాసక్తమగు జిత్తస్వరూపమును దానుగా భావించునో, అంతవఱకు పునః పునః జననమరణ సంసారమునఁబడి తీరవలసినదే. ఆతనికి సంసారసాగరమునుండి ఉద్ధారము కలుగదు. ఎప్పు డాతని శుద్ధస్వరూపమును నా స్వరూపముగ భావించునో, అప్పు డాతని చిత్తమేమియును జేయఁజాలదు. విషయములును నేమియును జేయఁజాలవు చిత్తములోనికి విషయములు వచ్చుచుండినను,

విషయములు వాసనారూపమునఁ జిత్తములోనికిఁ జేరినను, వానికి హర్షశోకములుండవు. కావున జిత్తము, విషయములను రెండు ఉపాధులని త్యజించి, తాను నిరుపాధికుఁడనని అనుభవపూర్వకముగఁ దెలియవలయును. ఇదియే సంసారసాగరమును దరించు నుపాయము."

సనకాదులిట్లనిరి :- "స్వామీ ! జీవుఁడు నిద్రించినపుడును, మేల్కొనినపుడును, స్వప్నమును గాంచునపుడును ఆతఁడు సుఖదుఃఖముల ననుభవించును, జన్మించును, మరణించును. అప్పుడు మనము చిత్తమునకును, విషయమునకును వేఱుగనున్నట్లెట్లు తెలియఁగలము ?"

అంత హంస భగవానుఁడిట్లనెను :- "మునులారా ! నిద్రించుటయును, మేల్కొనుటయును, స్వప్నమునుగాంచుటయును, వానిలోని సుఖదుఃఖముల ననుభవించుటయును జీవుని కార్యములు కావు. ఇవన్నియును త్రిగుణముల విషమత కలుగుటచేఁ గలిగిన బుద్ధివృత్తులు. జీవునకు నిర్ణయించు లేదా నిశ్చయించు బుద్ధి వీనికి వేఱుగనున్నది."

సనకాదులిట్లనిరి :- "బుద్ధివృత్తులు సరే. అయినను జాగ్రత్స్వప్నసుషుప్తుల యొక్క అనుభవము జీవుఁడే యొనరించును. ఉపాధి యుండినచో జననమరణము లుండితీరును."

హంసభగవానుఁడిట్లనెను :- "జీవునకు గుణవృత్తి ప్రదానమొనర్చు సంసార బంధనమును సాక్షీరూపమునఁ దురీయావస్థలో నుండు నాయందుంచి దానిఁ ద్యజింపుము ఇట్లు నిశ్చయించుము. నేను జాగ్రదభిమానిని కాను. స్వప్నాభిమానిని గాను. సుషుప్త్యభిమానిని గాను. నేనీ మూఁడింటికి విలక్షణుఁడను. తాను బద్ధుఁడనుకొనిన సంసార బంధనము కలుగును. ఈ విషయములను దాటి, తాను శుద్ధ స్వరూపుఁడనను జ్ఞానము కల్గినచోఁ జిత్త గుణములయొక్క పరస్పర సంబంధ త్యాగము కలుగును. చిత్తవిషయములు వాస్తవికము కాదు. కల్పితము. అవి తన కన్యమైనవిగా భావింపవలయును. అప్పుడు వానిమీఁదకు మనస్సుపోదు. ఆత్మకల్యాణమును గోరుకొనువాఁడీ అహంకార జనిత బంధనము నుండి పూర్తిగా నుపరమింప వలయును. తాను కర్తననుకొని దుఃఖము ననుభవించుటయే సంసృతి హేతువు. ఆత్మకిది అనర్థ కారణము. కావున నవస్థాత్రయమునందభిమానమును ద్యజించి తురీయుఁడనగు నాయందే యుండుము. అప్పుడీ సంసార చింతలన్నియును దమకు దామే వదలిపోవును. భేదభావ మున్నంత వఱకు బంధనము కలదు.

సనకాదులిట్లనిరి :- "ఈ భేదబుద్ధి యెట్లుతొలఁగును?"

హంసభగవానుఁడిట్లనెను :- "తొలఁగుట కుపాయ మేమనఁగా-విచారము వలనను, వివేకము వలనను, విమర్శ

చేతను, అనేకయుక్తుల చేతను, వాస్తవమున 'నేను' అనున దెవఁడో నిశ్చయము చేసికొనవలయును. తాను విషయము లలో మునిఁగియున్నానని అనుకొనుచునంతవఱకు ఎనుబదినాల్గు జీవరాసులలో జనించుచుండవలసినదే !"

సనకాదులిట్లనిరి :- "స్వామీ! ఈ ప్రాణి యెఱిఁగి యును విషయములనేల భజించుచున్నాఁడు. ఏల సంసార బంధనమున బధింపఁబడుచున్నాఁడు ?"

హంసభగవానుఁ డిట్లనెను:- "భ్రమవశమున నట్లు జరుగుచున్నది. స్వప్నావస్థలో నెవఁడును లేఁడు, కత్తియును లేదు. ఇవి లేకుండినను స్వప్నమున నెవఁడైనఁ గత్తితోఁ బొడిచినట్లుండిన యథార్థమున నెవఁడో తనను గత్తితోఁ బొడిచినట్లనుభవము కలుగును. మిథ్యలైనను సన్నియును స్వప్నమున యథార్థములుగనే తోఁచును. నేను పక్క మీఁదఁ బరుండి స్వప్నమును గాంచుచున్నానని తెలియనే తెలియదు. ఆసమయమునఁ దాను వనములో నాడుచుండి నట్లును లేదా యింకొకపని నేదియో చేయుచుండినట్లును, ఒకానొకఁడు వచ్చి తనను గత్తితోఁ బొడిచినట్లును, అచ్చట పురుషుఁడును, కత్తియును, ప్రహారమును మిథ్యలైనను సత్యముగఁ గనబడుచున్నవి. అదే విధముగ నజ్ఞానమందు నిద్రించినను సాంసారికులు తాము మేల్కొన్నట్లు భావించు

చుందురు. విషయముల వలన దుఃఖములను బొందుచుండె దరు. అదే విధముగ నొక్క ఆత్మయే సత్యము. కనఁబడు నవియు, ననుభవించుననియును స్వప్నమునఁ గనఁచు పదార్థ ముల వలె మిథ్యలు. అవి అసలు లేనే లేవు. ఈతఁడు దేవ దత్తుఁడు, ఈతఁడు యజ్ఞదత్తుఁడు, ఇది అశ్వము, వీఁడు యజమానుఁడు. యజ్ఞమువలనఁ బ్రాప్తించిన స్వర్గాదిగతులు, ఇది శుభకర్మ, ఇది అశుభకర్మ ఇవన్నియును స్వప్నమందు గనఁబడు పదార్థములవంటివి. మేల్కొనిన తరువాత నీ పదార్థములన్నియు నెట్లుండవో, వానివలనఁ బ్రాప్తించిన సుఖదుఃఖము లెట్లు సత్యములు కావో అదేవిధముగ జ్ఞానము కలిగిన తరువాతఁ జిత్తము నుఁడదు. విషయములును నుండవు. అన్నియును విలీనములై పోవుచు."

సనకాదులిట్లనిరి:- "స్వామీ! ఈప్రపంచము మాకు కనఁబడుచుండుటచే సత్యముగఁ దోచుచున్నది. దీనిని మిథ్యగా భావింపవలయునని మనస్సుతో నెంతగానో అను కొనుచున్నాము. కాని ఎనిమిది జాములును మానెత్తి కెక్కిన దానిని సర్వథా లేదని యెట్లనుకొనఁగలము? మేము దాని నెట్లు ఆత్మస్వరూపులమనుకొని వేఱుగ నుండఁగలము?"

సూతుఁడిట్లనెను:- "మునులారా! సనకాది మహా మునులు హంసభగవానునితో సంసారభ్రమ నివారణప్రశ్న

నడుగఁగా నాతఁడేవిధముగ నుపదేశించినదియు, దాని వర్ణనమును శ్రీకృష్ణచంద్రుఁడెట్లు ఉద్ధవునితోఁ జేసినదియును నేను మీకుఁ జెప్పెదను. మీరీ గూఢ జ్ఞానమయోపదేశమును శ్రద్ధాభక్తితో శ్రవణమొనర్పుఁడు.''

—//—

## భ్రమనివారణోపాయము

శ్లో॥ ఏవం విమృశ్య గుణతో మనసస్త్ర్యవస్థా
మన్యాయయా మయి కృతా ఇతి నిశ్చితార్థాః ।
సంఛిద్య హార్దమనుమానసదుక్తి తీక్ష్ణ
జ్ఞానాసినా భజత మఖిల సంశయాధిమ్ ॥

శ్రీభాగ. ౧౧ స్కం. ౧౩, అ. ౩౩ శ్లో॥

వ.— పంచేంద్రియంబులకు దృష్టంబగు పదార్థంబనిత్యంబు, నిత్యదృష్టి బ్రహ్మంబని తెలియవలయు, దేహి కర్మార్జిత దేహుండై సంసార మమతలు నిరసించి నిశ్చల జ్ఞాన యుక్తుండై మత్పద ప్రాప్తుండగు, స్వప్నపదార్థంబు నిజంబు గాని క్రియఁ గర్మానుభవ పర్యంతంబు కళేబరంబు వర్తించు—

శ్రీమదాంధ్ర భాగవతము.

మనకు చీఁకటిలో భూతభ్రమ కలిగినచో సమస్తాంగ ములకల్పన వానికవియే యేర్పడును. భూతమునకుఁ బెద్ద పెద్ద కోరలు లేక పోయినప్పటికిని గనఁబడును. భూతము తలక్రిందుల పాదములతో నృత్యము చేసినట్లుండును. దాని యొక్క వికరాళ ముఖము తెఱచుకొని తన వైపునకే వచ్చు చున్నట్లును, ఆ సమయమున నొక ప్రకాశము గల దీప మును దీసికొని వచ్చిన నచ్చట భూతమును లేదు. భూతము యొక్క ఛాయయును నుండదు. ప్రకాశమును గాంచి భూతము పారిపోలేదు. భూతమచ్చట లేనే లేదు. అది మిథ్యా భ్రమ. అదే విధముగ బ్రపంచమునఁ గనఁబడు ద్వైత మంతయును జ్ఞానము కలుగఁగానే నష్టము కాలేదు. జ్ఞానము కలుగఁగనే దాని ప్రతీతియే లేదు.

సూతుఁడిట్లనెను :- "మునులారా! భ్రమనివారణో పాయమును జెప్పుచు హంసరూపుఁడగు భగవానుఁడు సన కాది మునులతో నిట్లనెను :- "కుమారులారా! ఆత్మలో ద్వైతము లేదు. విశ్వ, తైజస, ప్రాజ్ఞత్వము లాకే ఆత్మ యొక్క సంజ్ఞలు. జాగ్రదవస్థయందు, అదే సమస్తేంద్రియము లతో బాహ్యమున నుండిన క్షణిక పదార్థముల నుపభోగిం చును. జాగ్రదవస్థలో నేను నానా కార్యము లొనర్చు చున్నాను, అనేక వస్తువులను జూచుచున్నాను. ఇంత దూరమునుండి ప్రయాణము చేసి వచ్చితి ననుటయును,

స్వప్నమందు వాసనామయ జగత్తునందలి నానా విషయము లను హృదయమందనుభవించుటయును, భోగించుటయును, వాని భోగముచే సుఖ దుఃఖములను జెందుటయును, సుషుప్తిలో మనస్సును, ఇంద్రియములును లయము కాఁగా సాక్షి రూపమున నుండునదియు అన్నియు నొక్కటియే. ఒక్క దానికే అవస్థా భేదముచే మూఁడు పేరులు వచ్చినవి. దాని నిట్లు తెలిసికొనుము.

ఒక శ్రేష్ఠి కలఁడు. ఆతని కొక చిన్న మందిరము కలదు. దానిలో నొక పూజారినిఁ బెట్టినాఁడు. ఆతఁడే భగవానునకు నైవేద్యమును వండును. ఆతఁడే భగవంతుని సమ్ముఖమునఁ బురాణమును జెప్పుచుండును. ఆతఁడు వంట చేయునపు డాతనిని ప్రజలు వంటవాఁడని పిలుచుచుందురు. పూజ చేయునపుడు పూజారి యందురు. కథను జెప్పునపుడు పండితుఁడందురు. వంటవాఁడు, పూజారి, పండితుఁడు వీరు ముగ్గురును నొక్కఁడే. కాని అవస్థా భేదముచే వానికా పేరులు వచ్చినవి. ఆత్మ ఒక్కటియే. అవస్థా భేదముచే దానికే విశ్వ, తైజస, ప్రాజ్ఞలను మూఁడు సంజ్ఞలు కలిగినవి. వాస్తవమున నీ మూఁటికినిఁ బరుఁడు తురీయుఁడు."

మునులిట్లడిగిరి :- "స్వామీ! జాగ్రదవస్థలో నాతఁ డింద్రియములకు నియామకుఁడు. స్వప్నావస్థయందు వాసనా

మయ విషయముల వలనఁ గలుగు ననుభవము కలుగును. దానికి సాక్షియై యుండును. కాని సుషుప్తి అవస్థయందు మనస్సు, ఇంద్రియములు మొదలగునవన్నియును విలీనము లగును. ఆ సమయమున నాత్మ సాక్షీరూపమున నెట్లుండును. ఏవస్తువు ననుభవించునో ఇది మనస్సునకు రాలేదు.”

హంస భగవానుఁడిట్లనెను :- “నేను నిద్రించితినను ప్రతీతి యెవరికిఁ గలుగుచున్నది ? నిద్రించిన తరువాత లేచి ‘నేఁడు గాఢనిద్రవచ్చినది, ఒక్క స్వప్నమైనను రాలేదు. పరుండఁగానే నిద్రపట్టినది ఇప్పుడే లేచితిని. కమ్మని నిద్ర పట్టినది’ అనును. నిద్రలో నన్నియును లీనమైనచోఁ గమ్మని నిద్రపట్టినదను ననుభవమును బొందినదెవరు ? దీనినిఁ బట్టి అన్నియును నిద్రించుచుండినను నన్నిటి యనుభవములను దెలిసికొనువాఁడెవఁడో మేల్కొని యున్నాఁడని తెలియు చున్నది. ఆ మేల్కొన్నదే ఆత్మ. అది మూఁడవస్థలలోని స్మృతిని గలిగియుండుటచే నా మూఁడింటికిని సాక్షిగను, ఇంద్రియమనస్సులకు నియామకుఁడుగను నున్నదని తెలియు చున్నది.”

మునులిట్లడిగిరి :- “ఆ యాత్మానుభవమెట్లు కలుగును.”

హంస భగవానుఁడిట్లనెను :- "సమస్త సంశయముల కాశ్రయరూపమైన అహంకారమే, జాగ్రత్స్వప్న సుషుప్తులను మాఱుచును మనస్సుయొక్క అవస్థలేయని సూక్ష్మ బుద్ధిచే విచారించినఁ దెలియఁగలదు. ఆత్మ యెల్లప్పుడును జాగృతినిఁ జెందియున్నది. సదా ఏకరసమైనది. మనస్సుయొక్క యీ యవస్థలన్నియును నా మాయాగుణములచేఁ బరమాత్మనగు నాయందుఁ గల్పింపఁబడినవి. ఒక్కవిషయమును నాలోచింపుఁడు. నా కన్నులు మంటగా నున్నవి. నా చెవులు వినఁబడుటలేదనిన నేను వేఱనియును, కన్నులు, చెవులు వేఱనియును ఋజువగుచున్నది. నాదనుటచే నేను వేఱనియు నా వస్తువు వేఱనియు తేలుచున్నది. 'నామనస్సు చంచలముగ నున్నది.' "నేనింత దాన మొనర్పవలయునని నాకు బుద్ధిపుట్టినది" అనుటచే మనస్సు వేఱనియు, దానిని నియమించునది వేఱనియు సిద్ధమగుచున్నది 'నీ వీ మాటను మాటిమాటికి అనుచున్నావు. కాని అది నా బుద్ధిలోని కెక్కుటలేదు అనుచుందురు. దీనిచే స్పష్టముగ నాదియను వాఁడు వేఱని, బుద్ధి అన్యమైనదనియుఁ దెలియుచున్నది. 'ఆత్మనే చూడుము, దానినే మనన మొనరింపుమని శాస్త్రములు మాటిమాటికినిఁ జెప్పుచున్నవి. అదేవిధముగ నను మానముచేతను, ఋషులవాక్యములచేతను జ్ఞానరూపమగు ఖడ్గమును దీక్ష మొనరింపుము. ఆ తీక్షకరవాలముచే సర్వ

సంశయములకు నాశ్రయమగు నీయహంకారమును ఖండించి, హృదయమందుండు సచ్చిదానంద ఘనుఁడను నాత్మరూపుఁడ నగు నన్ను భజింపుము.''

సనకాదులిట్లనిరి:- ''స్వామీ! మీరీ ప్రపంచమున సత్తుగఁ జెప్పుచున్నారు, కాని యిది సదా మాశిరస్సులపై నెక్కి తాండవించుచున్నది. దీని నివారించుకొనుటెట్లు?''

హంసభగవానుఁ డిట్లనెను :- ''నాయనా! ఇందులోఁ జేయవలసిన దేమున్నది ? భ్రాంతిరూపమగు నీ సంసారమును కేవలము మనోవిలాసమని మాత్రము తెలిసికొనుట. ఇది కేవల మిట్లుకనఁబడును. ఇందులో సారమేమియును లేదు. ఇంద్రధనుస్సు, జలమందలి నీలిమ, ఆకాశచ్ఛాయ, మృగమరీచికలు కనఁబడుచుండును. ఇవన్నియును వస్తువులు కావు. వాస్తవమున నివి లేనేలేవు. కనఁబడునవన్నియును నశ్వరములే పిల్లలు దీపావళిరోజున బాగ్గుబొట్లమును గట్టి, దానికి నిప్పంటించి దానిని గిఱ్ఱునఁ ద్రిప్పెదరు. అప్పుడొక అగ్నిచక్ర మేర్పడును. యథార్థముగ నగ్ని చక్రముకాదు. అది భ్రమయే. కనుగ్రుడ్డుమీఁద వ్రేలితో వత్తినచోఁ జంద్రులిద్దరున్నట్లు కనఁబడెదరు. కాని యిద్దరుచంద్రులు లేరు. నీటిమీఁద బుడగలుండును. అవి నీటికన్యమైనవి కావు. జలమీఁదఁ జంచల తరంగములుండును. అవి

జలముపై స్పష్టముగ గోచరించును. కాని అవి జలమునకు భిన్నమైనవి కావు. ఇదేవిధముగ అత్యంత చంచలమును, క్షణభంగురమును, నశ్వరము నగు నీజగత్తు ఏకైకమగు, నావిజ్ఞానమందు నానారూపముగ భాసించుచున్నది. ఆ ఏక విజ్ఞానమందు జాగ్రత్స్వప్న సుషుప్తులను మూండువిధములగు వికల్పములును మాయామయములు. స్వప్నరూపములు. ఇవి తొలంగిపోవుట కొక్కటేమార్గము. అది ఆవైపు చూడ కుండుటయే. విషయ తృష్ణను దీసివేసికొనుండు. ఈ జగత్తు నుండి దృష్టినిం దీసివైచి, లోపలిచూపును జూడవలయును. మౌనముగనుండి ఆత్మతత్వము ననుభవమునకుం దెచ్చుకొని నచో నమృతతత్వమును బ్రాప్తింపంగలరు. ఇప్పుడు మీరారచ్చట దృష్టినింబెట్టరాదు. నిజానంద పరిపూర్ణులై, నిశ్చేష్టులై ఆత్మానంద సుఖానుభవ మొనర్పుండు."

సనకాదులిట్లనిరి:- "స్వామీ! ఇదంతయును సత్యమే. ఆంకలైనపుడును, దప్పికైనపుడును జ్ఞానమంతయును మఱచి పోవుదుము. అప్పుడీ అసత్సంసారము 'సత్'గా భాసించును."

నవ్వి భగవానుండిట్లనెను:- "ఓయీ! క్షుధాపిపాస లాత్మ ధర్మములు కావు, ఆంకలిదప్పులప్పుడు సంసారము జ్ఞాపకము వచ్చినను హానియేమియును లేదు. స్వప్నము పూర్తియైన తరువాత మేల్కొన్నతరువాత స్వప్నమునం

గాంచిన సింహము స్మరణకు వచ్చినను క్లేశమును గలిగింపదు. భయముండదు. ఇదేవిధముగా నొక్కసారి పూర్ణజ్ఞానము కలిగిన తరువాత ప్రపంచము లేనే లేదని నిశ్చయమైన తరువాత అది కనఁబడినను భ్రమ ఉత్పన్నము కాఁజాలదు. దేహమున్నంతవఱకు సంసార ప్రతీతి యుండితీరును ''

సనకాదులిట్లనిరి :- ''స్వామీ ! ప్రపంచముయొక్క మిథ్యాత్వముగు బూర్ణజ్ఞానము కలిగిన వారిస్థితి యెట్లుండును. వారు ప్రపంచవ్యవహార మెట్లు చేయుదురు ?''

సూతుఁడిట్లనెను:- ''మునులారా! హంస భగవానుఁ డెట్లు సనకాది మహామునులకు జ్ఞానస్థితిని గూర్చి చెప్పెనో, దాని వర్ణనమును నేను ముందు చెప్పెదను.''

——//——

# హంసగీతా సమాప్తి

శ్లో॥ మయైతదుక్తం వో విప్రా
గుహ్యం యత్సాంఖ్యయోగయోః ।
జానీత మాగతం యజ్ఞం
యుష్మద్ధర్మవివిక్షయా ॥

శ్రీభాగ. ౧౧ స్కం. ౧౩ అ. ౩౮ శ్లో॥

రాత్రియందు దానియొక్క యథార్థజ్ఞాన మున్నంత వఱకే భయమును గలిగించు దుంగవలన భయముకలుగును. చీఁకటిలో దుంగనుజూచి దయ్యమనియో, దొంగయనియో భావించిన, దానినిఁ దెలిసికొనినతరువాత భయమంతయును బోవును. భయము పోయినతరువాత అచ్చటినుండి అది పోలేదు. అది అచ్చటనే యున్నది. ఇప్పుడు దానినిఁగాంచి నను భయముండదు. స్వప్నావస్థయందు కల్పిత వధకుఁడు ఖడ్గమునుబట్టుకొని, దానిచే మనకంఠమును దెగఁగొట్టుటకు వచ్చును. ఇవన్నియును గల్పితవస్తువులే. అయినను మనము భయపడెదము, అఱచెదము. మిక్కిలి కష్టము కలుగును. వెంటనే లేవఁగనే, ఆకల్పితవధకుఁడు, ఖడ్గము, కంఠము స్మరణకు వచ్చినను భయముత్పన్నముకాదు. కాఁగా మేమనఁగా నిప్పుడు మనము మేల్కొనియున్నాము. అవి జ్ఞాపకమునకు వచ్చుచునేయున్నవి కాని అవి స్వప్నవృత్తాంత మునకు సంబంధించిన వనియు, నన్నియును గల్పితములని యును, మిథ్యలనియుఁ దెలియును. ఇదేవిధముగ జ్ఞాని నెత్తిన కొమ్ములుపెట్టుకొని రాఁడు. ఆతని దృష్టిలో దేవ దత్తుఁడు, తల్లి, తండ్రి, సోదరుఁడు, ఇల్లు, పరివారము, పంచభూతములు, ఘట, పటములు, సమస్త పాంచభౌతిక పదార్థములు విలీనములు కాలేదు. ఇవన్నియు నుండినను, కంటిలోఁ జూచుచుండినను, నాతఁడన్నిటిని మిథ్యగా భావిం

చును, కావున నాతని కేషుటనయును విలక్షణముగ నుండదు. వాని కారణమున సుఖదుఃఖములుండవు.

సూతుఁడిట్లనెను :- "మునులారా! సనకాది మునులు హంసభగవానునితో జ్ఞాని స్థితిని గూర్చి ప్రశ్నింపఁగా నప్పుడు హంసభగవానుఁడిట్లనెను :- "మునులారా! మీరు నన్ను జ్ఞాని స్థితిని గూర్చి అడుగుచున్నారు. మీరు మర్త్య లోకమునకు బోయి ప్రత్యక్షముగ జ్ఞాని స్థితినిఁ గాంచుఁడు. శరీర ముండినను జ్ఞాని సదా శరీరాభిమానము లేక యుండె దరు. జ్ఞాని సంగతి వదలి వేయుఁడు. మీ రెన్నడైన సురా పినిఁ గాంచితిరా ?"

మునులిట్లనిరి :- "స్వామీ! చాల మంది సురాపులు సురాపాన మొనర్చి యున్మత్తుల వలెఁ బ్రలాప మొనర్చుచు, బూతులు తిట్టుచుండుటను గాంచితిని."

హంసభగవానుఁడిట్లనెను :- "మీరు వారినిఁ గాంచి జ్ఞాని స్థితిని గూర్చి అనుమానించుఁడు. సురాపానమునకుఁ బూర్వ మా వ్యక్తి యెట్లున్నాఁడు ? దూరమున నేదైన మైల వస్తువును గాంచిన, ముక్కులను మూసికొని దానినిఁ దప్పించుకొని పోయెడు వాఁడు. పొరపాటున నెవరైన గంగాజల బిందువు మీఁదఁ బడునట్లు చేసినను గన్నులెఱ్ఱ జేసికొనెడు వాఁడు. ఆతఁడు సురాపాన మొనర్చి యున్మత్తుఁ

డైనపుడును నదియే శరీరము. భోజనమును బెట్టినచో స్వభావ వశమునఁ దిని వేయును నాలుకకు జలము దించినఁ ద్రాగును. కాని యిప్పు డతనికి భేదభావ ముండదు. ఇదివఱలో ధోవతి మోఁకాళ్ల పైకి వచ్చినచో లజ్జించెడు వాఁడు. ఇప్పుడు దిగంబరిగ నున్నాఁడు. చింతయే లేదు. ఆతఁడు మురుగు కాలువలోఁబడి, ఆ మురుగునీరు నోటిలోనికిఁ బోయినను నాతని కిప్పు డసహ్యము లేదు. ఇప్పు డాతనికి భేదభావము లేదు. ఆతఁడూరక నవ్వుచుండును. మాటలాడిన నసంబద్ధ ప్రలాపము లాడును. శరీరము మీఁద వస్త్రముండిన నుండును లేదా లేకుండును. ఎదుట భార్య నిలుచుండినను జెల్లెలు నిలుచుండినను నాతనికి భేదభావ ముండదు. ఇదే విధముగ సిద్ధపురుషుఁడు జ్ఞానామృతపాన మొనర్చినపుడు సంసార మంతయు నల్లే యుండును. కాని వాని దృష్టిలో నది సదా మిథ్యగాఁ దోచును. శరీరము మీఁద నాఁతని కాసక్తి యుండదు, జీవితకాలములో శరీరముచే నేకార్యములు జేసెనో, జ్ఞానము కలిగిన తరువాత స్వభావ వశమున నా కార్యములు జరుగుచునే యుండును. శరీరము నిలుచుండును, నడుచును, కూర్చుండును, పరుండును. మలమూత్ర పరిత్యాగమును గావించును. జ్ఞాని యొక్క ముఖ్య మన స్సీకార్యముల పై పునరు బోనే పోదు, అవన్నియును దైవ వశమున జరుగును.''

సనకాదిమునులిట్లనిరి :- "స్వామీ! శరీరమునఁ బ్రాణమున్నంత వఱకు సుఖదుఃఖము లుండును. ఉండి తీరవలెను. వాని నెవ్వరైనఁ గొట్టినచో నా జ్ఞానికి కష్టము కలుగదా?"

హంసభగవానుఁడిట్లనెను :- "ఈ పాంచ భౌతిక శరీర మందాసక్తి యుండినచోఁ గష్టము కలుగును. అట్టి వారీ శరీరమునే ఆత్మగా భావించెదరు. ఆత్మ నిత్యమైన దనియు, శుద్ధముక్త మనియు, శరీర మనిత్యమనియు, నశ్వర మనియుఁ బంచ భూతముల బంధములో నున్నదనియు, వీరు భిన్న ధర్మలు. వీరి కేల దేహాసక్తి యుండఁగలదు? స్వప్న ములోఁ గాంచిన సింహము మేల్కొనిన తరువాత మిథ్య యని తోఁచును. ఎన్ని సార్లు స్మృతికి వచ్చినను దాని వలన భయముండఁ జాలదు. జ్ఞాని శరీర మమకారమును వదలి తనయొక్క వాస్తవిక స్వరూపమును దెలిసికొని యున్నాఁడు. అట్టి యెడ దేహము యొక్క సుఖదుఃఖములచే నాతఁడేల భయపడును? దేహమున్నను మంచిదే, లేకున్నను మంచిదే, ఎవ్వరైనఁ బూలను వైచిన హర్షము లేదు. మలమూత్ర ములు కొట్టినను విషాదము లేదు."

మునులిట్లనిరి :- "స్వామీ! ఇట్టి స్థితిలో శరీరముండ కుండ వలెను. శరీర మహంకారము చేతనే నిల్చియున్నది. దీని మీఁద నహంకారమే లేకుండిన శరీర ముండరాదు."

హంసభగవానుఁడిట్లనెను :- "అట్లు కాదు. మునులారా! శరీరము కర్మాధీనమైనది. సంచిత, ప్రారబ్ధ, ఆగామి కర్మలుండును. సంచిత మనఁగా జన్మ జన్మాంతరముల నుండి కూడబెట్టు కొన్నది. ఆ కర్మల నుండి ఒక జన్మము కొఱకు సుఖదుఃఖాను భవమున కేర్పఱచినది ప్రారబ్ధము. ఇప్పుడు మనము చేయునది ఆగామి కర్మ. ఇది పోయి సంచిత కర్మలోఁ జేరును. ఒకని వద్ద కూడబెట్టుకొనినఁ జైత్రక ధనములోనికి తాను సంపాదించిన ధనమును గల్పినట్లుండును. దాని నొకనికి వడ్డీకిచ్చిన దాని కాతఁడు వడ్డీయిచ్చినట్లుండును. వడ్డీతో వ్యాపారమును జేయును. దానిలోని లాభమును గూడ ఆ వడ్డీ తీసుకొన్నవానివద్దనే ఉంచును. అప్పు తీసుకొన్న వానివద్ద నిలువ ఉంచిన ధనము సంచితధనము, దానివలన వచ్చు వడ్డీ ప్రారబ్ధము. దానివలన వ్యాపారములలో వచ్చు లాభము అదియే ఆగామి. దైవయోగమున నప్పు పుచ్చుకొన్నవాఁడు దివాలాయైనాఁడు. ప్రతిదినమును జమవచ్చునదియును, పురాణమూల ధనమును నిప్పుడు పోయినది. కాని నేఁడాతనికి లభించిన వడ్డీ ఆతని వద్దనే ఉన్నది. ఆవడ్డీ పైకమున్నంతవఱకు దానినిఁ దినును. అది సమాప్తము కాఁగానే నిర్ధనుఁడగును. ఇదేవిధముగ జ్ఞానము కలిగినతరువాత సంచితాగామి కర్మలు నశించును గాని ప్రారబ్ధకర్మ మాత్రము నశింపదు. 'ప్రారబ్ధం భోగతో

నశ్యేత్' ప్రారబ్ధము అనుభవించిననే నశించును. భోగింపక ప్రారబ్ధము నశింపదు. దేహారంభమునఁ గల ప్రారబ్ధకర్మ శేషించినంతవఱకు జ్ఞాని శరీరము బ్రదికియుండును. ఇతర శరీరములకు వలెనే ఆతనికిని శరీరక్రియలుండును. భేదమేమి యనఁగా నాతనికి సమాధి సుఖము లభించును. ఆతఁడు సమాధియోగమున నారూఢుఁడై ఆత్మ సాక్షాత్కారమును బొందును. ఇప్పుడీ దృశ్యప్రపంచముండినను నాతనికి దాని మీఁద నాసక్తియుండదు. ఏలననఁగా నాతఁడు దీనియొక్క యథార్థస్వరూపమును దెలిసికొనినాఁడు. బ్రహ్మానందసుఖము ననుభవించినవాఁడీ మలమూత్రముల కొంపయందు సుఖానుభవమేల చేయును. ఆతఁడు స్వప్నజన్య పదార్థము వలె ఏంద్రియజన్య విషయములను మిథ్యలు దెలిసికొనును. ఆతనికి శరీరముమీఁద మమతయుండదు. దానినిఁ బోషించు కొను నపేక్షయును, పుష్టిని గావించుకొనవలయునను చింతయు నుండదు."

సనత్కుమారులిట్లనిరి:- స్వామీ ! మాకిప్పుడు తెలిసినది. మీరు మామీఁద మిక్కిలి అనుగ్రహమును జూపితిరి. మాతండ్రి మాప్రశ్నను విని మౌనముగ నుండెను."

భగవానుఁడిట్లనెను:- "ఏమియును లేదు మీతండ్రి సమాధానమీయకపోయిన మీతండ్రి తండ్రి సమాధాన

మొసంగినాఁడు. ఆత్మనుండి పుట్టుటచేఁ బుత్రునకును దండ్రికిని నేమియును భేదము లేదు, తండ్రియే పుత్రుఁడై మరలఁ బ్రకటన మగును. నన్ను మీరు మీతండ్రికి తండ్రినని భావింపుఁడు. వత్సలారా! నేనే యోగమున కంతిమలక్ష్యమును. సాంఖ్యులు పరమతత్త్వముగ నెవరినిఁ జెప్పుచున్నారో ఆతఁడను నేనే. సత్యమనియు, ఋతమనియు నెవరినిగూర్చి చెప్పుచున్నారో, అట్టి సత్యస్వరూపుఁడను నేనే. ఎవని తేజస్సు ప్రపంచమందంతటను వ్యాపించియున్నదో, ఎవని అంశాంశ తేజస్సునుబొంది బ్రహ్మాది దేవతలు తేజస్వులనఁబడుచున్నారో ఆ తేజస్సులన్నిటికిని ఏకైక ఆలయమును, నిదానమును నేనే. నేనే తేజస్వులందఱిలో శ్రేష్ఠుఁడను. శ్రీదేవి నాస్వరూపము. ఏకీర్తి కొఱకు ప్రపంచమందలి జను లువ్విళ్ళూరుచుందురో, ఆకీర్తి స్వరూపుఁడను నేనే. తేజస్వులింద్రియములను, మనస్సును వశమందుంచుకొని, శమదమముల నభ్యసించుచున్నారో ఆతఁడను నేనే. ఎంతవఱకని చెప్పుదును. పుత్రులారా! సమస్తము నేనే నాకతిరిక్తమైనదేదియును లేదు. సాధనలకన్నిటికంటెఁ బరమగతిని నేనే. శాస్త్రకారులందఱును సమదృష్టితోఁ జూడవలయును. విషమత పనికిరాదని చెప్పుచుందురో ఆ సమస్వరూపుఁడను నేనే. అన్నిటిలో నేనున్నానని తెలియవలయును. అన్నిటిని నన్నుగా భావింపవలయును. శాస్త్రములు మాటిమాటికి

నిట్లు చెప్పుచుండును:- "దృఢమగు నసంగ శస్త్రముతో మోహమును ఖండింపుము." ఆ అసంగము నన్ను భజించు చుండును. అనఁగా నాతో నొక్కనితోడనే సంగము కలిగి యుండుము. నేను గుణరహితుఁడను. అనఁగా నిర్గుణుఁడను. నాకేవస్తువును అక్కఱలేదు. ధనముగాని, సామగ్రిగాని అవసరములేదు. పరమ ప్రేమాస్పదుఁడను నేనే. అన్నిటి లోను నాత్మస్వరూపమున నేనే యుండి క్రీడించు చున్నాను. నేనుగాక యింకేదియును నుత్పన్నము కాలేదు, ఏదియును నస్తిత్వము లేదు, ఇంకఁ బ్రళయము సంగతి యేల? ఈ నానాభావములును, నానా దృశ్యములును, నానావాద వివాదములును గల్పితములు. మిథ్యలు, అసత్తు, అజాతము, అసంభవములు. అన్నిటికిని నేకమాత్రాశ్రయమును నేనే యని తెలియవలెను. నా ప్రియబాలకులారా! చిత్తమును లేదు, విషయమును లేదు. ఇదంతయును గంధర్వనగరము, మృగమరీచికలవలె నుండకుండినను నజ్ఞానమున భాసించు చున్నవి."

సనాకాది మునులు హంసభగవానుని చరణములకుఁ బ్రణామ మొనరించి యిట్లనెను :- "స్వామీ! మీ కృపచే మా సందేహములు దూరములైనవి. మా మోహము నశిం చినది. ఇది సుఖము, ఇది దుఃఖము, ఇది మంచి ఇది చెడ్డ, ఇది ఉత్తమము, ఇది అధమమును నవన్నియును మిథ్యా

కల్పనలనియు మాయయనియు గ్రహించితిమి. ఓక్కమీరే ఆత్మరూపమున సత్యము, ఈయాత్మ 'అహం' రూపమున సర్వత్ర వ్యక్తమైనది. అది నేనే."

నేను నవ్వి యిట్లంటిని :- "అవును పుత్రులారా! అదిమీరే. 'అహం, త్వం నేను, 'నీవు' యందు భేదమేమి యును లేదు. వీనిలో రెండుగా భేదమును జెప్పువాఁడు పశ్చాత్తాపమును జెందును. ఆతఁడేడ్చును. ఆతనికే భయము కలుగును."

శ్రీకృష్ణ చంద్రుఁడు ఉద్ధవున కుపదేశించుచు నిట్లనెను :- ఉద్ధవా! హంసరూపమున నేను సనకాదులయొక్క సర్వసంశయములను బోఁగొట్టఁగా, వారి ప్రశ్నలను యథార్థమగు ప్రత్యుత్తర మీయఁగా వారందఱును మిక్కిలి ఆనందించిరి. వారు అత్యంత శ్రద్ధాభక్తులతోఁ బూజించిరి. నానా స్తోత్రములతో నన్ను స్తుతించిరి. వారి పూజలను విధ్యుక్తముగ గ్రహించి నేను వెంటనే నాఱెక్కలను దటతట కొట్టుకొనుచు నెగిరిపోయితిని. ఎగిరిపోవు టెచ్చటికి? అచ్చటనే అంతర్ధానమైతిని. అచ్చటనే అదృశ్యమై నా ధామునకుఁ బోయితిని. నేను గూఢ జ్ఞానమయమగు హంసగీతను జెప్పితిని. ఇంకేమి నీవేమి వినఁదలఁచు చున్నావు?"

ఉద్ధవుఁ డిట్లనెను :- "స్వామీ ! మీరు పక్షిగా నైతి రేల ?"

నవ్వి భగవానుఁ డిట్లనెను :- "రెండు ఱెక్కలును నొకే పనిని జేయును. రెండు పక్షముల సహాయమున నెగురుదును. కావున నేను బక్షి నైతిని."

ఉద్ధవుఁ డిట్లనెను :- "స్వామీ ! మానవులకు పక్షి ఉపదేశించుట మా కాశ్చర్యమును గలిగించు చున్నది. మీ రుపదేశింపఁదలచిన మానవుల కుపదేశించు మునిగాఁ గావచ్చును గదా!

నవ్వి భగవానుఁ డిట్లనెను :- "ఓయీ! నన్నెవ రెట్లు భజించెదరో వారికట్టి రూపము దర్శన మొసంగెదను. జ్ఞానులు శుష్క ప్రకృతి కలవారుగ నుందురు. వీరికి సరసతయుండదు. తర్క ప్రధానులై యుండెదరు. కుక్క కును, కుక్కను దిను వానికిని నేమియును భేదముండదు. వీరు సుందర స్వరూప మునుపాసించువారు కారు. నిర్గుణధ్యానము నొనర్చువారు. అజపాగాయత్రి నిర్గుణమైనది. శ్వాస హంకారమున బయటకు బోవును, సకారమున లోపలకుఁ బ్రవేశించును. అందువలన జీవుఁడు 'హంస'యను బరమమంత్రమును నిరంతరము జపించు చుండును. నేను వారికి నిర్గుణోపదేశమును జేయవలసి యుండెను. 'హంస' అనునది జ్ఞాపకమునకు రాఁగానే నేను

వెంటనే హంసనైతిని. ఇది పక్షి, ఇతఁడు మానవుఁడను భేదము వీరికి లేదు. పక్షివలన జ్ఞానోపదేశమును బొందఁగూడదనునది వీరికుండదు. కావున నేను హంసనై వచ్చితిని. ఈ మునులందఱును సాత్వికులు, సత్వస్వరూపము తెల్లగనుండును అందువలన నేను దెల్లని హంసనై వచ్చితిని. అసురులు తామసులుగ నుందురు. వారికొఱకు నేను సూకరము నైతిని. దైత్యులు భయంకరముగ నుందురు. కావున నేను వికరాళ నృసింహుఁడ నైతిని.

ఉద్ధవుఁడిట్లనెను :- "స్వామీ! మీ యీ కచ్ఛప, మత్స్య, నృసింహ, హంసరూపములకు దూరముననుండియే ఒక్క నమస్కారము. ఇవన్నియును మీరూపములే. మేము వీనియందు శ్రద్ధను గలిగియుండము. కాని మాకు మాత్రమీ త్రిభువన విమోహక శ్యామసుందర స్వరూపమే అత్యంత ప్రియమైనది. ప్రభూ! ఈ జ్ఞానుల యొక్క పొడిపిండి మాకొంతు దిగదు. జగన్మిథ్యా, జగన్మిథ్యా అనఁగా ననఁగా జగత్తే జ్ఞాపకమునకు వచ్చును. రాగముచేఁగాని, ద్వేషముచేఁగాని, గ్రహించు నిచ్ఛచేఁగాని, మఱపునకు స్మరణచేసినను స్మరణముండితీరును. మఱచుటకుఁ బ్రయత్నించిన స్మరణమింకను నెక్కువగును. ఎవరితోనైనను 'మంత్రమును జపించుచుండుము, కాని ఆసమయమునఁ గోఁతి జ్ఞాపక

మునకు రాఁగూడ'దని చెప్పినచో వలదన్నను కోఁతి జ్ఞాపకమునకు వచ్చితీరును. కావున నిషేధవచనములను జెప్పుటకంటె విధివచనములను జెప్పుటమంచిది. ప్రపంచము మిథ్యయైనను సత్యమైన నేమిప్రయోజనము ? మిథ్యయైన దాని విషయమునఁ జర్చయేల ? మిథ్య మిథ్యయే కదా ! సత్యమైనచో దానిని మీచరణములం దేమూలనో పడనిండు. మాకు మీచరణములు కావలయును. మాకు వాని ధ్యానము కావలయును. 'నీమనస్సును నామనస్సులోఁ గలుపుమనియు, నీవన్నిటి భక్తిని వదలి నా భక్తుఁడవుకమ్ము. నీవు యజ్ఞయాగాదుల నొనర్పవలయుననిన నన్నుద్దేశించి చేయుము, ప్రణామ మొనరింపఁ దలఁచినచో నా పాదపద్మములకే ప్రణామమొనరింపు' మని మీరిదివఱలో ననేకసారులు చెప్పియుంటిరి. అట్టియెడ మీరు హంసలై ఇది చిత్తము, ఇది విషయము, ఇది జాగ్రత్తి, ఇది స్వప్నము, ఇది సుషుప్తి, వీఁడు విశ్వుఁడు, వీఁడు తైజసుఁడు, వీఁడు ప్రాజ్ఞుఁడు, ఇది తురీయమని యీ రగడ నేల తెలిసికొని వచ్చితిరి ? వాగెడు అభ్యాసము కలిగి, తర్కము లేక నిలువఁజాలని నీరస శుష్కజ్ఞానులనీ పొడిపిండిని, నిప్పువైచుకొని బొక్కనిమ్ము ప్రభూ ! మేము మధురోపాసకులము. మాకు మీరు మీ భక్త్యుపాయమును గూర్చి చెప్పవలయును. మీ భక్తి యెట్లు కలుగును. మీ భక్తులయొక్క లక్షణము లేవి ? ఈ విషయ

మును గూర్చి విస్తారముగఁ జెప్పుఁడు. జగస్సత్యమైనను మాకేమియును బాధలేదు, జగత్తు అసత్యమైనను మాకంతకంటె లాభములేదు. మాకు భక్తియోగ ప్రదానమును గావింపుఁడు. మీ మందహాస సుందర ముఖారవిందమును మాకు జూపుఁడు. నీ త్రిభంగ లలితఛవిని మా మనోమందిరములందు నృత్యమొనర్చుచుండు నుపాయమును జెప్పుడు. అయ్యో! లోకులెంత అంధులైనారు! నీ దివ్యలలితమాధుర్యరూపమును వదలి శిరస్సులను రాతికివైచి కొట్టుకొనుచున్నారు. పంచీకరణమును వల్లించుచు మాయవెంట ఉప్పుచు, పిండిని మూఁటగట్టుకొని పరువిడుచున్నారు. మీ మాయ నింతవఱకు దాఁచిన వాఁడొక్కఁడైనను లేఁడే, అట్టియెడ నీ ఘటపటములను మిథ్యగాఁ జెప్పుచు వాద వివాదములను గావించువారు దాఁచెదరా? అస్తు, మనమెవరినైన నిందించుటెందులకు? ఎవరి విషయమైన మనకెందులకు? బ్రహ్మవాదము బాగున్నదనుకొనువారిని దానినే ఆశ్రయింపనిండు. మాయావాదమును రచించువారా చిక్కులోఁబడనిండు. మాకు మా భక్తిరహస్యమును గూర్చి చెప్పుఁడు. భక్తులలోఁగల భేదములను గూర్చి చెప్పుఁడు. ఇంద్రియములు స్వాధీనమున లేకున్నను మీభక్తి చేయువానికేగతి సంభవించును? ఈ సమస్త విషయముల మర్మమును దెలుపుఁడు. ప్రజలలో భిన్నభిన్న ప్రకృతిగల

వారికి భిన్నభిన్న సాధనలుండును. మీరొక్కరే. ఈసాధనలలో నింతభేదమేల వచ్చినది ?''

నవ్వి భగవానుఁడిట్లనెను :- ఉద్ధవా ! నీవు మంచి చక్కని విషయమడిగితివి. మంచిది, ముందుగా నేను నీకదే జెప్పుచున్నాను. నన్నుఁ బొందుట కనేకమార్గము లేల కలిగినవో చెప్పి, తరువాత నీకు భక్తిమార్గ రహస్యమును గూర్చి చెప్పెదను. ఇప్పుడిఁక శుష్కమగు జ్ఞాన సరితను వదలి, అమృతవాహినియు, నాపాదములనుండి పుట్టినదియు నగు భక్తి భగీరథియందు ప్రేమతో నవగాహన మొనర్చి, కడుపు నిండఁ ద్రావి త్రితాపనాశకమగు పుణ్యసలిలమును బానము చేయుము.''

సూతుఁడు శౌనకాది మహామునులతో నిట్లనెను :- ''మునులారా ! ఇప్పు డేవిధముగ నుద్ధవునకు భక్తియోగ రహస్యమును జెప్పెనో, దానిని నేను మీకుఁ జెప్పెదను. మీరందఱును దత్తచిత్తులరై వినుఁడు.''

—॥—

# శ్రేయస్సిద్ధికొఱకనేక మార్గములకు కారణము

శ్లో॥ మన్మాయా మోహితధియః పురుషాః పురుషర్షభ ।
శ్రేయో వదన్త్యనేకాంతం యథాకర్మ యథారుచి ॥

శ్రీ భాగ. ౧౧ సం. ౧౪ అ. ౯ శ్లో॥

వ॥ నరోత్తమా! నామాయచే మోహితులైనవారు యథాకర్మలతో, యథారుచిలతో మోహితమతులై శ్రేయస్సిద్ధికి విభిన్నమార్గములను జెప్పిరి.''

ఎవరెట్టి ప్రకృతి కలవారుగనుందురో, వారి క్రియలును దదనుసారముగనే యుండును, నీవెచ్చటికైనను బొమ్ము, ఏ సమాజములోనైనను జేరుము. స్వభావవ్యవహార, వర్తనములచే వారి ప్రకృతులు దెలియఁగలవు. ఒకసారి ప్రయాగలోఁ గుంభమేళా జరిగెను. దశదిశలనుండియును నానామార్గముల వారు, నానామతములవారుఁ విభిన్నవేషములవారు, అనేక సాంప్రదాయములవారు వచ్చిరి. వారిలో నల్గురు సాధువుల నామములు చాల ప్రసిద్ధములు. ఒకసజ్జనుఁడు పోయి యీ సాధువుల నామములు చాల ప్రసిద్ధములు. ఒక సజ్జనుఁడు పోయి యీ సాధువు లేవర్ణములవారని విచారించెను. వారందఱును పోయి సాధువులనడుగమనిరి. అంత నొక

బుద్ధిమంతుఁడిట్లనెను:- "ఓయీ! నీవు సాధువును కులమేది యని యడిగినచో బ్రాహ్మణుఁడైనచోఁ దాను బ్రాహ్మణుఁడనని చెప్పును. ఇంకొక వర్ణమువాఁడైనచో నటునిటు ద్రిప్పి సాధువువర్ణమును నిర్ణయించుటెట్లు? సాధువు హరిని భజించును గావున హరికి సంబంధించినవారే కాఁగలరందురు. సాధువు చతుర్థ వర్ణమువాఁడైనచో 'సాధువునకు జాతిపరీక్ష నొనర్చుట, తల్లియొక్క యోనిపరీక్ష చేసినంత పాపము లభించును, సాధువు జాతివర్ణముల కతీతుఁడు" అనును. కావున వారికడకు బోయి అడుగుట ఉచితము కాదు. ఇంకొక విధముగ వారిజాతిని నిర్ణయించుకొనవలయును."

ఆ వ్యక్తి యిట్లనెను:- ఇంకొకవిధమేమున్నది. మీరే చెప్పుఁడు."

బుద్ధిమంతుఁడగు వ్యక్తి యిట్లనెను :- "దీనిలోఁ జెప్పుటకేమున్నది? స్వభావము నెంతగా దాచినను దాగదు. మాటలవలనను, వ్యవహారమువలనను దెలియఁగలదు. ఇట్లాతని గుర్తింపవచ్చును."

ఇట్లని యిద్దరును వెడలిపోయిరి, మునుముందుగా మొదటి సాధువులలో నొకటివాని వద్దకుఁబోయిరి. చాల సేపటివఱకచ్చటనే కూర్చుండిరి. వారా సాధువుకడకుపోయి యిట్లనిరి:- "స్వామీ! మాకేదైన నుపదేశ మొసంగుడు."

నవ్వుచు మహాత్ముఁడిట్లనెను:- "నాయనా! ఏమి యుపదేశమొసంగవలయునయ్యా ? -

గీ॥ 'రామ' పావననామంబె లడ్డు యగును
పృథివి గోపాలనామంబు ఘృతము యగును
ఘనమగు హరినామము కలకండయగును
మెల్ల మెల్లఁగఁ ద్రాగుఁడు మిత్రులార! ॥

ఇది వినఁగానే వారిద్దరును లేచిరి. విజ్ఞుఁడగు వ్యక్తి యిట్లనెను:- నిశ్చయముగ నీతఁడు బ్రాహ్మణుఁడు. బ్రాహ్మణులు మధురప్రియులుగ నుందురు. (బ్రాహ్మణో మధుర ప్రియః), అతనికి లడ్డు, నేయి, కలకండ స్మరణకు వచ్చుచుండును.

ఇప్పుడు వారు రెండవ సాధువునికడకు బోయిరి. అట్లే కూర్చుండి, చివర కుపదేశింపఁగోరిరి. ఆతఁడు గర్జించి యిట్లనెను:-

"ఓయిరా, మీకేమి యుపదేశింపవలయును? ఈ చచ్చు ఉపదేశములచేఁ బనికాదు. నడుముబిగించి నిలుచుండవలయును.

గీ॥ రామనామంబు డాలుగా రాజిలవలె
వసుధ కృష్ణనామంబు కృపాణధార

ముదము హరినామము కవచముగ ధరించి
వీగి పోరాడి యముని జయింపఁగలరు ॥

బుద్ధిమంతుడగు వ్యక్తి తన స్నేహితుని చెవిలో ఇట్లు చెప్పెను :- "ఈతఁడు క్షత్రియుఁడు నిజముగ క్షత్రియుండే. సందేహ మేమియును లేదు.

అప్పుడు మూఁడవ వానికడకు బోయి ఉపదేశమీయుఁడని కోరిరి. ఆతఁడు మిక్కిలి సరళముగ నిట్లనెను:-

గీ॥ సకలమును గ్రహించునది సంసారప్రజలు
రామనామంబు కొల్లగ రాజిలెనిట
అమిత ముదమున మాధవుం డమ్ముచుండె
రండు కొనుడింక మీపంట పండఁగలదు ॥

బుద్ధిమంతుఁడగు నావ్యక్తి యిట్లనెను :- "ఈతఁడు శ్రేష్ఠినాయనా! తరువాత నాల్గవ వానిదగ్గఱకు బోయి ఉపదేశ మొసంగుమని అడిగిరి—ఆతడిట్లనెను :-

గీ॥ తనదు కష్టమెంతో తగినట్లు శ్రీరామ
చంద్రుఁ డొసఁగుచుండు చాల కూలి
ఎవరికెంత కలదో చివరకంతయె వచ్చు
చింతఁజెందరాదు సుంతయైన ॥

బుద్ధిమంతుఁడగు వ్యక్తి తన స్నేహితునితో బయటకు వచ్చి యిట్లనెను :- "ఈతఁడు చతుర్థ వర్ణమునకు సంబంధిం

చిన సాధువు. ఇదంతయును జెప్పుటకు గారణ మేమనఁగా విభిన్నవ్యక్తులు ఒకే జ్ఞానమును వారివారి ప్రకృతి ననుసరించి గ్రహించెదరు. ఆ భావముతోడనే ఉపదేశించెదరు. చక్కెర ఒక్కటే. ఏనుఁగు మూసలోఁబడిన నేనుఁగుగ నగును. గుఱ్ఱము మూసలోబడిన గుఱ్ఱముగా నగును. వస్తువొక్కటే నామరూపముల భేదముచే భేదముగ గోచరించుచున్నవి. ఆ భేదమును భిన్నముగ నెవఁడు భావించునో ఆతఁ డజ్ఞాని. బహుత్వమున నేకత్వము నెవఁడు చూచునో ఆతఁడు జ్ఞాని.

సూతుఁడిట్లనెను :- "మునులారా! భగవానునితో నుద్ధవుఁడు భిన్నత్వ మేలవచ్చినది? అన్నిటిలో భక్తిమార్గ మేదియని ప్రశ్నింపఁగా భగవానుఁడు సాధకులలోని భిన్న ప్రకృతులనుగూర్చి చెప్పుచు నిట్లనెను :- "ఉద్ధవా! సమత్వ మార్గమున శుద్ధమగు మార్గము వేదము. వేదమందే నివృత్తియు ప్రవృత్తియు, జ్ఞానమును, భక్తియు, కర్మ మొదలగు వర్ణనము కలదు. నేనెట్లనాదినో, నాయీ వేదమును ననాదియే. ప్రళయ కాలమున నీవ్యక్త జగత్తు అవ్యక్తమునందు విలీనమైనపుడు నాయీ వేదరూపమగు వాణియును అదర్శనమగును. మరల సృష్ట్యాది యందవ్యక్తమునుండి యీజగత్తు ఉద్భవించినపుడు నా నాభి కమలమునుండి బ్రహ్మ యుద్భవించును. అప్పుడు నేనాతనికి ముందుగా వేదము నుపదేశించెదను. ఈ క్రమము

ననే యీ స్వాయంభువ మన్వంతరమందు నేను కమలాస నుఁడగు బ్రహ్మకు వేదము నుపదేశించితిని. బ్రహ్మ ఆ జ్ఞానము దనపుత్రుఁడగు స్వాయంభువమనువున కొసంగెను. మనువా సమయమున భృగు, అంగిరా, మరీచి, పులహా, అత్రి, పులస్త్య క్రతువను ని బ్రహ్మర్షి వేడుగురకు నుపదేశించెను. ఈయేడుగురును దమ సంతానమునకు దీని నుపదేశించెను. క్రమముగ నీజ్ఞానము పితృగణము, దేవగణము, దానవ, గుహ్యక, మనుష్య, సిద్ధ, గంధర్వ, విద్యాధర, చారణ, కింపురుష, కిన్నర, నాగ, రాక్షస, కిందేహాదులలో వ్యాపించెను. వీరందఱును సాత్వికులుకారు. కొందఱు సత్వప్రధానులు, కొందఱు రజోగుణ ప్రధానులు, కొందఱు తమోగుణ ప్రధానులు. ఈ విధముగ భిన్నభిన్న ప్రకృతి కలవారగుటచే నొకే జ్ఞానమును భిన్నభిన్నముగ గ్రహించిరి."

శౌనకుఁడిట్లడిగెను :– "సూతా! ఒకే జ్ఞానము భిన్నభిన్న వ్యక్తుల కడకు బోయి భిన్న భిన్నముగ నెట్లైనది?"

సూతుఁ డిట్లనెను :– "స్వామీ! ఒకే వస్తువైనను పాత్రభేదముచే దానిలో భిన్నత్వము వచ్చును. విద్య వినయము నొసంగును. విద్యవలన జ్ఞానము కల్గును. జ్ఞానము వలన ముక్తి కలుగును, కాని అదేవిద్య యేకుపాత్రుఁడగు ఖలుని కడకో పోయినచో దానినాతఁడు వివాదము కొఱకు

వినియోగించును. ధనము శ్రేష్ఠమగు వస్తువే. ధనముచే దానపుణ్యాది కర్మములు చేయవచ్చును. కార్యములన్నియును ధనముచే సిద్ధించును. కాని అదియే దుర్జనుఁడును, కృపణుఁడు నగు వాని వద్దకు బోయినచో నాతఁడు కూడఁ బెట్టును. దానితో జూదము, వేశ్యా, సురా, మాంసాది సేవన మొనర్చును. ధనమదమున మదించి నానార్థము లొనరించును. ఇదేవిధముగ శక్తి గొప్ప దివ్య వస్తువు. ప్రపంచమున సమస్త కార్యములను శక్తిశాలియే యొనర్చును. శక్తి శాలియును బలవంతుఁడును గాకుండినచో నశక్త పురుషులను దుష్టులు బాధించుచుందురు. శక్తిశాలియే అశక్తులను దుర్బలులను రక్షించును. అదే శక్తి దుష్టుని కడనుండినచో నాతఁడందఱను బాధించుచుండును. అందఱను గష్టపెట్టుచుండును. దానినిఁ బరపీడనకే ఉపయోగించుచుండును. వర్షపునీరు ఒక్కటే. అది సముద్రమునఁ బడిన నదియును నుప్పైపోవును. నదులలోఁ బడినచోఁ దీపిగనుండును. కూపములోఁబడిన నా కూపమందలి జలమెట్లుండునో అట్లేయగును. ఉప్పునీళ్ళబావిలో పడిన నుప్పగ నగును. మంచినీటిబావిలోఁ బడినఁ దీయగ నగును. ఈ విషయమున నొక చక్కని దృష్టాంతము కలదు.

ప్రాచీనకాలమున శిష్యుఁడు గురువు దగ్గఱకు బోయినపుడు మునుముందుగా బ్రహ్మచర్యవ్రతము నవలంబించి,

విషయ విముఖుఁడై ప్రశ్నించుటకు యోగ్యతను సంపాదించు కొనును. ఆతని అంతఃకరణము శుద్ధము కాఁగానే ప్రశ్నించు టకు యోగ్యుఁడగును. అప్పు డాచార్యునిఁ బ్రశ్నించును. ఆతఁడా పశ్నకు సమాధానమును గ్రహించుట యోగ్యుఁడు కాఁడని గురువు తలఁచినచో నింకఁ గొన్ని దినములు బ్రహ్మ చర్యము నవలంబించుమనును. ఈ నియమానుసారముగ నొకసారి దేవతలును, అసురులును, మనుష్యులును ఈ ముగ్గురు లోకపితామహుఁడగు బ్రహ్మకడకు బోయి బ్రహ్మ చర్యమును బాలించుచు నివసించుచుండిరి. చిరకాలము బ్రహ్మచర్యమును బాలించుటవలన వారి మనస్సులోఁ దమకు గల దోషములను దెలిసికొనఁగల యోగ్యత సంభవించెను. తన దోషములను దెలిసికొన కుండినఁ బతనము తప్పదు. తాను నిర్దోషి ననుకొనుచుండును. తన దోషములు తనకు దెలియఁగానే గురువు కడకుబోయి ప్రశ్నించును. హృదయ పూర్వకముగ నాతని సేవ నొనర్చును. ఆతని యుపదేశమును గ్రహించును. తన దోషములను బోఁగొట్టుకొనుటకు నిరంత రము ప్రయత్నించును. ఇదేవిధముగ దేవతలును, అసురు లును, మనుష్యులును బ్రహ్మచర్యముతో నుండుటచేఁ దమ దోషములను గూర్చి విచారింప నారంభించిరి.

కొంతకాలమునకు దేవతలు మిక్కిలి శ్రద్ధాభక్తులతోఁ జేతులను జోడించుకొని బ్రహ్మ సమీపమునకుఁ బోయి,

ప్రణామ మొనరించి మిక్కిలి దీనతతో నిట్లనిరి :- "ప్రభూ! మీరు మాకు మేలు కలుగునట్టి, ఉపదేశము దేనినైన నీయ వలయును".

బ్రహ్మ యిది విని కొంచెముసేపు మౌనముగ నుండి చివరకు "ద" అని పలికెను. దేవత లీ యుపదేశమును భక్తితో స్వీకరించిరి.

బ్రహ్మ యిట్లనెను :- "మీరు నా యుపదేశమునకుఁ దాత్పర్యమును గ్రహించితిరా ?

దేవతలిట్లనిరి :- "స్వామీ ! గ్రహించితిమి"

బ్రహ్మ యిట్లనెను :- "సరే, ఏమి గ్రహించితిరో, చెప్పుఁడు" దేవతలు తమ భావనానుసారముగ నిట్లూహించిరి :- "మనము భోగులము. నిరంతరము స్వర్గసుఖముల ననుభవించుచుందుము. కావున బ్రహ్మ మనకు ఇంద్రియ దమనము నుపదేశించి యుండును." అని యాలోచించి యిట్లనిరి :- "స్వామీ ! మీరు మాకు 'ద' అని యుపదేశించుటచే దమనమును గూర్చి చెప్పిరను కొనుచున్నాము. మీరు మాకు నేర్పినది – ఇంద్రియములను దమన మొనర్పుఁడు – భోగచిత్త వృత్తినిఁ దొలఁగింపుఁడు,"

బ్రహ్మ యిట్లనెను :- "బాగున్నది. మీరు సరిగానే గ్రహించితిరి. మీరుపోయి అట్లే యొనర్పుఁడు." ఇది విని

దేవతాగణము లోకపితామహుఁడగు బ్రహ్మకుఁ బ్రణామ మొనర్చి వెడలిపోయిరి."

ఇప్పుడు మనుష్యులు వచ్చిరి వారును వచ్చి ఉపదేశ మొసఁగుఁడని బ్రహ్మనడిగిరి. వారి మాటను విని బ్రహ్మ "ద" అని పలికి యిట్లనెను :- "మీ కర్థమైనదా ?"

మనుష్యులిట్లనిరి :- అవును స్వామీ ! అర్థమైనది."

ప్రజాపతి యిట్లనెను :- "ఏమి తెలిసికొంటిరి ?"

మానవులిట్లనుకొనిరి :- "మన ప్రవృత్తి సంగ్రహ మొనర్చుట. యే మానవునకైనను వేయిరూపాయల నొసంగి దీనిని విని యోగించుకొనుమనుము." సాధారణముగఁ దాను కావలసినది వ్యయమొనర్చి మిగిలినది పంచిపెట్టుట విరళ ముగ నెవరో యుందురు. కాకున్న నిట్లనుకొందురు. "ఉండ నిమ్మా ధనము ! దగ్గఱనుండిన నేదో అవసరమునకుఁ బనికి వచ్చును. సంగ్రహమువలన మానవుఁడు దుఃఖితుఁడగును. కావున లోక పితామహుఁడు మనకు 'ద' యనఁగా దానము చేయుఁడని యుపదేశించి యున్నాఁడు." ఇట్లాలోచించి మానవులిట్లనిరి :- "స్వామీ ! మీరు మాకు దానమును జేయుఁడని చెప్పుచున్నారు, మానవులకు దానమునకు మించిన కల్యాణకరమగు మార్గమింకొకటి లేదు,

బ్రహ్మ యిట్లనెను :- "మీరు యథార్థమును గ్రహించితిరి. పొందు. నిరంతరము కొంచెముగనో గొప్పగనో దానమొనర్పుఁడు. ఇది విని బ్రహ్మకు బ్రణామమొనరించి మానవులు వెడలిపోయిరి. ఇప్పు డసురులు వచ్చిరి.

అసురులును వచ్చి పితామహుని పాదపద్మములకుఁ బ్రణమిల్లి ఉపదేశింపుఁడని ప్రార్థించిరి. బ్రహ్మ వారికిని "ద" యని యుపదేశించి "మీకర్థమైనదా ?" అని అడిగెను.

అసురులిట్లనిరి :- "అవును, అర్థమైనది."

బ్రహ్మయిట్లనెను:- "ఏమిగ్రహించితిరో చెప్పుఁడు."

అసురులిట్లనుకొనిరి :- "మనము క్రోధ, హింసా పరాయణులము. ప్రాణపోషణకొఱకు పరులను బాధించు చుందుము. ద్వేష భావముతో నితరులను దండించు చుందుము. అందువలన మాకు దేవాధిదేవుఁడు దయకలిగి యుండుఁడని యుపదేశించియున్నాఁడు." అని యాలోచించి వారిట్లనిరి :-" "స్వామీ ! మీరు 'ద' యని యుపదేశించి దయకలిగియుండుఁడని చెప్పితిరి."

బ్రహ్మ యిట్లనెను :- "యథార్థమే. మీరు పోయి సమస్త ప్రాణులపై దయకలిగియుండుఁడు. దీనిలో మీకు మేలున్నది."

సూతుఁడు శౌనకాది మునులతో నిట్లనెను :- మును లారా ! "ద" యను శబ్దమొక్కటియే దాని యర్థము నందఱును దమ తమ పాత్రతను, యోగ్యతను, భావనను అనుసరించి భిన్న భిన్నములుగ నర్థము చేసికొనిరి. జ్ఞాన పరంపర ఒక్కటియే, కాని దానిని గ్రహించు పాత్ర తన భావనానుసారముగ నర్థము చేసికొనును." చాలమంది ఆ వచనములందు వేదవిరుద్ధమును బాషండమునగు మతమును బ్రచారమొనరించెదరు. పాషండులగుచుందురు."

శౌనకుఁడిట్లడిగెను :- "సూతా ! నీ యభిప్రాయ మును మేము గ్రహించితిమి. ఇప్పుడు నీవు కృపతో నుద్ధ వుఁడు కృష్ణునేమని ప్రశ్నించెనో చెప్పవలయును."

సూతుఁడిట్లనెను :- "స్వామీ ! ఈ విషయమునే భగవానునితో నుద్ధవుఁడనెను. "ప్రభూ ! ఒకే సిద్ధాంత ప్రతిపాదనమున నింత భిన్నత్వమేల కలిగినది ? భాగవత ధర్మ మొక్కటియే కదా ! దానిలో నెన్ని మతములు కలవు ? ఎన్ని వాదములున్నవి ? ఎన్ని సిద్ధాంతములున్నవి? ఎన్ని పద్ధతులున్నవి ?"

భగవానుఁ డిట్లనెను :- "ఉద్ధవా ! ఇదంతయును నా మాయానాటకమే. నా మాయయే పిపీలికము మొదలు బ్రహ్మావఱకు జీవులనందఱ నాడించుచున్నది. మాయా

మోహితబుద్ధులు తమ తమ కర్మానుసారముగఁ, దమ రుచి ననుసరించి కల్యాణమునకు భిన్నభిన్న మార్గములను జెప్పి యున్నారు. ఒకరొకవిధముగఁ జెప్పిన నింకొకరింకొక విధముగఁ జెప్పుచుందురు.''

ఉద్ధవుఁడిట్లనెను :- ''స్వామీ! ఈ విషయమును నాకు స్పష్టముగఁ దెలుపవలయును. నే నల్పమతికల వ్యక్తిని. నా బుద్ధి స్థూలమైనది. నాకు బాగుగా సరళముగఁ జెప్పుఁడు.''

ఇది విని భగవానుఁడు నవ్వి యిట్లనెను :- ''ఉద్ధవా! ప్రపంచమున నీవొక్కఁడవే కుశాగ్రబుద్ధివి. నీవే మానవ జన్మయొక్క సార్థకతను గుర్తించితివి. నీ యీ ప్రశ్న లోక కల్యాణము నిమిత్తమే ఈ విషయమును నల్పాతి అల్ప బుద్ధిగలవాఁడును గ్రహింపవలయునని నీ యాశయము. మంచిది. ఇప్పుడు నేను నీకు ప్రజలు పరమార్థసంబంధమునఁ బ్రకృతిని, రుచిని అనుసరించి యెట్లు విషమతగ నాలోచించె దరో చెప్పెదను. తమ తమ వాసనానుసారముగ ప్రజలు ఆపరమార్థము విషయమున క్షుద్రార్థమును గ్రహించిరి.''

సూతుఁడిట్లనెను :- ''మునులారా! పరమార్థము విషయమున వివిధ మునులకు వివిధ మతములు కలవు. మీరు భగవానుని నోట వచ్చిన పలుకులను శాంతితో శ్రవణ మొసర్పుఁడు.''

—//—

# స్వల్పమున సుఖము లేదు

శ్లో॥ మయ్యర్పితాత్మనః సభ్య
నిరపేక్షస్య సర్వతః ।
మయాత్మనా సుఖం యత్త
త్కుతః స్యాద్విషయాత్మనామ్ ॥

శ్రీభాగ. ౧౧ స్కం. ౧౪ అ. ౧౨ శ్లో॥

వ॥ సర్వసంగ పరిత్యాగంబు సేసి యొండెఱుంగక నన్నే తలంచు మానవునకు భుక్తి ముక్తి ప్రదాయకుండనై యుండుదును.

శ్రీమదాంధ్ర భాగవతము.

చాల మంది గ్రుడ్డివారు కూర్చుండి ఏనుఁగెట్లుండునని వాదించుకొనుచుండిరి. ఇంతలో నొక బుద్ధిమంతుఁడు వచ్చి యిట్లనెను :- "మీరేనుగును జూడదలఁచుచున్నారా ?"

గ్రుడ్డివారిట్లనిరి :- "అవును, ఏనుఁగును జూడవలయు నని కలదు." ఆ బుద్ధిమంతుఁడు రాజు దగ్గఱ నుండి యేనుఁ గును దెచ్చెను. ఆతఁడు వచ్చి అంధులతో నిట్లనెను :- "రండు, చూడుఁడు, కాని అందఱును వంతులు వంతులుగ రావలయును."

ఇది విని అందులో నొక అంధుఁడు వచ్చి, ఏనుఁగు తొండమును నిమిరి యిట్లనెను :- "ఏనుఁగు కొండచిలువ వలె నుండి బుసలు కొట్టుచుండును."

రెండవవాఁడు వచ్చి తన చేతితోఁ బెద్ద పెద్ద ఏనుఁగు దంతములపై నిమిరెను. ఏనుఁగు తొండమును పైకి యెత్తెను. చాల సారులు దంతములను నిమిరి అంధుఁడిట్లనెను :- "ఆఁ తెలిసినది. ఏనుఁగు రోఁకలి వలె నుండును"

ఇప్పుడు మూఁడవ వాఁడు వచ్చి ఏనుఁగు పాదమును పైకిని క్రిందకును నిమిరి, ఏనుఁగు నున్నని రాతి స్తంభము వలె నుండు ననెను.

నాల్గవవాఁడు వచ్చి ఏనుఁగు తోఁకను మాటి మాటికిని నిమిరెను. చివర కుచ్చును నిమిరి ఏనుఁగు కట్టవలె నుండు ననెను. ఈ విధముగ నే యంధుఁ డే యంగమును దైవవశాత్తుగ నిమిరెనో, అది అట్టి స్వరూపము కలదని చెప్పుచుండెను. ఆ యేనుఁగును నిమిరిన వారందఱును గవులే. వారా గజము మీఁద మంచిమంచి పద్యముల నల్లిరి. కాలాంతరమున నీయంధులు చచ్చిరి. ఇప్పుడు వారి శిష్యులును నంధులే. ఇప్పుడు వారు గజమును జూచు ప్రయత్న మొనర్ప లేదు. గురువాక్యము ప్రమాణమని వారు నిర్ణయించుకొనిరి. ఎవఁ డే యంధుని వాక్యములను బ్రమాణమును

ప్రమాణముగఁ దీసికొనెనో, ఆ వాక్యములపై భాష్యము లను రచింపనారంభించిరి. తన గురువు ఏనుఁగు స్తంభము వలె నుండునని చెప్పియుండిన, దానికి నానాతర్క వితర్కములను గావించి, ప్రమాణముల నొసంగి, యితర మతముల సత్యములని చెప్పుచు, స్తంభ స్వరూపమునే ధ్రువసత్యముగఁ జెప్ప నారంభించెను, ఇంకొకఁడు వీని వాదమును ఖండించి అజగర రూపమునే సిద్ధాంత మొనర్ప నారంభించెను.

కుక్కల యొక్క స్వభావమే మనఁగా నపూర్వ వస్తువులను గాంచి మొఱుగుట. ఒక కుక్క మొఱిగినా ఇంకఁ గుక్కలన్నియును మొఱగ నారంభించును. చీఁకటి రాత్రియందొక కుక్కకు దొంగ జాడ యేమైన నస్పష్టముగఁ గనఁబడెనా అది మొఱుగుచుఁ బరువిడును. ఇంతలోనే ఆజాడ లేకపోయినను మిగిలిన కుక్కలన్నియును. మొఱుగనారంభించును. ఇప్పుడెవరైన నాకుక్కలను 'మీరేల మొఱుగుచున్నారు. మీరేమియును జూడలేదు కదా!" యనిన దానికి ఇదే సమాధాన మొసంగును :- "మేము మా స్వభావమునకు వివశులై నాము. మేమేమియును జూడకుండినను. మొదటిది సత్య, అసత్య, అర్ధసత్య, సత్యాభాసములను గాంచి నను మేమా శబ్దముల ననువదించుచున్నాము. ఆ స్వరమున స్వరమును గలుపుచున్నాము."

అజేవిధముగ నా అంధగుహవులల్ప స్వల్పముగ నేనుం గును గాంచి అనుమానించిరి, కాని వారి భాష్యకారులగు శిష్యులు, వారి శబ్దములను గొన్నిటినిఁ ద్రుంచి, కొన్నిటినిఁ బెంచి యితరులతోఁ బోరాడుచుందురు :- "మా గురుపు చెప్పినది సత్యము. మీరంతయు నసత్యమును జెప్పుచు న్నారు. రండు. మాతో శాస్త్రార్థ మొనర్పుఁడు. శాస్త్రార్థ ములలో నొకరు జయించిరా, వారిని హత్య చేయ నారం భించిరి. కలహములు పెరిగెను.

ఇది దృష్టాంతము. ఇఁక దీనికి ద్రాష్టాంతమును జెప్పెదను. బ్రహ్మ ఒక యేనుఁగు. వేదరూపమగు బుద్ధి మంతుఁడు గ్రుడ్డివారగు మతప్రవర్తకుల సమ్ముఖమున దాని నుంచెను. ఇప్పు డేయంధుఁ డేయంశము ననుభవము కావిం చెనో, దానినే సమగ్ర మనుకొని వర్ణింప నారంభించెను. ఆ మతానుయాయులగు భాష్యకారు లనుభవ మొనరించు కొన నవసరము లేకపోయినది. వారి వచనములనే పలుకుచు నితరమతముల వారిని ఖండించుచుఁ దమయొక్క ఏకదేశీయ మతమును మండన మొనరింప నారంభించిరి. కన్నులున్న వారు, అనఁగా నిజమగు భగవద్భక్తులు బ్రహ్మను గాంచు చుందురు, దానిని స్పర్శించు చుందురు. గ్రుడ్డి వారగు నా భాష్యకారుల వాక్యములను విని నవ్వు కొందురు. వారికి దెలియఁ జెప్పుటకైనను బ్రయత్నింపరు. ఏలననఁగా వారు

చెప్పినను వినరు. బాహ్య చిహ్నములపైనను, అల్పశబ్దముల పైనను నిలువఁబడెదరు. దీనినే అంధపరంపర యందురు. ఈ యంధపరంపరా కారణముననే నానా వాదములును, నానామతములును, నానాసంప్రదాయములును, నానామార్గ ములును నడుచుచున్నవి. అందఱును దమదమ మార్గములు సత్యములని ఋజువు చేసికొనుటకే వ్యగ్రులై యున్నారు. స్వయముగఁ దాము సత్యాన్వేషణమును గావింపరు. సర్వ మును గనుగొనరు. దానిపుట్టపై బాదుచుందురు. ఇదియే భగవానుని మాయ. దీనికి విమోహితులై భిన్న భిన్న కర్మలను, భిన్నభిన్న రుచులవారు శ్రేయోమార్గమును భిన్న భిన్న విధములఁ బ్రతిపాదన మొనర్చుచున్నారు.

సూతుఁడిట్లనెను :- "మునులారా! ఉద్ధవుఁడు భగ వాఁనుని బ్రహ్మవాదులు శ్రేయోమార్గము లనేకములుగఁ జెప్పుచున్నారు గదా అవి వారి వారి దృష్టి ననుసరించి అన్ని యును శ్రేష్ఠములా? వానిలో నేదైన నొక మార్గము శ్రేష్ఠ మైనది కలదా?" అప్పుడు భగవానుఁడిట్లనెను:- "మాయా సంబంధమును గైకొని వాద వివాదము లొనర్చిన నచ్చట సత్యమెక్కడిది? నా మాయచే మోహితులగు వారే మత మతాంతర మార్గమున మృగతృష్ణకువలెఁ దిరుగుచుందురు!

కర్మవాదులు కలరు. వారు వేదములను జదివి కర్మ లే పరమ పురుషార్థములని నిశ్చయించిరి. వారి మతమునఁ గర్మ నాలుగు విధములుగ నుండును. నిత్యకర్మ, నైమిత్తిక కర్మ, కామ్యకర్మ, నిషిద్ధకర్మ. నిత్యకర్మలు సంధ్యావందనాది కర్మలు. అవి కర్తవ్యములని భావించి నిత్యమును జేయఁబడునవి. వానినిఁ జేయుటచే నేమియును విశేష ఫలముండదు. కాని వానినిఁ జేయకుండిన దోషము కలుగును.

నిమిత్తము కలిగినపుడు చేయఁబడు కర్మలకు నైమిత్తిక కర్మలని పేరు. ఇంటిలోఁ బిల్లవాఁడు పుట్టినచో జాతకర్మయును, నాందీ ముఖాది శ్రాద్ధము లొనర్చుటయును, మరణించినఁ బిండదానమును శ్రాద్ధాది కర్మ లొనర్చుటయును, గ్రహణము వచ్చినపుడు దాన పుణ్యాది కర్మ లొనర్చుటయును, వారుణీ, మహావారుణీ మొదలగు పర్వములు వచ్చినపుడు గంగాస్నానము లొనర్చుటయును, వేయేల నేదైన నిమిత్తము వచ్చినపుడు చేయఁబడు కర్మలకు నైమిత్తిక కర్మలని పేరు.

ఏదైనఁ గోరికతోఁ జేయఁబడు కర్మలకుఁ గామ్యకర్మలని పేరు. స్వర్గకామనచే అశ్వమేధాది యజ్ఞములును, పుత్ర కామనచే బుత్ర కామేష్టియును, ఏదో కోరికతో

నుండిన నా కోరిక నెఱవేరుటకై ఆ యా కర్మలు చేయఁ బడును. వీనిని మీమాంసకులు కామ్యకర్మలుగఁ జెప్పిరి.

శాస్త్రము నిషేధించిన కర్మల నొనర్చుటకు నిషిద్ధ కర్మలని పేరు. ఉల్లిని దినరాదు. పరస్త్రీగమన మొనర్ప రాదు. దొంగతనము చేయరాదు. దుర్జన సాంగత్యము పనికిరాదు. ఇట్టివి నిషిద్ధ కర్మలు. వీనిని సర్వథా పరిత్యజింప వలయును.

నిషిద్ధ కర్మలను మాని స్వర్గకామనచేఁ గామ్య కర్మలను జీవన పర్యంతమును జేయుమని కర్మవాదులు చెప్పు చుందురు. ఇచ్చట యజ్ఞ యాగాదుల నొనర్చినచోఁ జచ్చి ఉత్తమ లోకములను బ్రాప్తించ వచ్చును. పుణ్యము క్షీణము కాఁగానే, గొప్ప కులీనుఁడగు ధనికుని యింట జన్మించెద వందురు. అచ్చటను గొప్ప గొప్ప యజ్ఞములను జేయుటయును, అక్షయ లోకములను బ్రాప్తించు కర్మలను జేసి ఉత్తమలోకము లనబఁడు స్వర్గాదులందు సుఖము లనుభవింప వలయును. ఇదియే పురుషార్థము. ఇదియే లక్ష్యము. ఇదియే ముక్తి. సమస్తమును గర్మయే.

కొందఱు సుఖజీవితమున సంసారమే మంచిదను చుందురు. ఎంతటి దుఃఖితుఁడగు ప్రాణి యైనను జావుఁగోరఁడు. చీమను జంపఁబోయినను అది తన జీవనరక్ష కొఱకు సమస్త

ప్రయత్నము లొనర్చును. అత్యంత దుఃఖియును, రోగియును జావఁగోరఁడు. పైకి నేను జచ్చిననే మంచిదను చుండినను, లోలోపల జీవితాశ కలిగియుండును. ఈ విషయమున నొక దృష్టాంతము కలదు.

ఒక కట్టెలు కొట్టుకొను వానికి ఉబ్బసము రోగము కలదు. అత్యంత దరిద్రుఁడు. చాల ముసలివాఁడు. ఆతని భార్య చనిపోయినది. యువకుఁడగు బుత్రుఁడును మరణించెను. ఒక యువతియగు విధవ గ్రుడ్డిది తన దగ్గఱనే యుండెను. అతఁడు చాల కష్టపడి అడవిలోఁ గట్టెలను గొట్టుకొని తెచ్చి, వాని నమ్ముకొని యేదో విధమున జీవనము చేయుచుండెను. ఒక దినమున నాతనికి జబ్బు చేయుటచేఁ గట్టెలు కొట్టుటకు పోఁజాలక పోయెను. ఆ దినమున నాతఁ డుపవాసముండవలసి వచ్చెను. మఱునాఁడెట్లో దేకుచు దేకుచు వనమునకుఁ బోయెను. అచ్చటచ్చట గట్టెలను బ్రోవు చేసెను. అప్పటికి రెండు జాములయ్యెను. జ్యేష్ఠమాసము. ఇసుక మార్గము. ఇసుక మండిపోవు చుండెను. ఆతఁడు గొడ్డలిని దీసికొని పోయెను. పైన సూర్యుఁడు మాడ్చుచుండెను. క్రింద ఇసుక కాలుచుండెను. కడుపులో ఆఁకలి మాడ్చుచుండెను. వృద్ధావస్థయును, అశక్తతయును నాతని వదలలేదు. ఆతఁడు భయపడెను. ఎదుట నొక జమ్మిచెట్టుండెను. నీడకొఱకై దాని క్రిందకు రాఁగానే కాలిలో ముల్లు గ్రుచ్చు

కొనెను. కట్టెల మోఁపును దించి, దుఃఖితుఁడై యిట్లనెను. "అయ్యో నాకొఱకు మృత్యువైనను రాలేదే."

ఆ సమయమునఁ దల విరియఁబోసికొని, వికరాళ రూపమును ధరించిన నొక భయంకర ముఖము కల స్త్రీ వచ్చి యిట్లనెను :- "నేనే మృత్యుదేవతను. నీవు పిలువఁగా నేను వచ్చితిని, ఏమనెదవు ?"

ఇది వినఁగానే ఆ కట్టెలు కొట్టువానికి భయము వైచెను. ఆతఁడు మనఃపూర్వకముగ మృత్యువును బిలువ లేదు. మృత్యువు ఎదుటకు వచ్చి యిట్లనెను :- "దేవీ ! నేను జాల అలసిపోయితిని. ఇచ్చట నాకీ మోఁపు నెత్తువారలు లేరు. నాకీ మోఁపు నెత్తుము."

ఇంతకును జెప్పున దేమనఁగాఁ జావవలయునని యెవ రును గోరరు. అందఱకును జీవితము ప్రియమైనది, కాని యీ శరీరము పాంచభౌతికమైనది, అనిత్యమైనది, క్షణభంగుర మైనది. దీనిలో వేలకొలఁదిగ ఛిద్రములు కలవు. ఇది తప్పక నశించును. శరీరము శాశ్వతముగనుండదు. ఎవరి కీర్తి జీవించియుండునో ఆతఁడే నిజముగ జీవించిన వాఁడు. ఈలోకమునఁ బుణ్యమయమగు గీర్తి యెంతవఱకు జీవించియుండునో, అంతవఱకు స్వర్గలోక సుఖములను భోగించును. కావ్యములను రచించు కవులు తమ కీర్తి

ప్రపంచమున నిలిచి యుండుటయే పురుషార్థ మందురు. ఇదియే శ్రేయమైనది. ఎన్నియో పురుగులు లోకములోఁ బుట్టి చచ్చుచున్నవి, కీర్తినిఁ బ్రపంచమున నిలుపుకొనిన వాఁడే జన్మసార్థక మొనర్చుకొనిన వాఁడగుచున్నాడు. ఇచ్చట కీర్తి లేని వానిని స్వర్గమందును నుండనీయరు. ఈ విషయమున నొక కథ యున్నది.

ప్రాచీనకాలమున నింద్రద్యుమ్నుఁడను నొక రాజు కలఁడు. ఆతఁడు లక్షల సంవత్సరములు స్వర్గభోగముల ననుభవించెను. ఆతఁడు స్వర్గమునఁ జాల దినము లుండఁగా స్వర్గమందలి గృహ నిరీక్షకుఁడొక దినమున వచ్చి రాజుతో నమ్రతతో నిట్లనెను :- "రాజా! నీవు స్వర్గమందుండి చాల దినములైనది. నీకు స్వర్గములో నుండవలసిన గడువు సమాప్తమైనది. కావున నిఁక బయలుదేర వచ్చును."

రాజిట్లనెను :- "నా వృత్తి పత్రికలో నీవిషయము వ్రాయఁబడి యుండలేదు."

నిరీక్షకుఁడిట్లనెను :- "నీ వృత్తి పత్రికలోఁ బొరపాటు కలదని కొనుచున్నాను. ఇప్పుడు నీవు స్వర్గమున కధికారివి కావు. ఏలననఁగా నిచ్చటికి వచ్చి చాల దినములైనది."

రాజిట్లనెను :- "మీరు నా సందేహమును దీర్చుఁడు. నేను స్వర్గమున నుండుటకు నా కింకను నవకాశ మున్నదా లేదా ?

నిరీక్షకుఁడిట్లనెను :- "భూమి మీఁద నీ పేరెవరైన నెఱుఁగుదురా ?"

రాజు భయపడి యిట్లనెను :- నా అభియోగము పునరావృత్తి యగునని నాకు దెలియదు. మరల సాక్షులను దేవలయునని తెలియదు. నే నిచ్చటకు వచ్చి కోట్ల కొలది సంవత్సరము లైనది. నా పేరును ఫలాని వారెఱుగుదురని నేను జెప్పఁజాలను."

స్వర్గనిరీక్షకుఁడిట్లనెను :- "రాజా! కీర్తి యుండిన వారి పేరెవరికి దెలియదు. ప్రియవ్రతుఁ డెప్పటివాఁడు ? ఆతని రథచక్రముచే సప్త సముద్రముల నేర్పఱచినాఁడు. ఆతని పేరును గూర్చి పిల్లల నడుగుము. భగీరథుఁ డెప్పటివాఁడు ? ఆతఁడు గంగ నెప్పు డెందులకు తెచ్చినదియు నందఱకును దెలియును. నిమి చక్రవర్తి యెప్పటివాఁడు. కన్నులు కల వారందఱును నిమి చక్రవర్తి విషయము నెఱుఁగుదురు. వ్యాస వాల్మీకాదు లెప్పటివారు ? వారిద్దరి నందఱును నాత్మీయులుగా భావించు చుందురు. వారందఱును బుణ్య లోకములం దానందము ననుభవించు చున్నారు. నేలపై

నొక్కఁడైన నీపేరును దలఁచు చుండిన స్వర్గములో నుండ వచ్చును. ఒక్కని నోట నీ కీర్తి వినఁబడినను స్వర్గము నుండి నిన్ను వెడల నడుపు వాఁడెవఁడును నుండఁడు."

ఇప్పుడు రాజునకు మిక్కిలి చింత కలిగెను. ఇన్ని దినములైన తరువాత నేను సాక్షి నెచ్చటనుండి తేఁగలను ? ఇట్లాలోచింపఁగా నాలోచింపగా నాతనికి స్మరణము కలిగెను :- "మార్కండేయ మహాముని చిరజీవి. అతనికి కల్పముల కొలఁది ఆయువు కలదు. బహుశః ఆతఁడు నాపేరును నెఱిఁగి యుండవచ్చును. అని ఆలోచించి ఆతఁడు స్వర్గ నిరీక్షకునితో నిట్లనెను :— "మంచిది. నేను బృథివిపై నెవరినైన సాక్షిగా దేఁగలను" ఇది విని నిరీక్షకుఁడు తన విమానమును బిలిచెను. ఇద్దరును దానిలోఁ గూర్చుండి బయలు దేరిరి.

మార్కండేయ మహర్షి ఒక చెట్టుక్రిందఁ గూర్చుండి తప మొనర్చుకొనుచుండెను. ఇద్దరును ముని చరణములకు నమస్కరించిరి. అంత రాజిట్లనెను :- "స్వామీ ! మీరెన్నడైన నింద్రద్యుమ్నుఁడను రాజు నెఱుఁగుదురా ?" ముని యిట్లనెను :- "నేను చాలమంది రాజుల పేర్లను విని యున్నాను. అందఱిపేర్లను నాకు గుర్తులేవు. నేనెల్లప్పుడును

దపస్సులో నుందును, కావున నెవఁడెచ్చటి రాజో నాకు గుర్తుండదు."

రాజిట్లను కొనెను :- "ఈ సాక్షి సరిగాఁ జెప్పలేదు. ఈ సాక్షి వలన నేను స్వర్గాధికారిని గాఁజాలను." అని యాలోచించి ఆతఁడిట్లడిగెను :- "స్వామీ! మీవలెఁ జిరంజీవిగా నుండిన వ్యక్తి నెవరి నైనను జెప్పఁ గలరా?"

మార్కండేయ మహాముని యిట్లనెను :- "నాకంటెఁ బెద్దది ఈ మడుగు సమీపమున నొక కొంగ యున్నది. మీరు దానిని నడుఁగుడు.

ఇది విని యిద్దరును మునికిఁ బ్రణామమును గావించి ఆ కొంగ దగ్గఱకు బోయిరి. రాజు దానిని గూడ యిదే ప్రశ్న నడిగెను :- "అయ్యా! నీవు ఫలాని దేశపు రాజు ఇంద్రద్యుమ్ను నెఱుఁగుదువా? ఆతని విషయమును వింటివా?"

కొంగ యిట్లనెను :- "మహానుభావా! నేను చాల వృద్ధుఁడ నైతిని. నాకిప్పుడంతగా స్మరణశక్తి లేదు. విని యుందునేమో! నాకు సరిగా జ్ఞాపకము లేదు".

రాజు ప్రాణ మారిపోవుచుండెను. ఎవరును సాక్షులు దొరకకపోయినచో, నేను స్వర్గమునుండి పతనము కావలసి

వచ్చును. కావున నాతఁడిట్లనెను :- "మంచిది నీ వంటి వ్యక్తి యెవరైన నుండినచోఁ జెప్పుము."

కొంగ యిట్లనెను :- "ఫలాని సరోవరమున నొక తాఁబేలు నివసించుచుండు. అది నాకంటెను పెద్దది. దానిని బోయి అడుగుఁడు. బహుశః అది మీ ప్రశ్నలకు సమాధాన మీయఁ గలదు."

ఇది విని సరోవరము కడకు ఇద్దరును బోయిరి. రాజు తాఁబేలుతో నిట్లనెను :- "మహాభాగా! నీవు చిరంజీవివి కదా! నీవు ఇంద్రద్యుమ్న మహారాజు నెఱుగుదువా? ఎప్పుడైన నాతని పేరును వినియుంటివా?"

తాఁబేలు అత్యంత శ్రద్ధాభక్తులతో నిట్లనెను:- "తేజ స్వియగు నో మహానుభావా! నీవెవఁడవు? ఇంద్రద్యుమ్న మహారాజు నామము నెవరెఱుఁగరు? నేనిప్పుడుండెడు సరో వర మాతఁడు నిర్మించినదే, దీని కింద్రద్యుమ్న సరోవరమని పేరు. ఆ రాజర్షి యీ యగాధజలము గల సరోవరమును నా యెదుటనే త్రవ్వించినాఁడు. బంగారుతో రేవులు, మెట్లను గట్టించినాఁడు. ఆతఁడు స్వర్గవాసి కాఁగానే ఆతని వంశజులగు రాజు దీనిని బాగుగాఁ జూచుచు జీర్ణోద్ధారమును గావించి నాఁడు. దీని ఘట్టము మరల వెండితోఁ గట్టఁ బడెను. తర్వాత నిత్తడితోఁ గట్టఁబడినవి. ఇప్పుడు రాళ్ళతోఁ గట్టఁ

బడియున్నది ఇప్పుడు చిరకాలము నుండి రాజు యొక్క వంశజు లెవరును లేరు. ఈ ఘట్టములను మరల గట్టించిన వాఁడే లేఁడు. మెట్లన్నియును జగిలిపోయినవి. అయినను నాతని విమల కీర్తి యీ సరోవరము మూలమున స్వర్గము వఱకును వ్యాపించియున్నది.'' ఆ తాఁబేలు ఇట్లు చెప్పు చుండఁగనే వేలకొలఁది ఆవులు వచ్చి, యథేష్టముగ జలమును త్రావి వెడలిపోయెను. దీనినిఁ గాంచి స్వర్గ నిరీక్షకుఁ డిట్ల నెను :- ''రాజా! ఈ సరోవరమున నొక్క బిందువైనను నుండు వఱకు ప్రజలు నీ నామమున నీ సరోవరమును బిలుచు చునే యుందురు. అంతవఱకును నిన్ను స్వర్గము నుండి యెవరును నెట్టివేయఁజాలరు. నీవు సుఖముగ స్వర్గమున నివసింప వచ్చును.''

ఇంతకు జెప్పున దేమనఁగా లోకమందు కీర్తియుండు టయే నిజమగు జీవనము. దానిలోనే స్వర్గమున్నది. దాని లోనే సుఖమున్నది. కావునఁ జాలమంది కీర్తినే సర్వోత్తమ శ్రేయమని పలుకుచుందురు.

ప్రపంచమునఁ గామమే అన్నిటికంటె గొప్ప సుఖ మని కొందఱనుచుందురు. బ్రహ్మచింతనమున నేమి సుఖ మున్నది. దాని నెవరును జూడనే చూడ లేదు.

అది ఆకాశకుసుమము వంటిది. కేవలము చెప్పుటకే పనికివచ్చును. కామసుఖానుభవ మందఱకును గలదు. ప్రపంచమున గొప్పగొప్ప ఆపత్తులను గామసుఖముకొఱకే సహించుచుండెదరు. ఒక్క కుక్క కలదు. దాని శరీరమంత యును గ్రుళ్ళిపోయినది. పురుగులు పడినవి. కడుపునిండ అన్నమును దొఱకుటలేదు. కాని క్షణకాలము దానికి కామ సుఖము లభించినది సుఖమును బొందును. గొప్ప గొప్ప మునులు వేలకొలఁది సంవత్సరములు తపస్సును జేయుచు బ్రహ్మచింతనము నొనర్చుచుందురు. అప్సరస కనఁబడినా పతనమగుదురు. కామములో నింతటి సుఖము లేకుండినచో, వేలకొలఁది సంవత్సరములు తపస్సును జేసిన తరువాతను మనస్సు వారివైపుల కేల పరుగిడును ? కామముచే సమాధి కలుగును. తన కిష్టమగు స్త్రీ పతికి లభించినను, స్త్రీకి పతి లభించినను దానికి మించిన సుఖమును, గల్యాణమును, మోక్షము లేక ఆనందమును నింకొకటి లేదు. అందువలన వాత్స్యాయనాది మునులు కామశాస్త్రమును రచించిరి. అందులోఁ గామము శ్రేయస్సాధనమని చెప్పిరి. కామసేవన మెట్లు చేయవలయునో దానివిధిని గూర్చియును జెప్పిరి. వారి మతమునఁ గామమే పరమశ్రేయము.

కొందఱు అహింసగా నుండుటయును, సత్యమును బలుకుటయును, దొంగతనమును జేయకుండుటయును, బ్రహ్మ

చర్యముతో నుండుటయును, ఎక్కువగా ధనసంగ్రహ మొనర్పకుండుటయును, పవిత్రముగ నుండుటయును, సంతోష ముగ నుండుటయును, మంత్రజప మొనర్చుటయును, ఈశ్వర విశ్వాసమును గలిగియుండుటయును, మనస్సు, ఇంద్రియము లను దమన మొనర్చుటయును, ఇవియే పురుషార్థమను చుందురు. సమస్త దిక్కులనుండి చిత్తవృత్తులను నిగ్రహించి, తన స్వస్వరూప చింతన మొనర్చుటయే పరమ పురుషార్థము. ఈ విషయమునఁ బతంజలి మొదలగు మునులు విశుద్ధ వివేచన మొనరించిరి. వారందఱును విశేషబలము ఇంద్రియ ములను, మనస్సును సంయమ మొసంగుట కొసంగిరి.

కొందఱిట్లందురు :- "శరీరము నెండించుట బాధ పడుటకే. ఇచ్చట నేకర్మ చేసిన క్లేశము కలుగునో, దాని వలనఁ బరలోకమున నేమి సుఖము లభింపఁ గలదు! కావున మన ఐశ్వర్యమును బెంపొందించు కొనవలయును, అందఱను శాసించుము, ప్రభావశాలివికమ్ము. దండనీతి కారు లైశ్వర్య మునే ముఖ్యమని చెప్పిరి. వారు వారి శాస్త్రములలో సామ, దాన, భేద, దండోపాయములను గూర్చి విస్తారముగ వర్ణిం చిరి. శత్రువు నిట్లు చూపించిన నాతని యైశ్వర్యమును హరింప వచ్చుననియు, దన యైశ్వర్యమును స్థాపింప వచ్చు ననియు ననుకొను చుందురు. ప్రపంచమున నైశ్వర్యశాలు గుటయే అన్నిటి కంటె గొప్ప సుఖమని భావించెదరు.

ఐశ్వర్యప్రాప్తికొఱకే ప్రయత్న మొనరింప వలయును. ఎవని కెంతటి యైశ్వర్య మెక్కువగ నుండునో వారి కంతటి గొప్ప దనము వచ్చును.

కొందఱు స్వర్గ నరకములు లేనే లేవందురు. పర మాత్మ పరబ్రహ్మ నెవరును జూడనే లేదు. ఉన్నదేమో యీ శరీరమే. శరీరమందలి జలము నశించినచో నింకేమియు నుండదు. చచ్చినవారికి శ్రాద్ధాదు లొనర్చుటయును, బ్రాహ్మణులకు భోజనమిడుటయును నంతయును మిథ్యయే. అంతయును దంభమే. కొందఱు మాయా, ధూర్త నిశాచరులు తమపొట్టను నింపుకొనుటకై వేదపురాణములను సృజించిరి. వానికి మాటమాటికిని బ్రాహ్మణ భోజనమని యుండును. తద్దినమున బ్రాహ్మణ భోజనము. పిల్లవాఁడు పుట్టిన బ్రాహ్మణ భోజనము, చచ్చినచో బ్రాహ్మణ భోజనము, బ్రాహ్మ ణులకు భుజింపించినఁ బరలోకమున నుండిన ప్రేతమునకు బొట్టనిండినచో యాత్రకు బోవునపుడు మనము బియ్యమును, పప్పును, ఉప్పును, నేయి, కూరలను గట్టుకొనిపోవు టెందు లకు ? బ్రాహ్మణున కిచ్చుట పెట్టినచో యాత్రలో మన కడుపునిండవలయును గదా ? కాని అట్లు జరుగుటలేదు. ఇంటిలో భోజనము పెట్టిన యాత్రలో మనకు లభింపకపోయి నచోఁ బరలోకమున నుండినఁ బ్రేతమున కెట్లు లభింపఁ గలదు తర్పణమునఁ బితరులు తృప్తినిఁ జెందినచో రెండు

జాముల వేళ పొలములోఁ బనిచేయువానికి నీరు తీసుకొని పోవలసిన నవసరమేమియుండఁగలదు. పొలములోఁ బని చేయువానికి బాగుగా దాహమైనపుడు, ఒక బ్రాహ్మణుఁడు కడుపునిండఁ జల్లని జలమును దాగినచోఁ బొలములోని వారికందఱకును దప్పిక తీరకుండినఁ బరలోకగతులగు పితరుల దప్పిక యెట్లు తీరఁగలదు ? పరలోకములును, వేదమును, యజ్ఞ యాగాదులును, లేనేలేవు. ఏ విధముగ నైనను నీ శరీరముసుఖముగ నుంచుకొనుటయే పరమ పురుషార్థము. పరలోకము నెవరును జూడలేదు అది ఆకాశ పుష్పము, కుందేలు కొమ్ము, వంధ్యాపుత్రుఁడు, బూరుగు పుష్పము, చెఱకుపండు, చందనము యొక్క అర్థస్ఫుటిత కళికవంటిది. కావునఁ బరలోక చింతను వీడి సర్వప్రయత్నముల ద్వారా యీ శరీరమును బరిపుష్టమొనర్చుకొనవలయును. ఇంటిలో ధనము లేకుండినచో ఋణమును దీసికొని వచ్చి నేతిని గొనుము. దానిలోఁ బిండిచక్కెర పాకమొనర్చి హాలువాను జేసికొని కడుపునిండఁ దినుము. అదియే పరమార్థము, ఇప్పుడు ఋణ మిచ్చినవాఁడు దీసికొన్న దేమున్నది ? అప్పును దీర్పకుండినఁ బాపమనినచోఁ బాపమనునది లేదని లేదని వాదించుము. పొట్టను నింపుకొనకఁ బోవుటయే పాపము. ఏయుపాయముచే నైనను దానిని నింపుటయును, అలంకరించుటయును, బల మొనర్చుటయును నిదియే

పుణ్యము చచ్చినవాఁడు మరలి రాఁడు. కావున శరీరమును సుఖ పెట్టుటయును, దన తోటివారికి బాగుగాఁ బెట్టుటయును జీవితము యొక్క యేకైక లక్ష్యము.''

కొందఱిట్లను చుందురు :- ''అట్లు కాదయ్యా! పర లోక మొకటి కలదు. అది శరీరపోషణము చేతనే లభించు నది కాదు. అగ్నిహోత్రము, దర్శపూర్ణమాస్య, చాతు ర్మాస్య, పశుయజ్ఞము, సోమయజ్ఞము మొదలగు వ్రతముల నొనర్పవలయును. కృష్ణాష్టమి, శ్రీరామ నవమీ, ఏకాదశీ, మొదలగు వ్రతముల నొనర్ప వలయును. కృచ్ఛ్ర, చాం ద్రాయణాది తపముల నొనర్పవలయును. దాన మొసంగ వలయును. యమ నియమములను బాగుగాఁ బాలింప వలయును.

శ్రీకృష్ణభగవానుఁడు తన సఖుఁడగు నుద్ధవునితో నిట్లనెను :- ''ఉద్ధవా! యమ, నియమ, దాన, వ్రత, యజ్ఞ వివిధ తపస్సులును, ఇతర పుణ్యకార్యములను జేయుటచే నే లోకము ప్రాప్తించునో అవన్నియును బరిణామమున దుఃఖమును గలుగఁ జేయును. పుణ్యము పూర్తి కాఁగానే ఆ లోకము నుండి త్రోసివేయఁ బడుదురు. సువర్ణముతోఁ జేయఁబడిన వస్తువు లన్నియును సువర్ణ గుణము కలిగియే యుండును. చక్కెరతోఁ జేయఁబడిన వస్తువు లన్నియును

దీపికనే యుండును. మట్టితో నెట్టి సుందరమగు పాత్రను జేసినను నది పృథివి గుణము కలదిగనే యుండును. ఇదే విధముగఁ గర్మముల ద్వారా నీవు బ్రహ్మలోకము వఱకు పోయినను, ఇంకను స్వర్గలోకములకుఁ బోయినను అవి క్షయిష్ణువులే కాఁగలవు. చూచుటకవి తత్కాలమున సుఖము నొసంగునవిగఁ గనఁబడును. కాని వాని పరిణామమున దుఃఖమే ప్రాప్తించును. ఆరంభించిన కర్మలన్నియును దోషయుక్తములే. కావున నీ మోహజనక, క్షణికానందమును గలిగించు కర్మలు దోషయుక్తములే. కావున నీ మోహజనకములును, స్వల్పానందము నొసంగునవియు, శోకవ్యాప్తములైనవై యుండును.''

ఉద్ధవుఁడిట్లనెను :- ''స్వామీ! శాశ్వత సుఖము దేనివలన లభింపఁగలదు ?''

భగవానుఁడిట్లనెను :- ''ఉద్ధవా! సమస్త సాంసారిక భోగములందు నిరపేక్షుఁడవు కమ్ము. అది తీసికొనిరమ్ము ఇది తీసికొనిరమ్ము. దానినిఁ జేయుము. దానినుంచుము. దీనిని సంగ్రహించుము. దానిని రుచిచూడుము. అనునట్టి విచారములను మనస్సునుండి పారఁద్రోలుము. నాయందే చిత్తము నుంచుము. నా రూపమందును, నా చింతన మందును నిరంతరము తల్లీనమై యుండుము. నా యందే నిరంత

రము రమించుచుము. అప్పుడే అట్లు నే యు వానికి యథార్థమగు సుఖము లభింపఁ గలదు. ఏలనఁగా సుఖస్వరూపుఁడను నే నొక్కఁడనే. విషయములలో సుఖమెక్క డిది ? కావున నా స్మరణ మొనర్ప వలయును. నా ధ్యానము నొనర్ప వలయును. నాయందే మనస్సు నుంచుము. అదియే భక్తి దాని నెవరు పొందిరో, దాని ముందు బ్రహ్మలోకము వఱకు సమస్త సుఖములును తుచ్ఛము లగును. అట్టి వాఁడే నిర్భయుఁడు. అట్టి వాఁడే నిఃస్పృహుఁడు."

ఉద్ధవుఁడిట్లనెను :- "ప్రభూ ! ఈ ప్రసంగము చాల సరసముగ నున్నది. దీని నెంతగా విన్నను నాకు తృప్తి జనించుట లేదు. దయతో నాకీ విషయమును స్పష్టముగఁ జెప్పుడు. మీ భక్తు లెట్లుందురు ? వారి కే కోరికలుండును ? వారి వేష భావ లెట్లుండును ?"

ఇది విని భగవానుఁడు నవ్వి యిట్లనెను :- "ఉద్ధవా! భక్తులను గూర్చి చెప్పు చుండిన నాకు మిక్కిలి ఆనందము కలుగుచుండును. భక్తులు నా కత్యంత ప్రియులు. భక్తులే నాకు సర్వస్వము. వారి విషయమున నీకెంత కావలయు నన్నను నావలన వినవచ్చును. సరే, ఇప్పుడు నేను నీకు భక్తులను గూర్చి చెప్పెదను."

సూతుఁడు శౌనకాది ఋషుల కిట్లనెను :- మునులారా ! మీరు రసజ్ఞ భక్తులు. భగవద్భక్తియే మీ జీవితములకు బరమ లక్ష్యము. ఆ విషయమున నారాధ భక్తిని గూర్చియు, దానిని ధారణ మొనర్చు భక్తుని గూర్చియు మీరు శ్రవణ మొనర్పుఁడు."

—//—

## భక్తోత్కర్ష

శ్లో॥ నిరపేక్షం మునిం శాంతం నిర్వైరం సమదర్శనమ్ ॥
అనువ్రజామ్యహం నిత్యం పూయేయేత్యంఘ్రిరేణుభిః ॥
శ్రీభాగ. ౧౧ స్కం. ౧౪ అ. ౧౬ శ్లో ॥

వ॥ దేహాభిమానంబు వర్జించి యైహికాముష్మిక సుఖంబులఁ గోరక మనంబు గుదియించి యెప్రొద్దు నన్ను దలంచు వాఁడు వైకుంఠపద ప్రాప్తుండగు నేను నతని విడువఁ జాలక వెనువెంట నరుగుదు."

శ్రీమదాంధ్ర భాగవతము.

కొందఱు భాగవత కథలలోఁ బునరుక్తి దోషమును జెప్పుచుందురు. వారిట్లను చుందురు :- 'ఈ కథలన్నిటిలో మాటి మాటికిని ఒకే విషయమును జెప్పుచున్నారు. ఒకే

దృష్టాంతము మాటి మాటికిని యీయఁబడుచున్నది. ఒకే విషయమును బిష్టపేషణ మొనరించుచున్నారు' ప్రపంచమున నేవిషయమునఁ బిష్టపేషణము లేదని మే మడుగు చున్నాము శ్వాసను మాటిమాటికినిఁ దీసికొనుచున్నాము. ప్రతి దినమును నిద్రపోవుచునే యున్నాము. నిత్యమును నట్లే లేచు చున్నాము. నిత్యమును నదే విధముగ సూర్యుఁ డుదయించు చున్నాఁడు. నిత్యమును నొకే అన్నమును మాటి మాటికినిఁ దినుచున్నాము. నిత్యమును నొకే నీటిని మాటి మాటికినిఁ ద్రాగుచున్నాము. నిత్యమును దారాపుత్రుల నొకేవిధముగఁ బ్రేమించుచున్నాము. పిల్లవాఁడు కనఁబడినపుడు చంకలోనికిఁ దీసికొని వాని ముఖమును మాటి మాటికిని ముద్దుపెట్టు కొననేల ? ఒక్కసారి చాలదా ? ప్రపంచమున నన్నియును బునరావృత్తి జరుగుచుండఁగా భాగవతకథ లందు పునరుక్తి వచ్చిన దోష మేమున్నది ? ఆశ్చర్యమే మున్నది ? సమస్త శాస్త్రముల సారము రెండు విషయములలోనే కలదు. సచ్చిదానంద భగవానుఁడే సత్యము. ఆతని భజన మొనర్చుటే సారము. ఈ విషయము నొక్క దానినే శాస్త్ర మనేక యుక్తుల చేతను, అనేక దృష్టాంతముల నొసంగియు, ననేక వాదములను జెప్పియును, బ్రతివాదన మొనర్చు చున్నారు. ఒకే విషయమును పెద్ద పెద్ద గ్రంథములు చెప్పుచుండిన నది పునరుక్తి కాక యింకేమి కాఁగలదు ? భగవానునకు భక్తుఁ

డత్యంత ప్రియుఁడు. ఆతనిఁ బొందుటకు భక్తియే ఒక సరళ సుగమ సాధనము.

సూతుఁడిట్లనెను :- "మునులారా! ఉద్ధవుఁడు భక్తుల సంబంధమునఁ బ్రశ్నింపఁగా భగవానుఁడిట్లనెను :- "ఉద్ధవా! నా భక్తులు నిస్పృహులగుదురు వారు నన్ను గాక యింకేదియునుఁ గోరరు. భక్తులై యింకేదైన నాశించినచో నది వ్యాపారము కాని భక్తి కాదు. భక్తిని సామగ్రిగాఁ జేసికొని దానిచే ధనమును సంపాదింపఁ జూచుచుందురు. ఒకఁడన్నము వ్యాపారము, వస్త్ర వ్యాపారము, ఉప్పు వ్యాపారము, గుణవ్యాపారము, ఇతర సాంసారిక వస్తువుల వ్యాపారమును జేయును. కొందఱు భక్తి వ్యాపారమును జేయుచుందురు. వారి కోరిక భగవంతునిఁ బొందుట కాదు. వారు ధనమును సంపాదించుటకు కృష్ణకథను సాధనముగఁ జేసికొందురు. ధనమును గోరిన నది లభించును. ధనమును గోరక నన్నే కోరువారికి నేను మాత్రమే లభింపఁగలను.

ఎవఁడు మనస్సును, నింద్రియములను వశమొనర్చుకొని యున్నాఁడో, ఎవని బుద్ధి విషయ విలోకనముచే విచలితము కాదో వాని కేదుఃఖమును లేదు. శోకము లేదు. చింత లేదు. భయము లేదు. వారు నిర్భయులై ప్రపంచ

మునఁ జరించు చుండెడివారు. ఎవఁడైన వానిని భగవత్స్మరణము నాపి బ్రహ్మ పదమును గైకొనుమనినచో నాతఁడు బ్రహ్మపదమును గాలదన్నును. ఆతఁడు దానివైపు కన్నెత్తియైనను జూడఁడు. ఆతఁడిట్లనును :– "నేను బ్రహ్మనై యేమి చేయుదును? వృథాగా బ్రహ్మాండ భరణ చింత నా శిరస్సునఁ బడును. నేను హంసపై నెక్కి అటు పోవలయును, ఇటు పోవలయును, పుత్రచింత కలవారిని, పౌత్ర చింత కలవారినిఁ జూడవలయునను జంజాటము నాకేల? నాకు శ్రీకృష్ణ చింతన సుఖము కావలయును." కావున నాతఁడు బ్రహ్మయగుట కెన్నడును మనస్సుననైనఁ గోరఁబోఁడు.

ఆతఁడు బ్రహ్మపదమునే కాలఁదన్నిన నింద్రపదవి నేల ఆశించును? ఇది శాశ్వతము కాని క్షయిష్ణుపదవి. ఎవఁడైన నాతనితో 'నీవు సార్వభౌముఁడవయ్యెద' వనిన నాతఁడు దానినిఁ దిట్టుగఁ భావించును. సమస్త భూమండలాధిపత్యము స్వప్నమందైనను నాకాంక్షింపఁడు. ఎవఁడైఁన స్వర్గము, బ్రహ్మపదము, సార్వభౌమపదము, ఇతర పదవులు కాకున్నను నిచ్చుటనే యుండి సమస్త సిద్ధులను బ్రాప్తించుము, అణిమా, గరిమా, మహిమా, ఈశిత్వము, వశిత్వము, మొదలగు సిద్ధుల నుపభోగించుము. భగవానుని ఇదే అడుగుచునిన నీ ఆదాన ప్రదానముల

నాతఁడు భక్తికి గొప్ప ప్రతిబంధకముగ భావించును. ఈ సిద్ధులు భగవానుని విముఖము కావించునవి. జీవుని గర్వమును బెంచునవి. కావున భక్తుఁడు సాంసారిక సంబంధమగు నేవస్తువును గాని, ఏ సిద్ధిని గాని, ఏ గొప్ప పదవిని గాని కోరఁడు. చివర కాతఁడు మోక్షమునైనఁ గోరఁడు. నాదర్శనము లేనట్టియు, నా నిత్య సాన్నిధ్యము లేనట్టి మోక్షమును గాలఁదన్నెదరు. నా భక్తుఁడు నన్నుఁ గోరును. నాగుణ శ్రవణము, నానామ గానమును, నా స్వరూపధ్యానమును నాహారముగఁ దలచును. కావున నాతఁడు సదా వ్యాకులుఁడై యుండును. అందువలన భక్తజనులు నా కత్యంత ప్రియులు.''

ఉద్ధవుఁడిట్లడిగెను:- ''ప్రభూ! భక్తుఁడు మీ కెంతటి ప్రియుఁడు, ఎట్లు ప్రియుఁడు? కమలాసనుఁడగు బ్రహ్మ వలెనా?''

భగవానుఁ డిట్లనెను:- ''ఉద్ధవా! ప్రపంచమునఁ బుత్రుఁడు మిక్కిలి ప్రియుఁడుగ నుండును. పుత్రుఁడు తన యాత్మయే. ప్రపంచమున జనులు అయోగ్యుఁడగు బుత్రునే ప్రేమించెదరు. ఇఁక సర్వగుణ సంపన్నుఁడును నాజ్ఞాకారి యగు బుత్రుని విషయము చెప్పనేల? బ్రహ్మనాకు యోగ్యుఁ

డగు బుత్రుండే. ఆజ్ఞాకారియే. కాని నేను నా భక్తులను ప్రేమించి నట్లు ఆతనిఁ బ్రేమింపను."

ఉద్ధవుఁ డిట్లనెను :- "అయితే మీకు శంకరుని మీఁదఁగల ప్రీతి భక్తునిపై నుండునా ?"

భగవానుఁ డిట్లనెను :- "ఉద్ధవా ! పుత్రుని కంటెను బౌత్రుఁడు ప్రియుఁడు. పౌత్రుఁడు తన పదవినందుకొని, సర్వ సమర్థుడైన నింకఁ జెప్పవలసిన దేమున్నది ? శంకరుఁడు పరమైశ్వర్యశాలి. సర్వసమర్థుఁడు. పరమేశ్వరుఁడు. కాని ఆతఁడును నాకు భక్తుఁడంత ప్రియుఁడు కాఁడు."

ఉద్ధవుఁ డిట్లనెను :- "మీరు భక్తులను మీ అన్న యగు బలరామునివలె నాదరించెదరా ?"

భగవానుఁ డిట్లనెను :- "సంకర్షణుఁడు మాఅన్నయే ఆతని నేను మిక్కిలి ఆదరించెదను. హృదయ పూర్వకముగఁ బ్రేమించెదను. కాని ఆతఁడును నాకనన్య భక్తులంత ప్రీతి పాత్రుఁడు కాఁడు."

ఉద్ధవుఁడిట్లనెను :- "స్వామీ ! అందఱుమీఁదను మమతయుండును, ఉండవలయును. ప్రపంచమునఁ దన కను కూలవతియును, అత్యంతానురాగము నుంచునదియు నగు దన అర్థాంగిని ప్రియముగ నుండును. కావున నామెను

జీవనసహచరిగను ప్రాణప్రియగను, ప్రియతమగను జెప్పు చుందురు. లక్ష్మి మిమ్ములను మిక్కిలి ప్రేమించును. ఒక్క క్షణమైనను మీ పాదపద్మములను వదలి యుండదు. తన మృదువగు నూరువులమీఁద మీ చరణారవిందమును బెట్టుకొని, తన కరకమలములచేతను, సన్నని వ్రేళ్ళచేతను నెమ్మది నెమ్మదిగ నొత్తుచుండును. భక్తులు మీకామెతో సమానముగఁ బ్రియులేనా ?"

ఇది విని భగవానుఁడు నవ్వి యిట్లనెను :- ఉద్ధవా ! నీవు చెప్పునది సత్యమే. కామినిని గామధురా, గృహమేధ ధేనువనిరి. ఆమె కల్పలతయే. ఆమె సమస్త సుఖముల నొసంగును. ఆమెను ననురాగస్రోతయని చెప్పుచుందురు. కావున లక్ష్మీదేవి నాకు మిక్కిలి ప్రియమైనది. కాని నాకు భక్తునిమీఁదఁగల ప్రీతి ఆమెమీఁద లేదు."

ఉద్ధవుఁడిట్లనెను :- "స్వామీ ! భక్తుఁడు నీకు బ్రాణముల వలెఁ బ్రియుఁడని నేను గ్రహించితిని. ప్రపంచమున నే ప్రియముండినను దన ప్రీతి కొఱకే యుండును. ప్రాణముల కంటె నధిక ప్రీతికరమగు వస్తువింకొకటి లేదు."

భగవానుఁడిట్లనెను :- "ఉద్ధవా ! నీవు చెప్పునది నూటికి నూఱుపాళ్లు సత్యము. ప్రాణ మన్నిటికంటెఁ బ్రియమైనదే కాని నాకు నా భక్తుఁడు నా ప్రాణముల కంటెను

ప్రియమైన వాఁడు. నాప్రాణములకు ప్రాణము. నాకు పరమ ధనము. భక్తుఁడే నా యిష్టదైవము. అధికముగ నేమి చెప్పఁ గలను? భక్తుఁడే నా సర్వస్వము, భక్తులకును నేను బరతెంతు వెనువెంట గోవువెంటఁ దగులు కోడెభంగి,"

ఉద్ధవుఁడిట్లనెను :- "స్వామీ! కోడెదూడ పాలు త్రాగుటకు దిరుగును. దూడకంటె నెక్కువ ప్రీతి గోవున కుండును."

భగవానుఁడిట్లనెను:- "నేనాతని వెనువెంట, స్వామి వెంట దిరుగు సేవకుని వలెఁ దిరుగుచుందును."

ఉద్ధవుఁడిట్లనెను :- స్వామీ! సేవకుఁడు వేతన లోభమున స్వామి వెనువెంటఁ దిరుగు చుండును."

భగవానుఁడిట్లనెను :- "నాకును లోభము కలదు. నేనును నాతని వెంట స్వార్థముచేఁ దిరుగు చుందును. నే నెన్నడును నాతనికి ముందుగాఁ బోను. వెనుక పోవు చుందును."

అంత శౌనకుఁడిట్లడిగెను :- "సూతా! భగవానుఁడు భక్తుని వెంట ఏల తిరుగు చుండును?"

సూతుఁడిట్లనెను :- స్వామీ! భగవంతున కెల్లప్పుడును. భక్తుని చింతయే. ఆతని కుండు చింత తల్లికి పుత్రుని

మీఁదనైన నుండదు. తల్లి చేతితో నేదైనఁ బనిచేయు చుండి నను, ఆమె చిత్తము మాత్రము పుత్రుని మీఁదనే యుండును. పిల్లవాఁడు తన కంటికి కనఁబడక పోయెనా, ఆమెకు అనిష్టశంక కలుగును. కావున భగవానుఁ డెన్నఁడును భక్తుని వదలఁడు. భగవానుఁడు భక్తుని వెనుక నుండు టేలననఁగా వెనుక కన్నులు లేవు కదా! తన భక్తుని వెనుక నుండి ఎవ రైనఁ బ్రహారమును గావించెద రేమోనని అతని భయము. రెండవ కారణ మేమనఁగా భక్తుఁడు భగవానున కత్యంత ప్రియమైనవాఁడు. ముందుకు వచ్చినచో భక్తుని భగవా నుఁడు బాగుగాఁ గాంచును. అప్పుడు భక్తునిఁ జూడఁగనే భగవంతునకు సమాధిరాఁగలదు. అప్పుడాతఁడు నడువఁ జాలడు. అందువలన నాతని వెనుక భాగమున నడుచును. మూఁడవ కారణ మేమనఁగా భగవానుఁడు తాను భక్తుని కంటెఁ దక్కువ వాఁడనని భావించును. కావునఁ బెద్దవారికి వెను వెనుకనే పోవుచుండవలయును. ఆతనికి వీపును జూపి నడువను రాదు, కూర్చుండను రాదు, నాల్గవ కారణ మేమ నఁగా భక్తుఁడు మిక్కిలి సంకోచము కలవాఁడుగ నుండును. భగవానుఁడు భక్తుఁడే గొప్పవాఁడని తానను కొను చుండి నను భక్తుఁ డాతనిఁ దన ఆరాధ్య దైవము గను సర్వస్వము గను దలఁచును. భగవానుఁడు ముందు నడచినచో భక్తుఁ డాతని అడుగుల మీఁద నడుగులను బెట్టఁడు. ఆ చరణ

ములపై పడుగు నిడకయే అటు నిటు నడుచుచుండును. కావున భగవానుఁ డాతని సంకోచమును దూర మొనర్చుటకై భక్తుని వెనువెంటఁ బోవుచుండును. ఈ యనుభవము భగవానునకు వనములోఁ గలిగెను."

శౌనకుఁడిట్లనెను :- "సూతా! వనమందు భగవానునకే యనుభవము కలిగినది ?"

సూతుఁడిట్లనెను :- "స్వామీ! చిత్రకూటము నుండి భగవానుఁడు దండకారణ్యమునకుఁ బోవుచుండఁగా నాతఁడు ముందు పోవుచుండెను. ఆతని వెనుక జగజ్జనని యగు సీత, ఆ తరువాత యతివరుఁడగు లక్ష్మణుఁడును బోవుచుండెను. జానకీదేవి చాల జాగ్రత్తగాఁ బోవుచుండెను. ఆమెకు నిమిష నిమిషమునకును భగవానుని చరణారవిందములపైఁ దన పాదము పడునేమో నను భయము కలదు. అందు వలన నట్లుగాక కుడియెడమలుగ నడుచుచుండెను. లక్ష్మణుఁడు జానకి కంటెను మిక్కిలి జాగ్రత్తగ నడువ వలసి వచ్చెను. ఆతఁడు సీతారాముల చరణారవిందములను రెంటిని దప్పించుకొన వలసి వచ్చుచుండెను. ఏల ననఁగా నాతని కిద్దరును నిష్టదైవములే. కొంత దూరమునకు బోఁగనే భగవానునకు జ్ఞాపకము వచ్చెను. ఆతని నవనీత కోమలహృదయముకఱగ నారంభించెను. ఆతఁడిట్లను కొనెను :- "వీరి ధ్యానమంతయును

నా పాదములను జూచుచు నడుచుచుండినచో నీ వనశోభ నెట్లు చూడఁగలరు? సుఖానుభవ మెట్లొనర్పఁ గలరు? ఆనందాస్వాదన మెట్లొనర్పఁగలరు? లజ్జా సంకోచ, భయ ముండినచో రసానుభవమును బాగుగాఁ గావింపఁ జాలరు.'' అని యిట్లాలోచించుకొని భగవానుఁ డొక్క దట్టమైన వృక్షము క్రిందఁ గూర్చుండెను. సమీపముననే స్వచ్ఛ సలిలములుగల సరోవరముండెను. లక్ష్మణుండు కమల పత్రములతో జలములను దెచ్చెను. జానకీపతి జలములతోఁ గాళ్లుచేతులను గడిగికొనెను. జలపానము నొనర్చెను. కొంచెముసేపు విశ్రాంతిని దీసికొని యిట్లనెను :- ''లక్ష్మణా! ఇప్పుడు మన నడకను మార్చవలయును.''

లక్ష్మణుఁ డిట్లడిగెను :- ''ఏ విధముగ మార్చ వలయును స్వామీ?

భగవానుఁ డిట్లనెను :- ''నీవు ధనుర్బాణములను దీసికొని ముందుగాఁ బోవుచుండుము. నీ వెనుక సీత నడువఁ గలదు నేనిద్దరను రక్షించుచు వెనువెనుక వచ్చుచుందును. ఇది దట్టమగు వనము. ఇందడు గడుగునకును రాక్షస భయము కలదు.''

లక్ష్మణుఁ డిట్లనెను :- ''చిత్తము'' అని పలికి ముందుగా లక్ష్మణుండు నడువ నారంభించెను. ఆతని వెనుక జానకియును, నామె వెనుక శ్రీరామచంద్రుఁడును నడుచు

చుండెను. ఇప్పుడు సీత నిశ్చింతగా నుండెను. లక్ష్మణుని యొక్క చరణధూళి శిరస్సునఁ బడినను అడుగులాతని అడుగులపైఁ బడినను సంకోచింపవలసిన పనియుండదు. ఈ విధముగ భగవానుఁడును ఇద్దర చరణ రజమును కృపణుఁడు ధనమును బ్రోవుచేసినట్లు తన జడలపైఁ బ్రోవు చేయుచుఁ దనయొక్క అనన్య భక్తుల వెంట, వారికి వన శోభను జూపించుచు, సమస్త విధముల సుఖమును గలిగించుచు, వారి క్షేమము నరయుచు నానందముగ మార్గమున నడుచుచుండెను. అప్పటినుండి భగవానునకు భక్తుల వెను వెంట నడువవలయునను బుద్ధికలిగినది. కృష్ణావతారము రాఁగానే సంకర్షణునితో నిట్లనెను :- "నీవు ముందు పొమ్ము" ముందుగా జన్మించి పెద్దవాఁడవు కమ్ము. నేను వెనుక వచ్చెదను. అందువలనఁ గృష్ణుఁడందఱకంటెఁ జివరవాఁడై యెనిమిదవ గర్భమున వచ్చెను. పాండవులకును వెనుకనే పోవుచుండెడువాఁడు. అర్జున రథమందును నర్జునుని కంటెఁ గ్రింద, ఆతని చరణములను శిరస్సుపైనుంచుకొనియే కూర్చుండెడువాఁడు. కావున స్వామీ! భగవానుఁడు భక్తులకు వెనువెంటఁ దిరుగుచుండును."

ఉద్ధవుఁడు శ్రీకృష్ణచంద్రునితో నీ సంబంధమున నిట్లడిగెను :- "స్వామీ! భక్తుల వెనువెంటఁ దిరుగుట కింకేమైనఁ గారణము కలదా?"

చుండెను. ఇప్పుడు సీత నిశ్చింతగా నుండెను. లక్ష్మణుని యొక్క చరణధూళి శిరస్సునఁ బడినను అడుగులాతని అడుగులపైఁ బడినను సంకోచింపవలసిన పనియుండదు. ఈ విధముగ భగవానుఁడును ఇద్దర చరణ రజమును కృపణుఁడు ధనమును బ్రోవుచేసినట్లు తన జడలపైఁ బోవు చేయుచుఁ దనయొక్క అనన్య భక్తులవెంట, వారికి వన శోభను జూపించుచు. సమస్త విధముల సుఖమును గలిగించుచు, వారి క్షేమము నరయుచు నానందముగ మార్గమున నడుచుచుండెను. అప్పటినుండి భగవానునకు భక్తుల వెను వెంట నడువవలయునను బుద్ధికలిగినది. కృష్ణావతారము రాఁగానే సంకర్షణునితో నిట్లనెను :- "నీవు ముందు పొమ్ము" ముందుగా జన్మించి పెద్దవాఁడవు కమ్ము. నేను వెనుక వచ్చెదను. అందువలనఁ గృష్ణుఁడందఱకంటెఁ జివర వాఁడై యెనిమిదవ గర్భమున వచ్చెను. పాండవులకును వెనుకనే పోవుచుండెడువాఁడు. అర్జున రథమందును నర్జునుని కంటెఁ గ్రింద, ఆతని చరణములను శిరస్సుపైనుంచుకొనియే కూర్చుండెడువాఁడు. కావున స్వామీ! భగవానుఁడు భక్తులకు వెనువెంటఁ దిరుగుచుండును."

ఉద్ధవుఁడు శ్రీకృష్ణచంద్రునితో నీ సంబంధమున నిట్లడిగెను :- "స్వామీ! భక్తుల వెనువెంటఁ దిరుగుట కింకేమైనఁ గారణము కలదా?"

చుందురు. ధనము లేకపోవుట దారిద్ర్యముకాదు. మనస్సులో దరిద్రుఁడెవఁడో ఆతఁడే నిజముగ దరిద్రుఁడు. ఉద్ధవా! నీ వాలోచించుము - "ఒకనివద్ద చాలధనముండి మానసిక ముగ దారిద్ర్యముగను, కృపణుఁడుగను, లోభిగను నుండి నచో నాతని ధనమెందులకు? ఆతఁ డొకరికీయను నీయఁడు, తాను దినను దినఁడు. దీనికి విపరీతముగ నెవని వద్ద కేవల మొక్కపూఁట తినుటకు మాత్రమే యుండి, ఎవఁడైన నాతనినిఁ జెందిన నతిథివచ్చినచో నా యన్నమును యాచించి నచో దాని నాతని కిచ్చివేయును. వాస్తవముగ నుదారుఁ డును ధనవంతుఁడును నాతఁడే.

అర్జునుఁడు దేవేంద్రుని పుత్రుఁడు. తన పుత్రుఁడగు నర్జునునిఁ గర్ణుఁడు తప్పక చంపఁగలఁడని యింద్రునకుఁ జింత కలిగెను. ఏలననఁగా నాతఁడు సూర్యుని పుత్రుఁడు. కవచ కుండలములతోఁ బుట్టెను. ఆతని శరీరమున సహజకవచ మున్నంతవఱకును, కర్ణములందు స్వాభావిక కుండలము లున్నంతవఱకును నాతని నెవరును నోడింపఁజాలఁడు. ఆతఁ డెందఱను నోడింపఁగలవాఁడగును. ఏవిధముగనైన నాతని నుండి కవచకుండలములను లాగుకొనవలయునని యోచించి దేవేంద్రుఁడు బ్రాహ్మణరూపమును ధరించి కర్ణుని సమీప మునకు వచ్చెను. సూర్యునకీ సంగతి తెలిసెను. దేవేంద్రుని

కుంతిని తన పుత్రుఁడగు గర్ణునకుఁ జెప్పవలయునని ఆతఁడు మనస్సులో ననుకొనెను. పుత్రస్నేహమున సూర్యుఁడు కర్ణునికడకు వచ్చి యిట్లనెను :- "వత్సా ! ఇంద్రుఁడు బ్రాహ్మణ వేషమును ధరించి నిన్నుఁ గవచకుండలములడుగుటకు వచ్చుచున్నాఁడు. నీవు వాని నీయకుము."

కర్ణుఁడు నమ్రతతోఁడను, దృఢముగ నిట్లనెను :- "తండ్రీ ! మీరేమి యిట్లు తలక్రిందులుగ నుపదేశించుచున్నారు ? నాదగ్గఱనుండిన వస్తువు నే బ్రాహ్మణుఁడైనను వచ్చి యాచనచేసినచో దానినిఁ గాదనుట సంభవముకాదు. ఇంద్రుఁడు బ్రాహ్మణుఁడై రానక్కఱలేదు ఇంద్రుఁడుగా వచ్చి అడిగినను నేను నిరాకరింపను." ఇది విని సూర్యుఁడు వెనుకకు దిరిగి వెడలిపోయెను.

ఇంద్రుఁడు బ్రాహ్మణ వేషమును ధరించివచ్చెను. కర్ణుఁడు తెలిసికొని, తన శరీరమునుండి సహజకవచమును గోసి తీసి, కుండలములతోఁ గలిపియిచ్చివైచెను. ఇంద్రుఁడు తీసికొనిపోయెను. ఆతని గుఱ్ఱమాతని స్వర్గమునకుఁ దీసికొనఁజాలకపోయెను. ఇప్పుడాలోచించుము. "ఈతనిలో దారిద్ర్య మెచ్చట నుండినది ? వాస్తవమున నింద్రుఁడే దరిద్రుఁడు. ఇదేవిధముగ నేనాతని యుదారతను బరీక్షించుటకై వర్షాకాలమున సాధువేషమునఁ బోయి కట్టెలను

యాచింపఁగా నాతనికెచ్చుటను తడువని యొండు కట్టెలు లభింపక పోఁగా తనయింటియందలి చందన దూలము లను దీసి నాకు కట్టెపుల్లలుగ నొసంగెను. నా భక్తుఁడు దేనినిఁ దనవస్తువని అనుకొనఁడు, ఆతఁడు నిష్కించనుఁ డుగ నుండును; కాని ఆతని చిత్తము సదా నాయందను రక్తమై యుండును. వ్రజగోపికలయొక్క చిత్తము నిరంత రము నాయం దెట్లనురక్తమైయున్నదో చూడుము. ఉద్ధవా! నీవు వ్రజమునకుఁబోయి చూచి వచ్చితివికదా! వారు చేతు లతో నింటిపనులన్నిటినిఁ జేసికొనుచుఁ, చిత్తముతో సదా నన్నే చింతించుచుందురు. వారు పాలుపెరుగుల నమ్మఁబోయి నను వారిమనస్సులలో నేనేయుందును. వారు పాలు పెరుగు లను గేకవేయుటకు బదులుగా "శ్యాముని గొనెదరా" "కృష్ణునిఁ గొనెదరా" అని కేకలు వేయుదురు. ఎవరైన 'మీరు శ్యామ కృష్ణులనమ్ముచున్నారా, పెరుగు పాల నమ్ముచున్నారాయని యడిగినచో వారు సిగ్గుపడుచుందురు. ఈ విధముగ వంటచేసికొను నప్పుడును, పాలుపితుకునప్పు డును, పిల్లలకన్నము పెట్టునపుడును, వారిమనస్సు నాయందే అనురక్తమైయుండును. నాభక్తులు శాంతముగను సరళము గను నుందురు. వారికెవరైనను బాధలను గలిగించినచో, నవి తమ ప్రారబ్ధములని భావించెదరు. ఎవరిమీఁదను దోషము నాపాదింపరు, వారు ప్రాణులందఱకును హితమును

గావించెదరు. వారి మనస్సులలో సాంసారిక కామన ఉదయించనే ఉదయింపదు. వారు నామీఁదనే మనస్సును లగ్నమొనర్చి విషయవిరక్తులై యుందురు వారు నన్నుగాక ఇంకదేనినిఁ గోరరు. ఇట్టి నాభక్తులవద్ద నొకపైసయైన లేకున్నను నాత్మశాంతి కలుగును. అది ధనికుల కెచ్చటిది? ధనికులు సదా దుఃఖులుగను, చింతితులుగను, అశాంతులుగను నుందురు. విశాల తృష్ణలో విశాలదుఃఖము కలదు. నేను ధన సంపద్వైభవములకే ప్రసన్నుఁడ నైనచో దుర్యోధనుని పక్షమునే వహించెడు వాఁడను. దుర్యోధనుఁడు మాకు చుట్టము. సామ్రాట్టు. ఆతని కడ సుఖసామగ్రి యంతయును గలదు. నా స్వాగత సత్కారములకును నాతఁడెంతో గొప్ప యేర్పాటును గావించెను. కాని నేనాతని కడకు బోక, నా నిష్కించన భక్తుఁడగు విదురుని యింటికిఁ బోయితిని. రాజ్య, ధన వైభవములు లేని పాండవుల వెనువెంటఁ దిరిగెడు వాఁడను. పాండవుల కుండిన సుఖమును, ఆత్మసంతోషమును నంతటి యైశ్వర్య ముండినను గౌరవులకు లేదు. వారికి తమ ధనైశ్వర్య బల, పరాక్రమ, వేతన భోగులగు భీష్మ ద్రోణాదులపై విశ్వాసము కలదు. పాండవులకు కేవలము నాయందే విశ్వాసము కలదు. పాండవులు దుఃఖములకు భయపడరు, వారు యుద్ధమును ధర్మము కొఱకును, కర్తవ్యదృష్టితోడను, నా యాజ్ఞచేతను జేసిరి. కుంతి నన్ను

విపత్తులు కావలయునను వరము నడిగినది. నా పరమా నందాను భవము నిరపేక్షత వలననే ప్రాప్తించును. ఇట్టి అకించన, శాంత, దాంత, నిరపేక్ష భక్తుఁడు నా ప్రాణముల కంటెను నధిక ప్రియుఁడు, ఆతని కొఱకై నేను సమస్తమును జేయుటకు సర్వదా సర్వథా సిద్ధపడి యుండెదను.''

ఉద్ధవుఁడిట్లనెను : ''స్వామీ! మీరు మీ ఉత్తమ భక్తుల మహిమను గూర్చి చెప్పితిరి. కాని నేనట్టి యుత్తమ భక్తుఁడనుగాను. నే నధమాతి అధముఁడను. నా మనస్సు కామ, క్రోధ, లోభ, మోహాదులందు లగ్నమై యున్నది. విషయభోగ సామగ్రినిఁ జూడఁగనే చంచలమగు చుండును. నీ భక్తి చేయుచు నింద్రియములను జయింపఁ జాలనివాఁడు, అనఁగా నజితేంద్రియుఁ డేగతికి పోవునో చెప్పవలయును. ఆతనికిని ఉద్ధారము కలుగునా?''

ఇది విని భగవానుఁడిట్లనెను : ''ఉద్ధవా! నీవు పరమ భాగవతుఁడవు. నీవు నాకు సర్వశ్రేష్ఠభక్తుఁడవు. ఈప్రశ్నను నీవు సర్వసాధారణముగ నుండు నజితేంద్రియ భక్తులను గూర్చి వైచితివి. సరే, నేను నీ ప్రశ్నకు సమాధానమును జెప్పెదను. నీ వీ ప్రసంగమును సమాహిత చిత్తుఁడవై వినుము.''

సూతుఁడిట్లనెను : "మునులారా! ఏ విధముగ భగవానుఁడు భక్తోత్కృష్టతను జెప్పుచు భక్తిమహిమమును గాన మొనర్చెనో దానిని నేను వర్ణించెదను. వినుఁడు."

—//—

# భక్తియొక్క మహత్తరమహిమ

శ్లో॥ బాధ్యమానోఽపి మద్భక్తో విషయైరజితేంద్రియః।
ప్రాయః ప్రగల్భయా భక్త్యా విషయైర్నాభిభూయతే॥
శ్రీ భాగ. ౧౧ స్కం ౧౪ అ. ౧౮ శ్లో॥

వ. ఉద్ధవా! విషయబాధితుఁ డయ్యును నజితేంద్రియుఁడగు నా భక్తుఁడు ప్రాయికముగఁ బ్రౌఢభక్తి ప్రభావముచే నావిషయములకు వశీభూతుఁడు కాఁడు. వానినుండి బయటపడును."

ప్రాణులు సాంసారిక విషయములలోఁ బడుటలో నాశ్చర్యము చెందవలసిన పనిలేదు. సాధారణముగ విషయముల మీఁదఁ బ్రీతియుండును. ఆశ్చర్యమును జెందవలసిన దేమనఁగా నీవిషయములలో నుండియును వానికంటకుండుటయే, భక్తిమార్గము అతిశయమార్గము. భక్తిమార్గమున నే స్వల్పమోనర్చినను నది అక్షయము కాఁగలదు. ఇది కర్మాది

మార్గములందు లేదు. నీవు విపుల ధనమును వ్యయమొనర్చి ఒక గొప్ప యజ్ఞమును జేసినావనుకొనుము. దానిలో నేదైనఁ ద్రుటి సంభవించినచో దానిఫలము రాదు సరేకదా, ధనము నష్టము నైనది, పైఁగా విపరీతఫలమును గలుగును. విధిహీన యజ్ఞమొనర్చినవాఁడు శీఘ్రముగ నశింపఁగలఁడు. దానికి విపరీతఫలమును గలుగును. భక్తిమార్గమున నెంత వఱకు జేరి పతనమైన నంతవఱకౌ ఫలము సురక్షితముగ నుండును. కర్మమార్గము జూదమువంటిది. పాచికలు సక్రమముగఁ బడినచోఁ దాను దానియందొడ్డిన ధనమున కనేకరెట్లు ఫలము సిద్ధించును. పాచికలు సరిగా పడకపోయినచోఁ దనవద్దనున్న ధనమంతయును గోల్పోవుటయేగాక కారావాసమును సంభవించును. భక్తిమార్గ మట్టిది కాదు. నీకెంత ద్రవ్యము ప్రాప్తించినదో, అది దీనియందు సంచితముగ నేర్పడును. దీనితో వ్యాపారము చేయఁదలఁచినను నది వ్యయము కాదు. ఒకవేళ మధ్యలో దివాలాతీసినను దానిమీఁద కెవరును బోరు. పనిపడినపుడు మరల నది పనికివచ్చును. మరల వ్యాపారమును బ్రారంభింపవచ్చును. కావున భక్తిమార్గమున నడుచునపుడేదైనఁ బతనము సంభవించినచో వానికేమైన నమంగళము సంభవించునా? యనిన నట్లుకాదు.

సూతుఁడు శౌనకాది ఋషులతో నిట్లనెను:— “మునులారా! ఉద్ధవుఁడు భగవానుని అజితేంద్రియ భక్తులనుగూర్చి

అడుగఁగా భగవాను డిట్లనెను :- "ఉద్ధవా ! ఈ విషయ జన్యములగు సూక్ష్ములు సాధారణముగ సమస్త ప్రాణుల మనస్సుల నుండియును వెల్లువుకును. నాభక్తులలోఁ దమభక్తి ప్రభావముచే వీనిని జయించినవారిని విషయములు లేమియును జేయఁజాలవు. వారి ఆకర్షణమంతయును నామీఁదనే యుండును. వారిమనస్సు నన్నుగూర్చియే చింతించుచుండును. ఒకానొక ఉద్దండపశువును వదలిపెట్టినచో నే చేను పచ్చగానుండునో దానిలోనికిఁ బోయిబడును. కొంత తినును. కొంత చెడఁగొట్టును. మరల నింకొకటి కనఁబడినచో దానిలోనికిఁ బోయి పడును. తిండికి ఎచ్చట గనఁబడిన నచ్చటికి బరువిడును. దానికి సంయమము గాని నియమము గాని లేదు. తృప్తి లేదు. దానిమెడకొక పలుపును గట్టి ఒక మేకునకుఁ గట్టివైచినచో నది యెగురుటయును, దుముకుటయును, ఇతరుల చేలలోనికిఁబోయి పడుటయును ఆగిపోవును. ఆ మేకు చుట్టును మాత్రమే తిరుగుచుండును. యజమాని దేని నొసఁగిన దానినిఁ దినును. అప్పుడేమి యుపద్రవములను గావింపదు. అదేవిధముగ నే పురుషపశువు స్వచ్ఛందముగ హద్దులను మీఁటి నిత్యనూతన విషయములను గాంక్షించుచుండును. కాని ఎవని చిత్తము సద్గురువుయొక్క ప్రేమ రజ్జుచే శ్రీకృష్ణ చరణములకు బంధింపఁబడినదో, వానిచిత్తము చిత్తచోరుని చుట్టును దిరుగుచుండును గాని విషయములలోనికి పోనేపోదు.

ఉద్ధవుఁడిట్లనెను:- "స్వామీ! ఎప్పుడైనఁ దెంపుకొని పాఱిపోయినచో?"

భగవానుఁ డిట్లనెను:- "నాయనా! ఒకవేళ పార పాటునఁ బాఱిపోయినను నది అధిక దినములు ఉచ్ఛృంఖల ముగ నుండదు. దాని కంఠరజ్జువును జూడఁగానే ఎవఁడైన దయాళువు మరల దానినిఁ బట్టుకొని, యిది ఉచ్ఛృంగల ప్రకృతి గల పశువు కాదని తెలిసికొనఁగలఁడు. పొరపాటున దాని పలుపు ఊడిపోయినచో నాదఁడు దానిని దాని స్థానమునకు మరలఁ జేర్చును. దానికి మరలఁ దనపూర్వపదవి లభించును. ఇదేవిధముగ నెవఁడైన నాభక్తినిఁ జేసి, దానిలోని రసము ననుభవించియును, ఇంద్రియములను బాగుగా జయింపఁజాలక పోవుటచే, విషయములు సన్ముఖ మునకు రాఁగానే, ఆతఁడు విషయములచే బాధింపఁబడినచో నాతఁడు సర్వథా పతనమైనాఁడనుకొనరాదు. తన భక్తిచే నాతఁ డేనాటికైనను దిరిగివచ్చి మరలఁ దన స్థానమునకు రాఁగలడు. ఆతఁడు పూర్తిగా విషయములకు వశీభూతుఁడు కాఁడు. ఈ విషయమున నొక్కటి కాదు, అనేక దృష్టాంత ములు కలవు.

మహాభాగవతుఁడగు ప్రియవ్రతునకు ప్రథమమున నారదుని సత్సంగముచే భక్తిప్రాప్తి కలిగెను. నారదుఁడు

ప్రియవ్రతునకు భక్త్యుపదేశమును గావింపఁగా బ్రహ్మయును స్వాయంభువ మనువును వచ్చి దానికి విఘ్నమును గలుగఁ జేసెను. ప్రియవ్రతునితో రాజ్యమును గ్రహింపుమనెను. ఇంకొకరైయుండిన నారదుఁడేమైన జెప్పియుండును. కాని లోక పితామహుఁడగు బ్రహ్మయే చెప్పుచుండ నింక నారదుఁడేమి మాటలాడఁగలఁడు? బ్రహ్మ ఆజ్ఞను మన్నించి ప్రియవ్రతుఁడు గృహస్థాశ్రమమునఁ బ్రవేశించెను. వివాహమును జేసికొని పిల్లలను గనెను. భార్యయందత్యంతాసక్తినిఁ జెందెను. కొన్ని దినములకు దాను నారదుని వలన నేర్చిన భక్తిపాఠము జ్ఞాపకమునకు వచ్చెను. అప్పుడాతఁడు తన్నుఁ దాను నిందించుకొనెను. విషయములకు వశీభూతుఁడైనట్లు తెలిసికొనెను. వెంటనే రాజ్యవైభవమునంతను ద్యజించి, హృదయమున వైరాగ్య ధారణమును గావించి, భగవల్లీలలను జింతించుచు, దేవర్షియగు నారదుఁడు చెప్పిన మార్గమును మరల ననుసరించెను. ఆతఁడిది వఱకు నేర్చినదానిని మఱచిపోలేదు. అదియే ఆతని విషయములనుండి బయటబడవైచెను.

ఇదే విధముగ రాజర్షియగు భరతునకు వనమందు భగవద్భక్తి ప్రాప్తించినది. మధ్యలో నాతనిమనస్సు హరిణముమీఁదకు బోయెను. ఆతఁడు హరిణమయ్యెను.

కాని ప్రథమమున నాతఁడు చేసిన భక్తి ఆతని వదలలేదు. కావున హారిణ శరీరమందుండియును నాతఁడు నిస్సంగుఁడై భజన చేయుచుండెను. గండకిలో నిలుచుండి 'నారాయణాయ నమః' అని పలుకుచు శరీరమును ద్యజించెను.

భక్తి చేయుచుండఁగా ననేకమందికి కామినీయందు లగ్నమై పతనమైనవారు కలరు. కాని వారికది జ్ఞాపకము నకు రాఁగానే, అన్నిటిని వదలి భగవచ్చింతనమునఁ బడి పోయెను. అజామిళుఁడు మొదటనుంచి సదాచారి. మాతృ పితృభక్తుఁడు. భగవదుపాసనమును జేసినవాఁడు. ప్రారబ్ధ వశమున నాతని మనస్సు వేశ్యారూపమందు లగ్నమయ్యెను. యమదూత విష్ణుదూతల సంవాదమును విని ఆతనికిఁ దెలివి కలిగి, పశ్చాత్తాపమును జెందెను. అనంతరము సాధన భజనలలో మునిఁగిపోయెను.

భగవానుఁ డిట్లనెను:- "ఉద్ధవా! ఈ సాంసారిక పాపము తుచ్ఛవస్తువు, ఒక్కటికాదు, వేలకొలఁదిగ బ్రహ్మహత్యలొనర్చినను నింక నెన్నో పాపము లొనర్చినను, భగవద్భక్తి యుదయించెనా అగ్నిరవ్వ యెట్లు దూదిపర్వత మును నిమిషములో భస్మము కావించునో అట్లే అది సమస్త పాపరాసులను నిమిషములో భస్మము కావించును. చింతింప వలసిన పని లేనే లేదు. ఈ క్షుద్రప్రాణి కడుపునిండఁ బాప

ములను జేయునే చేయఁజాలఁడు. హిరణ్యకశిపు, హిరణ్యాక్షుఁడు, రావణ కుంభకర్ణులు, కంస, శిశుపాల, దంతవక్త్రులు వీరెన్నో ఘోరాతిఘోర పాపముల నొనర్చిరి. ఎందఱ సతీత్వములనో పాడుచేసిరి. నిరపరాధులగు ఋషులను మునులనెందరనో వధించిరి. రావణుఁడు వీని నన్నిటినిఁ జేసినను భగవానుఁడాతని క్షమించుచుండెను. వాని దుష్టత్వము పరాకాష్ఠత నందుకొనెను. చివరకాతఁడు కామభావముచే జగజ్జననియగు జానకినే హరించెను. తొమ్మిది పదినెలలు తన నగరమున నుంచుకొనెను. అయినను క్షమామూర్తియగు రామచంద్రుఁడాతనిఁ బ్రేమింపఁదలఁచెను. అంగదుని ద్వారా సందేశము నిట్లు పంపెను. ఏల ద్వేషించెదవు ? నేఁడు జానకిని నాకొసంగి సంధిచేసికొనుము. నన్నుఁ బ్రేమించుటకిది మంచి సరససాధనము.''

కాని ఆతఁడు రాక్షసుఁడు. ఆతఁడిట్లనెను :- ''నేను బ్రేమించను, ప్రేమించుట నా ప్రకృతికి విరుద్ధము. వైరమున సాధించెదను. నీవేమి చేసికొందువో చేసికొనుము, నీ క్షమవలన నేమి యుపయోగము కలదో చూచెదనుగాక !''

భగవానుఁడు నవ్వి యిట్లనెను :- ''ఫరవాలేదు. వైరమును మంచిదే. నాతో వైరమును బెట్టుకొన్నను, బ్రేమను బెట్టుకొన్నను ముక్తి సిద్ధముగనున్నది. ప్రేమించిన భక్తి నొసంగెదను, విరోధించిన ముక్తి నొసంగెదను.''

"ఉద్ధవా! ఇదియే నా భగవత్త్వము, నాతో సంబంధము నుఁ బెట్టుకొనవలయును. ఇంకఁ బాపముండదు. నా భక్తిరూపమగు నగ్నియందు పెద్ద పెద్ద శుష్కార్ద్ర పాపములన్నియును దగులఁబడి భస్మము కాఁగలవు."

ఉద్ధవుఁడిట్లనెను :- "స్వామీ! నిన్నుఁ బొందుటకు భక్తి కాక యింకేమైన సాధనము కలదా? యోగము ద్వారానే నిన్నుఁ బొందవచ్చు ననుచుందురు. యోగము వలన నే స్థానము ప్రాప్తించునో, సాంఖ్యము వలనను నదే స్థానము ప్రాప్తించుననియు, యోగ, సాంఖ్యములు రెండును నొక్కటియేనని భావించువారే పండితులందురు. ధర్మమే కల్యాణమునకు మూలమని స్మృతికారుల మతము. ఎచ్చట ధర్మము కలదో అచ్చట విజయమందురు. కొందఱు జపమున సిద్ధి కలుగునందురు. ఆ మూర్తియగు భగవానునకు మంత్రమే మూర్తమందురు. మరలమరల మంత్రములను శుద్ధోచ్చారణమునఁ బలికినచోఁ బ్రాణులు పవిత్రులగుదురు. కొందఱు తపస్సుచే సిద్ధింపని కార్యమేమని పలికెదరు. తపమే అన్నిటికిని మూలకారణము. కొందఱు సర్వస్వ దానమొనర్చుటచేతనే ప్రభువును బ్రాప్తింపవచ్చునని కొందఱి మతము. ఇందులోనే సాధనము సర్వశ్రేష్ఠమైనది?" ఇది విని భగవానుఁడిట్లనెను :- "ఉద్ధవా! సాంఖ్య, యోగ,

ధర్మ, జప, తప, దానాది సమస్త సాధనలును శ్రేష్ఠములే. అన్నియును నేదోవిధముగ నావలకును జేర్చును. కాని సుదృఢమగు భక్తి నన్నుం బ్రాప్తింపంజేయునట్లితర సాధనలు చేయంజాలవు. కావున నామతమున నిష్కామమగు నహైతుకీభక్తియే సర్వశ్రేష్ఠమైనది."

ఉద్ధవుండిట్లనెను :- "ప్రభూ! మీరు పరమ శుద్ధులు. మీభక్తి యొనర్చుటకు బరమ పవిత్ర విశుద్ధాంతః కరణము కావలసియుండును. మీరు మహాత్ములలో మహాత్ములరు. మీభక్తినిం బ్రాప్తించుటకు మహాత్త్వ కావలయును. మీరు శ్రేష్ఠతములు. కావున మీభక్తికొఱకు శ్రేష్ఠతయును గావలయును. అట్టియెడ మావంటి సాధారణులు మిమ్ములను బొందుటెట్లు ?"

భగవానుం డిట్లనెను :- "ఉద్ధవా! నేను దూరమున లేను. నేను భయంకరుండను గాను. నేను ప్రాణిమాత్రులకు సుహృదుండను నిజమగు సంబంధిని. సాధువులకుం బ్రియమగు నాత్మను. నన్నుంబొందుటకింకను ననేకోపాయములు కలవు కాని అవన్నియును గఠినోపాయములు. జ్ఞానమార్గము మంగలికత్తి మీంద నడకవంటిది అన్నిటికంటెను సరళ సులభమార్గము భక్తియే. భక్తియు ననేక విధములుగ నున్నది. భక్తియును గొందఱు ద్వేషముచేతను, కామము

చేతను, క్రోధముచేతను, ఈర్ష్యాదులచేతను నాశుభక్తినిఁ జేయుదురు. వీరందఱికిని మేలే కలుగును. కాని సర్వోత్తమ భక్తి శ్రద్ధాసంపన్నమగు భక్తి యనే చెప్పఁబడినది. ప్రేమ రూపమగు భక్తిచే నేను భక్తుల కధీనుఁడ నగుదును. వారి వెనువెంటఁ దిరుగుచుందును. నాభక్తికి కుల, సదాచార, జాతి, వర్ణ శ్రేష్ఠత్వము లక్కఱలేదు. ఒకవేళ చాండాలుని హృదయమున నాభక్తి యుత్పన్నమైనను, జాతీయదోష విముక్తినిఁ గావించి భక్తమహారాణి వానినిఁ బావనునిఁ గావించును. భక్తి కారణమున నాతఁడందఱికిని బూజ నీయుఁడగును. ఏ సాధనమును జేయకుండినను, నా భక్తి యేదో విధమున హృదయమున నుత్పన్నమైనచో నది మనస్సునందలి సమస్త మాలిన్యములను గడిగివైచి, హృదయ మాలిన్యమును గడిగి స్వచ్ఛమొనర్చును. అంతఃకరణ మందల సమస్త కుత్సిత వృత్తులను నశింపఁజేయును. కేవలము భక్తి వలననే సమస్త సిద్ధులును బ్రాప్తించును. నాభక్తికిఁ జేయవలసిన దేమియునుండదు. ఆతఁడు తన విశుద్ధ భక్తి ద్వారా కులమును, దేశమును, త్రిభువనములను బావన మొనర్పఁ గలడు. కావున భక్తి పథ పథికుఁడు తన పతితా వస్థ వైపు చూచుకొనరాదు. భక్తి మార్గమునఁ బోవుచునే యుండవలయును."

ఉద్ధవుఁడిట్లడిగెను :- "స్వామీ ! ఎట్లు పోవలయును? ఏమి చేయవలయును ?"

భగవానుఁడిట్లనెను :- "ముందుగా భక్తిమార్గ పథికుఁడు నన్నుఁ దలచుకొని యేడ్వవలయును. అత్యంత శీతముచే ఘృతము రాయివలెఁ చేరుకొనును. అది చేతితో రాదు. దాని నగ్ని సమ్ముఖమునకుఁ దీసికొని పోయి కరిగింప వలయును. అదే విధముగ విషయ వాసనా సంసర్గముచే నతికోమల మగు హృదయము వజ్ర సదృశముగను, అశ్మసారముగను గఠోరముగ నగును. దాని నెట్లైనఁ గరిగింప వలయును."

ఉద్ధవుఁడిట్లనెను:- 'ఇది కరఁగినట్లు గుర్తేమి స్వామీ!'

భగవానుఁడిట్లనెను :- "దీనికి ప్రధాన చిహ్నము లేవనఁగా భగవన్నామమును బలుకఁగానే, ఆతని కారుణిక లీలలను వినఁగానే నేత్రముల వెంట నీరు రావలెను. కన్నుల వెంట జల జల అశ్రువులు రాలవలయును. కొందఱు ధూర్తులు కపటాశ్రువులను గూడ కార్చెదరు. కాని వానిని సహజముగఁ దెలిసికొన వచ్చును. హృదయమందలి శీతలాశ్రువులు చిత్తము ద్రవీభూతము కాక వెలువడనే వెలువడవు. కఠోర హృదయము కలవారికి అశ్రువులు రానే రావు. వారు నిరంతర మితరులను ద్వేషించుచుందురు. ఈర్ష్య కలిగి యుందురు. దీని వలన వారి హృదయములు

మిక్కిలి కఠోరములుగను, నీచత్వముతోడను నిండి యుండును. కన్నులవెంట నీరు రావలయునను గొన్నను రాదు. వారేకాంతమున నభ్యాస మొనర్పవలయును. అట్లు కన్నుల నీరు రాకుండినచోఁ గర్పూరమును గన్నులలోఁ బెట్టుకొనియో, మిరియపు గంధమును బెట్టుకొనియో, కటు తైలమును బెట్టుకొనియో, నారింజరసమును బెట్టుకొనియో అశ్రువులను వెలువరించుట కభ్యసించుము. భగవల్లీలలోని కరుణా ప్రసంగములను మాటిమాటికి స్మరించి హృదయమును గరిగించుకొనుము. హృదయము ద్రవింపఁగనే కన్నులనీరు కారును, శరీరము రోమాంచమగును. భగవంతుని వైపునకు మనస్సు మొగ్గును.

ఉద్ధవుఁడిట్లనెను :- స్వామీ! అశ్రువులు రాకుండిన నేమి హాని కలదు?''

దృఢముగను, శీఘ్రముగను శ్యామసుందరుఁ డిట్లనెను :- ''ఓయీ! ఉద్ధవా! శరీరము రోమాంచము కానంత వఱకును, చిత్తము తడిగుడ్డవలె నార్ద్రము కానంత వఱకును, అది ద్రవింప నంతవఱకును, ప్రేమాశ్రువుల ఉద్రేకము రానంతవఱకును, కన్నుల నీరు కారనంత వఱకును, ఇట్టి భక్తి చిహ్నములు ప్రకటము కానంతవఱకు, అంతఃకరణ శుద్ధి యెట్లు కలుఁగఁ గలదు? అంతఃకరణ శుద్ధి లేకుం

డిన భక్తి స్రోత యెట్లు ప్రవహింపఁ గలదు? ఇవే నాభక్తి ప్రకట మగుటకు ప్రధాన చిహ్నములు."

ఉద్ధవుఁడిట్లడిగెను:- "స్వామీ! భక్తి లక్షణము లేవి? ఏ లక్షణములచే వీరు భక్తులని కనుఁగొన గలము?"

అంతభగవానుఁ డిట్లనెను:- "ఉద్ధవా! నా భక్తుఁడు లోక బాహ్యుఁడగును. ఆతనికి లోకరంజన మావశ్యకము కాదు. ఆతఁడెల్లప్పుడును దన ప్రభువును సంతోష పెట్టు చుండును. తద్భావభావితుఁడై ఆతని స్మృతియందే సంతతము నిమగ్నుఁడై యుండును. ఆతని కార్యములన్నియును విలక్షణ ములుగ నుండును. ఆతని యిచ్చ భగవద్గుణాను వాద కథన మందు లగ్నమగుచో, ఆతని హృదయ ముప్పొంగును. అప్పుడు వాక్కు గద్గదికమై నోటమాటరాకుండును. చిత్తము ద్రవీభూతమగును. చంద్రునిఁ గాంచి చంద్రకాంతశిల ద్రవిం చినట్లు భక్తిభావభావితమై ఆతని అంతఃకరణము ద్రవించును. ఎప్పుడైన నాయొక్క విచిత్రలీల లేవైనస్మరణకు వచ్చినచో ముక్తకంఠమున రోదనముచేయ నారంభించును. హా! హా రే! హాజగత్పతే! అని పలుకుచు బిగ్గఱగా నేడ్వనారంభించును. ఒక్కొక్కప్పుడు నవ్వుచుండును. శుద్ధాంతఃకరణ మగుటచే నాతని కేడ్చుటకును, నవ్వుటకును నేమంత వ్యవధి పట్టదు. పసివాఁడిప్పుడేడ్చుచుండిన నేదైన నాట వస్తువునుగాని

ఫలపుష్పములనుగాని, తినుబండారములనుగాని యొసంగిన వెంటనే నవ్వును. కపోలములం దశ్రువులు జారుచుండును. నోట నువ్వులొలుకుచుండును. బాలకున కెవరైన నేమైన ననుకొందురను భావముండదు. ఇప్పు తేడ్చినాఁడు, అప్పుడే నవ్వుచున్నాఁడని కొందరందురని భావింపఁడు." ఇతరుల విషయ మాతఁడు చూడనే చూడఁడు. ఆతని కాతని ఆనందముతోడనేపని. అందఱు బుద్ధియు నతనిదే. అంతయు నాలోచించుటకు స్వతంత్రుఁడు. ఇతరుల విషయము మన కేల అనుకొనును. తన పరమానందమునఁ దానుండుటయే తన ధర్మముగ నెంచుకొనును. ఒక్కొక్కప్పుడు గొంతెత్తి పాడ నారంభించును. ఆతనికి తాళస్వర లయాదులతోఁ బనిలేదు. ఆతని యంతఃకరణము గానమొనర్చుటకు వివశు నొనర్చును. ఆతఁడు పాడనారంభించుచు ఒక్కొక్కప్పుడు శరీరము కంపించును. ఒక్కొక్కప్పు డాగఁజాలక నృత్యము చేయనారంభించును. ఆతఁ డెల్లప్పుడును దన రాముని సంతోషపెట్టుటకుఁ బ్రయత్నించుచుండును. రాముఁడు దేనిచే సంతసించునో, ఆపనిచేయుటకు లజ్జను విడిచి ఆతఁ డేపనినైనను జేయును. నా భక్తుఁడు తాను పవిత్రుఁడగుటయే కాదు, ఆతని సేవను దర్శించిన వారును బవిత్రులగుదురు. ఆతని కథా సంకీర్తనలను వినినవారును బవిత్రులగుదురు. ఏ వాయుమండలము నుండి ఆతఁడు శ్వాసను

దీసికొనునో అదియును బవిత్రమగును. ఆతఁడీ త్రిభువనముల నైనఁ బవిత్ర మొనర్ప సమర్థుఁడగును. ఏడ్చుట ఆతని వ్యాపారము. ప్రభుస్మృతిలో నాతఁడేడ్చు చుండును."

ఉద్ధవుఁడిట్లనెను :- "స్వామీ! ఏడ్చిన నేమిలాభము. అమ్మమ్మ చచ్చిన నేడ్చెదరు. ఏదైన విపత్తు సంభవించిన నేడ్చెదరు."

భగవానుఁడిట్లనెను:- "నాయనా! ఈ సంసారములోఁ బడిన జీవికిది తక్కువ విపత్తా? శుద్ధాంతః కరణము విషయ సంసర్గముచే నశుద్ధమగును. గనిలో నుండినచో సువర్ణమున ననేక ధాతువుల మలములు చేరును. అది అశుద్ధ మగును. దాని నగ్నిలోఁ గాల్చి ద్రవింపఁ జేసి దాని మలమును వేఱు చేయవచ్చును. కఱగుటచే దానిలోని మలము బయటకుఁ బోవును. అది విశుద్ధమైన దగును. అదే విధముగఁ బ్రభు స్మృతి — భగవానుఁడు లభింప లేదేయను తీవ్రతాపము కలి గినచో నది యొక విధమగు నగ్ని, అది తగులఁగానే హృద యము ద్రవభూత మగును. అంతఃకరణ రూపమగు మలము జలమై కన్నుల నుండి వెలువడును. అప్పు డంతఃకరణ మందలి మల, విక్షేప, ఆవరణము లన్నియును, సమూలముగ నశించును. దర్పణమునఁ గల మురికినిఁ దుడిచినచో నెట్లు ద్రష్టయొక్క స్వరూపము స్పష్టముగఁ గనఁబడునో, అట్లే

హృదయమునఁ గల మాలిన్యము పోఁగానే నాయొక్క స్వరూపమందు క్రీడించుచున్నట్లు గోచరించును. అప్పుడు జీవుఁడు కర్మవాసనల నుండి విముక్తుఁడై నన్నుఁ బొందును. నేనాత్మ స్వరూపముగ నన్నింటియందును సర్వదా నివసించుచుందును. నేను బ్రాప్తించుటేమి? నేను పరిశుద్ధ హృదయము నందు స్పష్టముగ గోచరించెదను."

ఉద్ధవుఁడిట్లనెను:- "స్వామీ! హృదయ మాలిన్యము పోవుటెట్లు?

భగవానుఁడిట్లనెను,- "ఉద్ధవా! చెవులలో గుబిలి పెరిగినచోఁ బిచికారి కొట్టి శుభ్రము చేసికొందుము. ఊపిరితిత్తులలో జీవన తత్త్వము తక్కువగా నుండిన నొక విధమగు ప్రాణశక్తి యంత్రము ద్వారా యెక్కించెదరు. దుర్బలతా కీటాణువులు చచ్చిపోయినచోఁ బ్రాణి సబలుఁడగును. అదే విధముగ హృదయ మాలిన్యము పోవుటకు కర్ణములు, జిహ్వా ద్వారా పిచికారీ యొనర్ప వలయును."

ఉద్ధవుఁడిట్లడిగెను:- "కర్ణములు, జిహ్వాల ద్వారా పిచికారినిఁ జేయు టెట్లు స్వామీ?"

భగవానుఁడిట్లనెను:- కర్ణముల ద్వారా నాకమనీయ భాగవత కథలను నిరంతరము వినవలయును. మనస్సచ్చట నిలువక పోయినను వానినిఁ జెవులకు వినిపింప

వలయును. ముందుగాఁ జెవులలోఁ బడిన నింక వినకుండు టెట్లు? కాని మనస్సు లేక యేపనియును జరుగదు. విన వలయునను దృఢ సంకల్పమును మనస్సు చేతనే జరుగును. కావున నెట్లు విన్నను సంస్కారము కలిగి తీరును. కర్ణము లందు గథలు ప్రవేశించినా మనస్సులోని మురికి అంతయును బోయితీరును. జిహ్వతో భగవన్నామమును బలుక వల యును. ఆతని కీర్తిని గాన మొనరింప వలయును. అంతః కరణము క్రమక్రమముగ స్వచ్ఛమగును."

ఉద్ధవుఁడిట్లనెను :- "ఎట్లు స్వచ్ఛమగును స్వామీ! మేము చాలమందిని జూచినాము. జీవిత కాలమంతయును రామ రామ యను చుందురు. నియమముతోఁ గథాశ్రవణ మొనర్చెదరు. కాని వ్యాపారమున కపట మొనర్చెదరు. పరస్త్రీ గమన మొనర్చెదరు. ఇంక నెన్నియో చెడ్డ కార్యముల నొనరించెదరు. వారి మీఁద గథాకీర్తనముల ప్రభావము పడనే లేదు."

భగవానుఁడిట్లనెను :- "ఉద్ధవా! నీవు చెప్పినది సత్యమే. చాలమంది దంభముగఁ గథా కీర్తనములలోఁ బాల్గొందురు. వారి యాచరణమును బాగుండదు. కాని వారు కథా కీర్తనము లొనర్చుటచే నిట్టి కుత్సితాచరణ మొనర్చు చున్నారన వీలులేదు. కథా కీర్తన భజనాదులను

జేయరాదనరాదు. అట్లే యైనచో కథా కీర్తన మొనర్పుని వారును, భగవద్భజన మొనర్పుని వారును సదాచారులై యుండవలయును. కాని లోకములో నిట్లు కనబడుట లేదు. భజన, పూజా, శ్రవణము లొనర్పుని వారును పాపులు గనే యున్నారు. కాని భజన పూజా కీర్తనము లొనర్చు వారే దైనఁ బాప మొనర్చినచో వారి హృదయమునఁ బొడుచుచునే యుండును. భగవత్కథలు, ఆతని గుణగానము వారి పాప ములను బరిహార మొనర్చుచుండును. అనేక జన్మ పాప సంస్కారములచేఁ బ్రాణులకు బాప మొనర్చుటయందుఁ బ్రవృత్తి కలుగును. మానవుఁ డెంతెంతగాఁ బరమ పావన ములగు నా కథలను శ్రవణ, మనన, చింతన మొనర్చుట యును, గీర్తించుటయు నొనర్చుచుండిన నంతంతగా వారి చిత్తములు పరిమార్జితము లగును. చంద్ర గ్రహణమున రాహువు వదలిన కొలఁది చంద్రుని ప్రకాశము వృద్ధియగు నట్లు వీరును బ్రకాశించెదరు. ఆఁకలి గొన్న వాఁడు తినిన కొలది ఆఁకలిని దీర్చు కొన్నటులను, అద్దము మీఁదఁ బడిన దుమ్ము నోటితో నూదిన కొలఁది తొలఁగి పోయి ప్రతి బింబము స్పష్టముగఁ గనఁబడి నట్లును, కంటిలోఁ బొర వైచినఁ గాటుకఁ బెట్టినచో నది స్వచ్ఛమగు నటులను, కన్నులకు సూక్ష్మవస్తువులును, దూరవస్తువులును గనఁబడవు. కొన్ని అంజనములను వినియోగించినచో సూక్ష్మాతిసూక్ష్మ

వస్తువులును, దూరాతి దూర వస్తువులును స్పష్టముగ గోచ రించినట్లు కథాకీర్తనములే అంజనము. అట్టి అంజనముచే సేవించినచో చిత్తము స్వతః ద్రవీభూతమగును. నా విషయ మున నూహాపోహాలు బయలు దేరును. కావున నుద్ధవా! నిరంతరము నా కథలను వినుట చేతను, నా నామ గుణకీర్త నముల నొనర్చుట చేతను మలినమగు మనస్సు పరిశుద్ధ మగును."

ఉద్ధవుఁడిట్లనెను:- "స్వామీ! సాధనలు చాల కలవు. నాకేదైన నొక గురు మంత్రమును జెప్పుఁడు."

భగవానుఁడిట్లనెను :- "ఉద్ధవా! నీ వొకే ప్రశ్నను మాటి మాటికి నడుగుచుండినచో నేనొకే ప్రత్యుత్తర మొసఁగు చుండెదను. దీనికి నీవు పునరుక్తి దోషము నాపా దింపరాదు. ఒకానొకని శరీరమున భయంకర బాధ యున్న దనుకొనుఁడు, ఆతఁడు నిరంతరమును అయ్యో, అయ్యో! అనుచుండును. ఒకే శబ్దమును బునరావృత్తి యొనర్చు చుండును. ఆతని బాధ పోవునంతవఱ కట్లే అనుచుండును. ఓదార్చు వారును మాటి మాటికి నదేమాటలతో నోదార్చు చుందురు. నీవు నన్ను మాటిమాటికిని సరళమగు సాధన మును గూర్చి అడుగుచున్నావు. నేను దాని కొక్కటే ప్రత్యు

త్తర మొసంగుచున్నాను. అది సత్సంగ సేవనమును, దుస్సంగ పరిత్యాగమును.''

ఉద్ధవుఁడిట్లనెను :- ''ప్రభూ! నాకు సత్సంగ దుస్సంగ ముల స్వరూపమును గూర్చి చెప్పవలయును వానియొక్క ప్రభావమెట్లుండును? దానినిగూర్చి చెప్పుఁడు.''

నవ్వి భగవానుఁడిట్లనెను :- ''ఉద్ధవా! నేనిదివఱలో ననేకసార్లు దీనిని గూర్చి చెప్పియున్నాను. అయినను మరలఁ జెప్పెదను. నీవీ విషయమును దత్త చిత్తుఁడవై వినుము.''

సూతుఁడు శౌనకాది ఋషులతో నిట్లనెను :- మును లారా! మీ కిపుడు దుస్సంగ సత్సంగ ప్రభావమును గూర్చి చెప్పెదను వినుఁడు.

—//—

# సత్సంగ దుస్సంగముల ప్రభావము

శ్లో॥ విషయాన్ ధ్యాయతశ్చిత్తం విషయేషు విషజ్జతే।
మామనుస్మరతశ్చిత్తం మయ్యేవ ప్రవిలీయతే॥

శ్రీభాగ. ౧౧. స్కం. ౧౪ అ. ౨౭ శ్లో॥

వ ఉద్ధవా! విషయధ్యాన మొనర్చుటచేఁ జిత్తము నాయందు విలీనమగును.''

ఛాయాచిత్రమును దీయుటకొక యంత్రముండును. అభినయ కర్తలగు స్త్రీ పురుషపాత్ర లభినయించుచుందురు. వారి చిత్రములు దాని మీఁదకు వచ్చుచుండును. ఒకానొక పాత్ర ప్రేమాభినయమును జేయుచుండెను. ఆతని అభినయ ప్రేయసి సమీపముననే నిలుచుండెను. బాగుగా శిక్షణ నొసంగిన సింహమచ్చట నిలుచుండెను. వారు ఛాయా చిత్రమును దీయు నుద్దేశ్యముతో నాట్యమొనర్చు చుండిరి. హఠాత్తుగా రసభంగమయ్యెను. ఆ పెంపుడు సింహ మెగిరి అచ్చట నిలుచుండిన నటినిఁ దినవలయునని పట్టుకొనెను. ఈ దుర్ఘటనచే నాట్యము సమాప్తమయ్యెను. సింహభయముచేఁ బాత్రధారులటునిటు బరువిడిపోయిరి. కాని ప్రేమ నభినయించు యువకుఁడు సాహసమును గోల్పోవలేదు. ఆతనికడ విద్యుత్తోత్రముకలదు. దానినిఁ దీసికొని దాని మీఁద కుఱికెను. తాను ప్రాణములను ద్యజించు సాహసముతో నాయువతిని రక్షించెను. మరుక్షణముననే యింకొకఁడువచ్చి గుండును ప్రేల్చెను. సింహము చచ్చెను. దుర్ఘటన నుండి రక్షింపబడెను. నాటకమున ఛాయా చిత్రమును దీయు యంత్రములు నడుచుచునే యుండెను. దానిలోనికీ చిత్రములన్నియూను బడెను. తర్వాత నా చిత్రములను నటకులుచూచి యిట్లనిరి :- "మేమీ నాట్యమును అభినయమునఁ జేసినవి కావు. ఇది దైవికముగ జరిగినది." ఇంకొకఁ

డిట్లనెను :- "చలన చిత్రమున నీవు యథార్థముగ నభినయించుము లేక అయథార్థముగ నభినయించుము. యంత్రమున కెదురుగానుండు చిత్రములు దానిలోనికిఁ బడితీరును. ఇంతకు సారాంశ మేమనఁగా మనస్సు నే యాలోచన మొనర్చినను, దాని ప్రభావము మన మనస్సులపైఁ బడక యుండఁ జాలదు. మనస్సు స్వచ్ఛ శుభ్ర వస్త్రమువంటిది. ఏ రంగు నీటిలో దానిని దడిపిన దానికారంగంటును. ఎట్టి చింతన మొనర్చిన మనస్సట్లే కాఁగలదు. జగచ్చింతన మొనర్చిన మనస్సు సంసారమయమగును. జగత్పతి చింతన మొనర్చిన మన్సాతనిలోఁ గలిసిపోవును. కావున సాధకుఁడగువాఁడు ఇటుకలు, సున్నము, ఇసుక, వెండి, బంగారము మొదలగు భౌతికములును, నశ్వరములునగు పదార్థములందు జత్తము రమింపఁజేయరాదు. ఒకవేళ చిత్తమట్లు రమించినచో నది అట్లేకాఁగలదు. ఏ వస్తువులను ధ్యానించెదమో, అట్టి సంస్కారము మనస్సు మీఁదఁ బడఁ గలదు. ఆ ఘటనము సమాప్తమైన విచారధారయును సమాప్తమగునను మాటలేదు. ఏసంఘటన మైనను సరియే హృదయమునఁ గొంచెముగనో, గొప్పగనో దాని ప్రభావమును విడిచి పోవును. మాటిమాటికి దానిని ధ్యానించుటచే నా విషయమం దభినివేశము కలుగును. ఆసక్తి కలుగును. అంత దానిని భోగింపవలయునను గోరికజనించును. మనస్సా

రంగులో నద్దబడును. నీవు నివసింపఁ దలఁచిన వృక్షము క్రింద నుండవచ్చును. పూరిండ్లలో నుండవచ్చును. గొప్ప గొప్ప సుందర భవనములలో నుండవచ్చును, ఎంత గొప్ప ఎంతటి సుందర భవనమును గట్టించు కొందువో అంతటి ఆసక్తి వృద్ధియగును. పూరింటను జరిగిపోవును. రాజభవనము నను జరిగిపోవును. రాజమహాలు నందుండిన నశౌకర్యము లేదనియు, దుఃఖము లేదను మాటయును లేదు. వారును దుఃఖించు చుందురు. చింతించుచుందురు. అడిగిన నిట్లను చుందురు :- "స్వామీ! ఏదో గడచిపోవుచున్నది" జరిగి పోవుటయే యైనచోఁ బ్రపంచమున నతిథివలె నివసింప వలయును. నశ్వరములగు నీ నసత్పదార్థములం దింతటి అధిక చింతను నీవు పెట్టుకొననేల? ఈ విషయమున నొక మంచి దృష్టాంతము కలదు.

నారదుఁడు వీణను మీటుచుఁ హరిగుణ గాన మొనర్చుచుఁ దిరుగుచుండెను. ఆతనికి వనమున నొక వృక్షము క్రింద నొక గుడిశె కనఁబడెను. గుడిశె పాతది. చూడఁగా దానికిదివఱలో ద్వారముండెడిదని తోఁచు చున్నది. దాని నిట్టాడిగుంజ క్రిందఁబడుటచే గుడిశె నేలకు కూలెను. లోనుండి బయటకు వచ్చుటకు మార్గము లేకుం డెను. ఆతనికి లోపల నెవఁడో యున్నాఁడని తోఁచెను.

మనస్సులోఁ గుతూహలము కలిగెను. వీణనొక ప్రక్కనుంచి యేదోవిధముగఁ గప్పునెత్తి దానిలోనికి దూరెను. పోయి చూడఁగా లోపల నొకముని ధ్యానములోఁ గూర్చుండి యుండుటను గాంచెను. లోపలికి గొంచెముగ వెలుఁగు వచ్చెను. నారదుఁడు పరీక్షించి చూడఁగా నాతని ఆశ్చర్యమునకు మేఱ లేకుండెను. ఆతఁడు చిరంజీవియగు మార్కండేయ మహర్షి. నారదుఁడాతని భుజమును బట్టుకొని యిట్లనెను :- "స్వామీ! నేను నారదుఁడను వచ్చితిని."

మార్కండేయుని ధ్యానము భంగమయ్యెను. ఆతఁడిట్లనెను :- "నారదా! భగవంతునియొక్క గుణాను వాద మొనర్పుము."

నారదుఁడు నవ్వి యిట్లనెను :- "గుణాను వాదమును తరువాత గాన మొనర్చెదను. నాకిది ముందుగాఁ జెప్పవలెను. ఇందు నీవెప్పటినుండి కూర్చుంటివి. నిట్టాడి విరిగి పడిపోయినది. కుటీరమునుండి బయటకు వచ్చుటకును మార్గము లేదు. ఇంకొక నిట్టాడిని దీసికొనివచ్చి దీనికేల నమర్చలేదు ?"

కసరి మునివరుఁ డిట్లనెను :- "నారదా! నీవేమి వాగుచున్నావు, మాకు వనమునకుఁబోయి నిట్టాడి గుంజను దెచ్చి, పాతి, దానిపైకి యీ కుటీరము నెత్తు అవకాశ

మెక్కడిది ? నేనీ వ్యాపారములలోఁ బడినచో నీ భౌతిక విషయములలోఁబడి పోవుదును. భౌతిక వస్తువులందే మనస్సు లగ్నమగును, బ్రహ్మ చింతనము పోయి వాసచింతనము జరుగును. నాకు కావలసినది ధ్యానము. దానికీ కుటీరము దొఱకినది. ధ్యానము చేసికొనుచుంటిని. నాయిష్టమును బట్టి యింకొక చోటునకుఁబోయి ధ్యానమును జేసికొందును. ఈ వ్యర్థ విషయములను దీసికొని వచ్చి కాలమును వృథా చేయకుము కాల మత్యల్పమైనది. భగవంతునకు సంబంధించినమాటలే మాట్లాడుము."

మీఁరొక్క విషయము నాలోచింపుఁడు. కల్పజీవి యగు మార్కండేయునకే ఒక సిట్టాడినిఁదీసి యింకొక సిట్టాడిని నిలుపుటకు సమయము కుదురక పోయిన నల్పజీవుల మగు మనము ఈబండిలో నెంత యిటుక వచ్చినది. ఎంత సున్నము వచ్చినది, ఎంత యిసుకవచ్చినది, దీనిని గూర్చి చింతించుచుండిన చచ్చి యిటుకలుగను, సున్నముగను యిసుకగను బుట్టవలసినదే కదా !

సూతుఁ డిట్లనెను :- "మునులారా ! ఉద్ధవుఁడు భగవానుని సరళ సుగమ సాధనమును గూర్చి ప్రశ్నింపగా భగవానుఁ డిట్లనెను:- "ఉద్ధవా ! ఈ చిత్తము శుభ్రస్వచ్ఛ వస్త్రము వంటిది. దీనికేరంగు నద్దిన నట్టి రంగుకలదగును

ఎవరెట్లు చేసెదరో వారట్టివారగుదురు. ఈ సంసారము కల్ప వృక్షము. భగవానుఁడే ఆ వృక్షమునకు బీజము. బీజమును బట్టియే వృక్షముండును. కావున నీసంసార వృక్షము క్రిందఁ గూర్చుండి యెట్టి చింతన మొనర్చెదవో అట్టే కాఁగలము. దీని ఫలముల నారగింపఁదలచినచోఁ దిరుగుచుండ వలసినదే. ఏమియును దినక, విషయములకు దూరముగనుండి బీజ విషయమునఁ జింతించుచుండినచోఁ దదాకారమును జెంద వచ్చును. ఈ దృశ్య జగత్తంతయును మన మనస్సును బట్టి యేర్పడినదే. మనస్సే సాంసారిక పదార్థములందు పడియుం డెనా అంతవఱకు సంసారమే కనఁబడును. దీనినిఁ గాదని, కన్నులు మూసికొని హృదయ కమలమునఁ గూర్చుండిన సచ్చిదానంద ఘన భగవానునిఁ జింతించినచో, నాలోనే కలియుదురు. ఉద్ధవా! ఇదేమంత కష్టమైన పనికాదు. నీవు ప్రతిదినము ననుభవించుచున్నదే. పగలే వస్తువులను జూచు చుంటివో, చింతించుచుంటివో, రాత్రియందు స్వప్నమునను నదే వస్తువులు కనఁబడును. ఏకాంతమున విచారించినచో దానిని గూర్చియే విచారించెదవు. మాటలను మాట లాడె దవు. దాని సిద్ధికొఱకే చేయుదువు. నీమనస్సులోని వచ్చిన సంకల్ప మేనాటికైనను నెఱవేరితీరును. అది సూక్ష్మవాసన యైనచో నది స్వప్నముననే సమాప్తమగును. అది ప్రబల వాసనయైనచో దానికై జన్మింప వలసివచ్చును. మనస్సు

లోనికివచ్చిన దాని సంస్కార ముండదను మాటలేదు. ఒక డబ్బీలోఁ గర్పూరమును బెట్టుము. కర్పూర మైపోయినఁ బోవచ్చును గాని, దానివాసన మాత్రము చాలకాలము వఱకుండును. కావున సాధకుఁడగువాఁ డేవిధముగు నసత్సం కల్పమును మనస్సులోనికి రాకుండ చూచుకొనవలయును. ఆతఁడెంతటి ధనికుఁడైనను, మాన్యపురుషుఁడైనను, విద్వాంసుఁడైనను, భాగ్యవంతుఁడైనను నాతఁడు చిత్తముతో నిరంతరము విషయ చింతనమును గావింపు చుండినచోఁ జిత్తము విషయములలోఁ బడిపోవును. దీనికి వ్యతిరేకముగ నెవఁడు విషయములయం దుదాసీనుఁడై సదా నడుచుచుండినను, దిరుగుచుండినను, కూర్చుండినను నా స్మరణమొనర్చినచో, నాతఁడు నిశ్చయముగ నవిలంబముగ నేసందేహమును లేకయే నాలో లీనముకాఁగలండు. కావున నేను డంకామీఁద దెబ్బను గొట్టి చెప్పుచున్నాను. ఇతర సాంసారిక సాధనలన్నియును నసత్సాధనలు. ఒక్క నా చింతనమే సత్సాధనము.

ఉద్ధవుఁ డిట్లడిగెను :- "అయితే స్వామీ! మేమేమి చేయవలెను?

భగవానుఁ డిట్లనెను :- "ఓయీ! నేను మాటిమాటికిని జెప్పుచుండినను నదే విషయమును బిష్టపేషణ

మొనర్చెదవేల ? ఈ బాహ్యసాధనలన్నియును నసచ్చింతన మాత్రములే, సన్న స్వప్నమానములే. ఏకాంతమునఁగూర్చుండి చేయు మనోరథముల వంటివి. వీనినన్నింటిని వీడి నాయందే మనస్సును లగ్న మొనర్పుము."

ఉద్ధవుఁ డిట్లనెను :- "స్వామీ! లగ్నమైన మంచిదే. కాని లగ్నము కాకపోయినచో, మీ మీఁదఁ చిత్తమును లగ్నము చేయుచుండిన, సమయమును జూచుకొని అదిపారి పోవుచుండును. విషయములలోనికిఁ బోయిపడును, ఎందు వలన ?"

భగవానుఁ డిట్లనెను :- "నిరంతరము విషయ చింతన మొనర్చుటచేఁ జిత్త మశుద్ధమైనది. దీనికి విషయములతో రమించు నభ్యాసమైనది. ఒక ఆవు కలదు. దానిని దాని యజమాని యింకొకనికి విక్రయించినాఁడు. దాని నాతఁడు మేఁకుకు గట్టెను. ఆ మేకు గట్టిగా నున్నంత వఱకది అచ్చట నుండును. సమయము చిక్కి, బంధనము వదలుగా నున్నచో నభ్యాస వశమున మరలఁ దన పూర్వపు యజమాని సమీపమునకు వచ్చును. దాని పూర్వపుటాసక్తి ఆస్థానముననే కలదు. ఇదేవిధముగ నీ మనస్సు విషయములయందు రమించుటచే నశుద్ధమైనది.

ఉద్ధవుఁ డిట్లడిగెను:- "అయితే స్వామీ! ఈ అశుద్ధ మనస్సు శుద్ధ మగుటెట్లు! ఇది శుద్ధము కానిది. మీఁద నిలువనే నిలువదు."

భగవానుఁడిట్లనెను :- "శుద్ధమగు నుపాయమును నా చింతనమే మనస్సు నిలువకుండిన, మనస్సు నిలువకున్నను నుచ్చస్వరమున నా నామములను గీర్తించుము. నా కథలను మాటిమాటికి మనస్సు నిలువకుండినను వినుచుండుము. అట్లు చేయఁగా నెమ్మది నెమ్మదిగాఁ జిత్తము శుద్ధము కాఁగలదు. ఇంతవఱకు సాధనగా నుండినదియే చిత్తశుద్ధియైన తరువాతి సాధ్యము కాఁగలదు. నా చింతనమున శుద్ధమైన చిత్తమును నాయందు మాత్రమే కలుపుము."

ఉద్ధవుఁడిట్లనెను :- "స్వామీ! ఏమి విడువవలయునో దేనిని గ్రహింపవలయునో నాకు స్పష్టముగఁ జెప్పుడు."

ఇది విని భగవానుఁడు నవ్వి యిట్లనెను :- "ఉద్ధవా! ఈ విషయములు రహస్యముగఁ జెప్పదగినవి. ఇప్పుడు నీవు సమస్త విషయములను జవనికను దొలిగించి స్పష్టముగ వినఁదలచినచో నీకు జెప్పెదను. దానిని నీవు శ్రద్ధతో వినుము"

సూతుఁడిట్లనెను :- "మునులారా! భగవానుఁడు ధ్యానమును గూర్చి యేమిచెప్పెనో దానిని వర్ణించెదను. వినుఁడు."

# ధ్యానమునకు పాత్రత

శ్లో॥ స్త్రీణాం స్త్రీసంగినాం సంగం త్యక్త్వా దూరత ఆత్మవాన్।
క్షేమే వివిక్త ఆసీనశ్చింతయేన్మా మతంద్రితః॥.

శ్రీభాగ. ౧౧ స్కం. ౧౪ అ. ౨౯ శ్లో॥

వ॥ ఉద్ధవా! ఆత్మవంతుఁడగు వాఁడు స్త్రీల యొక్కయు, స్త్రీ సంగుల యొక్కయు సంగమును వీడి నిర్భయుఁడై, నిర్జన స్థానమందుండి నిరాలస్య భావముతో నన్నుఁ జింతింపవలయును.''

ఋషులు రెండానందములను గుఱించియే చెప్పియున్నారు. విషయానందము, బ్రహ్మానందము. కావున రెండే మార్గములు కలవు. కామ మార్గము, రామమార్గము. కామ మార్గమునకు సాధన స్త్రీ, రామమార్గమునకు సాధన భక్తి. కామమున్నచోట రాముఁడుండఁడు, రాముఁడున్నచోట కామమునకేమి పనియున్నది? రాముఁడెవరికిని పుత్రుఁడు కాఁడు. జగత్పతి కాముఁడు సంకల్పమునకుఁ బుత్రుఁడు. కావున రామమార్గమునఁ బోఁదలఁచినవాఁడు విషయ సంకల్పమును గలుగఁజేయు కాముని ద్యజింపవలయును. సంగమున సంకల్ప ముదయించును. కావున ముముక్షువులకు నిస్సం

గతయే ముక్తికి ప్రధాన సాధనము. విషయధ్యానము చేతను, జింతనము చేతను సంగము కలుగును. సంగ ముండినచోట కామోత్పత్తి కలుగును. మనస్సులోఁ గోరిక లుదయించినఁ జిత్తవృత్తి తదాకారకారిత మగును. ఈ కామమే. అనేక రూపములను ధరించి సంసార బంధనమును నధికాధికముగ దృఢ మొనర్చును. స్త్రీ పురుష సంగము శరీర ముదయిం చును. కావున శరీరధారియొక్క మనస్సులో దాగియుండిన కామన మనోనుకూల వస్తువును బొంది పైకుబుకును. దాని యెడల నాసక్తి జనించును. దేనిమీఁద నాసక్తి కలుగునో మనస్సు దాని కమ్ముడు వోవును. కావున ముక్తి నాశించు పురుషుఁడు స్త్రీ ఆసక్తిని, మోక్షము నాశించు స్త్రీ పురుషాసక్తిని విడువవలయును. వీ రిద్దఱును నీ యాసక్తులను విడువజాలనంతవఱకు హృదయమున భగవంతుని నిలుపు కొనఁ జాలరు. ఏలననఁగా హృదయ గహ్వరము చాల చిన్నది. దానిలో నిద్దరకు తావు లేదు. అచ్చట కోదండ రాముఁడైనను గూర్చుండ వలయును, కుసుమాయుధుఁడగు గాముఁడైనను గూర్చుండ వలయును. అంధకార ప్రకాశములు రెండును నొక్కచోట నుండుట అసంభవము.

శౌనకాది మహర్షులతో సూతుఁడిట్లనెను:- "మును లారా! ధ్యాన మొనర్చుటకు పాత్రత యెప్పుడు వచ్చునను

విషయమును గూర్చి చెప్పుచు భగవానుఁ డుద్ధవునితో నిట్లనెను :- "ఉద్ధవా! లోభము పడుటంత కఠిన కార్యము కాదు. చాలమంది మత్సర, ప్రమాదాది దుర్గుణములను గూడ వదలెదరు. కాని యీ కామమును జయించుట చాల కఠినము, గొప్ప గొప్పత్యాగులును, తపస్వులును దీని మాయలోఁ బడిపోయినారు. పూర్వజన్మ సంస్కార కారణమున విషయముల వైపునకు మనస్సు పరువిడుచుండును. భగవంతుని వైపునకుఁ ద్రిప్పుటకు చాల ప్రయాస పడవలసి వచ్చును. ఈ ప్రయాసకే సాధనమందురు. సాధకులైనవారు మును ముందుగా స్త్రీలను, స్త్రీ సాంగత్యమొనర్చువారలను శాశ్వతముగఁ ద్యజింపవలయును. దేనినిఁజింతించుచుందు మో దానియం దాసక్తి కలుగును. స్త్రీ చింతనమునను, స్త్రీ దర్శనమునను, స్త్రీ స్పర్శనమునను మానవుఁడు సాధన నుండి చ్యుతుఁడగును.

భగవానునితో నుద్ధవుఁ డిట్లనెను :- "స్వామీ! తల్లిని, సోదరిని, గురుపత్నినిఁ దాకుచునే యున్నాము. స్త్రీ మాత్రమును దాకరాదనుచున్నారేమి ?

అంత భగవానుఁ డిట్లనెను :- "ఉద్ధవా! నేను నీయింటివారి సంగతి చెప్పుటలేదు. బ్రహ్మ రతిని సృజింపఁ గానే అందఱకును నా మెను బొందవలయుననుగోరిక కలిగెను.

బ్రహ్మయొక్క చిత్తమును జంచలమయ్యెను. అప్పుడా మెను గామదేవునికిచ్చి వివాహమునుగావించి యిట్లనెను:- "బాల్య కాలమున నీయందు దోషముండదు. కావున యువకుండైన తరువాత తన తల్లిని, సోదరిని పుత్రికనైనను నేకాంతమునఁ దాఁకరాదు. ఈ నియమము గృహస్థులకు. త్యాగులయొక్క నియమమింకను కఠినమైనది. సజీవ స్త్రీలసంగతి నట్లుంచి స్త్రీల చిత్రములనైనను జూడరాదు. కొయ్యతోఁ జేయఁ బడిన స్త్రీని పాదాంగుష్ఠమున నైనఁ దాఁకరాదు."

ఉద్ధవుఁడిట్లనెను :- "స్వామీ ! కొయ్యబొమ్మను దాఁకిన నేమిహాని కలదు ? కొయ్య కొయ్యయేకదా !"

భగవానుఁ డిట్లనెను:- ఉద్ధవా! ఈధూర్త మనస్సును నమ్మరాదు. తపోబలమున్నను నిది విషయముల వైపునకే వ్రాలును. అప్పుడింకను ననర్థము కలుగును. ఈవిషయమున నీవొక దృష్టాంతమును వినుము.

ఒక తపస్వితపస్వియును, త్యాగియును, విరాగియునై యుండెను. ఏకాంతమున నుండి, ఎండుటాకులను దినుచు, యమునలో స్నానమొనర్చుచు నెవరివైపునను జూడనే చూడఁడు. నిరంతరము తపోనిరతుఁడై యుండుచు, తపస్సు చేయఁగా నాతనికి సంకల్పసిద్ధి కలిగెను. ఆతనికి సంకల్పసిద్ధి కలిగినదని మనికి తెలియదు.

ఒకదినమాన ముని స్నానమొనర్చి తిరిగి వచ్చుచుండెను. అప్పుడాతని పాదమొక కొయ్యబొమ్మకు తగిలెను. ముని దానినిఁ దీసెను. కళాకారుఁడెవండో చాలసుందర మూర్తినిఁ జేసినాఁడనుకొనెను. ముని కుతూహల వశమున దానినిఁ దన కుటీరమునకుఁ గొనితెచ్చెను. కమండలువట్లుంచి, దానిని శ్రద్ధగా జూడసాగెను. మూర్తి చాల సుందరముగఁ జేయఁబడినది. దానిలో స్త్రీ చిహ్నములు మిక్కిలి స్పష్టముగను సుందరముగను నిర్మింపఁబడెను. ముని దానిని అర్ధోన్మీలిత నేత్రములతోఁ జూచుచు నట్లే నిలిచిపోయెను. వెంటనే అతని మనస్సులో నీమూర్తి సజీవమైనదైనచో బాగుగా నుండెడిదనుకొనెను.''

ఇన్ని దినములు తపస్సును జేయుచుండినను ముని యేకోరికను గోరలేదు. దీనివలన నాతని యిష్టదైవము, ఈతఁడేమియును గోరుటలేదు కావున నీతని కోరికను నెఱవేర్చవలయుననుకొనెను. సహృదయుఁడు తనను స్తుతించువారియెడలను, బూజించువారి యెడలను గృతజ్ఞతను జూపించును. తన భక్తుఁడు కోరిన కోరికను భగవంతుఁడు నెఱవేర్చఁ దలఁచెను. వెంటనే ఆకొయ్య బొమ్మ సజీవ మూర్తి యయ్యెను. మునికి మిక్కిలి ఆశ్చర్యమును, గుతూహలమును, గలిగెను. ఆతఁడామెను వడిలోనికిఁ దీసికొనెను. ఇట్లను

కొనెను:- "ఈమె పెద్దదైనచో నీమెతో మాట్లాడవచ్చును గదా!" ఇట్లను కొనుచుండఁగనే ఆమె పెద్దదయ్యెను. ముని ఆమెను ప్రేమ పూర్వకముగ నాలింగన మొనర్చు కొనెను. రెండు విభిన్న లింగములవారు ఒకరినొకరు తాఁకినచో, వారి మనస్సు లాకర్షింపఁబడును. వివశులై పోవుదురు. ఆ సమయమున సంయమ, సాహసములు పారిపోవును.

ఇప్పుడు ముని తపస్సును గిపస్సును మఱచిపోయెను. బాబాజీ బాబయ్యెను. ఒకరిద్దరు పిల్లలును బుట్టిరి. తపస్స బొత్తిగా లేకుండపోయెను. స్త్రీ ప్రతిదినము నేవేవియో అడుగుచుండెను. నేఁడివి లేవు, రేపవి కావలయుననుచుండెను. ఒక దినమున ముని దుఃఖితుఁడై చాల ధనము కావలయు ననుకొనెను, కాని అది నెఱవేరలేదు. ఎట్లు నెఱవేరఁ గలదు. తపశ్శక్తియంతయును బోయినది. ఒక్కసారి కల కండను దినిన నీఁక దానిని మఱచుట ఉండదు. మునికి తాను తపస్సుచేసిన రోజులు జ్ఞాపకమునకు వచ్చెను. ఆతఁ డిట్లనుకొనెను :- "అయ్యో! నేనెంతగా భ్రష్టుఁడనైతిని! కొయ్య స్త్రీ బొమ్మను బాదముతోఁ దాఁకుటచేతనే నాకిట్టి పతనము కలిగినఁ ద్యాగివేషమును వైచుకొని యువతులతో నుండినఁ బతనము కాకుండుట అసంభవము కాఁగలదు. నేను నా యనుభవమునఁ గొయ్యతోఁ జేయఁబడిన స్త్రీ మూర్తి

నైనఁ భాగాంగుష్ఠముచే నైనఁ దాఁకరాదని చెప్పి చున్నాను. కొయ్య ఆడువనుఁగునుగాంచి మగయేనుఁగు వలలోఁ బడిపోవుచున్నది.'' అని పలుకుచు నాతఁడన్నిటిని వదలి తపస్సును జేసికొనుటకై వెడలిపోయెను. శ్రీకృష్ణ చంద్రుఁ డుద్ధవునితో నిట్లనెను :- "ఉద్ధవా! కామినీ సంగ మునకు మించిన పతన కారణము కాముక పురుషుల సాంగ త్యము. ఎవరెట్టి యాలోచన మొనరించుచుందురో, వారి శరీరమునుండి అట్టి సంస్కారము గల పరమాణువులే వెలు వడుచుండును. ధూమ్రపాన మొనర్చు వారి నోటినుండియును, శరీరమునుండియును నా దుర్గంధము వెలువడుచుండును. ధూమ్రపాన మొనర్చువాని గగ్గఱ ధూమ్రపాన మొనర్పని వాఁడు కూర్చుండిన నాతఁడు ధూమ్రపాన మొనర్పకుండిన సను దానినిఁ బీల్చుచునే యుండును. కొన్నాళ్ల కాతనికి కోరిక జనించును. ఒకటి రెండు సార్లు వినోదమునకుఁ ద్రాగును. తర్వాత నదియే అభ్యాసమగును. ధూమ్ర పర మాణువులు సమీపమున నుండినవారి శరీరమందు ప్రవే శించునట్లు కామక్రోధమునకు సంబంధించిన పరమాణువు లును ప్రవేశించును. మన సోదరియున్న దనుకొనుఁడు. ఇరు వైపులను శుద్ధభావము కలదు. ఏ విధముగ నైనఁ బురుషుని మనస్సులోనికిఁ బాపమువచ్చినచోఁ బాపభరిత దృష్టితోఁ నా సోదరినిఁ జూఁచినచో నామె మనస్సును వికార

యుక్తము కాఁగలదు, కన్నులే భావమును స్పష్టముగఁ జెప్పును. వానినుండి భావకిరణములు వెలువడుచుండును. కాముకుని శరీరమునుండి కామము నుత్పన్న మొనర్చు పరమాణువులు వెలువడి సమీపముననుండు వారి మనస్సును గూడ కామయుక్తముగ నొనర్చును. మహాత్ముల శరీరము నుండి సాధుతా పరమాణువులు వెలువడుచుండును. కాని సద్గుణములు కంటె దుర్గుణముల ప్రభావమతి శీఘ్రముగఁ బడును. కావున ముముక్షువులగు వారును, బరమార్థ పథికులును స్త్రీ సంగ మొనర్చువారి సంగమును దూరముననే త్యాగ మొనర్ప వలయును. సౌభరి మహర్షి కెవరి సంగమును లేదు. జలములోపల మునిఁగి తపస్సు చేసికొనెడు వాఁడు. ఆ జలములలో నాతఁడు మైథున మొనర్చు మత్స్యమును గాంచెను. ఆ జలచర జీవులయొక్క మైథున ప్రభావమాతనిపైఁబడెను. ఆతఁ డిట్లనుకొనెను :- "నేను తపస్సులోనే కాలమును గడిపితిని. ఈ మత్స్యము లేగృహస్థ సుఖము ననుభవించుచున్నవో దానిని నేననుభవింపలేదు. దీనిలో నేమున్నదో?" ఈ సంకల్పము రాఁగానే ఆతఁడు త్యాగియయ్యును గృహస్థుఁడై యేఁబదిమంది రాజకుమారి కలను వివాహ మాడెను. చివరకు పశ్చాత్తాపమును జెంది యేడ్చి యేడ్చి యిట్లనెను:- "ముముక్షువులగువారు మిథున

ప్రతుల సాంగత్య మెన్నటికిని జేయరాదు. ఇంద్రియములను బాహ్య విషయముల మీదకు బరువిడనీయరాదు."

భగవానుఁ డిట్లనెను:- "ఉద్ధవా! ఈ ఉదాహరణము లిచ్చుటకు గారణమేమనఁగా ముముక్షువులగు వారు సంగముచేఁ గామపరవశులై తన శరీరము మీఁదఁబడు వారితో సాంగత్య మొనర్పరాదు. కాముకుల యొక్కయు, గామినుల యొక్కయు సాంగత్యమును వదలినవాఁడే ధ్యాన మొనర్చుట కధికారియగును"

అంత నుద్ధవుఁ డిట్లడిగెను:- "ప్రభూ! ఇప్పుడు నాకు ధ్యానమును గూర్చి చెప్పుము. సాధకుఁడెట్లు ధ్యాన మొనర్ప వలయును? ఏ రూపమందు ధ్యానమును లగ్న మొనర్ప వలయును, ఏ భావముతో మీ ధ్యాన మొనర్ప వలయును. దయయుంచి నా యీ ప్రశ్నలకు సమాధాన మొసంగుఁడు."

అంత భగవానుఁ డిట్లనెను :- "మంచిది ఉద్ధవా! ఇప్పుడు నీకు నేను ధ్యానమును గూర్చి ఉపదేశించెదను. నీవు దానిని శ్రద్ధతో వినుము."

సూతుఁ డిట్లనెను:- "మునులారా! ఏ విధముగ భగవానుఁడు ధ్యాన మొనర్చు విధిని గూర్చి చెప్పెనో దానిని వర్ణించెదను. వినుఁడు".

—॥—

# ధ్యాన పద్ధతి

శ్లో॥ ధ్యానేనేత్థం సుతీవ్రేణ యుంజతో యోగినో మనః ।
సంయా స్యత్యాశు నిర్వాణం ద్రవ్యజ్ఞాన క్రియాభ్రమః॥

శ్రీ భాగ. ౧౧ స్కం ౧౪ అ. ౪౬ శ్లో॥

వ. ఉద్ధవా! ఈ విధముగ యోగి అత్యంత తీవ్ర ధ్యాన యోగము ద్వారా చిత్తమును సంయమము కావించి నచో నాతని చిత్తమునకు ద్రవ్య, జ్ఞాన, కర్మ సంబంధము లగు భ్రమ లతిశీఘ్రముగ నివృత్తియగును.

ధారణా ధ్యాన సమాధులకే సంయమమని పేరు. ఆసనప్రత్యాహార, ప్రాణాయామములు బాహ్యసాధనములు. వీని ద్వారా ధ్యానసిద్ధికలుగును. సిద్ధించిన ధారణయే ధ్యాన రూపమునc బరిణతినిc జెందును. ధ్యానముయొక్క పరి పక్వావస్థకే సమాధియందురు. ఈ శరీరము దోషనిలయము. దీనినిండ మలములే కలవు. నవద్వారములనుండి నిరంతరము మలములే స్రవించుచుండును. దర్పణమునకు ముందేవస్తు వును దీసికొనివచ్చిన నట్టి ప్రతిబింబమే దానిలోc గనc బడును. శరీరములో నుండునవి ముఖ్యముగ దశప్రాణములు అవి శరీరముయొక్క నాడులలో సంచారమొనర్చుచుండును. నాడులు శుద్ధముగ నుండినచో ధ్యానమును శుద్ధముగ నుం

డును. నాడులశుద్ధముగ నుండిన ధ్యానమును నశుద్ధమల యుక్తముగ నుండును. మునుముందుగా ధ్యానమును జేయఁ దలంచినవాఁడు నాడీశుద్ధినిఁ గావించుకొనవలయును. కొందఱు నాడీ శుద్ధికొఱకు ధౌతి, నేతి, నౌలిమొదలగు షట్క్రియ లను జేయుచుందురు. కాని వీనివలన నాడులు పూర్ణముగ శుద్ధముకావు. లోపలనుండిన మలమవశ్యము తగ్గితీరును, కాని నాడులలో నిండిన సూక్ష్మాతి సూక్ష్మమలములు ఒక విశేష ప్రాణాయామము ద్వారా మాత్రమే శుద్ధి యగును .దీనికి స్థూలమగు గుర్తు యేమనఁగాఁ గూర్చుండి నను, నిలుచుండినను. నడుచుచుండినను, దిరుగుచుండి నను సర్వకాలములయందును సుషుమ్నానాడి కనఁబడు చుండును. శరీరములోఁ జాలనాడులు కలవు. కాని సుషుమ్న ప్రధానమైనది. అది గుదస్థానమునుండి మస్తకము వఱకు నుండును, సమస్త నాడులును సుషుమ్ననుండియే బయలు దేరును. వీపున గుదస్థానమునుండి మస్తకము వఱకును వెన్నముక కలదు. అది ఒక్క యెముక కాదు. ఒకదానిపై నొకటిగఁ గ సేరుకలు పేర్చఁబడినవి. వానిమధ్య రంధ్రము లుండును. దానిలో మజ్జాపదార్థముండును. దానిమధ్య నిలువుగ సుషుమ్నానాడి కలదు. దాని ప్రక్కలకుండా వేలకొలఁది నాడులు బయలుదేరి శరీరమంతయును వ్యాపించి నవి. సుషుమ్నవలననే జీవనము. సుషుమ్నానాడి శరీరము

నుండి వేత్తైనచోఁ బ్రాణి వెంటనేమరణించును. కులకుండలినీ శక్తి గుదముదగ్గఱకల మూలాధార చక్రమున సుషుమ్నా ముఖమును దన తోఁకతో నాపియుంచి మూఁడున్నర చుట్లు చుట్టుకొని నిద్రించినట్లు పడియుండును. ఏవిధముగనైన సుషుమ్నా ముఖము తెఱచుకొని, ఆ కుండలిని తిరిగి యా సుషుమ్నా ద్వారమందే ప్రవేశించి, షట్చక్రములను భేదించుచు సహస్రార చక్రమునందుకొనిన సదాశివ సచ్చిదానంద ప్రాప్తి యగునుగాని అన్యథా కాదు. తీవ్రధ్యానము చేతనే కుండలినీ ఉత్థానము కలుగును. అది ఊర్ధ్వగామినీయైనపుడు సమాధి సుఖము సంప్రాప్తించును.

సూతుఁడు శౌనకాది మునులతో నిట్లనెను:- "మును లారా! భగవానుని ఉద్ధవుఁడు ధ్యానము విషయమడుగఁగా భగవానుఁడిట్లనెను :- "ఉద్ధవా! ధ్యానముకొఱకు మును ముందుగా నాసన మత్యంతావశ్యకము కాఁగలదు. యోగ మాసనము తోడనే ప్రారంభమగును. యమనియమము లన్ని సాధనలందును నవసరమే అవి లేక సాధనప్రవృత్తి యుండదు. అందువలన నవి వ్యాపకములు. ముందుగా నాసనాభ్యాసమును గావింపవలయును. నరములను, నాడులను మృదులము లొనర్చుటకై అనేకాసనములు కలవు. ఆసనములు తెలిసినవారు ఎనుబదినాలుగు లక్షల ఆసనములు

కలవని చెప్పుదురు. అనఁగా నెన్ని యోనులు కలవో అన్ని ఆసనములు కలవు. కాని యీ యాసనము లన్నిటిలోను బద్మాసనము, సిద్ధాసనము, సహజాసనము (సుఖాసనము) స్వస్తికాసనమును ముఖ్యములు. ఏయాసనమునఁ గూర్చుండి నను వెన్నెముకను నిలువుగ నుంచవలయును. శరీరమును సమభావముతో స్థిరముగ నుంచవలయును. శరీరమునకే యాసనమున సుఖము కలదో, మడమలు నేల కానించి దానిలోఁ గూర్చుండవలయును. ఆసనమును వేసికొని, శరీరమును నిక్కబొడచి, చేతులను వడిలో స్వాభావికముగ నుంచుకొనవలయును. ఇప్పుడు చేతులు, కాళ్ళు, మొండెము వీని సంయమము జరిగినది. అనంతరము శిరస్సును సంయమము కావింపవలయును. దృష్టినిఁ జంచలము కావింపరాదు. కన్నులను బూర్తిగా మూయనురాదు, పూర్తిగాఁ దెఱవను గూడదు. పూర్తిగా మూసిన నల్పకాలముననే నిద్రవచ్చును బాగుగాఁ దెఱచి యుంచినచో దృష్టి చంచల మగును. కావున నర్ధోన్మీలిత నేత్రుఁడవై యుండవలయును. ఇతర వస్తువులను గాంచిన సంకల్ప వికల్పములు చెలరేగును. అందువలన నాసాగ్రమున దృష్టిని నిలుపవలయును. అనంతరము ప్రాణాయామము ద్వారా నాడీ శోధన మొనర్పవలయును.''

ఉద్ధవుఁ డిట్లడిగెను:- "స్వామీ! నాడీ శోధన మెట్లు స్వామీ!"

భగవానుఁ డిట్లనెను:- "ముందుగా వాయువును శ్వాసద్వారా లాగి పూరింపవలయును. పూరకమనఁగా గాలిని నింపుట. ఆవాయువును గుండలోపలె బిగింపవలయును. దీనిని కుంభకమందురు. అనంతరము దానిని విడువవలయును. దీనిని రేచకమందురు. ముందుగా శ్వాసాయామమును గావించి అనంతరము ప్రాణాయామ మొనర్పవలయును."

ఉద్ధవుఁ డిట్లనెను:- "స్వామీ! శ్వాసాయామ మన నేమి? ప్రాణాయామ మననేమి?

భగవానుఁ డిట్లనెను:- "శ్వాస వ్యాయామమునకు శ్వాసాయామ మందురు. నాసికా ఛిద్రములద్వారా శ్వాస ప్రశ్వాసలను దీసికొని దానితోఁ బూరక, కుంభక, రేచకముల నొనరింప వలయును. ముందుగా నెడమ ముక్కుతో గాలినిఁబీల్చి, అనంతరము కుంభక మొనర్చి, తరువాత మెల్లగా రేచింపవలయును. ఇట్లు చేయుటచే హృదయ నాడులు శుద్ధములగును. అనంతరము ప్రాణాయామ మొనర్ప వలయును. నోటితో మనము తిను అన్నమును, త్రాగు జలమును ఆహార నాళముద్వారా పక్వాశయములోనికిఁబోవును. అన్నజలములతోఁ గూడ దానిలోనికి వాయువును బోవును.

కడుపునిండఁగానే త్రేపు వచ్చును. త్రేనుపనఁగానేమి కడుపు నిండినదని ప్రాణవాయువు తెలుపుచున్నది. ఏమార్గమున లోపలినుండి బయటకు వాయువువచ్చినదో, ఆ మార్గముననే బయటనుండి లోపలికి గాలినిఁ దీసికొనవలయును. మొదట వాయువు నిలువదు. నీవు లోపలకు గ్రహింపఁగనే మరల త్రేపువలెనే బయటకు త్రోసికొనివచ్చును. కారణమేమనఁగాఁ బక్వాశయమందలి నాడులన్నియును మలావృతములైనవి. ఎంతగా బయటివాయువు పక్వాశయములోనికిఁ బోవునో, అంతగానది సమస్త నాడులందును విశేష సంచారమొనర్చి మలమునంతను నొక్క స్థానమునకుఁ జేర్చును. హృదయము పైనఁ గఫస్థానము కలదు. కావున శరీరమునఁ గల వికృతకఫమేది కలదో అది నోటిద్వారా బయటకు వచ్చును. నాభికి క్రిందవాయువు, మలము నిలిచియుండును. సంచిత మలమును, అశుద్ధవాయువును నపానవాయువై మలద్వారమున బయటకువచ్చును. ఆ సమయమున నపానవాయువు మిక్కిలి వేగముతో శబ్దమొనర్చుచు బయటకు వచ్చును. నాడీ శుద్ధియైనట్లొకే గుర్తుకలదు. వాయువును బయటనుండి తీసికొనఁగానే, అది పొట్టలోనికిఁ బోయి, పక్వమై వెంటనే అదే వాయువు అపానవాయువై మలద్వారమున వెలువడినచో నాడీ శుద్ధియైనట్లు తెలిసికొనవలయును అనంతరము పానముచేసిన వాయువు నపానము

ద్వారా వదలక శరీరమునందే జీర్ణింపఁజేసికొనినచో సాధకున కాహారమెక్కువ అవసరము లేదు. వాయువే ఆహారము కాఁగలదు. కొంచెముగ నన్నముండినఁ జాలును. చక్కగా సరిపోవును. నాడీశుద్ధి కాఁగానే శరీరము కృశించును. ముఖ మండలమునఁ దేజస్సు స్పష్టముగ నుట్టిపడుచుండును. శరీరము రోగరహితమగును. జిహ్వాలోలత్వముండదు. వాక్కు మిక్కిలి మధురముగ నుండును. మలమూత్రములు దుర్గంధ హీనములుగను, సూక్ష్మముగ నగుచు, ఈ విధముగ నాడీ శుద్ధి కాఁగానే ధ్యానమొనరింపవలయును. ధ్యానము సగర్భ మనియు, నగర్భమనియు రెండురకములు."

ఉద్ధవుఁ డిట్లనెను:- "స్వామీ! సగర్భధ్యానమెట్లు? అగర్భధ్యానమెట్లు?"

భగవానుఁ డిట్లనెను:- "నా సాకారరూపమును ధ్యానించుటకు సగర్భధ్యానమందురు, నా నిరాకారరూప మును ధ్యానించుటకు అగర్భ ధ్యానమందురు. ఇదే విధ ముగఁ బ్రాణాయామము సగర్భమని యు నగర్భమనియు రెండువిధములు. ఓంకార సహితమైనది సగర్భము. ఓంకార రహితమైనది అగర్భము. ముందుగాఁ బ్రాణాయామము ద్వారా నిరంతరము మ్రోగు ప్రణవధ్వనిని శ్రవణమొనర్ప వలెను. హృదయమున నిహితమైనఁ గమలనాళమువలె

నోంకారమును ప్రాణముద్వారా పైకి తీసికొనిపోయి దాని యందు శబ్దకల్పన మొనర్పవలయును. చిత్తము చంచలమగు నంతవఱకు ఆ ధ్వని వినఁబడదు. చిత్తవృత్తుల నన్ని వైపులనుండియు నిరోధించి, వాని నాధ్వనియందు లగ్న మొనర్చినచో నాస్వరమందు ఘంటానాదమును స్థిర మొనర్ప వలయును. అనఁగా ఘంట నాదమగుచున్నట్లు భావింపవలయును. అశబ్దమందు మనస్సురమించినచోఁ ప్రాణము స్థిరమగును. ప్రాతఃకాలమునను, మధ్యాహ్నమునను, సాయంకాలమునను, బది పది ప్రాణాయామము లొనర్పవలయును. దానిలో నాశబ్దమును వినవలయును, ఇట్లు జేయుటచే నాడీ శుద్ధియైన తరువావాత రమారమి ఒకమాసము లోనే సాధకుఁడు ప్రాణవాయువును జయింపఁ గలుగును. అప్పుడతని మనస్సు స్థిరమగును. మనస్సు స్థిరమైనచో ధ్యానము నిలుచును:"

ఉద్ధవుఁడిట్లడిగెను:- "ధ్యానమెట్లు చేయవలయును? స్వామీ!"

భగవానుఁడిట్లనెను:- "అంతకరణమందొక హృదయ కమలము కలదు. అది అష్టదళ పద్మము. దాని ముఖము అధోముఖముగ నుండి మూసికొని యున్నది. ధ్యాన సమయము నూర్ధ్వముఖమై వికసించినట్లు భావింపవలయును.

ఆ యష్టదళ పద్మమునందు నన్ను ధ్యానింపవలయును. ఈ యష్టదళములకును మధ్య నుండిన స్థానమునకు కర్ణిక యందురు. దానిలో జీలకఱ్ఱలవలెఁ బసుపుపచ్చని కేసరము లుండును. ఆ కర్ణికయందే నా మనోహరరూపమును ధ్యాన మొనర్పవలయును. ఆ కర్ణికయం దాసనము వేయఁబడిన దనియును, ఆ యాసనము సూర్యచంద్రాగ్నులకు సంబంధించినదనియు, ప్రథమగోళము సూర్యమండలమనియును, ద్వితీయగోళము చంద్రమండల మనియు, దాని లోపలఁ ద్రికోణాకారము కలది అగ్నిమండలమనియు, నా యగ్ని మండల మధ్యమున నంగుష్ఠప్రమాణము గల అత్యంత తేజస్వరూపమును భావింపవలయును. నా ధ్యానము సమస్త శోక మోహములను, జింతలను దూర మొనర్చు పరమ మంగళప్రదమని భావింపవలయును.''

ఉద్ధవుఁడిట్లడిగెను :- ''స్వామీ ! మీ రూపము నెట్టిదిగా భావింపవలయును ?''

భగవానుఁడిట్లనెను :- ''ఆ సమయమున సాధకుఁడు నా పరమ మనోహరరూపమును ధ్యానింపవలయును. నా అంగ ప్రత్యంగము లత్యంత సౌందర్యవంతములనియును, శరీరము సుందర, సుదృఢ, మనోహరమనియు భావించుచు సమస్త శరీరమును ధ్యానింపవలయును, ముందుగా ముకుట

యుక్తమును, ఉంగరములు తిరిగి నల్లగానుండిన వెండ్రుకలు కల నా శిరస్సును ధ్యానింపవలయును. అనంతరము చందన చర్చితమగు మస్తకమును, అనుపమాద్భుతాననమును ధ్యానింపవలయును. ఆ ముఖమున మందహాసముతో నున్నట్లు చూడవలయును. అనంతరము నల్లగఁ దుమ్మెద రెక్కల వలె నుండు నా కనుబొమ్మలను ధ్యానింపవలయును. తద నంతరము ఉత్ఫుల్ల సరోజ దళ సదృశములగు నా కన్నులను, నిరంతరము కృపాకిరణములను ప్రసరింపఁ జేయుచున్నట్లు భావింపవలయును. ఆ చూపులు శరణాగతులపై ననుగ్రహ వృష్టినిఁ గురిపించుచున్నట్లు చూడవలెను. ఆ తరువాత నుబ్బెత్తుగను గుండ్రముగను, అద్దములవలె నుండు నిద్దంపు చెక్కిళ్ళను, ఆ చెక్కిళ్ళలో సాధకుని రూపము కనఁబడు చుండినట్లు ధ్యానింపవలయును. మకరాకృత కుండలము ప్రేలాడుచు, సంసార సంతాప సంతప్త ప్రాణుల కాశ్వాస మొనర్చునట్లుండి, ఉంగరములు తిరిగిన నలకావళులచే నావృతమైన గర్ణములను ధ్యానింపవలయును. అనంతరము బులాకినిఁ బెట్టుకొని, నాసికాపుటములనుండి అమృతమయ శ్వాసలను విడుచుచుఁ బ్రపంచమందలి సమస్తామంగళము లను నాశ మొనర్చు నాసికను ధ్యానింపవలయును. అనంత రము సుందరు శుభ్రస్వచ్ఛ దంతయుక్తమగు ముఖమును ధ్యానింపవలయును. అవి రెండు అధరములచే నావృత

మైనట్లును, మందహాసముచేఁ గొంచెముగ వికసించినట్లును, తాంబూల చర్వణ మొనర్చుటచేఁ గొంచెముగ నెఱ్ఱగ నున్నట్లు భావింపవలయును, రసభరిత బింబాఫలములవలె నుండి, అధరామృతపాన మొనర్చుటకై వ్యగ్రతను జెందు, రసపరిపూర్ణములగు నధరములను ధ్యానింపవలెను. ఆ యధరోష్టమును దాకిన నందుండి సుధారసము వెల్లుబుకు నట్లు భావింపవలయును. నల్లని పుట్టుమచ్చ కలిగి కృష్ణ హృదయము కలవారి నాశ్వాసించు చిబుకమును ధ్యానింప వలయును, దానిక్రింద శంఖమువలె నత్యంత మనోహరము గను, వనమాలను ధరించినదియు నగు గంతమును ధ్యానింప వలయును. సింహశాబకమునకు వలె విశాలమును, గండ పట్టినదియు నగు స్కంధములను ధ్యానింపవలెను. వాని నుండి శాఖలవలె నున్న బాహువులను ధ్యానింపవలయును. అనంతర మాజాను దీర్ఘములును, వ్రజాంగనలను గృతార్థ మొనర్చినవియును, భక్తవరదములును, శంఖ, చక్ర, గదా, పద్మాద్యాయుధములచే శోభించునవియు, బాజుబందుల చేతను, అంగుళీయకముల చేతను శోభించునవియు నగు బాహువులను ధ్యానింపవలయును, శరీరమంతయును, నీల వర్ణముగ నున్నట్లును, కాని కనుకొలుకులును, కపోల మధ్య భాగమును, అధరమును, ఓష్ఠములును, అఱచేతులును, నఖములును, పాదతలములను రక్తవర్ణముగ నున్నట్లు

భావింపవలయును. బాహువులను ధ్యానించిన తరువాత లక్ష్మీనివాసమును శ్రీవత్స చిహ్నశోభితమును, విప్రపాద లక్షితమును, విశాలమును, విస్తృతమును, హార, కంఠ, కౌస్తుభమణి, వనమాలా శోభితమును, ఉన్నతముగ నుండిన స్తనద్వయమందలి చందన చర్చితమైనదియును, దాని యందలి సుగంధము నాఘ్రాణించుటకు వ్రజాంగన లుద్వేల్లాయు నదియు, నా రాలింగన మొనర్చుకొని విహ్వాలలై, ఆత్మ విస్మృతినిఁ జెందు గోపాంగనలకుఁ బ్రియమైనదగు వక్షస్థల మును ధ్యానింపవలయును. గంభీరమును, సుడిగుండమువలె లోతుగ నుండునదియును, శ్వాసప్రశ్వాసలచే నిరంతరము పైకి క్రిందకు వచ్చుచుండునదియు నగు నానాభిని ధ్యానింప వలయును. విద్యుత్తువలెఁ బట్టు పీతాంబరము కట్టఁబడినది యును, ఝుణ ఝుణ మ్రోగు బంగారు మువ్వలు కట్టఁబడి నదియు, పీతాంబర మావరించుటచే స్థూలనితంబముల శోభ నినుమడించునదియు నగు నా నడుమును ధ్యానింపవలయును, కదళీవృక్ష స్తంభముల వలె నుండి, పీతాంబరావృతమైన పిక్కలను ధ్యానింపవలయును, తరువాత మడిమలను, గిలక లను ధ్యానించి, అనంతరము నూపుర యుక్తములకు నా చరణద్వంద్వమును ధ్యానింపవలెను. భక్తులకు సర్వస్వ మవియే. వాని ధూళికొఱకు బ్రహ్మాది దేవతలందఱును సదా ఉవ్విళ్ళూరుచుందురు. వాని యందలి నఖప్రకాశము

భక్తుల హృదయాంధకారమును నిరంతరము నాశముచేయు చుండును.

ఈ విధముగ విభిన్నాభరణ యుక్తమును, సుందర హృదయంగమ, సుకుమారమును మధురాతి మధురమునగు రూపమును ధ్యానించి, దానియందు చిత్తమును లగ్న మొనర్ప వలయును. ఇదియే ధ్యానపరాకాష్ఠ. ఇదియే పరిపక్వమై సమాధిరూపమును జెందును, ఆ సమయమున సాధకుఁడు నన్ను గాక యింకేమియును జింతింపరాదు. ఆతని దృష్టిలో నామనోహర రూపము తప్ప చింతనీయమగు వస్తు వేదియును నుండదు.

సగుణోపాసకులు గాక నిర్గుణోపాసకులు నాయీరూప ధ్యానమును సాధ్యరూపమునఁ గాక సాధన రూపమునఁ జిత్తమును స్థిరమొనర్చుటకై భావనచేయవచ్చును. వారికి రూపమునందనురాగ ముండదు. వారరూపోపాసకులు, కావున నిట్టి సాధకులును మొదట నా రూపమును ధ్యానింప వలయును. దేహమొక రథము. ఇంద్రియములు గుఱ్ఱములు. మనస్సు పగ్గము. బుద్ధి సారథి. జీవుఁడే రథికుఁడు. ప్రాప్య స్థానమును నేనే. ఇంద్రియములు స్వభావవశమునఁ బుట్ట గుట్టలలోనికి బోవుచుండును. కావున బుద్ధి రూపమగు సారథి సహాయమున మనస్సును బగ్గమును లాగి, ఇంద్రియములను

సుష్టిములను ప్రపంచము వైపునకుఁ బోనీయక నావైపునకు మరలింపవలెను. సర్వాంగ సుందరుఁడనగు నా సమీపము నకే యీ శరీరమును రథ సహాయముచేఁ జేరవలయును. గంతవ్య స్థానమును నేనే. నేనే కామ్యను, నేనే పరాగతిని.

నిర్గుణోపాసకుఁడు ముందుగా సమస్త విధములఁ జిత్తమును లాగి నాసుందర సర్వాంగములందు మనస్సును లగ్నమొనర్పవలెను. తరువాత సర్వాంగములనుండి చరణ ముల మీఁదనో, హృదయ మందునో, ముఖమునందునో, ఏదో ఒక స్థానమున మనస్సును స్థిరమొనర్పవలయును. అంత నామందహాస సుందర వదనార విందమునందు మనస్సును స్థిరమొనర్ప వలయును. ఇప్పుడు ముఖార విందమునందు బాగుగాఁ జిత్తము స్థిరమగుచో. నంతదాని నచ్చటినుండి తీసి రూపములేని ఆకాశమందు స్థిరమొనర్ప వలయును. ఆకాశమందు స్థిరమైన తరువాత నా శుద్ధ సచ్చిదానంద నిర్గుణరూపమును ధ్యానింప వలయును.

ఉద్ధవుఁ డిట్లనెను:- "స్వామీ! నిర్గుణమై, యేరూప మును లేకుండిన దానిని ధ్యానించు టెట్లు? అరూపధ్యానమును జేయు టెట్లు?"

భగవానుఁ డిట్లనెను:- "ఉద్ధవా! ఈవిషయ మత్యంత కఠినమైనది. దేహధారికి అరూప ధ్యాన మొనరించుట

సహజము కాదు. అత్యంత కఠినము. ఇచ్చట రూపమనఁగా జ్యోతి. నిర్గుణోపాసకుఁడు జ్యోతిర్ధ్యాన మొనర్చును. దేహముయొక్క పరిచ్ఛిన్నతను బోనాడి అపరిచ్ఛిన్నత యందు దానినిఁ గలుపును, ఒక అగ్ని మిణుగురును దీసికొని పోయి ప్రజ్వలితమగు మహాగ్నిలో విలీన మొనరించిన, నా అల్పాగ్ని తననామ రూపములను వదలి మహాగ్నిలో విలీనమగును. ఒక జలబిందువును దీసికొనిపోయి సింధువు నందు గలిపిన దాని నామ రూపములను వీడినది. ఇదే విధముగఁ జిత్తము వశీభూతమై స్థిరమైన తరువాత ద్వైత ముండదు. సాధకుఁడు తనలో నన్నును, నాలోఁ దనను జూచును. ఇది చెప్పుటకును, వినుటకును, తర్కవితర్కము లొనర్చుటకును వీలగునది కాదు: శాస్త్రార్థ విషయము కాదు. వాణీవిలాస మాత్రమైనది కాదు. ఇది అనుభవరూపమైనది. తీవ్రధ్యాన యోగము ద్వారా చిత్తసంయమ మొనరించిన యోగి చిత్తముయొక్క ద్రవ్య, జ్ఞాన, కర్మలకు సంబంధించిన భ్రమలు శీఘ్రముగ నివృత్తియగును.''

ఉద్ధవుఁడిట్లనెను :- ''స్వామీ! నాబుద్ధికిది అందుట లేదు. ద్రవ్య, జ్ఞాన, కర్మసంబంధమగు భ్రమయని దేని నందురు ?''

భగవానుఁ డిట్లనెను:- ''ఉద్ధవా! ఈసృష్టి సంకల్ప ముచే నైనది. అన్నియును మనస్సుచే జరుగుచున్నవి.

మనస్సే బంధమోక్షములకు గారణము. మనము చూచునదియును, అనుభవించునదియును, కర్మ యొనర్చునదియును అన్నిటిని మనస్సే చేయుచున్నది. మనస్సు శుద్ధమనియు, నశుద్ధమనియు రెండువిధములు. అశుద్ధ మనస్సు ప్రపంచము యొక్క రూపము, శుద్ధమనస్సు నాయొక్క రూపము. అశుద్ధ మనస్సు సంసారమును బ్రాప్తింపఁజేయును. శుద్ధ మనస్సు నన్నుఁ జేర్చును. సమాధిపర్యంతము సమస్త సాధనలు అశుద్ధ మనస్సును శుద్ధమొనర్చుటకే. పాంచభౌతిక పదార్థములను గాంచు నశుద్ధమనస్సును వానిని భ్రమవశముననే చూచుచున్నది. ఒకానొక సుందరస్త్రీ కనఁబడినదనుకొనుఁడు. ఆమె మిక్కిలి ఆకర్షకముగను, మనోహరముగను కనఁబడును. వాస్తవమునఁ జూచినచో దానిలో నాకర్షణమేమియును లేదు. సౌందర్యమును లేదు. భ్రమవశమున నామె సుందరిగఁ గనఁబడుచున్నది మనయొక్క అశుద్ధమనస్సు దానియందు వాసనానుసారముగ భ్రమచేఁ బ్రియత్వమును గల్పించుకొనినది. ఇదేవిధముగ మనమీ ప్రపంచమున ధనమార్జించుట కెంతో పరిశ్రమ మొనర్చుచున్నాము. ఎన్నో కఠినకార్యము లొనర్చుచున్నాము, సముద్రములను జించుకొని సప్తసముద్రములను దాటిపోవుచున్నాము. విషయసుఖములను బ్రోవుచేయుటకై చేయరాని కార్యముల నెన్నిటినో భ్రమవశమునఁ జేయుచున్నాము. ఈ క్రియలొనర్చు

టచే సుఖము లభించునని మనమాశించుచున్నాము. ఆక్రియ లొనర్చినను నది లభింపకుండిన, మనము సావధానముగఁ జేయలేదు. కావున నది లభించలేదని భ్రమవశమున మరల దానియందే ప్రవృత్తినిఁ జెంది, వికర్మలొనర్చుటకుఁ బ్రయత్నించుచుందుము. ఏ క్రియలొనర్చినను భ్రమకు వశీభూతులమై చేయుచుందుము. అశుద్ధమగు మనస్సుతో మనమేమి నిశ్చయమొనర్చినను భ్రమవశముననే చేయుచుందుము. చిన్నబాలకుఁడు భ్రమవశమున నొకయాటవస్తువు లభించిన సుఖము లభించునని నిశ్చయించుకొనెను. ఆతని కదియే సుఖమని తలఁచును. ఆ యాటవస్తువు నెవరైన లాగుకొనినచోఁ జాలదుఃఖమును బొందును. యువతీయువకులకు దాంపత్య ప్రేమయే సుఖసాధన మనుకొందురు. ఇదేవిధముగ నందఱును భ్రమవశమునఁ దన సుఖసంబంధమున నొక నిశ్చయమొనర్చుకొనిరి. ఈధ్యాన యోగముచే నాత్రివిధ భ్రమలు ద్రవ్యసంబంధమగు భ్రమ అనఁగా భౌతిక భ్రమ, క్రియాసంబంధమగు భ్రమ అనఁగాఁ జేయుచుండు కర్మలలో భ్రమ జ్ఞానసంబంధమగు భ్రమ అనఁగా సుఖసంబంధమున నిశ్చయ మొనర్చుకొనిన భ్రమ. ఈమూఁడును దీవ్ర జ్ఞాన యోగము ద్వారా నాశనమగును. యోగి భ్రమ రహితుఁడై యథార్థ జ్ఞాని యగును.

ఉద్ధవుఁ డిట్లనెను:- "స్వామీ! ఇప్పుడు నాకు తెలిసినది. ఇంక నేనొక్క విషయము నడుగ వలసి యున్నది. సాధకుఁడు వెనుక ముందు లాలోచించుకొనవలయును. పూర్వపక్ష పరపక్షముల రెంటిని ఆలోచించుకొనవలయును. ఒకానొక సాధకుఁడు సాధన చేయుచుండెను, వ్రతమును, జేయును. మౌనముండును, జపమొనర్చును, కాని యింద్రియములను జయింపఁ జాలక పోయెను. ఆతని సాధన దేనికి బనికి రాఁగలదు?"

భగవానుఁ డిట్లనెను:- "అట్టి అజితేంద్రియుని సాధనవృత్తి కాఁగలదు. పొట్టనింపు కొనుటకుఁ బనికి వచ్చును."

ఉద్ధవుఁ డిట్లనెను:- "సాధకుఁడు జితేంద్రియుఁడును, శాంతుఁడును, దాంతుఁడును, సమచిత్తుండు నైనాఁడను కొనుఁడు. ఆతని కేమియును విఘ్నములు రావా?"

భగవానుఁ డిట్లనెను:- "అట్టి శాంత, దాంత, సమచిత్తుఁడగు సాధకునకు సిద్ధులు లభించును."

ఉద్ధవుఁ డిట్లడిగెను:- "సిద్ధు లెన్ని? ఏయే ధారణచే నేయే సిద్ధులు ప్రాప్తింపఁ గలవు? కృపతో నాకీ విషయముల నన్నిటినిఁ జెప్పుఁడు. ఏలనఁగా మీరే సమస్త సిద్ధుల

కును సిద్ధి నొసంగువారు. సిద్ధులన్నియును మీయధీనము లనే కలవు ”

ఇది విని భగవానుఁ డిట్లనెను :- “ఉద్ధవా! సిద్ధులుం చాల గలవు. వాని భేదములును జాల కలవు. ఇప్పుడు నేను వాటి నన్నిటిని గూర్చి చెప్పెదను. నీవు సిద్ధుల సంబంధమున సావధానుఁడవై వినుము.”

సూతుఁ డిట్లనెను:- “మునులారా! ఇప్పుడు భగ వాను, డేవిధముగ నుద్ధవునకు సిద్ధులను గూర్చి వర్ణించెనో దానిని నేను మీకుఁ జెప్పెదను. మీరందఱును సమాహిత చిత్తులరై వినుఁడు.”

—//—

# సిద్ధులు

శ్లో॥ సిద్ధయోఽష్టాదశప్రోక్తా ధారణాయోగపారగైః।
తాసామష్టౌ మత్ప్రధానా దశైవ గుణహేతవః॥

శ్రీభాగ. ౧౧స్కం. ౧౫ అ. ౩౨ శ్లో॥

వ:- ప్రాణాయామంబున నన్ను హృదయగతుంగాఁ దలంచి యష్టాదశ ధారణాయోగ సిద్ధులెఱింగి యందఱి

మానవులు ప్రధానసిద్ధులుగా దలంచి, యింద్రియంబుల బంధించి మనంబాత్మ యందు చేర్పవలయు.

శ్రీమదాంధ్ర భాగవతము

యోగసాధనమున సిద్ధులు విఘ్నములుగఁ జెప్పఁబడి నవి. వాస్తవమున సిద్ధులు విఘ్నరూపములే. అవి సాధకుని ముందునకుఁ బోనీయవు. ఒకానొక విద్యార్థి బడికిపోవు చున్నాఁడను కొనుఁడు. దారిలో నాతని మిత్రుఁడు కనబడి, ఏవో వినోదములకో, ఆటలకో పిలుచుకొని పోయినాఁడు. ఆతఁడు పోయిన వానికి మనోరంజనము కలుగుచునే యున్నది. చిత్తమున కానందము కలుగుచునే యున్నది కాని వాని ముఖ్య లక్ష్యము పోయినది. ఆతఁడు తన ధ్యేయ మును వదలివైచెను. ఆతని కాటలయందు మనస్సుండిన చదువు గంధ్యాలు పోయినవి. ఆతఁడు వెంటనే సంభాళించు కొని ఆటలను వీడి మరల చదువునకుఁ బోయినచో ఫరవా లేదు. రెండు మూఁడు దినములాతఁడాటలలో మునిఁగినను సంభాళించుకొనుటచే మరల చదివి పరీక్షలోను త్తీర్ణుఁడగును. ఇదే విధముగ భగవానుని కడకు ప్రయాణ మొనర్చువానికి మొదట ఆధివ్యాధులును, ప్రమాద, ఆలస, నిద్రాదులు విఘ్నములుగ వచ్చును. వానిని దాటినచో స్త్రీయొక్క ఆకర్షణము పురుషునకు, పురుషుని ఆకర్షణము స్త్రీకిని

యుండును. ఈ లౌకిక విఘ్నములను దాటఁ గలిగినచో నెదుటకు దివ్య సిద్ధులు వచ్చి పడును, సిద్ధుల వలన సాధకునకు గొప్ప సహాయమేమియు నుండదు కాని తాను సాధనలో ముందునకు బోవుచున్నానను తృప్తి మాత్రము కలుగును. క్షుద్రసాధకుల కీసిద్ధులురావు. ఈ లౌకికపదార్థములం దాసక్తిని వీడి దాటిన వానికే అవి వచ్చును. వానిలో బడిపోయెనా ఆతఁడు పతనమై తీరును. ముందు నడక ఆగిపోవును. ఆతఁడీమాయిక జగత్తులో బంధింపఁబడును. వీనిని దాటిఆవలికి బోయినచో నాతఁడు ప్రకృతి మండలమును దాటి పరమాత్మ మండలమునకుఁ జేరుకొనును. అచ్చటికి మాయరానేరాదు. మోహమను మాటగాని పునర్జన్మ వృత్తాంతముగాని అచ్చట నుండఁబోదు.''

సూతుఁడు శౌనకాది మునులతో నిట్లనెను:- ''మునులారా! ఉద్ధవుఁ డడుగఁగా నేవిధముగ సిద్ధులను గూర్చి భగవానుఁ డుపదేశించెనో దాని సారాంశమును నేను మీకందఱకును జెప్పెదను.''

భగవానుఁ డిట్లనెను:- ''ఉద్ధవా! సిద్ధు లనేకములు. మానవ స్వభావమున కతీతము లన్నియును సిద్ధులే. అందులోఁ బదునాఱు ముఖ్యములు.''

ఉద్ధవుఁ డిట్లడిగెను:- "స్వామీ! ఆ పదునెనిమిది సిద్ధులేవి?"

భగవానుఁ డిట్లనెను:- "(1) అణిమా, (2) మహిమా (3) లఘిమా (4) ప్రాప్తి (5) ప్రాకామ్యము (6) ఈశితా (7) వశితా (8) ప్రాకామ్యము (9) అనూర్మిమత్వము (10) దూరశ్రవణము, (11) దూరదర్శనము (12) మనోజనము. (13) కామరూపము, (14) పరకాయ ప్రవేశనము (15) స్వేచ్ఛా మృత్యువు (16) దేవక్రీడాను దర్శనము (17) సంకల్ప సంసిద్ధి (18) అజ్ఞా ప్రతిహతా అవ్యాహత సర్వత్రగతి ఇవి పదునెనిమిది సిద్ధులు ఇవిగాక ఇంకను జాల సిద్ధులు కలవు. (1) త్రికాలజ్ఞత్వము (2) నిర్ద్వంద్వత్వము (3) పరచిత్తాద్యభిజ్ఞత్వము (4) అగ్ని స్తంభనము (5) సూర్య స్తంభనము (6) జల స్తంభనము (7) విష స్తంభనము అపరాజితాదులు.

ఉద్ధవుఁ డిట్లడిగెను:- "స్వామీ! ఈ సిద్ధుల కర్థమును జెప్పుఁడు.

భగవానుఁ డిట్లనెను:- "అణిమా, మహిమా, లఘిమా, ప్రాప్తి, ప్రకామ్యము, ఈశిత్వము, వశిత్వము, ప్రకామ్యము. ఈ అష్టసిద్ధులు ప్రధానములు. అందు వలననే మాటిమాటికిని లోకులు వానివద్ద అష్టసిద్ధులును, నవనిధు

లును జేతులు కట్టుకొని నిలుచుండిన వనుచుందురు. వాస్తవ మున నివి నా ప్రధాన సిద్ధులు. ఈ సిద్ధులు నాకు స్వాభావము చేతనే ప్రాప్తించినవి. నా భక్తులకును నివి నాకృపచేఁ బ్రాప్తించు చుండును. సరియే, నీవు ముందుగా నీ అష్ట సిద్ధులను గూర్చి వినుము."

(1) అణిమా సిద్ధి:- దీనివలన యోగి యెప్పుడు కావలయుననిన నప్పుడెంత సూక్ష్మరూపమునైన ధరింప వచ్చును. స్థూల దేహము సూక్ష్మమగును. ఏ యోగికీ సిద్ధి లభించినదో, ఆతని నేదు తాళములువైచి బిగించి యుంచుము. గాలిపోవుట కుండిన చిన్న రంధ్రము ద్వారా ఆతఁడు బయటకు వచ్చును. హనుమంతుఁడు లంకకు బోయి నపుడు మశక సమానమై పోయెను. అతఁడు రావణుని భవనము లన్నిటిలోను దిరిగెను. కాని ఆతని నెవరును జూడ జాలనంతగఁ జిన్నవాఁడయ్యెను.

(2) లఘిమాసిద్ధి:- యోగి తన శరీరమును నీసిద్ధిలో గాలిలో నెగిరి పోవునంత తేలికగ నొనర్చు కొనును. ఈ తేలిక శరీరముతో నా కాశమున కెగిరి యెచ్చటికిఁ బోవ లసి యుండిన నచ్చటికిఁ బోవును. ఆ కాశమున వ్రేలాడఁ గలఁడు. నేను కంసమామ సభకు బోయినపుడు కంసమామ చాల యెత్తైన సింహాసనమునఁ గూర్చుండెను. నేను క్రింద

నుంటిని. నేను లఘిమా సిద్ధి ప్రభావమునఁ దేలికనై ఆతనిఁ బట్టుకొని క్రిందకు వచ్చితిని.

(3) మహిమాసిద్ధి:- "యోగి యీ సిద్ధిలో నెంతటి పెద్దవాఁడై నను, బరువు గలవాఁడైనను గావచ్చును. నేను లఘిమా సిద్ధి నాశ్రయించి కంసునిఁ బట్టుకొని క్రిందకు దెచ్చి నా మహిమమును జూపించితిని. హనుమంతుని యెదుటకు సర్పముల మాత సురస అనునది వచ్చెను. అది తన మహిమమును జూపించెను. అది తన ముఖమును యోజనముల పర్యంతము తెఱచెను. హనుమంతుఁడు తన శరీరమును రెట్టింపుగఁ బెంచెను. దాని ముఖము బాగుగాఁ బెరిగిన తరువాత అణిమా సిద్ధి ప్రభావముచే నతి సూక్ష్ముఁడై దాని కడుపులోనికి బోయి వెంటనే బయటకు వచ్చెను. నేనును గేశినిఁ జంపినపుడు వానినోటిలోనికిఁ జేయినందించి, నా మహిమా ప్రభావముచేఁ జేతిని బెంచి అశ్వరూపమును ధరించిన నా రాక్షసునకు ఊపిరాడకుండ జేసితిని. వాఁడు వెంటనే మరణించెను. ఈ మూఁడు సిద్ధుల సంబంధము శరీరముతోడనే. శరీరమును సూక్ష్మాతి సూక్ష్మముగను, స్థూలముగను, అతి తేలికగను. అతి బరువుగను జేయుట.

(4) ప్రాప్తి సిద్ధి:- నాల్గవ సిద్ధియొక్క పేరు ప్రాప్తి. దీనిక్రింది యముులతో సంబంధము కలదు. కన్నులు, చెవులు

ముక్కు, నాలుక, త్వక్కు ఈ యింద్రియ విషయములను వెంటనే పొందుట, ఏదైన దర్శనీయ పదార్థముండినచోఁ గోరిక గలుగఁగానే దానినిఁ బిలుచుట. ఏదైన శ్రవణీయ శబ్దముండినచో దానినిఁ దన సమీపమున కాహ్వానించుట, ఏదైన సుంగధిత వస్తువుండినచో నా సుగంధమును దగ్గఱకు లాగుట, ఏదైన స్వాదిష్ట పదార్థముండినచో దాని స్వాదు ననుభవించుట, ఇదే విధముగ నింద్రియ విషయముల నిచ్ఛాను సారముగఁ బ్రాప్తించుట, యోగి యీ వస్తువుల నెప్పుడు కావలయునసిన నప్పుడు పిలుచును.

(5) ప్రకాశ్య సిద్ధి - "అయిదవది ప్రాకాశ్య సిద్ధి, స్వర్గాది పుణ్యలోకములలోని యేసుఖములను గూర్చి విను చున్నామో అట్టి పారలౌకిక సుఖములను, కనఁబడుచుండిన లౌకిక సుఖములను దన యిష్టాను సారముగ ననుభవింప వచ్చును. యోగి తానింద్రుఁడను గావలయు నను కోనిన వెంటనే తానింద్రుని సింహాసనమునఁ గూర్చుండి స్వర్గసుఖ ముల ననుభవించును. ఈ సిద్ధి ప్రభావముచేఁ గర్దమ మహా సుఖముల ననుభవింపఁ జేసెను.

(6) ఈశితాసిద్ధి :- ఆఱవది ఈశితాసిద్ధి. నా మా యను దాని కార్యములను దన యిచ్ఛాను సారముగఁ బ్రేరింపఁ గలుగుశక్తికి ఈశితాసిద్ధి. ఇట్టి యోగి తన

యిచ్ఛానుసారముగ నవీన సృష్టినిఁ గావింపఁ గలఁడు, తన సంకల్పముచే నేది కావలయునిన దానినిఁ జేయఁగలఁడు. త్రిశంకు మహారాజును విశ్వామిత్రుఁడు తన శక్తిచే స్వర్గమునకుఁ బంపినను వారాతని నచ్చట నుండనీయలేదు. అప్పుడాతఁడు కోపించి ఈశితాసిద్ధిచే నవీనస్వర్గమును సృష్టి గావించెను దేవతలందఱును వచ్చి అనునయ వినయములొనర్పఁగాఁ జివరకు బ్రహ్మవచ్చి ఆశ్వాసింపఁగా నాతఁడు తన హఠమును వీడెను. అయినను నాతఁడు నిర్మించిన గ్రహమును. సప్తర్షులును నేఁటికిని అట్లే యున్నారు.

(7) వశితా సిద్ధి:- ఏడవది వశితాసిద్ధి. పంచభూతాత్మకములగు పదార్థముల నన్నిటినిఁ దనవశమొనర్చుకొనుటయును, వానియందాసక్తినిఁ జెందకుండుటయును వశితాసిద్ధియొక్క లక్షణములు. భరద్వాజుఁడు తన యాశ్రమమునకు భరతుఁడు వచ్చినపుడు సమస్త భోగ్య పదార్థముల నచ్చట నుంచెను. కాని వాని వైపున కాభరతుఁడు కన్నెత్తియైనను జూడలేదు.

(8) ప్రాకామ్యసిద్ధి:- ఎనిమిదవది ప్రాకామ్యసిద్ధి. అనఁగా నిష్టపదార్థముల జరమ సీమనందుకొనుట. మూఁడు లోకములలో నాతఁడు కోరఁగనే ఆతని దగ్గఱకు రాని పదార్థమేదియు నుండదు. సౌభరి మహర్షి యీ సిద్ధిచేఁ దన

యేఁబదిమంది భార్యలకును గోరిన భోగముల నొసఁగు చుండెను. నేను బదునాఱు వేల నూటయెనిమిదిమంది భార్యలకు నీసిద్ధి చేతనే సుఖుల నొనర్చుచుంటిని. యోగుల కీసిద్ధు లన్నియును సాధనచేత నా యనుకంపచేఁ బ్రాప్తించు చున్నవి, కాని యిట్టివి స్వభావముచేతనే నా వెంట నుండును.

ఉద్ధవుఁ డిట్లనెను:- "స్వామీ! ఇవి అష్ట సిద్ధులు కదా! ఇంక నితర సిద్ధులను గూర్చియును నాకు జెప్పవలయును."

భగవానుఁ డిట్లనెను :- "ఉద్ధవా! అన్ని సిద్ధులను గూర్చి నేను జెప్పఁ జాలను. అయినను నింకఁ గొన్ని సిద్ధులనుగూర్చి చెప్పెదను."

(1) అనూర్మి మత్వము:- అందఱ దేహములందును క్షుధా, పిపాస, శోక, మోహ, జన్మ, మరణ, వ్యాధి యీ యాఱు నూర్ములు నిరంతరము చెలరేగి బాధించు చుండును. ఏ సిద్ధిచే నీ యూర్ములు రానేరావో అదియే అనూర్మిత.

(2) దూరశ్రవణ దర్శనము :- ఒక స్థానమునఁ గూర్చుండి దూరముననుండిన శబ్దములను వినుటయు, దూరమున జరుగు సంఘటనములను బ్రత్యక్షముగఁ జూచుట.

(3) మనోజవము:- మనస్సువలె శీఘ్రగామి యగుట, అనఁగా నెచ్చటికిఁ బోఁదలఁచిన నచ్చటికిఁ జేరుట.

(4) కామరూపము :- తన యిచ్ఛానుసారముగ రూపమును ధరించుట.

(5) పరకాయప్రవేశము :- "ఇతరుల శరీరమునఁ బ్రవేశించి తన యిష్టానుసార మా శరీరముతోఁ బను లొనర్చుట.

(6) స్వచ్ఛందమృత్యువు :- భీష్మునివలె మృత్యువును జయించుట, తన కిష్టములేనిది మృత్యువు రానేరాదు.

(7) దేవక్రీడానుదర్శనము :- స్వర్గమందు దేవతా గణము అప్సరసలతో నెట్టి క్రీడలొనర్చెదరో వానినిఁ బ్రత్యక్షముగఁ గాంచుట. దేవతా క్రీడలీ చర్మ చక్షువులకు గనఁబడునవి కావు.

(8) సంకల్ప సంసిద్ధి:- ఏది సంకల్పించిన నది వెంటనే నెఱవేరుట.

(9) ఆజ్ఞా ప్రతిహతా :- ఎవరికే యాజ్ఞనొసంగినను దానిని పాలించెదరు. తిరుగుండదు.

(10) అప్రతిహతాగతి:- ఏలోకమునకైనను వెంటనే పోవుట.

ఈవిధముగ నుద్ధవా! ఈ పది సిద్ధులు సత్వగుణా మధికముగ నుండువారికి సిద్ధించును.

ఉద్ధవుఁడిట్లడిగెను :- "ఈ పదు నెనిమిది కాక యింకే మైన సిద్ధులుండినచోఁ జెప్పుఁడు."

భగవానుఁడిట్లనెను:- "ఇంకను జాల సిద్ధులు కలవు. త్రికాలజ్ఞత్వము. అనఁగా భూత భవిష్యద్వర్తమాన విషయములను దెలిసికొనుట. శీతోష్ణ సుఖదుఃఖ, రాగద్వేషాది ద్వంద్వములకు వశపడకుండుట, ఇతరుల మనస్సులోని విషయములను జెప్పకయే తెలిసికొనుట, అగ్ని, జల, విషాదుల శక్తి స్తంభింపఁజేయుట. ఈవిధముగ వీనిలో నెన్నియో భేదములుకలవు."

ఉద్ధవుఁ డిట్లడిగెను :- "స్వామీ! ఈ సిద్ధులెట్లు ప్రాప్తింపఁగలవు?"

భగవానుఁడిట్లనెను:- "ఈ సిద్ధులన్నియును ధారణచేఁ బ్రాప్తింపఁ గలవు. మనోధారణ సిద్ధించినచో నా విషయకమగు సిద్ధి ప్రాప్తించును. తన్మాత్రలమీఁద ధారణచేయుటచే నణిమా సిద్ధి ప్రాప్తించును. మహాత్తత్వ ధారణచే మహిమా సిద్ధియు, బరమాణుధారణచే లఘిమాసిద్ధియు, సాత్వికాహంకార ధారణచేఁ బ్రాప్తియును, సూత్రాత్మ ధారణచేఁ

ప్రాకామ్యసిద్ధియును, కాలధారణచే నీశితయును, తురీయ ధారణచేఁ బ్రాకామ్యమును, శ్వేతద్వీపాధిపతినగు నాయందు ధ్యానమును నిలుపుటచే ననూర్మితయును, నాదమందు ధారణచేయుటచే దూరశ్రవణమును, సూర్యధారణచే దూరదర్శనమును, ప్రాణవాయు రూపమున నాధారణచేసినచో మనోజవమును, మనస్సున ధారణ మొనర్చుటచేఁ గామరూపమును, ప్రాణప్రధాన లింగశరీరోపాధికమగు నాత్మయందు ధారణచేయుటచేఁ బరకాయప్రవేశమును, ప్రాణసంయమముచే నిచ్ఛామృత్యువును, శుద్ధసత్వమందు ధారణచేయుటచే సురక్రీడా దర్శనమును, సత్యధారణచే సంకల్పసిద్ధియును, చిత్తమ దేనిని ధారణచేసిన నట్టి గుణము కలదగును. అగ్నిమయ చిత్తము నొనర్చినచో నగ్నిస్తంభన కలుగును అగ్ని కాలదు. అగ్నిని అగ్ని యెట్లు కాల్పఁ జాలదో అట్లే యోగి శరీరమును అగ్ని జలము, విషము మొదలగునవి నశింపఁ జేయఁజాలవు. నా యవతారము లందు ధారణచేయుటచే సాధకుఁడ జేయుఁడగును. ఈ విధమగు యోగధారణద్వారా నా యుపాసన మొనర్చు సాధకుఁడు సమస్త సిద్ధులును బూర్ణముగఁ బ్రాప్తించును."

అంత శౌనకుఁడిట్లడిగెను :- "సూతా! మీరన్యథా భావింపకుండిన నేనొక్కమాటను జెప్పెదను."

సూతుఁడు శీఘ్రముగ నిట్లనెను :- "చెప్పెదను స్వామీ! అన్యథా భావింపవలసిన పనియేమున్నది? నేను మీ ప్రశ్నలకు సమాధానమును జెప్పుటకై మీరిచ్చిన నీ యాసనముపైఁ గూర్చుంటిని."

శౌనకుఁడిట్లనెను :- "సూతా! ఉద్ధవుఁడు భగవత్స్వరూపుఁడే. ఆతఁడీ సంకేతములను గ్రహించియే యుండును; కాని నిజమునకు మాకర్థము కాలేదు. ధారణమనఁగా నేమి? ధారణ నెట్లు చేయవలయును నీవే వస్తువులమీఁద ధారణ చేయవలయునని చెప్పితివో, దానినెట్లు చేయవలసి యుండును?"

సూతుఁడిట్లనెను :- "స్వామీ! ఈవిషయ మత్యంత గూఢమైనది. కథా ప్రసంగమున నీ విషయమును గూర్చి చెప్పఁబూనినచో నది సర్వసాధారణులకే కాదు, నాకును బాగుగాఁ దెలియదు. కాని నేను గురు పరంపరచే వినిన దానిని యథావకాశమున, నెప్పుడైనను యోగమునకు సంబంధించిన మీమాంసి వచ్చినపుడు చెప్పెదను. ఈ సమయమునఁ గథా ప్రసంగమును సాగించుటకై నేనత్యంత సంక్షేపముగ నీ విషయమును నామ నిర్దేశమాత్రముగ నొనర్చితిని."

శౌనకుఁడిట్లనెను :- "మంచిది సూతా! అటులైన చోఁ బోనిమ్ము మాకు సిద్ధులతో నేమి పని? మాకు నిస్తారము కలుగుటకై యేదైన సరళసిద్ధినిగూర్చి చెప్పుము."

అంత సూతుఁడిట్లనెను :- "భగవానుఁడు సమస్త సిద్ధులకును నుపసంహారమొనర్చుచుఁ జివరకు భక్తులకొఱకు చక్కని శ్రేష్ఠ సిద్ధిని గూర్చి చెప్పెను దానినిఁ బ్రాప్తించిన స్వతః సర్వసిద్ధులును వచ్చి చేతులుకట్టుకొని నిలుచుండును."

శౌనకుఁడిట్లనెను :- "సూతా! దానినే మాకు జెప్పుము. మేము సారగ్రాహులము:

సూతుఁడిట్లనెను :- "మంచిది స్వామీ! ఇప్పుడు భగవానుఁ డేవిధముగఁ దన భక్తిరూపమగు సిద్ధినిఁ గూర్చి చెప్పెనో దానినిగూర్చి మీకు జెప్పెదను. మీరు సమాహిత చిత్తులరై శ్రవణమొనర్పుఁడు."

—||—

# సర్వసిద్ధులకును స్వామి శ్యామసుందరుఁడు

శ్లో॥ సర్వాసామపి సిద్ధానాం హేతుః పతిరహం ప్రభుః ।
అహం యోగస్య సాంఖ్యస్య ధర్మస్య బ్రహ్మవాదినామ్॥
శ్రీ భాగ. ౧౧ స్కం. ౧౫ అ. ౩౫ శ్లో॥

వ. ఉద్ధవా! నేనే సమస్త సిద్ధులకును, బ్రహ్మవాదుల ద్వారా చెప్పఁబడిన యోగ, సాంఖ్య, ధర్మాది సమస్త సాధనలకును హేతువునై యున్నాను. ప్రభువును నేనే.''

కుండ నిండక పోయిన నూరక తొణఁకును. అది నిండఁగానే తొణుఁకుట ఆగిపోవును. పరిపూర్ణమగు సముద్ర మందు వరదరాదు. క్షుద్ర నదులే వర్షాకాలమందు మిక్కిలి వేగముగఁ బెరిగి, అల్పకాలముననే తగ్గిపోవును. అదే విధముగఁ బూర్ణత్వము లేనివాఁడే సిద్ధుల మాయలోఁ బడిపోవును. అల్ప శక్తినిఁ బొంది తాను గొప్పవాఁడ నను కొనును. నేనుగూడ ఇంతటివాఁడ ననుభావ మణుమాత్రము వాని మనస్సులోనికి వచ్చినను వాని యున్నతి ఆగిపోయినట్లే. అతఁడు పతనము వైపున కగ్రేసరుఁడగు చున్నాఁడని తెలిసి కొనవలయును. కావున సాధకుఁడగు వాఁడెన్నటికిని సిద్ధుల వైపునకుఁ బోరాదు. మనస్సుతో సిద్ధులను స్వీకరించితిమా

మన మోహానుఁడు మనస్సునుండి లేచిపోవును. సిద్ధుల అహం కార మాతని స్థానమును గ్రహించును. సాంసారికులకు సిద్ధు లాకర్షకముగ నుండిన నుండుగాక. సాధకునకుమాత్రమవి పతనమునకుఁ బ్రధాన కారణములు కాఁగలవు.

సూతుఁ డిట్లనెను:- "మునులారా! ఉద్ధవుఁడు భగవా నుని సమస్త సిద్ధులను బొందుటకై సరళమగు నుపాయము నడుగఁగా భగవానుఁ డిట్లనెను:- "ఉద్ధవా! యోగధారణ మొనర్చు యోగికీ సిద్ధులన్నియును సాధనచేఁ బ్రాప్తించును. తన యింద్రియములను దన స్వాధీనమునఁ బెట్టుకొనిన వాఁడును, విషయేంద్రియ సంయోగము కలిగినను వ్యాకుల మును జెందని వాఁడును, ధారణ, ధ్యాన, సమాధుల నభ్యాస మొనర్చినవాఁడును, ప్రాణమును దన వశమునఁ బెట్టుకొనిన వాఁడునగు యోగి యేసిద్ధిఁ బొందఁజాలఁడు? నూతన సృష్టినే యొనర్పఁగలఁడు. సమస్త భువనములను శాసింపఁ గలఁడు."

ఉద్ధవుఁ డిట్లడిగెను :- "స్వామీ! ఈ సిద్ధుల విమ్ముఁ బొందుటకు సాధిక లేనా? వీనినిఁ బొందిన మీరు త్వరగాఁ బ్రాప్తింపఁ గలరను కొందును."

నవ్వి భగవానుఁ డిట్లనెను:- "ఉద్ధవా! ఈ సిద్ధులం నా ప్రాప్తికి సాధికలు కావు బాధికలు. ఈ సిద్ధులన్నియును

సాంసారికము లే. ఇవన్నియును లౌకిక సిద్ధులు, సాధకునకు వీని యందెంతకాలము మనస్సు లగ్నమై యుండునో, అంత కాలము నన్నుఁ బొందుట కాలస్యమగును. ఈ క్షుద్ర సిద్ధులను బొంది యెవరును కృతార్థులు కాఁజాలరు. వారి గతి ఆగిపోవును. వారికి పతనము కలుగును. సిద్ధులనేక విధములుగఁ బ్రాప్తించును. చేఁపలు, తాఁబేళ్ళు పుట్టుక తోడనే యీదుట నేర్చినట్లును, పక్షుల పిల్లలకు జన్మ తోడనే ఆకాశమున నెగురుట చేతనైనట్లును, చకోరము జన్మచేతనే అగ్నిని భక్షణ చేయునట్లును, కొందఱకు జన్మ తోడనే సిద్ధులు ప్రాప్తించును. సిద్ధులకును, విద్యాధరు లకును జన్మచేతనే అంతర్ధానాది సిద్ధులు ప్రాప్తించును. కొన్ని సిద్ధులు ఓషధుల చేతను బ్రాప్తించును. ఒక మాత్ర కలదు దానిని నీవు నోటిలోఁ బెట్టుకొనినచో నాద ఱును నీకు గనఁబడెదరు కాని నిన్నెవరును జూడఁజాలరు. ఒకానొక అంజనమున నాకాశమున నెగురు దేవతా విమాన ములు కనఁబడును. స్థూలాతి స్థూల వస్తువులును, సూక్ష్మాతి సూక్ష్మ వస్తువులును జూడఁగలిగిన నంజనములు కలవు. ఒకానొక లేపనమును పాదములకు బూసికొనిన నెచ్చటికిఁ బోవలయునని న నచ్చటికిఁ బోవచ్చును. ఒకానొక తిలకము కలదు. దానిని ధరించి యెవరిముందునకుఁ బోయినను వారు వశులయ్యెదరు. ఇదేవిధముగ నీ యౌషధములను జాల యున్న

ముతోఁ జేయుచుండురు. చాలస్వాభావికముగనే యుండును. వానిని గుర్తించుట కష్టము. గంధమాదన పర్వతము మీఁద నొక వృక్షము కలదు. దానితో నేదైనవస్తువును సిద్ధముచేసి తినినచో నెన్నటికిని ఆఁకలికాదు."

ఒకానొకసారి ఒక గొల్లవాఁడు తన గొఱ్ఱెలను మేఁపుకొనుచు గంధమాదన పర్వతముపై నుండిన నొక శిఖరము మీఁదకు బోయెను. అచ్చట నాతని కాఁకలి యయ్యెను. ఆతనివద్ద పులగము వండుకొనుటకు బియ్యము పప్పును గలవు. ఆతఁడు పాత్రలో బియ్యమును బప్పును బోసి వండుచు అచ్చట నుండిన నొక చెట్టు రెమ్మను దీసికొని కలియఁబెట్టెను. దానినిఁదినఁగానే ఆతని క్షుత్పి పాసలన్నియును బారిపోయెను. శరీరమున శక్తి పూర్వము వలెనే యుండెను. ఇంటిలోని వారు చాల భయపడిరి. వైద్యులను బిలిపించిరి. వైద్యులేమియును గనిపెట్టఁ జాలక పోయిరి. చాల నెలల వఱకాతఁడేమియును దినలేదు. కాని ఆతని కణుమాత్రమైనను నిర్బలత లేదు. ఒకసారి ఒక ముని ఆకాష్ఠమును వెదుకుకొనుచు నచ్చటికి వచ్చెను. ఇంటి వారడుగఁగా నాతఁడు పులగమును వండుకొనినట్లును, దాని నొక పుల్లతోఁగలియఁ బెట్టినట్లును, ఆకాష్ఠ సంసర్గము కలిగిన వస్తువును దినినట్లును జెప్పెను. ముని వానినిఁ దీసికొని

ఆ స్థానమునకుఁ బోయెను. ఎంతో వెదకెను. కాని ఆ కాష్ఠము కనఁబడలేదు. అప్పుడు ముని యింకొక ఔషధము నొసంగి వానికి వమనమగునట్లొనర్చెను. ఆ వమనమునఁబడిన పులగమును దాను తినెను. అప్పటి నుండి ఆతని క్షుత్పిపాసలును దీరిపోయెను. ఈ విధముగఁ జాల ఔషధములను జేయుచుందురు. చాల స్వతః లభించుచుండును. వానిని సేవించుటచేతను నానావిధములగు సిద్ధులు ప్రాప్తించును.

తపః ప్రభావమునను సిద్ధులు తపస్విసమ్ముఖమునఁ జేతులను జోడించుకొని నిలుచుండును. చాల మంత్రములను విధివిధాన పూర్వకముగ జపానుష్ఠాన మొనర్చుట చేతను సిద్ధులు ప్రాప్తించును. ఈసిద్ధులనన్నిటిని కేవలము యోగము చేతనే ప్రాప్తింప వచ్చును. యోగి తన యోగప్రభావముచే నోషధీ, మంత్ర, తపములు లేకయే, కేవలము సంయమము ద్వారా ధారణ యొనర్చుటచే సమస్త సిద్ధులను ప్రత్యక్ష మొనర్చుకొనవచ్చును. కాని యోగము యొక్క ముఖ్య ఫలము నన్నుఁ బొందుట. అది నాయందు జిత్తమును లగ్న మొనర్చుట చేతనే ప్రాప్తింపవచ్చును. దానికి వేఱొక సాధనము లేదు. కావున నన్నుఁ బొందఁదలఁచినవారు పొరపాటుననైన సిద్ధుల మాయలోఁ బడరాదు. సమస్త సిద్ధులకును నేకైక స్వామిని నేనే. నన్నెవరు వశము చేసికొందురో

సిద్ధులన్నియును నాభక్తునికి వశమై యుండును. పతిని మనసును వశపఱచుకొంటిమా ఆతని ఆశ్రిత స్వతః వశము కాఁగలదు. రాజును వశపఱచుకొనిన వానికి వాని సేవకులందఱును వశమయ్యెదరు.

యోగ, సాంఖ్య, ధర్మాది సాధనములును, అణిమా, గరిమా, లఘిమా, ప్రాప్తి, ప్రాకామ్య, ఈశితా, వశితాది సిద్ధులును నా కారణముననే కలుగును. వీని కన్నిటికిని హేతువును నేనే. అన్నిటికిని స్వామిని నేనే. వీని అన్నిటికిని ప్రభువును నేనే. ఈశ్వరుఁడను నేనే. కావున నాయందు మనస్సును లగ్నమొనర్చుటచే సమస్త సిద్ధులును నేవిధమగు ప్రయాసము లేకయే పిలువకయే వచ్చును.''

ఉద్ధవుఁ డిట్లడిగెను:- ''స్వామీ! మీరు సాధకులు, సాధనలు, సిద్ధులు.''

భగవానుఁ డిట్లనెను:- ''అన్నియును నేనే. కర్తను నేనే. కర్మను నేనే. క్రియను నేనే. ఘటమునకు లోపలను, బయటను, ప్రక్కలందును సర్వత్ర మట్టియే యుండునట్లు, మట్టిగాక యింకొకటి లేనట్లును. మనుష్య, పశు, పక్ష్యాదుల దేహములందు లోపలను బయటను పంచభూతములే యుండునట్లు ఈ బ్రహ్మాండమునకు లోపలను, బయటను నేనే యున్నాను. నేను గాక యింకొక పదార్థము

లేనే లేదు. ద్రష్టను నేనే దృశ్యమును నేనే. నేనే సమస్త క్షేత్రములందు క్షేత్రజ్ఞ రూపమున నున్నాను. నేనే బాహ్యమున నున్నాను. లోపల నున్నాను, ఇదంతయును నా విలాసమే. ఇదంతయును నా క్రీడయే, నా లీలయే. కావున నన్నుఁ గాక యింకే మాయలోను బడవలదు. నన్ను గాక యే యితర అసత్పదార్థమును సత్పదార్థముగ భావింపవలదు. ఉద్ధవా! అనన్యభావముతో నా ఉపాసన యొనర్చుటచే నేది ప్రాప్తించునో, అది సరళముగను, సుగమముగను ప్రాప్తించును. కావున నెచ్చటనుండినను నా యుపాసనను గావింపుము. మాయావరణముచే నాచ్ఛన్నమగుటచే సాంసారిక ప్రాణి నన్నుఁ జూడఁ జాలకున్నాఁడు."

ఇది విని ఉద్ధవుఁ డేవ్పుచు నిట్లనెను :- "ప్రభూ! మీరు సాక్షాత్తుగ ననాది, అనంత, ఆవరణ శూన్యులని యిప్పుడు నేను గ్రహించితిని. మీరు పరబ్రహ్మలు. ఈ ప్రపంచమంతయును మీనుండి యుత్పన్నమైనది. మీరే బ్రహ్మవై సృష్టి చేయుచుందురు. విష్ణువై మీరే రక్షించుచుందురు. తదనంతరము రుద్రుఁడవై నీవే అన్నిటిని సంహారమొనర్చెదవు. మీరే అన్నిటికి నాదికారణులు మీరు లేని చిన్న, పెద్ద, పొడుగు, పొట్టి స్థావర జంగమ ప్రాణులు లేరు. మీ అనుభవమును శుద్ధబుద్ధి కలవాఁడే చేయఁగలఁడు,

అశుద్ధబుద్ధి కలవారలకు మీరు సర్వథా దుర్విజ్ఞేయులు. సమస్త పరిగ్రహములను త్యజించినవాఁడును, లౌకిక సుఖముల నపేక్షింపని వాఁడును, సాంసారిక విషయములను విషముగ భావించినవాఁడునగు సంయమి బ్రాహ్మణుఁడే నిన్ను సర్వాత్మభావముతో నుపాసింపఁగలఁడు. ఇట్లుండినను సర్వత్ర వ్యాపించిన మిమ్ముపాసించుటెట్లు ?"

భగవానుఁడిట్లనెను :- "ఉద్ధవా ! నా విభూతుల మీఁద నన్ను భావించి మహర్షులు నన్నుపాసించెదరు. ఆ విభూతుల ద్వారానే నేను వారి సమస్త మనోకామనలను నెఱవేర్చెదను."

ఉద్ధవుఁడిట్లడిగెను :- "స్వామీ ! ఏ యే భావముల ద్వారా భక్తిపూర్వకముగ మీ ఉపాసనమును సాధారణులు చేసి సిద్ధినిఁ బొందెదరో, ఆ భావములను నాకుఁ జెప్పుఁడు. ఏ భావముతో, నెచ్చట మీ ఉపాసనమును జేయవలయునో, నాకు సరళముగఁ దెల్పుఁడు. మీరు సర్వాంతర్యామి యనియుఁ అండజలో రోమరోమమున రమించుచున్నారనియు, అణు పరమాణువులం దనుస్యూతముగ నున్నారనియు నాకు దెలియును. అందఱిలోను దాగి మీరు గుప్త రూపమున లీలనొనర్చుచున్నారు. మీకడ దాపరికమేమియుచులేదు. కాని యీ మాయామోహిత జీవి మిమ్ముఁ

జూడఁజాలకున్నాఁడు. మీరు తెఱవెనుక నుండి యీ కోయ్యబొమ్మలను స్వేచ్ఛానుసారముగ నాడించుచున్నారు. అయినను నచ్చటచ్చట మీ విశేష చమత్కారము కనఁబడుచున్నది. అచ్చటచ్చట మీరు సామాన్యులకంటె విశేషముగఁ దోఁచుచున్నారు. మీ విశేషత పృథివీ, స్వర్గ, పాతాళాదులందును, దశదిశలయందును సర్వత్ర కనఁబడుచున్నది. ఎచ్చటెచ్చట విశేషత కనఁబడుచున్నదో, అచ్చటచ్చట మీ విభూతి దర్శనమగుచున్నది. మీ విభూతు లెన్నియో చెప్పఁడు. నేను మీ విభూతుల నన్నిటినిఁ దెలిసికొనఁదలఁచుచున్నాను. మిమ్ముడుగకుండిన నింకెచ్చటికి బోఁగలను? మీరుగాక హితోపదేష్టయగు గురు వింకొకఁడు లేఁడు. కావున నేను సమస్త తీర్థముల కాశ్రయభూతములగు మీ చరణకమలములను బట్టుకొంటిని, వానినే ఆశ్రయించితిని."

ఇది విని భగవానుఁడు నవ్వి యిట్లనెను :- "ఉద్ధవా! నా విభూతులనంతములు. కాని వానిలోఁ గొన్నిటినే నేను నీకు జెప్పెదను."

సూతుఁడిట్లనెను :- "మునులారా! ఇప్పు డేవిధముగ భగవానుఁ డుద్ధవునితోఁ దన విభూతులను గూర్చి వర్ణించెనో దానిని మీకుఁ జెప్పెదను."

—॥—

# విభూతి వర్ణనము

శ్లో॥ అహమాత్మోద్భవామీషాం భూతానాం సుహృదీశ్వరః ।
అహం సర్వాణిభూతాని తేషాం స్థిత్యుద్భవాప్యయః ॥

శ్రీభాగ. ౧౧ స్కం. ౧౬ అ. ౯ శ్లో॥

వ. చరాచర భూతంబయిన జగంబంతయు మదాకారంబుగా భావించి భూతలంబునందు నాధారభూతంబును సూక్ష్మంబులందు జీవుండను నేనే.

శ్రీమదాంధ్ర భాగవతము

ప్రపంచమున నెవఁడును నెవరికిని వందన మొనరింపఁడు. ఎవని మాటను వినఁడు. ఎవరి అధీనమునను నుండఁడు. భగవానుని విభూతులు కనఁబడినచో, నచ్చట సాధారణ జనము సవిమ స్తకులగుచుందురు. ఈ ప్రపంచము త్రిగుణమయమైనది. త్రిగుణములచేతనే యిది పుట్టినది. భగవంతుఁడను గుణముల ననుసరించియే బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులుగ నైనాఁడు. భగవంతుని విభూతులును సాత్త్విక, రాజస, తామసభేదములచే మూఁడు రకములుగ నున్నవి. ఎప్పు డే గుణప్రాబల్యముండునో, అప్పుడు మిగిలిన గుణములణఁగి యుండును. హిరణ్యకశిపుఁడును భగవంతుని పార్షదవతారమే, నారదుఁడును భగవంతుని అవతారమే,

కాని హిరణ్యాకశిపునియొక్క గుణానురూప ప్రభావము పడినప్పుడు నారదుఁడును నాతని కణఁగి యుండవలసి వచ్చినది. ఆతని సర్వమున సర్వము కలుపవలసివచ్చెను. ప్రపంచమున నేది జరిగినను భగవద్విభూతుల వలననే జరుగుచున్నది. ఎప్పు డేగుణము లవసరమగునో, అప్పు డట్టి గుణములు కల విభూతు లుత్పన్నమై, అట్టి పనినే చేయుచుండును. కావున సాధకుఁడు బాహ్యదృష్టినిఁ బెట్టుకొనరాదు. అన్ని రూపములలోను నా స్వామియే కార్యము లొనర్చుచున్నాఁడని భావించి యెచ్చట తేజము, ఓజము, బలము, శ్రీ కాంత్యాదులు కనఁబడునో వానిని మనస్సులో భగవానునివిగ భావించి ప్రణామ మొనర్పవలయును. చేయువాఁడును, జేయించువాఁడును సమస్త విభూతుల కధిష్ఠానమగు శ్యామసుందరుఁడే. ఆతఁడు గాక యింకెవరును నేమియును జేయఁజాలరు బలవంతులకు బలము నొసంగు వాఁడును, సౌందర్యమందు సౌందర్య ప్రదాన మొనర్చువాఁడును, గుణవంతుల యందు గుణములను స్థాపించువాఁడును నా విశ్వేశ్వరుఁడే. ప్రపంచమాతని విభూతులచే నిండియున్నది.

సూతుఁడు నైమిశారణ్యమున నివసించు శౌనకాది మహామునులతో నిట్లనెను:- "మునులారా! ఉద్ధవుఁడు భగవద్విభూతులను గూర్చి ప్రశ్నింపఁగా ఆతఁడిట్లనెను:- "ఉద్ధవా!

నీవు నా విభూతులను గూర్చి ప్రశ్నించితివి. నేను చాలసంతో షించితిని. నా విభూతులను గూర్చి తెలిసికొనినవాఁ డింకెవరి తోడను రాగ, ద్వేష, ఈర్ష్యలను జెందఁడు. తానుస్వతంత్ర కర్త యని భావించినపుడే యీర్ష్య కలుగును. ఇంకను దనలో గుణములు న్యూనతగనుండి, యితరులలో నధిక ముగ నుండినను లోలోన నీర్ష్యజనించును ఇవన్నియును భగవద్విభూతులని తెలిసినచో నింక రాగద్వేషము లేల కలుగఁ గలవు? నీవిప్పు డేప్రశ్నను వైచితివో, అదే ప్రశ్నను నన్నదివఱలో నర్జునుఁడు వేశియుండెను."

ఉద్ధవుఁ డిట్లనెను:- "స్వామీ! అర్జునుఁడు మిమ్మీ ప్రశ్న నెప్పుడువైచినాఁడు?"

భగవానుఁ డిట్లనెను:- "కురుక్షేత్రమునఁ గౌరవ పాండవ యుద్ధము జరుగఁబోవు నపుడు నేను పాండవుల పక్షమున నుంటిని. అర్జునుఁడు నన్ను సారథిగా నుండఁ గోరెను. నేనాతని సారథినైతిని. రెండు సేనలును బోరాడు టకు సిద్ధపడునంతలో నాతఁడు ననుఁ బ్రశ్నించెను."

ఉద్ధవుఁ డిట్లనెను:- "స్వామీ! యుద్ధ సమయమున నిట్టి ప్రశ్నను వేయుట కర్జునునకేమి అవసరము కలిగినది? ఇచ్చట వీరత్వమునకు సంబంధించిన ప్రశ్న వేయవలసి యుండెను."

భగవానుఁ డిట్లనెను:- "ఉద్ధవా! నేనే చంపఁగల స్వాతంత్ర కర్తనను గర్వమాతనికి గలిగినది. ఆతని బుద్ధి ప్రాకృతమయ్యెను. అహంకార మమకారము లాతని నావేశించినవి. స్వపరాభి నివేశమాతనికిఁ గలిగినది. వీరు నావారు, వారు పరాయివారను మోహమాతనికిఁ గలిగెను.

ఉద్ధవుఁ డిట్లనెను:- "మోహమునకును విభూతుల కును నేమి సంబంధము? మోహము కలిగినచోఁ దనవారిని రక్షించును. పరులను జంపును."

భగవానుఁ డిట్లనెను:- "ఇదియే వచ్చిన చిక్కు. ఇరువైపులను నాతనికి దన బంధువులే కనఁబడిరి. అందు వలన రాజ్యము కొఱకు జాతి సంబంధుల వధను బీభత్సముని పలికి ఆతఁడు యుద్ధోపరతుఁడయ్యెను."

ఉద్ధవుఁ డిట్లనెను:- "ఉపరతుఁడగుట మంచిదే కదా! ఆతని మీరు మరల యుద్ధములోనికేల లాగినారు? యుద్ధ మునకు లాగినను నచ్చుట విభూతుల ప్రశ్నయేల వచ్చినది?"

భగవానుఁడు నవ్వియిట్లనెను:- "నాయనా! నేనాత నికి సత్యమును జెప్పుచు నిట్లంటిని —— చంపుటకు నీ వె వడవు? ఇదంతయును నేను నా విభూతులచేఁ గ్రీడించు చున్నాను. ఎవరినైనను జంపుటకు జడమగు గాండీవమున

కేమిశక్తి యున్నది? నా విభూతి యగుట చేతనే వీరివంద ఱను జంపుటకు సామర్థ్యము కలుగు చున్నది.

అప్పుడాతఁ డిట్లనెను:- "స్వామీ! మీ విభూతు లెన్ని?"

నేనిట్లంటిని:- "నావిభూతులకు లెక్కయే లేదు. అవి అసంఖ్యాకములు. వానిలోఁ గొన్నిటిని నీకు జెప్పెదను.' అని చెప్పినా విభూతులను జెప్పితిని."

ఉద్ధవుఁ డిట్లనెను:- "స్వామీ! నాకును నా విభూతు లను గూర్చి చెప్పుఁడు. అర్జునునకుఁ జెప్పిన దానికంటెఁ బది పండ్రెండెక్కువగనే చెప్పవలెను, కృపణత పనికిరాదు."

నవ్వి భగవానుఁ డిట్లనెను:- "సముద్రము నంకలి జలము నెన్నిట్టినన బయటకు జిలుకుము. అది తరుగదు. సరే, నేనింక నావిభూతులను గూర్చి చెప్పెదను. ప్రపంచమునగల స్థావర, జంగమ, ఉద్భిజ, స్వేదజ, అండజ, జరాయుజప్రాణు లన్నిటికిని ఆత్మను నేనే. ఎవరినైన నీ వెవరవని యడుగుము. అతఁడు "నేను" అనును. ఆ 'నేను' నేనే, అందఱును నెవరి నైనను ప్రేమించెదరు. ఆప్రేమను నేనే. అందఱకును నేకైక సుహృదుఁడను నేనే. భార్య తన భర్త ఆజ్ఞను బాలించును, కొడుకు తన తండ్రి యాజ్ఞను మన్నించును. సేవకుఁడు తన యజమాని ఆజ్ఞను బాలించును, వీరందఱిలో నే స్వామి

త్వము కలదో అది నేనే. అంతఃకరణ నిజమగు స్వామిని నేనేయని తెలిసికొనుము. తన స్వామి సేవ రాదరించు చున్నారో, వారు నన్నే ఆదరించుచున్నారని తెలిసికొనుము, నీకు గనఁబడు ఘట, పట, పశు, పక్షి, స్త్రీ పురుషాది మానవ మాత్రులందఱును నారూపములే, నేనే యిన్ని రూపములలో నున్నాను. పాలు పేరుకొని పెరుగైనది. నీరు పేరుకొని మంచుగడ్డైనది. ఆదిలో నేనే అవ్యక్తుఁడుగ నున్నాను. మధ్యలో నేనే వ్యక్తమైనాను. చివరకు నేనే మరల నవ్యక్తముగ నుందును. నావలననే జగదుత్పత్తి యైనది. నాలోనేయున్నది. చివరకు నాయందే కలియు చున్నది. ఇప్పుడు నీవు నా విభూతులను గూర్చి వినుము.''

ప్రపంచమున నన్నియును గొలఁదిగనో గొప్పగనో ప్రగతినిఁ జెందుచున్నవి. అన్నియును నున్నతి, లేక అవనతి వైపునకు బోవుచున్నవి. కంకరు-రాళ్లును బెరుగుచుండును. తరుగుచుండును. సమస్త గతిశీలురలో గతియేదికలదో అది నావిభూతియే. అనఁగా నారూపమే.

ప్రపంచమున ననేకములగు పదార్థములు కలవు. అవి ప్రాణులను దమకధీన మొనర్చుకొనుచున్నవి. తేనె టీఁగలలో రాణియీఁగ ఒకటి యుండును. అది మిగిలిన తేనె టీఁగల నన్నిటిని దనవశమున నుంచుకొనును. అది

లేచిపోయినచో నన్నియును దానివెంట లేచిపోవును. మృగము తన యూథమందలి ఆడు మృగములను, ఏనుఁగు తన యూథమందలి ఆడు యేనుఁగులను దన కధీన మొనర్చుకొనును. బంగాళా దేశమందలి స్త్రీలు తమ మాయలచేతను మంత్రములచేతను బురుషులను జిలుకలవలెను, మేఁకలవలెను జేసి తమ యధీనమున నుంచుకొందురు. తేజస్వులగు పురుషులు తమ తేజముచే స్త్రీ పురుషులను దమ కధీనులుగ నొనర్చుకొందురు. సుందర స్త్రీ పురుషులు తమ సౌందర్యముచే సౌందర్యోపాసకులగు స్త్రీ పురుషులను దమకధీనము గఁ జేసికొందురు. కాలదేవుఁడు సమస్త ప్రాణులను దన కధీన మొనర్చుకొనును. కావునఁ గాలము నాయొక్క విభూతియే. కలన మొనర్చువారిలోఁ గాలమును నేనైయున్నాను: గుణములలో సమతా గుణమును నాయొక్క స్వరూపమే."

ఉద్ధవుఁ డిట్లడిగెను:- "స్వామీ! గుణము లెన్ని?"

ఇది విని నవ్వుచు భగవానుఁడిట్లనెను :- "ఉద్ధవా! నా నామము లెట్లసంఖ్యాకములో, నా గుణములును నట్లే అసంఖ్యాకములు. ప్రపంచమున గుణములచేతనే ప్రతిష్ఠ కలుగును. సత్య, శౌచ, దయా, క్షమ, త్యాగ, సంతోష, కోమలత, శమ, దమ, తప, తితిక్షా, ఉపరతి, శాస్త్రవిచా

రము, జ్ఞాన వైరాగ్యములు, ఐశ్వర్యము, శూరత్వము, వీర త్వము, తేజము, బలము, స్మృతి, స్వతంత్రత, కుశలత, కాంతి, ధైర్యము, మృదుత్వము, నిర్భికత్వము, వినయము శీలము, సాహసము, ఉత్సాహము, సౌభాగ్యము, గంభీ రత్వము, స్థిరత్వము, ఆస్తికత్వము, కీర్తి, సన్మానము, నిరహంకారము, సమత్వము మొదలగు సహస్రాదికములగు గుణములు కలవు ఈ గుణములన్నిటిలో సమతాగుణము సర్వశ్రేష్ఠమైనది. సమత్వ మెవరి మనస్సులోఁ గలదో వారి హృదయములో నేనున్నానని తెలియవలయును, సమతా గుణము నాయొక్క రూపమే. అది నా విభూతియే."

కొన్ని గుణములు స్వాభావికముగ నుండును, కొన్ని కృత్రిమగుణములును బయటనుండి తేఁబడును. ఎట్లనఁగా నొక బాలకుఁడు సాధారణముగఁ బోఁకిరిగ నల్లరివాఁడుగ నుండును. ఉపాధ్యాయుని దగ్గఱ సరళముగను, నమ్రాయక ముగను నుండును. చిన్నతనమున నా స్వభావగుణము చంచ లత్వమే. పోఁకిరితనమే. పొరుగిండ్లకు పోవుటయును, వెన్నను దొంగిలించుకొని వచ్చుటయును, ఒక్కొక్క యింటికి నిప్పు పెట్టుటయును, వారి వారి కుండలను, పాత్రలను బగులఁ గొట్టుటయును, జేయుచుండెడు వాఁడను. నేను మా అమ్మ యశోద దగ్గఱను బోఁగానే యేమియును దెలియని వానివలె

నమాయకుఁడుగ నుండెడువాఁడను. అప్పుడు గోపికలు నవ్వు కొనుచు నిట్లనెడువారు:- "శ్యామసుందరా! నీవు వేషములు మార్చుట బాగుగా నెఱుఁగుదువయ్యా! కపటాశ్రువులను రాల్చుచున్నావా? కాని నీయీ కపటస్వరూపము నీ స్వాభావిక స్వరూపమంత సుఖకరముగ లేదు. ఉద్ధవా! గుణవంతులలో స్వాభావిక గుణమును నేనే. గుణయుక్త వస్తువులలో సూత్రాత్మరూపమున నేనే యున్నాను. పక్వమైన ద్రాక్ష పండ్లయొక్క రుచి,తీపి, దానిలోఁ గల మాధుర్యమును నేనే.

ప్రపంచమున నాకాశము, సుమేరువు, సముద్రము మొదలగు గొప్ప వస్తువులు కలవు. ఈ మహాపదార్థములలో గొప్ప మహత్వమును నేనే. అన్నిటికంటె గొప్ప మహత్తును నేనే.

ప్రపంచమున నొకదానికంటె నొకటి సూక్ష్మజీవులు కలవు. అణువీక్షణ యంత్రము వలనను బాగుగాఁ గనఁబడ నంత సూక్ష్మజీవులు కలవు. ముక్కుతో శ్వాసించిననే చచ్చి పోవు జీవులును గలవు. ఈ సూక్ష్మజీవులలోను జీవుఁడు న్నాఁడు కావున నన్నిటికంటెను సూక్ష్మమైనవాఁడు జీవుఁడు ఆ జీవుఁడు నావిభూతియే. జీవుఁడు నా స్వరూపుఁడే.

ప్రపంచమున జయింపరాని శత్రువులు కలరు, అట్టి జయింపరాని శత్రువులలో మనస్సు మిక్కిలి దుర్జయమగు శత్రువు. ఆ మనస్సును నేనే.

వేదమును జెప్పిన చాలమంది ఋషులు కలరు. అత్రి, గౌతమ, భరద్వాజ, జమదగ్ని, వశిష్ఠ, పరాశరాది అగణిత ఋషులును, మునులును గలరు. వీరందఱిలో హిరణ్యగర్భ రూపమున మొట్ట మొదటి వాఁడను నేనే కమల నాళము మీఁదఁ గూర్చుండిన బ్రహ్మకు నేనే వేదముల నుద్బోధించితిని. కావున నధ్యాపకులలో నాది అధ్యాపకుఁడగు హిరణ్యగర్భుఁడను నేనే."

వేదములలో నసంఖ్యాకములగు మంత్రములు కలవు. వానికి లెక్కలేదు. కాని యీ మంత్రము లన్నిటికిని నాది కారణమగు బ్రణవమును నేనే. ప్రణవముచేతనే సమస్త మంత్రములును బుట్టినవి. కావునఁ ద్రివృత ఓంకారరూపమున నాది మంత్రమును నేనైయున్నాను.

అక్షరములు రెండు రకములు స్వరములు, వ్యంజనములు, అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఋ, ౠ, ఌ, ౡ, ఏ, ఐ, ఓ, ఔ, అం, అః, ఈ పదునాఱును స్వరములు. క, ఖ, గ, ఘ, ఙ, చ, ఛ, జ, ఝ, ఞ, ట, ఠ, డ, ఢ, ణ, త, థ, ద, ధ, న, ప, ఫ, బ, భ, మ, య, ర, ల, వ, శ, ష, స హ, క్ష, త్ర, జ్ఞ, ఈ ముప్పది యాఱును వ్యంజనములు. ఈవిధముగ నేఁబది రెండక్షరములు కలవు. ఇవన్నియును 'అ' కారము లేక పలుకఁబడవు. అకారమే మొదటి అక్షరము,

కావున నక్షరములలో 'అ' కారము నావిభూతి అకారము నాస్వరూపమే. ఏకాక్షర కోశమున ఆకారమునకు వాసుదేవుడను నర్థము చెప్పఁబడినది. ఛందస్సులలో గాయత్రీ ఛందస్సును నేనే.

ఉద్ధవుఁ డిట్లడిగెను:- "స్వామీ! ఛందస్సు లెన్ని?"

భగవానుఁ డిట్లనెను:- "నాయనా! లౌకిక, వైదిక ఛందస్సు లసంఖ్యాకములుగ నున్నవి కాని వీనిలో గాయత్రి ఉష్ణిక్, త్రిష్టుప్, అనుష్టుప్, జగతీ, పంక్తి, బృహతీ ఛందస్సులను నీయేడు వైదిక ఛందస్సులును ముఖ్యములు. ఈ అన్నిటిలో గాయత్రీ ఛందస్సు అన్నిటికంటె శ్రేష్ఠమైనది. అది నావిభూతియే. నా స్వరూపమే."

దేవతలును నసంఖ్యాకములుగ నున్నారు. దేవతలలోఁ జాల గణములు కలవు. దేవతలందఱకును నొక రాజుండును. ఆతని దేవరాజనియు, దేవేంద్రుఁడనియు నందురు. ఆ దేవేంద్రుఁడు నా విభూతియే."

ఉద్ధవుఁ డిట్లడిగెను:- "స్వామీ! దేవతలకును జాల సంజ్ఞలు కలవు, వసువులు, ఆదిత్యులు, రుద్రులని వేఱు వేఱుగ నున్నారు. ఈ అన్నిటిలో మీ విభూతులు కలిసియున్నవా, వేఱు వేఱుగ నున్నవా?"

భగవానుఁ డిట్లనెను:- "అన్నిటియందును నావిభూతులు వేఱు వేఱుగఁ గలవు. నా విభూతి లేని జాతి లేనే లేదు. ధ్రువాది వసువులలో అగ్నియను వసువు నా విభూతియే. ధాత, మిత్ర, ఆర్యమ, పూష, శక్ర, వరుణ, భగ, త్వష్ట, వివస్వాన్, సవితా, భాస్కర, విష్ణు వను పేర్లుగల యీ ద్వాదశాదిత్యులలో విష్ణువను నాదిత్యుఁడను నేనే.

అంత శౌనకుఁ డిట్లడిగెను:- "సూతా! విభూతికి అపచారము కాకుండినచో మే మొక్కటి అడిగెదము."

సూతుఁ డిట్లనెను:- "స్వామీ! ప్రశ్నించుట అపచారము కాదు."

శౌనకుఁ డిట్లనెను:- "ఇది ప్రశ్న కాదు. తెలిసికొనుటకు మాత్రమే. నీవు విభూతి యోగమును గబగబ చెప్పుకొనిపొమ్ము. ఫలాని వానిలో ఫలాని వాఁడనని చెప్పి త్వరగా ముగించుము. ఇట్లు వివరముగఁ జెప్పిన నెప్పటికి పూర్తికాఁ గలదు!"

సూతుఁ డిట్లనెను:- "స్వామీ! మీరు యుగముల పాటు జీవించెదరుగాక! నేనును నదియే కోరుచున్నాను. మీ భయమున బయట పెట్ట లేదు. గడ్డి కోసినట్లున్నదని మీరనుచున్నారు. అయితే వినుఁడు. త్వరత్వరగా ముగించెదను. భగవానుఁడును నుద్ధవునకు గబగబ చెప్పి వైచి

సాయిలందు ధనసంపత్తిని, ఛలులందు ఛలమును, తితిక్షు లందుఁ దితిక్షను, సాత్త్వికులందు సత్త్వగుణమును, బలవం తులందు బలమును, ఉత్సాహులం దుత్సాహమును, భక్త లందు భక్తి పూర్వకమగు నిష్కామ కర్మను, వైష్ణవ భక్త లకు వాసుదేవ సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ, నారాయణ హయగ్రీవ, వరాహ, నృసింహ, బ్రహ్మ యీ తొమ్మిది మందిలో సర్వోత్తమ మూర్తియగు వాసుదేవుఁడను నేనే. గంధర్వులందు విశ్వావసువు, అప్సరసలందుఁ బూర్వచిత్తినిఁ పర్వతములందు స్థిరతను, భూమియందు గంధమును, జల మందు రసమును, తేజస్సులందగ్నిని, సూర్య చంద్రులను నన్నుఁగా దెలిసికొనుము. తారకలందలి కాంతియు, ఆకాశ మందు దానిగుణమగు శబ్దమును, బ్రహ్మణ్యులందు బలిని, వీరులందు నర్జునుని, సమస్త ప్రాణులయందు ఉత్పత్తి. స్థితి. వినాశములను నేనే. గతివంతులందు గతిని. యుక్తి వాదు లందు యుక్తిని, త్యాగులందుఁ ద్యాగిని, గ్రహణ మొనర్చు వారియందు గ్రహణమును, ఆనందమును, సుఖదస్పర్శనొసంగు వారియందు స్పర్శను నేనే. స్వాదిష్టముగ నుండు వానియందు స్వాదును. వినఁబడు వానియందు శ్రవణమును, వాసనచూచు వానియందు ఘ్రాణమును, సమస్తేంద్రియములందు నింద్రి యత్వమును నేనే.

పృథివ్యప్తేజోవాయు రాకాశములను బంచ భూతము లును, అహంతత్త్వమును, మహత్తత్త్వమును, జీవ, ప్రకృతి సత్వ, రజ, స్తమ బ్రహ్మలును నేనే. తత్వ సంఖ్యను లెక్కించుటయును, లక్షణముల ద్వారా వానిని సిద్ధించుట యును, బుద్ధిద్వారా వానిని నిశ్చయించుటయును, ఇదంత యును నారూపమే. ఈశ్వర జీవ, గుణము-గుణీ, అన్నిటి యందునుండు సర్వస్వరూపముగఁ జూడఁ బడునదియును నా రూపమే. నాకతి రిక్తముగ నింకేమియును లేనే లేదు.

ఉద్ధవుఁ డిట్లనెను - "స్వామీ! మీరిప్పు డనుమాన మున మీసమస్త విభూతులను గూర్చి లెక్క చూచి చెప్పుఁడు. కోటియా, నూఱుకోట్లా, పద్మములా, మహా పద్మములా? అన్నియును నీ విభూతులెన్ని యున్నవి?"

అంత భగవానుఁ డిట్లనెను:- "ఉద్ధవా! ఒక్క గ్రామమందు నెన్నియో యిండ్లుండును. అట్టి గ్రామము లెన్నో కలిసిన నొక ప్రాంతమగును. చాల ప్రాంతములు కలిసి ఒక మహాప్రాంతమగును. కొన్ని మహా ప్రాంతములు కలిసి దేశమగును. చాల దేశములు కలిసి ఒక వర్షమగును లేదా ఖండమగును. చాల ఖండములు కలిసి ఒక ద్వీప మగును. ఈ పృథివిమీద సప్త ద్వీపములును సప్త సముద్రములును గలవు. సప్త పాతాళమును, సప్త

స్వర్గములును గలవు. పదునాలుగు భువనము లొక బ్రహ్మాండము. ఇట్టి అసంఖ్యాకములగు బ్రహ్మాండములకు నేను స్వామిని. ఎవఁడైన లెక్కించు వాఁడుండినచో బ్రహ్మాండమందలి ధూళిని, సముద్రములందలి జలబిందువులను లెక్కింపవచ్చును, కాని నావిభూతుల సంఖ్యను నే లెక్కింపఁ జాలను."

ఉద్ధవుఁ డిట్లనెను :- "స్వామీ! అయితే యింక ముందుకునోవుట వ్యర్థము, ఇది మీయొక్క విశిష్ట విభూతి యని తెలిసికొనుటకేదైనఁ బరిభాషను నాకు చెప్పవలయును."

ఇది విని భగవానుఁడిట్లనెను:- "మంచిది, ఉద్ధవా! నా విభూతుల నన్నిటిని గుర్తుంచుటకొక గురుమంత్రమును జెప్పెదను,"

సూతుఁ డిట్లనెను :- "మునులారా! ఏ విధముగ భగవానుఁడు ఉద్ధవునకు సమస్త విభూతులను గుర్తించుటకై యేమి చెప్పెనో దానిని మీకు జెప్పెదను వినుఁడు."

—॥—

# భగవద్విభూతులకు ముఖ్యమగు గుర్తు

శ్లో॥ తేజః శ్రీః కీర్తిరైశ్వర్యం హ్రీస్త్యాగః సౌభగం భగః ।
వీర్యం తితిక్షా విజ్ఞానం యత్ర యత్ర స మేఽంశకః ॥
శ్రీభాగ. ౧౧ స్కం. ౧౬ అ. ౪౦ శ్లో॥

వ॥ ఉద్ధవా ! తేజ, శ్రీ, కీర్తి, రైశ్వర్య, లజ్జా, త్యాగ సౌందర్య, సౌభాగ్య, పురుషార్థ, తితిక్షా, విజ్ఞానాది ఉత్తమ గుణము లెచ్చట గనఁబడునో అవి నా అంశ లేయని తెలియవలెను.

ప్రపంచమంతయు నా భూమాపురుషునియొక్క విభూతియే. ఆతని విభూతిచేతనే ఈ ప్రపంచమంతయును భాసించుచున్నది ఆతని విభూతి లేకుండినచో దృశ్యమును లేదు, ద్రష్టయును లేఁడు ఆతఁడే దృశ్యమునై, మరల ద్రష్టయై ఆ దృశ్యమును జూచుచున్నాఁడు. ఆతఁడణు పరమాణువులందు వ్యాపించియున్నాఁడు. కాని విశేషస్థానములందు విశేషరూపమున ననుభవమునకు వచ్చుచుండును. ప్రకాశమంతటను వ్యాపించినను సత్వమెంత అధికముగనుండినఁ బ్రకాశమంత ప్రస్ఫుటితముగును. పాషాణమందు సూర్యుఁడు ప్రతిబింబింపఁడు. ఏలననఁగా దానిలోఁ దమస్సుయొక్క ఆవరణ

లధికముగనుండును. మనుపు ధాతువులమీఁదఁ గొంచెముగఁ గనఁబడును. ఏలననఁగా దానిలో బాషాణమునకంటె సత్యమధికముగ నున్నది. అద్దములో స్పష్టముగఁ గనఁబడును. ఏలననఁగా దానిలో స్వచ్ఛత్వమును, సత్వము యొక్క మాత్రయును నన్నిటికంటె శ్రేష్ఠముగనున్నది. ఏ వస్తువైనను భగవానుఁడు లేక ఉండనే ఉండదు. కాని యెచ్చట విశేషముగ గోచరించునో అది ఆతని విభూతి.

సూతుఁ డిట్లనెను :- "మునులారా! ఉద్ధవుఁడు భగవంతుని ఆతని విభూతులను గూర్చి అడుగఁగా భగవానుఁ డిట్లనెను:- "ఉద్ధవా! నీ వెచ్చటనైన నేదైన విశేషమును గాంచినచో నది నా విభూతి యని తెలిసికొనుము. ఏ పురుషునిలో, ఏ స్థలమున నీకు తేజము కనఁబడునో అది ఆతనిది కాదు నా విభూతియే. ఒకనిలోఁ దేజస్సుండిన నాతని మాటలను నవశ్యము వినుచుందుము. ఆతనికిఁదల యొగ్గెదము ఏలననఁగా నది నా తేజస్సే. నా విభూతికి చిహ్నమది.

ఒకొక్కని దగ్గఱ ధనశోభగాని, తపశ్శోభగాని యుండును. ఒకని యిఁటికిఁబోయిన నాయిల్లు చక్కఁగఁ గళకళలాడుచు శోభగా నలికి మెత్తఁబడి యుండను. ఇంటి లోని వారును వేష భాషలందును, మర్యాదయందును, లోపలను బయటను స్వచ్ఛముగ నుందురు. ఇది భగవద్విభూతికి చిహ్నము.

ఒకానొక వ్యక్తిని లక్షలకొలంది జనము చూడ కుండినను వానికీర్తి వ్యాపించియుండును. ఆతని పరోక్షమున జనులాతని గూర్చి చెప్పుకొను చుందురు. ఆతని సంఘ టనములను గూర్చి చెప్పుకొను చుందురు. ఆతని చరిత్రలను మిక్కిలి ప్రేమతో వినుచుందురు. ఆ వ్యక్తి కింతటి కీర్తి యేల కలిగినది? ఏలననంగా నాతనిలో నా విభూతి అంశ కలదు. నా మూలముననే వాని కింతటి కీర్తి వచ్చినది?

కొందఱకు గొప్ప యైశ్వర్యముండును. వారింటిలో నుండినను, వనములో నుండినను వారి యైశ్వర్యము వారిని వదలదు. ఒకానొక శ్రేష్ఠి గొప్ప విభవ వంతుండును నైశ్వర్యశాలియునై యుండెను. ఆతం డెచ్చటికి పోయినను నాతని యైశ్వర్యమాతని ముందు పోవుచుండునని లోకులను చుందురు. ఒకానొక నాస్తికునకు దీనిమీంద విశ్వాసము లేదు. ఆతండు పురుష ప్రయత్నవాది. ఒక దినమున నేదో పని మీంద నాతని నొంటరిగానే నౌకలోం గూర్చుండం బెట్టుకొని యమునానదికి మధ్య ప్రవాహములోనికి గొని పోయెను. ఆతం డిట్లనెను:- "శ్రేష్ఠిగారూ! మీయైశ్వర్యము మీ వెనువెంటనే నడచునని నేను వినియుంటిని. అట్లయినచో మీరు నా కిచ్చటనే ఒక లక్షరూపాయ లొసంగుండు."

శ్రేష్ఠి వెంటనే యమునానది లోనికిఁ జేతినిఁబెట్టి యిట్లనెను:- "నీవీయవలసినది లక్షరూపాయలు త్వరలో" ఆ నాస్తికుని యాశ్చర్యమునకు మేరలేక పోయెను. ఆతని చేతిలో లక్షరూపాయల సంచిని జూడఁగనే, ఆతఁడాతని పాదముల మీఁదఁబడి యిట్లనెను:- "యథార్థమున మీరే యైశ్వర్య శాలురు" ఉద్ధవా! ఐశ్వర్యశాలురలో నైశ్వర్య మును నేనే. నీ కెచ్చట సమ్యాగ్నైశ్వర్యములు కనఁబడినను నది నా రూపమే యని భావింపవలయును.

చాలమంది కన్నులు మిక్కిలి సిగ్గుగా నుండును. స్త్రీలలోను బురుషులలోను లజ్జఉండును. నిర్లజ్జులే లజ్జను గాంచి హృదయమునఁ బశ్చాత్తాపమును జెందెదరో ఆ లజ్జ నా విభూతియే."

కొందఱు తమదగ్గఱ నున్న దంతయును నొసంగు త్యాగులుగ నుందురు. వారు కూడఁబెట్టు కొందమన్నను గూడఁ బెట్టుకొనరు. దానము చేసిచేసి నిర్ధనులగుదురు. కాని వారికి త్యాగము పోనేపోదు లేక తమ సర్వస్వము నొసంగి వనములకోఁ బోవుదురు వారికి మనస్సులో నైనను దాృగము చేసిన వస్తువు జ్ఞాపక ముండనేయుండదు. అట్టి త్యాగులలో గల త్యాగధృతిని నేనే. రఘుమహారాజు తన సర్వస్వమును త్యాగ మొనరించెను. ఆతఁడు మట్టి పాత్రలో సంధ్యావం

దన మొనర్చెడువాఁడు అప్పుడు గురు దక్షిణకై ధనము నడుగుటకై ఒక బ్రాహ్మణుఁడు వచ్చెను. రాజు యొక్క యీ నిర్ధనతను గాంచి ఆతఁడు మిక్కిలి దుఃఖించెను. నిరాశుఁడై యుండెను. తర్వాత రాజునకుఁ దెలియఁగాఁ గుబేరునిపై దండెత్తఁ బ్రయత్నించెను. ఈ సంగతిని కుబేరుఁడు గ్రహించి రాత్రిపూట కుబేరుఁడు రాజుయొక్క ధనాగారము నంతను ధనముతో నింపి వైచెను. కోశాధ్యక్షుఁడు వచ్చి కోశాగారమంతయును సువర్ణముతో నిండియున్న దని చెప్పఁగా నా ధనము నంతను నా బ్రాహ్మణున కీయుఁడలఁచెను. బ్రాహ్మణుఁడు పదునాలుగు లక్షల సువర్ణ ముద్రల కంటె నెక్కువగఁ దీసి కొనఁదలఁప లేదు. రాజు ఉన్నదంత యును నీయఁదలఁచెను. వారిద్దరి త్యాగమును గాంచి ఆకాశమునుండి దేవతలు వారిద్దరిమీఁదఁ బుష్పవృష్టినిఁ గురిపించిరి. ఆ యిద్దరికడ నుండిన త్యాగ విభూతి నా స్వరూపమే.

ప్రపంచములో సౌందర్యమును నొక ఆకర్షణ వస్తువు. ఎచ్చట సౌందర్యముండిన నచ్చటికి ఋషుల చిత్తము సహజముగ నాకర్షింపఁబడును. స్వర్గమందలి అప్సరసలకును, భూమిమీఁద వేశ్యలకును సౌందర్యముండును. దానివలన వారు మంగళముఖులుగ నెన్నఁబడు చుందురు.

అసురులు మోహినీ సౌందర్యమును గాంచియే ఆమె కుల గోత్రముల నాలోచింపకయే వారికి బ్రాణప్రదమగు నమృతము నర్పించిరి. కామదేవుని భస్మ మొనరించిన మహాదేవుఁడు నా మోహినీరూప సౌందర్యమునకు వశీభూతుఁడై అతని వెంట బడెను. ఎంతో జ్ఞాని, ధ్యాని, వివేకి యగు దశరథుఁడు సౌందర్య లోభముచేఁ గైకేయి చేతిలోఁ గ్రీడామృగమయ్యెను. వ్రజాంగనలు నా సౌందర్యమును గాంచియే ఆత్మ విస్మృతినిఁ జెందిరి. ఎచ్చటెచ్చట సౌందర్యమున్నదో అది అంతయును నా విభూతియని తెలిసికొనుము.

సౌభాగ్యమును బ్రపంచమున నందఱును బొందఁ జూలరు? తన పతిచే నతిప్రేమతోఁ జూడఁబడు స్త్రీ మిక్కిలి సౌభాగ్యశాలిని. తన యాజ్ఞను బాలించు పుత్రుఁడు కలిగిన తండ్రి సౌభాగ్యశాలి. సుందరుఁడును, స్వస్థుఁడును, మందహాసముఖారవిందుఁడును, సర్వగుణ సంపన్నుఁడును, గుణీనుండును, శ్రీమంతుఁడు నగు బతి దొఱకిన కన్యయే సౌభాగ్యశాలిని. భగవద్భక్తుఁడుగ నుండు పుత్రునిఁ గనిన తల్లియే సౌభాగ్యశాలిని. భగవద్భక్తుఁడు జన్మించిన దేశమే సౌభాగ్యశాలిని యగు దేశము. ఆతిథ్య మొసంగుటలో నానందమును బొందువాఁడును, నిరంతరము నతిథులును నభ్యాగతులును వచ్చి సంతుష్టులై వెడలుచుండు గృహస్థుని

గృహామే సౌభాగ్యవంతమైనది. నిరంతరము సాధువులను సజ్జనులను సేవించు భాగ్యముగల వారి జన్మమే సౌభాగ్య వంతమైనది.

చాలమంది మిక్కిలి పురుష ప్రయత్న మొనర్చు చుందురు. ఏదో చేయుచునే యుందురు వారు వ్యర్థముగ నొక్క నిమిషమైనను గడుపరు. ఎట్టి చెడ్డ స్థానమునా వారి కొసంగినను, నచ్చుటను దన పురుషార్థమును దానిని సుందర ముగను, స్వచ్ఛముగను నొనర్చును. ఎట్టి చెడిపోయిన కార్యమునైన నాతని కొసంగుము నిరంతరము తన పురుష ప్రయత్నముచే దానిని సాధించును. అట్టివారు ప్రారబ్ధము మీఁద నాధారపడియుండరు. ఆ పని నెఱవేరువఱకును దాము పురుష ప్రయత్నమును జేయుచునే యుందురు. అట్టి పురుషా ర్థులలో నేపురుషార్థమున్నదో అదినేనే. నా విభూతియే.

చాలామంది తపస్వులు గ్రీష్మమునందు పంచాగ్ని మధ్యమునఁ దపించెదరు. చలికాలమున నీటిలో నిలుచుం దురు. వర్షకాలమున వానలో నిలుచుందురు. ఎవరైనఁ గటు వచనములను బలికిన దానిని సహించెదరు. రోగము వచ్చి నచో నది ప్రారబ్ధిభోగమని భావించి సహించెదరు. దానిని నివారించుకొనుటకుఁ బ్రయత్నింపరు. సారాంశ మేమనఁగా వారు సమస్త దుఃఖములను బ్రతీకారమేమియును లేకయే

సహించెదరు. ఆ సహాన శీలురలో నేతితిక్షకలదో, అది నా స్వరూపమే.

చాలమంది జ్ఞానులకు బ్రహ్మవిజ్ఞానముండును. వారు తమ విజ్ఞానమున నీదృశ్య ప్రపంచమును క్షణభంగురము, గను, పరివర్తన శీలముగను గ్రహించెదరు. ఆ జ్ఞానులలోని విజ్ఞానమును నేనే. భౌతిక విజ్ఞానమున నిత్యమును జరుగు నా విష్కారమేది జరుగుచున్నదో అది నా స్వరూపమే. ఉద్ధవా! ఎంతని చెప్పగలను? ఎచ్చటనైన నేదైన వైశిష్ట్య ముండెనా అది నా విభూతియే."

ఉద్ధవుఁ డిట్లనెను:- "అయితే స్వామీ! మేమీ! విభూతులను గూర్చి చింతించెదము."

నవ్వి భగవానుఁ డిట్లనెను:- "ఇవి నన్నుఁ బొందుటకు నాయింటి లోనికిఁ బ్రవేశించుటకు సాధనమాత్రములే. నీవీ విభూతులను మాత్రమే పురుషార్థముగను పరమార్థముగను భావింపకుము ఇవి కేవలము మనో వికారమాత్రములే.

ఉద్ధవుఁ డిట్లనెను :- "మనో వికారములగు టెట్లు స్వామీ!"

భగవానుఁ డిట్లనెను:- "నీకు నేను బరమార్థ వస్తువును గూర్చియు, నపరమార్థ వస్తువును గూర్చియు చెప్పెదను, మనో వాక్కులకు విషయ మగు వస్తువు లన్నియును

మాయాప్రసారములే, మనోవికారములే, యదార్థమునకు బరమార్థవస్తువు మనోవాక్కుల కందునదికాదు. వీనిలోఁ బరమార్థముయొక్క ఆభాసమాత్రమున్నది. ఆ పరమార్థము యొక్క సత్తాచే నిది సత్తావంతమైనది. కావున దీనినే సమస్తమునని ప్రయత్నము చేయరాదు. నీవొక దేశమునకుఁ బోవలయు ననుకొనుము, గుఱ్ఱము ద్వారా పోవలయును ఎవరైన నీవు గుఱ్ఱమునకు సేవచేసినచో నచ్చటికిఁ బోయెదవని నట్లుండును. ఆతఁడు గుఱ్ఱమును రాత్రింబవళ్లు సేవించుచున్నాఁడు. కాని దాని పై నెక్కి పోవుటలేదు. అది ముందుకు బోకపోయినచో నశ్వసేవ వ్యర్థము. ఎవరైనను నీవు వడ్లను దంపుచుండును. నీకు జీవనయాత్ర సాగిపోవునని చెప్పిన, నిరంతరము ధాన్యమును దంపుచుండును. కాని వానిని చెఱఁగి, పొట్టు, చిట్టు, తవుడును దీసివైచి బియ్యమును వండి తినుటలేదు. కేవలము దంపుటనే నిమగ్నుఁడై యుండెను. దానివలన నాతని జీవయాత్ర నడువదు. కావున మనోవాక్కులకు విషయములగు నీ విభూతులే సమస్తమని భావింపగూడదు. మనస్సును సంయమ మొనర్చి, బుద్ధినిఁ గుశాగ్రముగఁ జేసికొని దానిని నా యందుంచుము. మనస్సంయమ మొనర్పక, మనస్సు నటునిటు విషయముల మీఁదకుఁ బంపుచుఁ, బైకి గొప్పగొప్ప కృచ్ఛచాంద్రాయణాది వ్రతముల నొనర్చుచు, ఘోరతపస్సును జేయుచు,

జ్ఞానవాక్యములను బెద్దగఁ బలుకుచుండినచోఁ జినిఁగిన బట్టలో బియ్యమును గట్టిన నవి యెట్లు విడిపోవునో అట్లే సమస్త కార్యములును బాడైపోవును. ఎవరైన మట్టి పాత్రలో నీరును దీసికొని రమ్మని చెప్పినచో నదికిఁబోయి, అచ్చట గట్టిమట్టిని దీసికొని, పాత్రగానొనర్చి నీరును నింపి నచో నది కరిగి నీరంతయును బోవును. మట్టిపాత్రలో నీటినిఁ దీసికొని వచ్చుట నిజమే, కాని పచ్చిమట్టితోఁ జేసినదిగ నుండరాదు. మట్టినిదెచ్చి దానిని బాగుగాఁ శాకె మొనర్చి కుండగఁజేసి, ఆరిన తరువాతఁ జక్కఁగా మూసి ఆరఁబెట్టి, యెండిన తరువాత గాల్చవలయును. కాల్చిన తరువాత నిచ్ఛిద్రముగ నుండవలయును. అప్పుడు దానిలో జలము నిలుచును. నా జ్ఞానము మనస్సుచేతనే జరుగుననుట నిజమే కాని సంసార వ్యవహారములలోఁ బడిన నశుద్ధమగు మన స్సుతోఁ గాదు. సంయమాగ్నియందు మనస్సును గాల్చి శుద్ధమొనర్చవలయును. ముందుగా వాక్కును జయించుము మిగిలిన యింద్రియములను జయించుము, ప్రాణములను జయించుము. నీయాత్మచే బుద్ధిని జయింపుము. ఈ విధ ముగఁ గ్రమముగ నన్నిటిని జయించి ఆత్మనిష్ఠుఁడవు కమ్ము. అప్పుడు నీవీ సంసారమందలి ఆవాగమునుండి శాశ్వతముగ ముక్తుఁడవయ్యెదవు. ఈ సంసృతి చక్రమునుండి శాశ్వత

ముగ బయట పడెదవు. ఇంక జనన మరణ చక్రమునఁ బడఁబోవు.

కావున సారాంశ మేమనఁగా ముందుగా వాక్కును సంయమ మొనర్చుము. సమస్తేంద్రియములను సంయమ మొనర్పుము. అంత వాఙ్మనః ప్రాణములను నాయందుగల భక్తియుక్తమగు బుద్ధితో సంయమ మొనర్పుము. ఈ విధముగ వాఙ్మనః ప్రాణములను ఇంద్రియములను సంయమ మొనర్చి, సర్వభావముచే నన్ను శరణు పొందుము. వీని నన్నిటిని నాలోఁ గలిపినచో నింక నాతఁడేమియును జేయ వలసిన పనియుండదు. ఆతఁడు కృతకృత్యుఁడగును. అతఁడు కృతార్థుఁడై పోవును, జీవన ఫలమును బొందినవాఁడగును. నేను నీకు సంక్షేపమున విభూతులను గూర్చి చెప్పితిని. ఇప్పుడు నీ వేమి వినఁగోరుచున్నావు.''

ఉద్ధవుఁ డిట్లనెను:- ''దేవా! ఇప్పుడు నాకువర్ణాశ్రమ ధర్మ రహస్యమును గూర్చి చెప్పుఁడు.''

సూతుఁ డిట్లనెను:- మునులారా! ఉద్ధవుఁడు భగవానుని వర్ణాశ్రమ ధర్మములనుగూర్చి చెప్పఁ దొడఁగెను. ఇప్పుడిఁక వాని వివేచనమును గావించెదను.''

—//—

# వర్ణాశ్రమ ధర్మ రహస్యము

శ్లో॥ విప్ర క్షత్రియ విట్శూద్రా ముఖబాహూరు పాదజాః।
వైరాజాత్పురుషా జ్జాతా య ఆత్మాచారల క్షణాః॥

శ్రీ భాగ. ౧౧స్కం. ౧౭అ. ౧౩శ్లో॥

వ. ఉద్ధవా! విరాట్పురుషుని ముఖ, బాహూరు, పాదముల నుండి క్రమముగ బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రు లను నీ నాల్గు వర్ణము లుద్భవించినవి. వీనిలో వారి వారి ఆచారములే వీరి వర్ణములకు లక్షణములు. అనఁగా వీరు తమ కర్మలద్వారానే గుర్తింపఁబడుదురు."

సమాజమున సమస్త ప్రకృతులవారును నుందురు. అందఱియొక్క సమూహనామము సమాజము. సమాజము నకు ఆధ్యాత్మ్య, శాసన, వ్యాపార, సేవలు మిక్కిలి అవసర ములుగ నుండును. ఇందులో నధ్యాత్మ చింతన మెవరు చేయుచుందురో, వారి నిర్వాహభారము సమాజముమీఁదఁ బడును. వారు శరీర నిర్వాహముకొఱకు వేఱే ప్రయత్న మొనరింప నక్కర లేదు. సమాజమును శాసించువానికి ఇత రులు పన్నులు రూపమున నొసంగెదరు. ఆ పన్నులద్వారా తన కార్యములను నిర్వహించుకొనును వ్యాపారమును జేయువారు, వ్యాపారమున వచ్చిన లాభములలోఁ దమ

కార్యములను నిర్వహించుకొందురు. సేవాపరాయణులగు వారియొక్క నిర్వహణము వారెవరికి సేవచేయుచుండిరో వారే చేయుదురు. ఈ విధముగ పరస్పర సహాకారము వలన నీ సమాజరూపమగు బండి నడుచుచుండును. సమాజమున నుశ్శృంఖలత వచ్చినపుడును, సంకటము వచ్చినపుడును, నొకరొకరు సహాయమును జేసికొనరు. స్వధర్మమును వీడి పరధర్మము ననుసరించెదరు. దానివలన నధర్మము వృద్ధి పొంది ధర్మము నశించును. అధర్మము పరాకాష్ఠను జెందగానే అంతయు నొక్కసారిగా దలక్రిందులగును. అధర్మము పెరిగినకొలంది ధర్మము తగ్గిపోవును. అధర్మము వృద్ధిపొందినంత త్వరగా ధర్మము వృద్ధిపొందదు. ఇప్పుడు కలియుగము. అధర్మముయొక్క పూర్ణ సామ్రాజ్యమిది. వెంటనే కృతయుగము రాగలదు. ఘోరమగు నధర్మము తరువాత వెంటనే శుద్ధమగు ధర్మము ప్రసారమగుచుండును. ఈ క్రమమున నెల్లప్పుడును జరుగుచుండును. ధర్మాధర్మములు రెంటికిని జనకుండా ప్రభువే.

సూతుండిట్లనెను – "మునులారా! ఉద్ధవుండు భగవంతుని వర్ణాశ్రమ ధర్మములను గూర్చి ప్రశ్నింపంగా భగవానుండిట్లనెను:– "నాయనా! నీవి వర్ణాశ్రమ ధర్మములను గూర్చి నన్నే యడిగెదవేమి?"

ఉద్ధవుఁడిట్లనెను:- "స్వామీ! ఎవరి నడుగుదును? స్వామీ! ఈ పృథివీతలము సంగతి యెందులకు? సాక్షాద్వేద గర్భుఁడగు బ్రహ్మసభలో నాలుగు వేదములును మూర్తీభ వించి ఆతని నుపాసించుచుండును. అచ్చటనే నీయీ ధర్మము నకు వ్యాఖ్యాతగాని, నిర్మాతగాని, రక్షకుఁడుగాని లేఁడు. కావున నేను మిమ్మే మీ నోట వర్ణాశ్రమ ధర్మములను గూర్చి వినఁదలఁచుచున్నాను. చాలమంది వర్ణాశ్రమ ధర్మ ములు కర్మప్రధానము లనుచుందురు. వర్ణాశ్రమ ధర్మము లకు గర్మ ప్రధాన మవశ్యమున్నది, కాని నేను వర్ణాశ్రమ ధర్మములను మీ భక్తియనియే భావించెదను. కావుననే వర్ణాశ్రమ ధర్మముల నాచరించుటచే మీయందు భక్తి కలుగదో అట్టి అనుష్ఠానమును గూర్చి చెప్పఁగోరుచున్నాను. వర్ణాశ్రమ ధర్మముల నుపదేశించినది మీరేకదా!"

భగవాను డిట్లనెను:- "ఉద్ధవా! నే నెప్పుడెవరికి వర్ణాశ్రమ ధర్మములను గూర్చి యుపదేశించితిని?"

ఉద్ధవుఁ డిట్లనెను:- "స్వామీ! బ్రహ్మసభయందు సనక, సనందన, సనాతన, సనత్కుమారులు నల్గురును దమ తండ్రియగు ధాతను బ్రశ్నించినపుడాతఁడు కర్మకాండలో మునిగియుండుటచేఁ గుమారుల ప్రశ్నలకు యథార్థముగు నుత్తరము నీయఁజాలకపోయెను, అప్పుడు మీరు హంస

రూపమును ధరించి వారి ప్రశ్నలకు సమాధాన మొసంగితిరి. కుమారులకును, బ్రహ్మకును మీరేది ఉత్తమ ధర్మమని యుపదేశించితిరో, అదియే పరంపరగా నిప్పటికిని నడుచు చున్నది. తమ తమ తండ్రులు, తాతలు, గురువుల వలన విని జనులా ధర్మము నాచరించుచున్నారు. ఇప్పు డధర్మ బాహుళ్యముచేతను, అధిక కాలము గడుచుటచేతను నా అనుశాసనరూపమగు ధర్మము మర్త్యలోకమందునష్టప్రాయ మైనది. దాని ప్రచలనమత్యంత న్యూనమైనది. మీరే ఈధర్మ మునకు వక్తలు, ప్రవర్తకులు, రక్షకులు, ప్రసారకులు, మీ చేష్టలచే మీరీధరాధామమును వదలి మీలోకమునకుఁ బోసున్నారని తోఁచుచున్నది. అచ్యుతా! మధుసూదనా! మీరు స్వధామమునకు పోయిన తరువాత నష్టప్రాయమైన నీధర్మము నుపదేశించువారెవరుందురు. ఈ అప్రచలిత ధర్మ మును మరలఁ బ్రచారము చేయువారెవరు? కావున మీరీ భక్తి ప్రధానమగు వర్ణాశ్రమ ధర్మమును నాకుపదేశిం చుఁడు. ఏ వర్ణము వానికి, ఏ ఆశ్రమము వానికే ధర్మము కలదు ఏయే ముఖ్య ముఖ్య ధర్మముల నాచరింపవలయును. దయతో దానిని నాకు జెప్పుఁడు."

సూతుఁ డిట్లనెను:- "మునులారా! ఉద్ధవుఁడు భగ వానుని చాల వినయముతో నడుగఁగా భగవానుఁ

డిట్లనెను:- "ఉద్ధవా! నీవుమంచి లోకోపకారకమగు ప్రశ్న నడిగితివి. నీయీ ప్రశ్నచే ధర్మ ప్రధానులగు వారికి చాల మేలు కలదు. నీయీ ప్రశ్న వర్ణాశ్రమ యుక్తులగు సజ్జనులకు ఆత్యంతిక శ్రేయఃస్వరూపమును ముక్తిని బ్రసాదించునది కాఁగలదు. నేను జెప్పిన విధముగ నెవడాచరణ మొనరించునో, అతఁడే సంసార బంధనము నుండి విముక్తినిఁ జెందును. నాయీ వర్ణాశ్రమ ధర్మము సనాతనమైనను, ఇది సమయానుసారముగ వికాసము జెందినది."

ఉద్ధవుఁ డిట్లనెను:- "వికాస మెట్లెవది? స్వామీ! ముందుగా దీనిని గూర్చి నాకు జెప్పుఁడు."

భగవానుఁ డిట్లనెను:- "ఉద్ధవా! కల్పాంతమున నీ సృష్టియంతయును బ్రహ్మలో లీనమగును. వేయి మహాయుగములొక కల్పమగును. ఆ సమయమున నీ బ్రహ్మాండమంతయును బ్రళయమును జెంది, బ్రహ్మయొక్క యుదరములో లీనమగును. అతని రాత్రియనంతే. రాత్రిపూర్తి కాఁగానే మరల సృష్టి జరుగును. ఆ సమయమున నధర్మము దాగియుండును. శుద్ధ సత్వగుణ ప్రాబల్యముండుటచే నందఱ బుద్ధియును శుద్ధముగ నుండును. మానవులందఱునులోపలను జయుటను విశుద్ధముగ నుందురు. ఆసయమున నెవరికిని నాది నేను, నిది నీవు అను భావముండదు. ఏ వస్తువు నందును స్పృహ యుండదు, అందఱకును ధర్మ మతియుండును. అంద

అను దాము జగత్పితయొక్క పుత్రుల మనుకొనుచుందురు. అందఱును ప్రేమతో నుండెదరు. ఆ సమయమున నందఱును నొకే వర్ణము వారై యుండెదరు. వారిని బ్రాహ్మణులనుము పావనులము, ధర్మాత్ములనుము. జ్ఞానస్వరూపులుగను శుద్ధముగను నుండుటచే 'హంస' యను పేరు శాస్త్రములలో వాడఁ బడినది. కల్పాదిని కృతయుగమున నొక్క హంస వర్ణమే కలదు. ఆసమయమున నెవరును నిండ్లు కట్టుకొనెడు వారు కారు. వస్తు సంగ్రహ మొనర్చెడు వారు కారు. జీవనము కొఱకే ప్రయత్నమును జేసెడువారు కారు. అందఱి చిత్తములు శుద్ధముగ నుండుటచే సంకల్ప సిద్ధి యుండెడిది. ఏ వస్తువును సంకల్పించినసది వెంటనే వచ్చెడిది. వృక్షములు వానికవియే ఫలములొసంగెడివి. ఎక్కడ కావలయు ననిన నచ్చటనే సిద్ధించెడువారు. ఆ సమయమున వారు పూర్ణ ఉన్నతిలోనుండిరి. పూర్ణ ఉన్నతి యనఁగా బాహ్య వస్తువు యొక్క అవసరము లేకపోవుట. వారందఱును నాత్మ సంతుష్టులై యుండిరి.

ఈ కృతయుగమున మానవుల కాత్మ నిష్ఠయును, దృఢవ్రతమును, సత్యవ్రతమును, అపరిగ్రహమును, నిర్మమతయును గలదనియు, వీరి మనస్సున నీర్ష్య లేదనియు నసురులు గ్రహించిరి. అసురులలో నహంకారమును నసు

రుఁడు కలఁడు. ఆతఁడు మిక్కిలి మాయావి. ఆతఁడు మొదల కుండ గాల రూపములను ధరించి ప్రజల శరీరమునఁ బ్రవేశించెను. ఇప్పుడు కొందఱు తాము గొప్పవారమును కొన నారంభించిరి. ఆ అహంకారము యొక్క భార్య మమకార మును నాతని వెంటనుండెను, స్త్రీ యెచటికిఁ బోయినఁ గలవరమేదో రాకతప్పదు. కొన్ని వస్తువుల మీఁద నధికార మును జలాయించును. దానికి దన పిల్లల చింత యెక్కువగ నుండును. ఇంకను దానికి పిల్లలు పుట్టలేదు. ఇప్పుడు ప్రజలలో నహంకార మమకారములు మాత్రమే నివసించుచుండెను. వీరెవరి శరీరములలోనికిఁ బ్రవేశించిరో వారితరులను దక్కువ వారిగా భావింప నారంభించిరి. కొన్ని స్థానములు తమవనుచుండిరి. ఇప్పు డహంకార మమకార సంతానము వృద్ధి కాఁజొచ్చెను. అహంకారమునకుఁ గ్రోధమను బుత్రుఁడు పుట్టెను. మమకార మేవస్తువునందు దన యధికారమును స్థాపించుకొనెనో దాని నింకెవరైన నుపయోగించుకొనినచో నహంకారపుత్రుఁడగు క్రోధము ఒండ్లు పట పట కొఱకుచు వానిపైఁ బడును. క్రోధమునకును వివాహమయ్యెను. ఆతని భార్యపేరు కలహము. వీరికిని అవినయ, దుశ్శీలురను నిద్దరు పుత్రులు పుట్టిరి. అవినయము యొక్క భార్య ఉద్ధత మోహమను కుమారుని గనెను. మోహము యొక్క భార్య మూర్ఖత. వారిద్దరికిని అజ్ఞాన

మను బ్రహ్మంతు పుట్టెను. ఇప్పుడీ అసుర సృష్టి పెరిగి పోయెను. వీరు ప్రజల శరీరములలోఁ ప్రవేశించి ఉపద్రవ మొనరింప నారంభించిరి. వారికుండిన సమత్వ జ్ఞానము నశించెను. అహంకార పరివారము పెరిగి ప్రజలలో నశాంతినిఁ గలిగించిరి."

ఉద్ధవుఁ డిట్లనెను:- "స్వామీ! ఈ యహంకారము నకుఁ బూర్వపురుషుఁ డెవఁడు? ఈతఁ డెవరిపుత్రుఁడు?"

భగవానుఁ డిట్లనెను:- "వీరందఱకును నాదిపురుషుఁడు మహామోహము"

ఉద్ధవుఁ డిట్లడిగెను :- "స్వామీ! మహామోహ మెవరివలన నుత్పన్నమైనది. దీని కాది పురుషుఁడు డెవఁడు?"

కసరి భగవానుఁ డిట్లనెను:- "ఉద్ధవా నీవు వంశావళి నడిగెదవా? లేక కథను వినెదవా. నీవు పండ్లను దినెదవా? చెట్లను లెక్కింతువా? ఆతఁడెవరి పుత్రుఁడు? ఎవని పిల్ల వాఁడు. ఆతని ఆది పురుషుఁడెవఁడు? అని అడుగుట వలన నేమి లాభము? అన్నిటికిని ఆది పురుషుఁడను నేనే. ఇంకే మడిగెదవో అడుగుము."

ఉద్ధవుఁ డిట్లనెను:- "నేనేమియు నడుగవలసినది లేదు. ధర్మాధర్మములకు రెంటికిని జనకుఁడవు మీరేనని తెలిసి

కొంటిని. తర్వాత కథను జెప్పుఁడు. ఈ కామ, క్రోధ, లోభ, మోహములను నసురు లేయే యుపద్రవము లొన ర్చిరి?"

భగవానుఁ డిట్లనెను:- "ఈ యహంకార మమ కారముల యొక్క సంతానము మనుష్య శరీరములందు బ్రవేశించి భేదభావము నుత్పన్నము కావించిరి. తాను బల వంతుఁడనను కొనువాఁడు దుర్బలులను బాధింపు చుందురు. అజ్ఞానము వలనఁ బ్రజలలో సహానుభూతి లేకుండపోయినది. ఒకరి నొకరు ద్వేషించుకొన నారంభించిరి. కొందఱు దండించు టకును బాల్పడిరి. కొందఱితరులను దిట్ట నారంభిం చిరి. ప్రజలలో విషమతయును నశాంతి మొదలగునవి ప్రవే శించెను. ఇప్పుడేమి యును నుపాయము తోచక పోఁగానే అందఱును గలిసి శివుని సమీపమునకుఁ బోయి యిట్లనిరి:- "స్వామీ! మాలోనికిఁ గొందఱసురులు ప్రవేశించిరి. వారు మాలో విషమతను గలిగించిరి."

శివుఁ డిట్లనెను:- "వారిని గొట్టి వెడలఁ గొట్టుఁడు."

ప్రజలిట్లనిరి:- "స్వామీ! ఎట్లు కొట్టి వెడల, గొట్టఁ గలము. ఇప్పుడు వారి బలము హెచ్చినది. వారి సంతాన మును బెరిగినది. మేము వారిని గసరితిమి. కాని వారినణఁచు టకు మాకు శక్తి లేకున్నది."

శంకరుఁ డిట్లనెను:- "నేనా దుష్టులగు నసురులను జంపెదను." అనిపలికి పినాకపాణియగు శంకరుఁడు వచ్చి, తన అజగవమును ధనుస్సునకుదీక్ష్ణబాణమును సంధించి ఆకాశమునకు విడిచెను. ఆ బాణముపోయి కామ, క్రోధ, లోభములకు దగులఁగా నా యసురులు భూమిపైఁ బడిరి.

వారందఱకును వృద్ధ పితామహుఁడగు మహామోహమును గూడ కొట్టెను. వీరు చచ్చిరని శంకరుఁడను కొనెను. అందువలన నాతఁడు వీరిని వదలి వెడలిపోయెను.

ప్రజలు సుఖించిరి. వారు పూర్వమువలె ధర్మాచరణ మొనర్ప నారంభించిరి. అందఱలో సమత్వ ముండెను. ప్రజలు జన్మచేతనే కృతకృత్యు లగుచుండిరి, అందువలన నాయుగమునకుఁ గృతయుగమను పేరు వచ్చెను. అప్పటి డింకను వేదము లింతగా విస్తరింపలేదు. అప్పుడొక 'హంస' యను వర్ణమే కలదు. ప్రణమొక్కటియే వేదముగనుండెను ధర్మ మప్పుడు నాలుఁగు పాదములతో నడుచుచుండెను."

ఉద్ధవుఁ డిట్లడిగెను:- "స్వామీ! ధర్మము యొక్క నాల్గు పాదము లేవి?"

భగవానుఁ డిట్లనెను:- "తప, శౌచ, దయా, సత్యములే నాలుగు పాదములు. కృతయుగమందు ధర్మము నాలుగు పాదముల నడచును. కాలవశమున గ్రమక్రమ

ముగ; త్రేతాయుగమందు దానికొక పాదము నష్టమైనది. ద్వాపరమున రెండుపాదములే యుండును. కలియుగమున నొక్క పాదమే యుండును, కలియుగాంతమున ఒక్కపాదమును నశించును అప్పుడు నే నవతారమును ధరించి ధర్మమును నాలుగు పాదముల నడిపించెదను.”

ఉద్ధవుఁ డిట్లనెను:- “దేవా ! అది కృతయుగమందు మీరు చెప్పినట్లు ఒక్క హంసయను వర్ణమే కలదు. మరల నాల్గు వర్ణము లెట్లైనవి ?”

భగవానుఁ డిట్లనెను:- “వర్ణములు బీజరూపమున నాలుగును సనాదులే. వాని వికాసము కాలానుసారముగ నెమ్మదిగ నైనది. విరాట్పురుషుని ముఖమునుండి బ్రాహ్మణ ధర్మము యొక్క ఉత్పత్తి జరిగినది. భుజములనుండి క్షత్రియ ధర్మమును, ఊరువులనుండి వైశ్యధర్మమును, చరణముల నుండి శూద్రధర్మమును నుదయించెను.”

ఉద్ధవుఁ డిట్లడిగెను:- “భగవాన్ ! విరాట్పురుషుని ముఖమునుండి గుంపులు గుంపులుగ బ్రాహ్మణులూడి పడిరా ? బాహువుల నుండి రాజ సమూహమును, ఊరువుల నుండి అసంఖ్యాకులగు వైశ్యులును, చరణములనుండి శూద్రులు నూడిపడిరా ? అట్లయినచో ఆది కృతయుగ మందును వీరంద ఉండవలయునుగదా !”

భగవానుఁ డిట్లనెను: "సోదరా! ముఖము నుండి బ్రాహ్మణ సమూహము పడలేదు. బ్రాహ్మణులలోని బ్రాహ్మణత్వముఅనఁగా బ్రహ్మ ధర్మము ముఖమునుండి వెలువడినది సమస్త శరీరమునముఖము ముఖ్యమైనది. ప్రధాన స్థానము అట్లే వర్ణములలో బ్రాహ్మణ వర్ణము ముఖ్యమైనది. నోటిలో నన్నమునుబెట్టినచో శరీరమున కంతకును బుష్టి వచ్చును. బ్రాహ్మణునికిఁ బెట్టినచో సమస్తసమాజమునకునుబుష్టిఁ ఉన్నది. కలుగును. ముఖము యొక్క పని తాను దినిదాని సారమును శరీరమున కంతకును బంపుట. మావిలు చెప్పి అందఱను యథాయోగ్య కార్యమున నియోగించుట, అట్లే బ్రాహ్మణుఁడు వేదమును బఠించి సమాజమున జ్ఞాన ప్రసారమును గావింపవలయును, క్షత్రియోత్పత్తి భుజములవలననైనది. అనఁగా క్షత్రియ ధర్మము భుజములలో నుత్పన్నమైనది. భుజములు శరీరము నంతను రక్షించును. అన్నమును దీసికొని పోయి నోటికందించును, శరీరమున నెచ్చటనైన జిల పుట్టిన వెంటనే పోయి గోకును. ఎవ్వరైన శరీరమును గొట్టుటకు వచ్చినచో మనుముందుగాఁ జేతులుముందునకుఁబోయి ఆప్రహారము నాపును. ఆక్రమణ మొనర్చు వానిని దండము చేతను, ఇతర అస్త్ర శస్త్రములచేతను బాది వెడలఁగొట్టును సమాజమును రక్షించుటలో క్షత్రియుల కార్యమిదియే. క్షతము దుఃఖమునుండి రక్షించుటచే నాతనికి క్షత్రియుఁ

డను పేరు వచ్చినది, ఊరువుల బలము వలననే నడచుట తిరుగుట జరుగుచుండును. ప్రజావృద్ధి ఊరువుల వలననే జరుగును. అదే విధముగ వైశ్యుని యొక్క కృషి, గోరక్షా, వ్యాపారముల వలన సమాజమునకు అన్నమును, ఘృతమును జీవనోపయోగములగు వస్త్రాదుల నొసంగును. సమాజము యొక్క సమస్తావశ్యకతలను బూర్ణము కావించును. వారన్నాది వస్తువుల నీయకుండినచో సమాజ వృద్ధి యెట్లు కాగలదు ? ఇదేవిధముగఁ బాదములు శరీరము యొక్క బరువు నంతను మోయును. అన్నిటి కంటెను గ్రిందనుండి ఊరు, భుజా, శిరస్సులయొక్క భారమును భరించును. అదే విధముగ శూద్రుఁడు సేవద్వారా సమాజముయొక్క భారమును వహించును. ఈ విషయముల వలనఁ దేలిన దేమనఁగా విరాట్పురుషుని నాలుగు అంగములనుండి నాలుగు వర్ణధర్మములుదయించినవి. ఆవశ్యకతాను సారముగ వానికి వికాసము కలిగినది.''

ఉద్ధవుఁ డిట్లనెను:- ''దేవా ! ముఖ్య ప్రశ్న అట్లే యున్నది. ఒక్క 'హంస' లేక బ్రాహ్మణ వర్ణముచే నాలుగు వర్ణము లెట్లు వికాసమును జెందినవి ?''

భగవానుఁ డిట్లనెను:- ''నేను మొదటనే చెప్పితిని. మహామోహము యొక్క అసుర సంతానము వచ్చి ప్రజల శరీరమందు ప్రవేశించి కలవర మొనర్ప నారంభించినవి.

శివుఁడు తన బాణములచేఁ గొందఱను జంపినను నవి సమూలముగ నాశము కాలేదు. సృష్టిలో సమూలనాశమను నది లేదు. వారి సంతానము మరల పెరిగినది. ఇప్పుడు ప్రజలు సమాజమున నవ్యవస్థగా నుండుటనుగాంచి, అందఱును సమావేశమై ఒక్క సభ చేసికొని యిట్లనిరి, "ఇట్లు పని సాగదు. సమాజమున కొకవ్యవస్థ నొనర్పవలయును. వర్ణములుగ నొనర్పలయును. అందఱకును బనిని బంచవలయును. దీని నందఱు నంగీకరించిరి. వారిలో గౌరవర్ణముగ నున్న వారును, బుద్ధిశాలురును, బాగుగా విద్యలందభిరుచి కలవారును, మేధావులును, బ్రాహ్మణులుగఁ జేయఁబడిరి. వారు వేదములను జదువుటయును, జెప్పుటయును, జ్ఞానార్జన మొనర్చుటయును జేయుచుండిరి. శారీరకముగను, శూరవీరులుగను, యుద్ధము చేయువారుగను, కొంచెము రక్త వర్ణముగ నుండువారును, ఇతరులను రక్షించుటలో సుఖమును జెందువారును క్షత్రియులనఁబడిరి. వారు ప్రజలను బాలించుటయు, వారు బ్రాహ్మణులను వదలి మిగిలిన వారి వద్ద పన్నులను గొనుటయును వృత్తిగ నేర్పడెను. వ్యాపార మొనర్చుట యందును సంగ్రహ ప్రవృత్తి యందును బుద్ధి గలవారిని వైశ్యులుగ నొనర్చిరి. చదువుటయందు ప్రవృత్తి లేనివారిని, శారీరక కార్యము లొనర్చుటకును, మూఁడు వర్ణముల వారికి సేవయొనర్చుటయును, శూద్రుల యొక్క

ధర్మముగ నేర్పడెను. ఈ విధముగ నొకే వర్ణము నాలుగు విధములయ్యెను.

బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులు వేఱు వేఱు వర్ణములు కలవారై తమతమ కార్యములందు నిమగ్నులైరి. నాశ్వాసనుండి ప్రథమముననే సూక్ష్మరూపమున ఋక్సామ యజుర్వేదము లావిర్భవించెను. సమయము రాఁగానే యివి విశుద్ధులగు బ్రాహ్మణుల హృదయమం దావిర్భూతము లయ్యెను. ఒక్క వేదమే మూఁడు నాలుగు రూపముల వ్యక్త మయ్యెను, ఆ త్రయీ విద్యచే హోతా, అధ్వర్యు, ఉద్గాతా యొక్క త్రివృత్కర్మ యజ్ఞరూపమున నుత్పన్న మయ్యెను. మొదట మొదట జనులు ధ్యానముచేతనే భగవంతుని బూజించెడువారు. ఇప్పుడు యజ్ఞయాగాదులు జరుగుచుండెను. త్రయీ విద్య యగుటచేతను, ధర్మములో నొక పాదము క్షీణించుటచేతను నిది త్రేతాయుగముగ వ్యవహరింపబడినది. దీనిలో వర్ణాశ్రమ ధర్మము ప్రధానముగ నుండెను. ఈ సమాజము వేఱు వేఱుగ నేర్పడెను. వీరు వేష భూషలచేతను, నడకచేతను దమ తమ కర్మలద్వారా చెప్పకళ్లు స్పష్టముగగుర్తు తెలియుచుండిరి. వీరందఱు ధర్మమును నిశ్చయ మయ్యెను,

విరాట్పురుషుని శరీరమునుండి నాలుగు వర్ణములు నాలుగు శరీర భాగములనుండి పుట్టినట్లు ఆతని నాలుగు

అంగములనుండియును నాలుగు ఆశ్రమములును నుత్పన్న మయ్యెను. మస్తకమునుండి సన్న్యాస ధర్మమును, వక్షస్థలము నుండి వానప్రస్థ ధర్మమును, హృదయమునుండి బ్రహ్మచర్య ధర్మమును, పిక్కలనుండి గృహస్థ ధర్మమును బుట్టెను. నాలుగు వర్ణములతో బాటు నాలుగాశ్రమములును నయ్యెను. కావున నందఱును వారి వారి ధర్మము ననుసరించియు, నియమముల ననుసరించియు నడుచుచుండిరి.

ఉద్ధవుఁ డిట్లడిగెను:- "దేవా ఏ వర్ణమునకు, ఏ ఆశ్రమమునకు ఏ ధర్మము. దీనిని నాకు విస్తారముగఁ జెప్పుఁడు.

భగవానుఁ డిట్లనెను:- "నాయనా! సమస్త వేద శాస్త్ర, పురాణములందు ప్రధానముగ వర్ణాశ్రమ ధర్మ చర్యయే యుండును. కావున నేను విస్తారముగ నీ స్పష్టాంతము వఱకును జెప్పఁగలను. కావున నట్లు గాక కేవలము సంకేత మాత్రముగ వీరి ధర్మములను గూర్చి చెప్పెదను. నీవు నీ మనస్సున విస్తారము కావించుకొనుము."

సూతుఁడు శౌనకాది మునులతో నిట్లనెను:- 'మునులారా! ఇప్పుడే విధముగ భగవానుఁడు నాలుగు వర్ణములు నాలుగాశ్రమముల ధర్మములను గూర్చి వర్ణించెనో దానిని నేను సంక్షేపముగ మీకందఱకును జెప్పెదను. ముందుగా వర్ణ ధర్మములను గూర్చి చెప్పి, ఆశ్రమ ధర్మములను జెప్పెదను. వర్ణములలో సర్వప్రథముగ బ్రాహ్మణ ధర్మమును గూర్చి వినుఁడు."

# బ్రాహ్మణ స్వభావము.

శ్లో॥ శమో దమ స్తపః శౌచం సంతోషః క్షాంతి రార్జవమ్‌.
మద్భక్తిశ్చ దయాసత్యం బ్రహ్మప్రకృతయ స్త్విమాః॥

శ్రీభాగ. ౧౧ స్కం. ౧౭ అ. ౧౬ శ్లో॥

వ॥ ఉద్ధవా! శమ, దమ, తప, శౌచ, సంతోష, క్షమా, ఋజుతా, భక్తి, దయా, సత్యములనునవి బ్రాహ్మణునకు స్వభావగుణములు.

ఏమియును నేర్పకయే జన్మచేతనే గుణములు వచ్చినచో వానికి స్వభావమందురు. నైసర్గిక లేక స్వభావగుణములను త్యజించుట అత్యంత కఠినము. గోక్షీరములు స్వభావమునఁ దీపిగ నుండును. వేఁపకాయ స్వభావమునఁ జేదుగ నుండును. హారీతకి స్వభావమున వగరుగ నుండును. ఎవరే వర్ణము వారో వారావర్ణముయొక్క గుణమును స్వభావముగఁ గలిగియుందురు.

సూతుఁ డిట్లనెను:- "మునులారా! ఉద్ధవుఁడు బ్రాహ్మణ స్వభావమును గూర్చి అడుగఁగా శ్రీకృష్ణ భగవానుఁడిట్లు చెప్పఁ దొడఁగెను:- "ఉద్ధవా! బ్రాహ్మణుఁడు స్వభావముచేతనే కష్టి సహిష్ణువుగను, త్యాగిగను, అసం

గ్రహింగను నుండును. వానిలో తొమ్మిది గుణములు నైసర్గిక ముగనుండును.

ఉద్ధవుఁ డిట్లనెను:- ''స్వామీ! బ్రాహ్మణున కే తొమ్మిది గుణములు స్వభావములు.''

భగవానుఁ డిట్లనెను:- ''ఉద్ధవా! చెప్పెదను వినుము బ్రాహ్మణుని యందు ముఖ్యమగు గుణము 'శమము'

(1) శమము:- చిత్తమును వశమం దుంచుకొనుటకు శమనుందురు, చిత్తము వశమున లేనివాఁడు పారమార్థిక సాధనమును దేనినిఁ జేయఁజాలఁడు. చిత్త చంచలతయే అశాంతికి గారణమగును. బ్రాహ్మణుని చిత్తము సదా పర మార్థ చింతనమందే లగ్నమై యుండును. ఆతఁడెన్నడును విషయచింతన మొనర్పఁడు, ఒకానొక ఋషి తన చిన్న కుమారుఁడు జీవహింసయందు బ్రవృత్తుఁడై నట్లు తెలిసికొని వెంటనే ఆతఁడాతని బరిత్యజించి యిట్లనెను:- ''వీఁడు బ్రాహ్మణుఁడు కాఁడు. వీనికి స్వాభావిక ప్రవృత్తి హింస. బ్రాహ్మణుని చిత్తమెన్నఁడైనఁ జంచలమైనచో, నాతఁడు దానికిఁ బ్రాయశ్చిత్త మొనర్చుకొనును. బ్రాహ్మణుని గుణములలో రెండవది 'దమము'',

(2) దమము:- ఇంద్రియములను దమన మొనర్చుటకు దమన మని పేరు. బ్రాహ్మణుని యొక్క యింద్రియములు

స్వాభావికముగ నాతనివశమందుండును. ఆతని వాక్కెన్నడును నప శబ్దములను బలుకదు. ఆతఁడు చూడరాని వస్తువులను జూడనే చూడఁడు. వినరాని శబ్దములయందు బ్రవృత్తినిఁ జెందనే చెందఁడు. ద్రుపద మహారాజు సభలోనికి ద్రోణాచార్యుఁడు పోయినపుడు రాజు ఆచార్యుని సమ్మానింప లేదు; తిరస్కార మొనర్చెను. దీనివలన దుఃఖితుఁడై ఆచార్యుఁడు తన కౌరవ పాండవ శిష్యులను బంపి బంధించి తెప్పించెను. తరువాత క్షమించెను. రాజు మనస్సులలో ద్వేషము నెలకొనెను. అతఁడాచార్యునిఁ జపించుటకు యజ్ఞము బ్రారంభించెను. కాని యే బ్రాహ్మణుఁడును నా హింసామయ యజ్ఞమును జేయించుట కిష్టపడలేదు. అప్పుడాతఁడొక ముని కడకు దీనుఁడై పోయి, మిక్కిలి అనునయ వినయములను గావించి మునితో నిట్లనెను:- "రాజా! ఇంద్రియములను వశమొనర్చుకొనిన విశుద్ధముగు బ్రాహ్మణుఁ డెవఁడును నిట్టి హింసామయ యజ్ఞమును జేయింపఁడు. లోభియై, యింద్రియములు వశమున లేని నాఁడు ధనలోభముచే నీయజ్ఞమును జేయింపఁగలఁడు."

రాజిట్లనెను:- "స్వామీ! మీరే దమర్థహితుఁడగు నొక బ్రాహ్మణుని పేరును జెప్పుఁడు.

ముని యిట్లనెను:- "నాకొక సోదరుఁడున్నాఁడు నేనెఱుఁగుదును, వాని కింద్రియములు స్వాధీనమున లేవు.

ఒక దినమున మేమిద్దరమును గలసి పోవుచుంటిమి. వన
మున నొక సుందరమగు ఫలము మార్గమునఁ బడియుండెను.
ఆతఁడు దానిని దీసికొనెను. ఇది యెవరి ఫలము? ఇచ్చటి
కెట్లు వచ్చినది? ఇది తినయోగ్యమైనదా? కాదా? అని
ఆతఁడు విచారింపలేదు. ఆతఁడు దానినిఁ నడుగలేదు. భగ
వానునకు నివేదింపలేదు. జిహ్వాలోలుపతాకవశమున
నాతఁడు మార్గమున నడచుచునే తినెను. అందువలన నింతటి
జిహ్వాలోలుపత కలవాఁడు ధనలోలుపతను గూడ కలిగి
యుండునని నేనూహించుచున్నాను. ధనలోభముచే నీయీ
హింసాపరాయణుఁడు యజ్ఞమును జేయించునని భావించు
చున్నాను."

ఈ దృష్టాంత మొసఁగు నభిప్రాయ మేమనఁగా
యథార్థ బ్రాహ్మణుని యింద్రియము లాతని వశమున
నుండును. సాధ్యమైనంత వఱకాతఁడు మర్యాదా విహీన
మగు వ్యవహారమునఁ బ్రవృత్తినిఁ జెందఁడు. బ్రాహ్మణుని
యొక్క మూఁడవ స్వాభావిక గుణములో "తపస్సు".

(3) తపస్సు:- బ్రాహ్మణుఁడు జన్మచేతనే తపస్విగ
నుండును. ఆతని కింద్రియ సుఖములు ప్రీతికారకములుకావు.
కృచ్ఛ్రచాంద్రాయణాది వ్రతములయందు ఆతనికి నైసర్గిక
ప్రీతియుండును. బ్రాహ్మణుని యొక్క యీ శరీరము క్షుద్ర

కామనా పూర్తి కొఱకు కాదు. ఈ లోకమున నున్నంత వఱకాతఁడు ఘోర తపస్సును జేయుచునే యుండును. దాని ఫలమున నాతఁడు మరణించి పుణ్యలోకములందు దివ్య సుఖమును భోగించును ఈ లోకమునఁ దప మొనర్పని వాఁడింద్రియభోగములయందే ఆసక్తినిఁ జెందును. అతఁడుచచ్చి నరక యాతనల ననుభవించును.

ఒకసారి నారదమహాముని తుంబురుఁడను గంధర్వునితోఁ బోవుచుండెను. దారిలో వారికి మంచి వస్త్రాభూషణములను ధరించిన రాజపుత్రుఁడు కనఁబడెను. ఆ రాజపుత్రుఁడు నారదునకుఁ బ్రణామము కావించెను. నారదుఁ డాతనితో నిట్లనెను:- "రాజపుత్రా ? చిరంజీవ !" రాజకుమారా ! నీవు చాలా రోజులవఱకు బ్రదికి చిరంజీవిగ నుండుము." అని పలికి ఆతఁడు ముందునకుఁ బోయెను.

ముందునకు బోఁగా గోపీనమును ధరించి, జడలను బెంచుకొని సమిధల కట్టను బట్టుకొని యుండిన ఋషికుమారునిఁ గలిసికొనెను. ఆతఁడును నారదునకుఁ బ్రణామములను గావించెను. అప్పుడు నారదుఁ డిట్లనెను:- "మా జీవ ఋషిపుత్రక !' ఓ ఋషికుమారా ! నీవు చాల దినములు బ్రదికి యుండకుము" అని పలికి ముందునకుఁ బోయెను.

పోఁగా బోఁగా నాతని కొక అవధూత సాధువు కనఁబడెను. ఆతఁడును నారదునకుఁ బ్రణామమును గావించెను. నారదుఁ డిట్లనెను:- "జీవ వా మర వా సాధో" ఓ సాధూ! నీవు జీవించిన జీవించుము. చచ్చినఁ జావుము." అని పలికి ముందునకుఁ బోయెను.

ముందునకు బోఁగా నొక వ్యాధుఁడు చేతిలోఁ బాళ మును బట్టుకొని కనఁబడెను. ఆతఁడును నారదునకుఁ బ్రణా మము కావించెను. అప్పుడు నారదుఁ డిట్లనెను:- "వ్యాధఁ 'మాజీవ మామర' "ఓ వ్యాధుఁడా! నీవు బ్రదుకను వద్దు చావనువద్దు"

అంతఁ దుంబురుఁ డిట్లడిగెను:- "స్వామీ! మీరు ఈ నలుగురకును నాలుగు విధములుగ నాశీర్వాదించితిరేల?

అంత నారదుఁ డిట్లనెను:- "నాయనా! ఎవరికెట్టి స్వభావముండునో అది! పదలదు. ఈ వ్యాధుఁడు బ్రదికి యున్నంత వఱకు హింసను జేయును. చచ్చిన నరకమునకు బోవును. కావున నేను నీవు బ్రదుకుటయును మంచిది కాదు. చచ్చినను మంచిది కాదని చెప్పితిని. నీవు బ్రదికినను దుఃఖమే. చచ్చినను దుఃఖమే. ఇఁక సాధువందమా - ఈతఁడు బ్రదికి యున్నంతె వఱకు పరోపకార మొనర్చును. చచ్చిన వైకుంఠ లోకమునకుఁ బోవును. కావున నీతని

జీవితము బ్రతికినను మంచిదే. చచ్చినను మంచిదే. ఈ రాజ పుత్రుఁడు బ్రతికి యున్నంత వఱకు యథేష్టముగ సుఖముల ననుభవించును. చచ్చిన తరువాత నీతఁడు నరకమునకుఁ బోవలసి వచ్చును. కావున నీవెంతగా జీవించిన నంత మంచిదని నేనంటిని. ఋషి పుత్రుని నీవు జీవింపవలదని నేనేల యంటి ననఁగా బ్రాహ్మణుని శరీరము తపస్సు కొఱకే. ఈ ఋషి కుమారుఁ డెంతవఱకు జీవించునో, అంతవఱకును దప మొనర్చి కష్టముల ననుభవింప వలయును. వానికి సుఖము చచ్చిన తరువాతనే లభించును. కావున నాతఁ డెంత త్వరగాఁ జచ్చిన నాతఁడంత సుఖ మనుభవించును. ఏలననఁగా బ్రాహ్మణున కీ జన్మలో శారీరక సుఖము కలుగదు. అతఁడు తపోమయ జీవితమును గడుపవలసియుండును. కావునఁ దపస్సు బ్రాహ్మణునకు నైసర్గిక గుణము. నాల్గవ గుణము 'శౌచము'

(4) శౌచము:- లోపలను బయటను బవిత్రముగ నుండుటకు శౌచమందురు, పవిత్రముగ నుండని బ్రాహ్మణుఁడు బ్రాహ్మణుఁడు కాఁడు. శౌచము యొక్క శిక్షణ గురుకులమున ముందుగా నేర్పఁబడును. శౌచహీనుఁడగు వాఁడు బ్రాహ్మణుఁడైనను నధముఁడే. శౌచమ్ము కలిగిన శ్వపచుఁడైనను శ్రేష్ఠుఁడే. ఈ విషయమున నొక దృష్టాంతము కలదు.

ఒకానొక రాజుయొక్క అఱచేతిలో వెంట్రుకలు మొలిచెను. ఆతఁడు పండితులను బిలిచి దాని కారణ మడిగెను. పండితులిట్లనిరి:- "మహారాజా! ఒక ఋషికి ఉపచార మొనర్చుటచే నిట్లైనది"

రాజిట్లనెను:- "అయితే ద్విజోత్తమా! దీనికుపాయ మేమి, ఇవి యెట్లు పోఁగలవు ?

పండితు లిట్లనిరి:- "ఒకానొక అధముని చేతి యన్నము జేతిలోఁ బెట్టుకొని తినినచో మీ యీ వెంట్రుకలు వెంటనే రాలిపోవును."

ఆ రాజుయొక్క నగరమునందు గొప్ప భక్తుఁడగు శ్వపచుఁడు నివసించు చుండెను. రాజుపోయి ఆతనితో నిట్లనెను:- "ఓయీ! రేపు నేను నీదగ్గఱ భోజనము జేసెదను. "ఇది వినఁగానే శ్వపచుని యానందమునకు మేఱ లేకుండెను. ఆతఁడు వెంటనే తనగుడిసెను నిప్పంటించెను. ఎచ్చటి నుండియో క్రొత్త తెల్లును దెచ్చి, క్రొత్త గుడిసెను వేసెను. శుద్ధమగు మృత్తికను, గోమయమును దెచ్చి దాని నలికించెను. పాతగుడ్డల నన్నిటినిఁ దగులఁ బెట్టెను. క్రొత్త బట్టలను దెచ్చెను. ఈవిషయమంతటను వ్యాపించెను. రాజు వానియింటికి భోజనమునకు రాఁగలఁడని తెలియఁగనే, ఆతఁడేమడిగిన అందఱును దాని నొసంగుచుండిరి. ఆత

డి త్తడి పాత్రలను క్రొత్తవి తెచ్చెను. వానిలో గంగాజలమును నింపెను. ఆతని భార్య పంచగవ్యముతో స్నానమొనర్చెను. మంచి పట్టు చీరెను గట్టుకొని పవిత్రముగ గంగాజలముతో వంటచు జేసెను. రాజు రాఁగానే కూర్చుండుటకు పీఁట నొసంగెను. రుచిగా భోజనమును బెట్టెను. రాజు మాటి మాటికిని అఱచేతితో నన్నమును దీసికొనుచుండెను. కాని అఱచేతిలోని వెంట్రుకలూడలేదు. భోజనముచేసి వెడలిపోయెను. మరునాఁ డాతఁడు పండిత సభ చేసెను. ఆతఁ డిట్లనెను:- "పండితులారా! మీరు నా ధర్మమును జెడఁ గొట్టితిరి. కాని నాఅఱచేతిలోని వెంట్రుకలు పోలేదు.

పండితు లిట్లనిరి:- "మహారాజా! మేము నీచుని భోజనము చేయుమని చెప్పితిమి. శౌచము లేనివాఁడెవఁడో వాఁడు నీచుడు. ఆతఁడు శ్వపచుఁడైనను, మిక్కిలి పవిత్రముగఁ బరమ శుద్ధముగ భోజనమును జేయించెను. దానినిఁ దినుటచే మీ అఱచేతి వెంట్రుకలు పోవు"

రాజిట్లనెను:- "అయితే స్వామీ! నీచుఁడెవఁడో మీరే చెప్పుఁగు."

ఒక పండితుఁ డిట్లనెను:- "మహారాజా! మీరు నా వెంట వచ్చినచో నేను నీచునిఁ జూపించెదను."

ఇది విని రాజా బ్రాహ్మణుని వెంటఁబోయెను. ఎండ కాలము. పోఁగాఁ బోఁగా వారికి మధ్యాహ్న మయ్యెను. ఎండ మండిపోవుచుండెను. రాజింతవఱకు కాలినడకను నెన్నఁడును నడువలేదు. ఎదుట చూడఁగా నొక బ్రాహ్మణుఁడు రెండు దుర్బలములగు నెద్దులను గట్టి పొలమును దున్నుచుండెను. రెండు జాములైనను, ఎద్దులు నడువఁజాలక పోవుచుండినను ముల్లు కఱ్ఱతోఁ బొడుచుచుఁదోలుచుండెను. ఎద్దుల శరీరమునుండి రక్తము చిందుచుండెను. అది ఆతని చేతికిని అయ్యెను. అయినను నాతఁడు నాగలిని విడువలేదు.

రాజపండితుఁ డిట్లనెను:- "రాజా! అందఱికంటె నీచుఁడీతఁడు. వీనిచేతి అన్నము మీకు లభించినచో మీఅఱచేతిలోని వెంట్రుకలప్పుడే ఊడిపోఁగలవు."

రాజిట్లనెను:- "వీనిచేతి అన్నము లభించుటెట్లు?"

పండితుఁడిట్లనెను :- "కూర్చుండుఁడు. నేను మీకొక ఉపాయమును జెప్పెదను? ఇది విని రాజును బండితుఁడును వచ్చుట నొక వృక్షము క్రింద నీడను గూర్చుండిరి. ఇంతలోనే ఆతని భార్య అన్నమును, గూరలను, జలమును దీసికొని పొలములోనికి వచ్చెను. ఆమె చంకను సంవత్సరమో సంవత్సరమున్నరో యీడుగల పసివాఁడుండెను. ఆమె యిట్లనెను :- "రెండు జాములైనది. అరకను విడిచి అన్నమును దినుఁడు."

కృషీకుఁడగు నావిప్రుఁ డిట్లనెను:- "నీ కేమియును దెలియదే. నేఁడు నేనీ పొలము నంతయును దున్న వలయును. నేఁడిది యంతయును బూర్తియగు వఱకు నాగలిని విడువను."

భార్య యిట్లనెను :- "అయితే అన్నమెట్లు తినఁగలరు ?"

ఆతఁడిట్లనెను :- "నేను అరకను దున్నుచుండెదను. నీవు ముద్దలుచేసి నా నోటను బెట్టుచుండుము. పొలమును దున్నినట్లు కాఁగలదు, అన్నమును దినినట్లు కాఁగలదు."

ఆమె యేమి చేయఁగలదు. ఆమె ఆతని వెంట వెంటఁ బోవుచు ముద్దలను జేయుచు నాతని నోటిలోఁ బెట్టుచుండెను. పిల్లవాఁడు చంకలో నుండెను. ఆ సమయమునఁ బిల్లవాఁడు మూత్ర విసర్జన మొనర్చెను. అందులోఁ గొన్ని చిందులు వచ్చి అన్నము మీఁదనుఁ బడెను."

ఆమె యిట్లనెను :- "అయ్యో ! ఈ కుంక డంతయును బేడయు బెల్లము నొనర్చినాఁడు. ఉచ్చ బోసినాఁడు."

ఆతఁడు కసరి యిట్లనెను :- "ఉచ్చబోసిన నేమైనది ? 'పుత్రుని మూత్రము క్షేత్రమంత పవిత్రము' ఫరవాఁలేదు. నీవు గ్రాసమును నా నోటిలోఁ బెట్టుచుండుము.

ఆ సమయమునఁ బండితుఁడు రాజుతో నిట్లనెను.- "రాజా ! నీ విప్పుడు వీని నన్నమును యాచింపుము."

రాజిట్లనెను:- "పండితవర్యా ! నేను గ్రహించితిని. అడిగిన నీతఁడొక మెతుకైనను బెట్టఁడు." అదే సమయమున నా స్త్రీ చేతినుండి ఒక ముద్ద జారి క్రిందఁ పడెను."

పండితుఁడు శీఘ్రముగ నిట్లనెను :- "మహారాజా ! పరుగెత్తుము. పని నెఱవేరినది." ఇది విని పరుగెత్తుకొని పోయి రాజా ముద్దను జేతిలోనికిఁ దీసికొనెను. దాని నతఁ చేతిలోనికిఁ దీసికొని దినఁ దలఁచుచుండగా వెంటనే ఆతని అఱచేతిలోని వెంట్రుకలూడి మీఁదఁ బడిపోయెను.

అప్పుడు పండితుఁ డిట్లనెను :- "మహారాజా ! శౌచ హీనుఁడెవరో వాఁడే నీచుఁడు. ఆతఁడుచ్చ వర్ణము వాఁడు కానిండు నీచవర్ణమువాఁడు కానిండు. నీచవర్ణము వాఁడైనను శౌచయుక్తుఁడైనచో నాతఁడే వీని కంటె శ్రేష్ఠుఁడు."

శౌచమునకు చాల గొప్ప మహిమము కలదు. బ్రాహ్మణుల యొక్క నైసర్గిక గుణము పవిత్రత. ఇప్పుడు పంచమ గుణము 'సంతోషము.'

(5) సంతోషము:- ఏ పరిస్థితులలోనైనను సంతోషముగ నుండుటకు సంతోషమందురు. నేఁడు భగవంతుఁడు

పిడికెడన్నమును మాత్రము లభింపఁజేసిన దాని తోడనే సంతృప్తి పడుట కడుపునిండ లభింపఁజేసినను నట్లే యుండుట. సంతోషమున కంటె మించిన సుఖమీ ప్రపంచమున నేది యుండదు. హృదయములో సంతోషముండినచో నాతఁడొక్క పుడిశెడు జలమునకే సంతుష్టినిఁ జెందును. హృదయమున సంతోషము లేకుండినచో సప్తద్వీప రాజ్యము లభించినను నసంతుష్టుఁడుగనే యుండును. సుదాముఁడెంత సంతోషియో చూడుఁడు. అంతటి విద్వాంసుడును, త్యాగియును, శాస్త్రజ్ఞుఁడు నైనప్పటికిని తనకు లభించిన భిక్ష చేతనే సంతుష్టినిఁజెంది యుండెడు వాఁడు. తన దగ్గఱ నెన్ని వస్తువు లుండినను సంతోషము లేకున్నచో నేమియును లేనట్లే కాఁగలదు. సంతోషముండినచో నేమియును లేనప్పటికిని సర్వము నుండినట్లే. అజగర మేమియును జేయదు. అది యుండిన చోటనే యుండి దానికేది లభించిన దానినిఁ దినును. ఏమియును దొరకకుండినచో వాయుభక్షణ మొనర్చి తృప్తినిఁ జెందును. కాని ఆహారము లభింపకుండిన నది దుర్బలము కాదు. అది అట్లే లావుగా నుండును. వనము లందలి ఏనుగులకు చెఱకుగడ లెక్కడ చిక్కఁగలవు ? ఎండిన గడ్డినిఁదిని అవి యెంతో బలముగ నుండ లేదా ? మును లడవులందలి చేదు వగరు పండ్లను దిని జీవన యాపన మొనర్చుచుందురు. బ్రహ్మానంద సుఖము ననుభ

పిడికెడన్నమును మాత్రము లభింపఁజేసిన దాని తోడనే సంతృప్తి పడుట కడుపునిండ లభింపఁజేసినను నట్లే యుండుట. సంతోషమున కంటె మించిన సుఖమీ ప్రపంచమున నేది యుండదు. హృదయములో సంతోషముండినచో నాతఁడొక్క పుడిశెడు జలమునకే సంతుష్టినిఁ జెందును. హృదయమున సంతోషము లేకుండినచో సప్తద్వీప రాజ్యము లభించినను నసంతుష్టుఁడుగనే యుండును. సుదాముఁడెంత సంతోషియో చూడుఁడు. అంతటి విద్వాంసుడును, త్యాగియును, శాస్త్రజ్ఞుఁడు నైనప్పటికిని తనకు లభించిన భిక్ష చేతనే సంతుష్టినిఁజెంది యుండెడు వాఁడు. తన దగ్గఱ నెన్ని వస్తువు లుండినను సంతోషము లేకున్నచో నేమియును లేనట్లే కాఁగలదు. సంతోషముండినచో నేమియును లేనప్పటికిని సర్వము నుండినట్లే. అజగర మేమియును జేయదు. అది యుండిన చోటనే యుండి దానికేది లభించిన దానినిఁ దినును. ఏమియును దొఱకకుండినచో వాయుభక్షణ మొనర్చి తృప్తినిఁ జెందును. కాని ఆహారము లభింపకుండిన నది దుర్బలము కాదు. అది అట్లే లావుగా నుండును, వనములందలి ఏనుగులకు చెఱకు గడ లెక్కడ చిక్కఁ గలవు? ఎండిన గడ్డినిఁదిని అవి యెంతో బలముగ నుండ లేదా? మును లడవులందలి చేదు వగరు పండ్లను దిని జీవన యాపన మొనర్చుచుందురు. బ్రహ్మానంద సుఖము ననుభ



వించెదరు వీరందఱేల దుఃఖులగుట లేదు? ఏలనఁగా వారికేది లభించిన దానితోడనే సంతుష్టినిఁ జెందెదరు. బ్రాహ్మణుని మనస్సులోనికి అసంతుష్టి వచ్చెనా ఆతఁడు నశించును. కావున బ్రాహ్మణునకు ముఖ్య ధనము సంతోషము. ఆఱవగుణము 'క్షమ''

(6) క్షమ:- తనకెంతటి అపకారము నొనర్చినను వారికెన్నడును నపకారమును దలంపకపోవుటకు క్షమయని పేరు. అపకారియొక్క అపకారములవైపున మనస్సు నుంచ రాదు. పైఁగా నాతని కుపకారమును గావింపవలయును. బ్రాహ్మణుఁ డొకఁడొక రాజు దగ్గఱకు యాచనకు బోయెను రాజు వస్తువునీయలేదు. బ్రాహ్మణుఁడు పోఁ బోవఁగా నాతనిఁ బిలిచి కూర్చుండఁబెట్టి ఆతని నవమానించెను ఇట్లు చాల సారులు చేసినప్పటికిని బ్రాహ్మణుఁ డేమియును రోషపడలేదు. అప్పుడు రాజు బ్రాహ్మణుని పాదములమీఁదఁ బడి గద్గద కంఠముతో నిట్లనెను:- "ద్విజోత్తమా! మీ క్షమ ధన్యమైనది"

బ్రాహ్మణుఁ డిట్లనెను:- "ఇందులో ధన్యవాదమునకు నేనేమి చేసితిని? కుక్కను గొట్టెదరు. ఛీఛీ యందురు. అయినను మరల నది ఏదో దొఱకునను ఆశచే వచ్చుచుండును. ఈ గుణము కుక్కలలోను గలదు."

క్షమించి, నేనాతని క్షమించితినను విషయమును మనస్సు లోనికైనను రానీయరాదు. క్షమా విహీనుఁడగు బ్రాహ్మణుఁడు శోభింపఁడు. శ్రేష్ఠులగు వారు క్షమా విహీనుని నిందించెదరు. కార్తవీర్యార్జునుఁడు పరశురాముఁడు లేని సమయమున బలవంతముగ నాతని తండ్రియగు జమదగ్నియొక్క కామధేనువును హరించుకొనిపోయెను. వనము నుండి పరశురాముఁడు రాఁగానే యీ సంగతినిఁ దెలిసికొని రాజధానికిఁబోయి సేనా సహితుఁడగు రాజును వధించి గోవును జాల ఆనందముతోఁ దండ్రి కడకు దీసికొనివచ్చెను. ఆతఁడు దారిలోఁ గామధేనువును గాంచి మాతండ్రి చాల సంతోషించి, నా వీరత్వమును విని సంతసించి పరమ ప్రముదితుఁడై, భూరిప్రశంసలొనర్చి, ప్రేమించి ఆశీర్వదించునని భావించెను, కాని దీనికి విపరీతముగ జరిగెను.

జమదగ్ని తన కుమారుఁడు రాజును జంపి కామధేనువును దెచ్చినాఁడని వినఁగానే, తన పుత్రుని చీవాట్లు పెట్టుచు నిట్లనెను:- పరశురామా! నీ బాహువులు పెద్దవి. కాని వీనివలన బుణ్యమును సంపాదింపక పాపమునే సంపాదించితివి.",

పరశురాముఁ డట్లే నిర్ఘాంతపోయి యిట్లనెను:- "తండ్రీ! నేనేమి పాపము నొనర్చితిని?"

మహర్షి జమదగ్ని యిట్లనెను:- “ ఇంతకంటె గొప్ప పాపమేమున్నది? విధ్యుక్తముగ రాజ్య సింహాసనమునఁ బట్టాభిషిక్తుఁడైన వాఁడును, మూర్ధాభిషిక్తుఁడునగు రాజును నీవు వధించితివి. ఇట్టి రాజును వధించుట బ్రహ్మవధ కంటె నెక్కువ పాపము.

పరశురాముఁ డిట్లనెను:- “స్వామీ! ఆతఁడును బాపమును జేసినాఁడు. మీరాతని సేనతోఁగూడ ఎంత సత్కార మొనర్చితిరి! ఆతని కెంతటి ఉపకార మొనర్చితిరి అతఁడు బలవంతముగ మీ యజ్ఞ ధేనువును హరించుకొని పోయినాఁడు. ఆతఁడు మీధర్మమును గూడ నాశ మొనర్చినాఁడు.”

ధైర్యముతో జమదగ్ని మహాముని యిట్లనెను:- “నాయనా! నీకు దెలియదు. ఆతఁడేది చేసినను రాజు. మనమో అందఱికంటె శ్రేష్ఠులమనఁబడు బ్రాహ్మణులము. మనము దండించుటగాని, యుద్ధమొనర్చుట గాని, ప్రతీకార మొనర్చుటకాని పనికిరాదు. దానివలన గొప్ప వారముకాఁబోము. క్షమా కారణముననే మనగొప్పదన మున్నది. ఈ సృష్టియంతయును బ్రహ్మాది, అసుర, రాక్షస, భూత, ప్రేత, పిశాచాదులు ప్రతిక్షణ మెన్ని పాపములు చేయుచున్నవి! దండించుటకే బ్రహ్మ పూనుకొనినచో నొక్క దినములోనే

సృష్టి యంతయును సహరింపఁబడఁ గలదు. వాని నన్నిటిని సహించివారిని రక్షించు చుండును. ఈ క్షమా కారణము ననే ఆతఁడు పారమేష్ఠ్య పదమున నున్నాఁడు."

పరశురాముఁ డిట్లనెను:- "స్వామీ! ఏ క్షమ చేఁదన ధర్మకర్మ లన్నియును లుప్తమగునో ఆ క్షమ ఉచిత మైనదని నేను దలఁపను."

కసరి జమదగ్ని యిట్లనెను:- "ఏమి వాగుచున్నావు! నీవు క్షమయొక్క మహాత్వమును గ్రహింప లేదు, పైఁగా వాగుచున్నావు. క్షమావంతుని ధర్మము నెవ్వరైనఁ జెడఁగొట్టఁ గలరా! బ్రహ్మయొక్క బ్రహ్మ సంపత్తి క్షమా కారణముననే తళతళ మెఱయు చున్నది. క్షమా శస్త్ర మున్న వానినే శత్రువు నేమియు జేయఁజాలఁడు నీవు శస్త్ర ముచేనొకని తండ్రినిఁ జంపిన, రేపొకఁడు నీ తండ్రినిఁజంపును. ఇది బురదను బురదతోఁ గడిగి నట్లుండును. క్షమావంతునకు లోక పరలోకములు రెండును లభించును. ఈ లోకమున క్షమాశీలునకు బ్రశంస యుండును. చచ్చిన తరువాత పుణ్యలోకములు ప్రాప్తించును. క్షమావంతుల యెడల శ్రీ హరి త్వరగాఁ బ్రసన్నుఁడు కాఁగలఁడు పొమ్ము. నీవు తీర్థయాత్ర నొనర్పుము. భగవంతుని భజింపుము. నీ పాపమునకుఁ బ్రాయశ్చిత్తమును గావించు కొనుము.

ఈ విధముగ జమదగ్నిమహర్షి పరశురామునకు క్షమోప దేశమును గావించెను. బ్రాహ్మణుని యొక్క శ్రేష్ఠత బలము వలనఁగాదు, క్షమాకారణముననే బ్రాహ్మణుఁడెంత క్షమాశీలుఁడుగ నుండునో, అంతటి శ్రేష్ఠుఁడగును. బ్రాహ్మణుని ఏడవ గుణము "ఋజుత్వము."

(7) ఋజుత్వము:- కోమలతకు ఋజుత్వమని పేరు. బ్రాహ్మణ హృదయ మెన్నడును కఠోరముగ నుండదు, అతని చిత్తము నవనీతము వలెఁ గోమలముగను, స్నిగ్ధముగను నుండును. ఒక వేళ నాతనికిఁ గోపము వచ్చినను నీటి మీఁద గీతవలె వెంటనే మాసిపోవును. అతని హృదయమున ద్వేషమును నిలుపుకొను సామర్థ్యముండదు. బ్రాహ్మణుఁడు కోపపడి శాపమొసంగిన ఘట్టములును గలవు. కాని వెంటనే అనునయవినయము లొనర్చినచో నాతని కోమల చిత్తము కరిగి పోవును. తన వాక్కుయొక్క సత్యతను గాపాడు కొనుట కేమైనను గొంచెముగ మాట్లాడ వచ్చునేమో కాని అతఁడు వెంటనే క్షమించును.

చదివిన తరువాత గురువునకు దక్షిణ నొసంగుట శిష్యున కావశ్యకమగు కర్మగాఁ జెప్పఁబడినది. వేదమహర్షి యొక్క శిష్యుఁడు ఉత్తంకుఁడు. అతఁడు గురువునిట్లు ప్రార్థించెను:- "నేను మీ కేమి గురుదక్షిణగా నొసంగెదను?" గురు

విట్లనెను:- ,,నా భార్య యేమి యడిగిన దానినిఁ దీసికొని రమ్ము.''

ఉత్తంకుఁడు గురుపత్నీ సమీపమునకుఁబోయి యిట్లనెను:- ,,అమ్మా గురుదక్షిణకు మీ కేమి కావలసిన దెచ్చెదను.'' స్త్రీలకు సొమ్ములనిన మిక్కిలి యిష్టముగ నుండును. ఒకానొక యజ్ఞమందు వేదముని పత్ని పౌష్యమహారాజు భార్య చెవులకు దివ్యకుండలములుండుటను గాంచెను. అట్టివి తనకు గావలయుననుకొనెను. ఆమె యిట్లనెను:- ,,నీవు నాకు ప్రియమొనర్పఁ గోరినచో నేఁటికి నాల్గవదినమున మా ఇంట శ్రాద్ధమున్నది. ఆ దినమున నేను కుండలములను ధరించి బ్రాహ్మణులకు భోజనమును వడ్డింపవలయునని యున్నది. నీ వేలాగుననైన నా రాణియొక్క కుండలములను దీసికొని రమ్ము. ఇదియే నీ గురుదక్షిణ.

బ్రహ్మచారియగు నుత్తంకుఁడు సాహసుఁడును, సామర్థ్యము కల వాఁడునై యుండెను. ఆతఁడు పౌష్య మహారాజు కడకుబోయి, తాను వచ్చిన గారణమును దెలిపెను. యోగ్యుఁడగు పాత్రలభించినచోఁ బూర్వము రాజుల కదేయమైన దేదియును నుండెడిది కాదు. రాజు బ్రహ్మచారిని రాణికడకు బంపెను. రాణి తన భాగ్యమును గూర్చి పొగడుకొనుచు సదా అమృతమును జిలుకు నా దివ్య కుండలములను నా బ్రహ్మచారి కొసంగెను.

విట్లనెను:- ,,నా భార్య యేమి యడిగిన దానినిఁ దీసికొని రమ్ము''

ఉత్తంకుఁడు గురుపత్నీ సమీపమునకుఁబోయి యిట్లనెను:- ,,అమ్మా గురుదక్షిణకు మీకేమి కావలసిన దెచ్చెదను.'' స్త్రీలకు సొమ్ములనిన మిక్కిలి యిష్టముగ నుండును. ఒకానొక యజ్ఞమందు వేదముని పత్ని పౌష్యమహారాజు భార్య చెవులకు దివ్యకుండలములుండుటను గాంచెను. అట్టివి తనకు గావలయుననుకొనెను. ఆమె యిట్లనెను:- ,,నీవునాకు ప్రియమొనర్పఁ గోరినచో నేఁటికి నాల్గవదినమున మా ఇంట శ్రాద్ధమున్నది. ఆ దినమున నేను కుండలములను ధరించి బ్రాహ్మణులకు భోజనమును వడ్డింపవలయునని యున్నది. నీ వేలాగుననైన నా రాణియొక్క కుండలములను దీసికొని రమ్ము. ఇదియే నీ గురుదక్షిణ.

బ్రహ్మచారియగు నుత్తంకుఁడు సాహసుఁడును, సామర్థ్యము కల వాఁడునై యుండెను. ఆతఁడు పౌష్య మహారాజు కడకుబోయి, తాను వచ్చిన గారణమును దెలిపెను. యోగ్యుఁడగు పాత్రలభించినచోఁ బూర్వము రాజుల కదేయమైన దేదియును నుండెడిదికాదు. రాజు బ్రహ్మచారిని రాణికడకు బంపెను. రాణి తన భాగ్యమును గూర్చి పొగడుకొనుచు సదా అమృతమును జిలుకు నా దివ్య కుండలములను నా బ్రహ్మచారి కొసంగెను.

అప్పుడు ముని యిట్లనెను:- "రాజా! నీవు నిరప రాధినగు నాపై దోషము నెంచుచున్నావు: నీవీయన్నమును జూడుము." ఇది విని రాజా యన్నముచు గాంచెను. అది చల్లఁగానుండెను. పాసియుండెను. దానిలో వెంట్రుకలు పడియుండెను. అప్పుడు రాజు ముని పాదములను బట్టుకొని యిట్లనెను:- 'ఆవశ్య మీ అన్నము తినరానిదే. కాన నేనంధుఁడను గాకుండునట్లు చేయుఁడు."

పాదములను బట్టుకొనఁగానే ముని ప్రసన్నుఁడై అత్యంత నమ్రతతో నిట్లనెను:- "రాజా! నే నన్నదును నవ్వులకుగాని, స్వప్న మందుగాని అబద్ధమాలలేదు. కావున నీవు నామమాత్రముగ నంధుఁడవయ్యెదవు. కాని ఒకటి రెండు రోజులలో మరలఁ జూడఁ గలుగుదువు. తర్వాత నీవు యథారీతిగఁ గాఁకలవు. నేను నా శాపమును ద్రిప్పి వైచితిని, ఇప్పుడు నీ శాపమును గూడ త్రిప్పి వేయుము. నన్ను సంతానహీనుఁడను గాకుండు నట్లొనర్పుము."

ఇది విని కుమ్మహాస మొనర్చుచు పేష్యుఁడిట్లనెను:- "ద్విజోత్తమా! నేను నా శాపమును ద్రిప్పఁ జాలను నా క్రోధ మింకను శాంతింపలేదు."

ఉత్తంకముని యిట్లనెను:- "నీవు శాపమునేల త్రిప్పి వేయవు?"

అప్పుడు ముని యిట్లనెను:- "రాజా! నీవు నిరప రాధినగు నాపై దోషము నెంచుచున్నావు: నీవీయన్నమును జూడుము." ఇది విని రాజా యన్నముచు గాంచెను. అది చల్లఁగానుండెను. పాసియుండెను. దానిలో వెంట్రుకలు పడియుండెను. అప్పుడు రాజా ముని పాదములను బట్టుకొని యిట్లనెను:- "ఆవశ్య మీ అన్నము తినరానిదే. కాన నేనంధుఁడను గాకుండునట్లు చేయుఁడు."

పాదములను బట్టుకొనఁగానే ముని ప్రసన్నుఁడై అత్యంత నమ్రతతో నిట్లనెను:- "రాజా! నే నెన్నడును నవ్వులకుగాని, స్వప్న మందుగాని అబద్ధమాలలేదు. కావున నీవు నామమాత్రముగ నంధుఁడవయ్యెదవు. కాని ఒకటి రెండు రోజులలో మరలఁ జూడఁ గలుగుదువు. తర్వాత నీవు యథారీతిగఁ గాఁకలవు. నేను నా శాపమును ద్రిప్పి వైచితిని, ఇప్పుడు నీ శాపమును గూడ త్రిప్పి వేయుము. నన్ను సంతానహీనుఁడను గాకుండు నట్లొనర్పుము."

ఇది విని శుష్కహాస మొనర్చుచు పేష్యుఁడిట్లనెను:- "ద్విజోత్తమా! నేను నా శాపమును ద్రిప్పఁ జాలను నా క్రోధ మింకను శాంతింపలేదు."

ఉత్తంకముని యిట్లనెను:- "నీవు శాపమునేల త్రిప్పి వేయవు?"

బ్రాహ్మణుఁడు భగవద్భక్తి చేతనే సర్వమాన్యుఁడగును నాలుగు వేదములను జదివి భగవద్భక్తి లేకుండినచో నాతని వేదాధ్యయనము వ్యర్థము. భగవద్భక్తి యుండినచో సమస్తగుణములు శోభించును. బ్రాహ్మణుని కుండవలసిన తొమ్మిదవ గుణము దయ.

(9) దయ :- ఇతరులు దుఃఖమున నుండుటను గాంచి వారి దుఃఖమును దూరమొనర్చుటకు దయయనిపేరు. ఎవరికి హృదయమున దీనదుఃఖులయెడల దయయుండునో, ఆతఁడు నరరూపమున నుండిన నారాయణుఁడే. అత్యంత వ్రత తపస్సుల నొనర్చిన మునినేదో అల్పమగు నపరాధమునకై నరకమునకుఁ గొనిపోవుచుండెను. ఆతని శరీర వాయువు తగులఁగానే నరకవాసులందఱును బరమప్రముదితులైరి. ఆతఁడు వెడలి పోవుచుండఁగా నరకవాసులత్యంత దుఃఖితులై యేడ్వనారంభించిరి. అప్పుడా వ్రతధారియును, దయాళువు నగు ముని యిట్లడిగెను:- "దూతలారా! ఈ నరకవాసు లిప్పటివఱకు సంతోషమున నుండిరి. ఇప్పు డేడ్చుచున్నా రేల?"

దూతలిట్లనిరి:- "మహానుభావా! మీరు ధర్మాత్ములరు. దయాళువులు. మీ శరీరముయొక్క దివ్యవాయువు తగులఁగానే నరకమందును వీరికి పరమ సుఖము లభించినది. మీరిప్పుడు పోవుచుండుటచే వీరు దుఃఖించుచున్నారు."

ఇదివిని దయాళువగు నా మహానుభావుఁ డిట్లనెను:- నేనిప్పుడు పుణ్యలోకములకుఁబోను. నేనీ నరకములోనే యుండి అందఱకు బదులు దుఃఖమును సహించెదను. ఈ నరకవాసుల నందఱను విడిచివేయవలయుననియు, వీరికి బదులుగా ననంతకాలము వఱకు దుఃఖమును నే ననుభవించెదననియు ధర్మరాజునకుఁ జెప్పవలయును.

ధర్మరాజట్లే యొనర్చెను. నరకమంతయును గాలీయయ్యెను. అప్పుడా దయాళువును. వ్రతధారియునగు మహానుభావుడిట్లడిగెను:- "నన్నిప్పుడెంతవఱకు నరకములో నుంచఁదలఁచిన నంతవఱకు ఉంచవచ్చును."

ఇది విని ధర్మరాజిట్లనెను:- "మహానుభావా! ఈ దయా కారణమున నీ ధర్మము కోటిరెట్లుగఁ బెరిగినది. ఇప్పుడు నీవక్షయ లోకముల కధికారివైనావు."

ఇంతకు జెప్పవచ్చిన దేమనఁగా దయావంతుఁడెచ్చటికి పోయినను దయను జూపించును. సమస్త ప్రాణుల యందును నధిక దయను జూపించును. బ్రాహ్మణుని యందు దయాగుణము స్వాభావికముగ నుండును. ఏ బ్రాహ్మణుని హృదయము పరుల దుఃఖమును గాంచి ద్రవింపదో, ఆతఁడు నామమాత్ర బ్రాహ్మణుఁడు. దయా కారణముననే బ్రాహ్మణుఁడు సర్వోత్తముఁ డనఁబడుచున్నాఁడు. పదవ నైసర్గిక గుణము బ్రాహ్మణులందు సత్యమనునది కలదు.

(10) సత్యము:- సత్యమనఁగా దేనినెట్లు చూచితిమో, వింటిమో, అనుభవించితిమో దాని నట్లే చెప్పుట. బ్రాహ్మణునకు స్వాభావికముగ సత్యమునందు రుచి యుండును. ఈ విషయమున నొక వైదిక వ్యాఖ్యానము కలదు.

సత్య కామనామకుఁడగు నొక బ్రహ్మచారి హారిద్రుమత గౌతముఁడను నొక ఆచార్యుని సమీపమునకుఁ బోయెను. పోయి ఆతఁడు సాష్టాంగ నమస్కారమును గావించి యిట్లనెను:- "స్వామీ! నేను మీ చరణ సన్నిధి యందుండి బ్రహ్మచర్య వ్రతపాలన మొనర్చుచు విద్యాధ్యయన మొనర్పవలయునని కలదు."

ఆచార్యుఁడిట్లడిగెను:- "సౌమ్యా! నీవే గోత్రమునఁ బుట్టితివి? మీ తండ్రియొక్క గోత్ర మేమి?"

ఆతఁడిట్లనెను:- "స్వామీ! నాకు దండ్రి లేఁడు. మా తల్లి యున్నది.' నే నామె నడిగితిని:- "గురువు నన్ను గోత్రమడిగినచో నేమి చెప్పుదును?"

అప్పుడు మా తల్లి యిట్లనెను:- "వత్సా! నేను వయస్సులో నుండఁగాఁ బరిచారికను. చాలపనులు చేసెడు దానను, అప్పుడు నేను నిన్నుఁ బడసితిని. అందువలన నీవే గోత్రము వాఁడవో నేనెఱుఁగను నాపేరు జబాల. నీపేరు సత్యకాముఁడు."

ఇది వినఁగానే ఆచార్యుఁడు బాలకుని గట్టిగాఁ గౌఁగిలించుకొని యిట్లనెను:- "వత్సా నీవు నిజముగా బ్రాహ్మణుఁడవే. నీవే ఋషి వీర్యమునకో పుట్టితివి. బ్రాహ్మణుఁడు తప్ప యిట్టి యథార్థమగు సత్య విషయము నెవఁడును బలుకఁడు. నీవు సమిధలను దీసికొనిరమ్ము. నేను నీకుపనయన సంస్కార మొనర్చెదను. జబాల పుత్రుఁడ వగుటచే నేఁటినుండి నీవు సత్యకామ జాబాలుఁ డనఁబడెదవు."

చెప్పిన దేమనఁగా బ్రాహ్మణునకు స్వాభావికముగ సత్యమును జెప్పు ప్రవృత్తి యుండును.

శ్రీకృష్ణ భగవానుఁడు ఉద్ధవునితో నిట్లు చెప్పుచుండెను :- "ఉద్ధవా! ఈ విధముగ బ్రాహ్మణుని యందు శమ, దమ, శౌచ, సంతోష, క్షమా, కోమలతా, భక్తి, దయా, సత్యములను నీ దివ్యగుణములు స్వాభావికముగ జన్మచేతనే యుండును. వీనిని బ్రాహ్మణ బాలకుఁడు కడుపున నుండియే నేర్చుకొనును. ఎవరిలో నెంతగా న్యూన గుణము లుండునో, వారిలో నంతగా దోషములుండును. నేనిప్పుడు బ్రాహ్మణునియొక్క స్వాభావిక గుణములను గూర్చి చెప్పితిని. ఇప్పుడు నేను బ్రాహ్మణ ధర్మమును గూర్చియు, వృత్తినిఁ గూర్చియుఁ జెప్పెదను."

సూతుఁ డిట్లనెను:- "ఋషులారా! ఏ విధముగ భగవానుఁడు బ్రాహ్మణ వృత్తి ధర్మములను గూర్చి వర్ణించెనో దానిని నేను మీకు జెప్పెదను.

# బ్రాహ్మణ వృత్తి — ధర్మములు

శ్లో॥ ఇజ్యాధ్యయన దానాని సర్వేషాంచ ద్విజన్మనామ్॥
ప్రతిగ్రహోఽధ్యాపనంచ బ్రాహ్మణ స్యైవ యాజనమ్॥

శ్రీ భాగ. ౧౧ స్కం. ౧౭ అ. ౪ శ్లో॥

ప. "ఉద్ధవా! యజ్ఞ మొనర్చుటయును, దాన మొనర్చుటయును, వేదాధ్యయన మొనర్చుటయును ఇవి బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులకును విహిత ధర్మములు. కాని దానమును గ్రహించుటయును, వేదములను జెప్పుట యును, యజ్ఞమును జేయించుటయును బ్రాహ్మణునియొక్క ధర్మములు."

ధర్మమును, అందఱియొక్క వృత్తులును వేఱు వేఱుగ నేర్పఱుపఁ బడినవి. ఆర్యవైదిక సనాతన ధర్మమందు వర్ణాశ్రమ ములను గుఱించి గొప్పగను, మిక్కిలి గంభీరము గను విచారింపఁ బడినది. ఈ మానవుఁ డెంతటి అధిక బుద్ధి మంతుఁడో, అంతటి అధిక ఉచ్ఛృంఖలుఁడును నైయున్నాఁడు. వీనికి ధర్మభయమే లేకుండినచో నీతఁడు పశువునకు మించి పోఁగలఁడు. ధర్మము నాశ్రయించినచో నీ ప్రపంచము నందుండియును జీవన్ముక్తుఁడు కాఁగలఁడు. మనకు ధర్మ శబ్ద

మాత్యంత వ్యాపకము. ఇందులో స్వభావము, వృత్తి, కర్తవ్యము, సదాచారము, పూజాపద్ధతి ఈ అన్నిటి యొక్క సమావేశము కలదు. జలము యొక్క ధర్మము శీతలత. అగ్నియొక్క ధర్మము ఉష్ణత. ఇచ్చట ధర్మశబ్దమువ్యవహార మందు వ్యవహృతమైనది. బ్రాహ్మణునకు దానమును దీసికొనుట ధర్మమే ఇచ్చట ధర్మము వృత్త్యర్థమునఁ గైకొనఁబడినది. ఒకానొక రాజకర్మచారి తన పదవిలో నున్నాఁడు. ఆతఁడెవరికో సహాయము నొనర్చెను. ఆతఁడు తనకు కృతజ్ఞతను జెప్పఁగా రాజకర్మచారి యిట్లనును:- "దీనిలో ధన్యవాదము లర్పించుట నేనేమి గొప్ప కార్యము నొనర్చినాను, ఇది నాధర్మము. ఇచ్చట ధర్మము కర్తవ్య పాలనార్థమున వ్యవహృతమైనది. తన యూరిపిల్ల యింకొక యూరిలో వివాహమును జేసికొనినది. ధర్మభీరువగు వాఁడా గ్రామమునకుఁ బోయిన, నచ్చటి వారచ్చట భోజనము చేయుమనిన నిచ్చట మా అమ్మాయినిచ్చినాము కావున నిచ్చట భోజనమొనర్చుట ధర్మ విరుద్ధమనును. ఇచ్చట సదాచారార్థమునఁ గైకొనఁబడినది. ఒకానొక్క డెక్కువగ బూజాపారాయణము లొనర్చును. లోకులందఱాతనిని మిక్కిలి ధార్మికుఁడందురు. ఇచ్చట ధర్మమనునది పూజాపద్ధతి వ్యవహారమున వ్యవహరింపఁబడినది. ఒక్కఁడు సత్యాసత్యములను

బలుకుచుండును. చెడ్డపనులను జేయును. కాని యెవరు భోజనమును వండినను దినఁడు. ఒకరోజున నాతఁడు భోజనము జేసిపెట్టుకొనెను. ఇంకెవఁడో వచ్చి ఆతనిఁ దాఁకెను. ఆతఁడు కోపముతో నిట్లనెను:- "నేనిన్నాళ్లు నౌకరి చేసితిని, అబద్ధమాడితిని, దొంగిలించితిని. వ్యభిచరించితిని, కాని నాధర్మమును నేను విడువలేదు."

ఇచ్చట ధర్మమున కర్థము కుల పరంపరాగతమగు భోజనమును దాఁకుట విషయముననే కలదు. ఈ విధముగ ధర్మశబ్దము చాలవ్యాపకమైనది. అందులకే ధర్మముతోఁ గొన్నిటినిఁ గలిపెదరు. రాజధర్మము, బ్రాహ్మణధర్మము, వైశ్యధర్మము, వర్ణధర్మము, అనుటచే నిచ్చట ధర్మము వర్ణముయొక్క కర్తవ్యమనియు, వర్ణముయొక్క ఆజీవిక యనియు గ్రహింపవలెను. ఏ వర్ణమునకే ఆ జీవిక యేర్పఱుపఁ బడినదో ఆ వర్ణమువారా ఆ జీవిక తోడనే బ్రదుక వలయును. ఆ యా జీవికచే నిర్వాహము కాకపోయినచో దాని కాపద్ధర్మము వేఱుగఁ గలదు. సామాన్యముగ నెవరికే వంశ పరంపరాగతమగు నా జీవిక కలదో దాని నా నా జీవికగాఁ బరిత్యాగ మొనరింపరాదు. ఒకని యొక్క పరంపరాగతమగు కార్యము పాత్రలుచేయుట, గుడ్డలు కుట్టుట, పొలము పనిచేయుట అయినచో నట్టివాఁడు తన

పైతృక వృత్తి నెన్నటికిని బరిత్యజింపరాదు. అది దోష యుక్తమైన నగుగాక, నీచకార్యమైన నగుఁగాక! మహా భారతమున వ్యాధగీతగలదు. జాతిలో వ్యాధుఁడు ఆతని వంశ పరంపరాకార్యము మాంసము నమ్ముకొనుట. ఆతఁడు దానిని వదలలేదు. ఆ కార్యము నొనర్చును నాతఁడు మహా జ్ఞాని యయ్యెను. గొప్పగొప్ప బ్రాహ్మణులకును నుపదేశించెడు వాఁడు. ఆతఁడు తన పైతృక ధర్మమును వదలలేదు. ఒకానొకరి పైతృక కర్మ దొంగతనములు చేయుటయు, మదిరా మాంసముల నమ్ముటయును, నాటకములలో స్త్రీ వేషములను వేయుటయును, రాజైధనమును సంపాదించుటయు, లోహ, చర్మములను విక్రయించుటయును మొదలగునవి పైతృక వృత్తులైనను వీనిని వదలినచో దోషములేదు. ఇతర పైతృక వృత్తులను వదలుటచే దోషము కలుగును. దీనివలన సమాజమున శాంతియుండదు. ప్రజలలోఁ బ్రతిస్పర్థ లేర్పడును. ఒకరి ఆ జీవిక నొకరు లాగుకొనుటకుఁ బ్రయత్నించెదరు. సంఘర్షణము కలుగును. అశాంతి ప్రబలును. తమ ధర్మములను వదలి, పరధర్మముల నాశ్రయించి, పరస్పరము కలహించు కాలమునకే కలియుగమని పేరు. గలియుగాంతమునకు వర్ణధర్మముండదు. అందఱును మ్లేచ్ఛులయ్యెదరు ఆది కృతయుగమునందు విశుద్ధమగు ధర్మమే

నిలిచియుండును. అప్పుడును వర్ణధర్మముండదు. మధ్యకాలమున వర్ణాశ్రమ ధర్మపాలన మత్యంతావశ్యక మగును.

సూతుం డిట్లనెను:- "మునులారా! బ్రాహ్మణుల యొక్క స్వభావమును గూర్చి వర్ణించిన తరువాత వాసుదేవ భగవానుఁడు ఉద్ధవునితో బ్రాహ్మణ ధర్మమును గూర్చియు నాతని వృత్తిని గూర్చియు వర్ణించుచు నిట్లనెను:- "ఉద్ధవా! బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులను వారు ముగ్గురును ద్విజులు. రెండు సార్లు జన్మించిన వారికి ద్విజులని పేరు. పక్షులు తల్లిగర్భములో నుండి ముందు గ్రుడ్డుగాఁ బుట్టి, తర్వాత నది పగిలి పిల్ల యగును. దానికిని ద్విజనామము కలదు. దంతములకును ద్విజనామముఁ గలదు బాల్యమునఁ బండ్లు వచ్చి మరల నవి యూడిపోయి పెరుగును. ఇదే విధముగ బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులకు తల్లిగర్భములో నుండి వచ్చుట ఒక జన్మయగును, శిక్షా దీక్షలను గైకొని గురుకులము నుండి బయటకు వచ్చుట రెండవజన్మ, శూద్రులకు గురుకులవాస మవసరము లేదు అందువలన వారు ద్విజేతర శూద్రు లనఁబడుదురు.

ద్విజ సంజ్ఞకలిగిన ముగ్గురి ధర్మమొక్కటియే. వేదమును జదువుట ముగ్గురకును గలదు. యజ్ఞము లొనర్చుట ముగ్గురకు నవసరమే 'కర్తవ్యమే'.

ఉద్ధవుఁ డిట్లడిగెను:- "బుద్ధుని ధర్మము లొక్కటైనచో వీనికి వేఱువేఱు సంజ్ఞ లేలకు?"

భగవానుఁ డిట్లనెను:- "వృత్తి ననుసరించి వీనికి వేఱువేఱు సంజ్ఞ లేర్పడినవి. స్వభావమునకు వీనికి వేఱు వేఱుగ నైనవి. స్వభావ వర్ణమును నేను గావించితిని. ఇప్పుడు బ్రాహ్మణ వృత్తిని గూర్చి చెప్పెదను."

ఉద్ధవుఁ డిట్లడిగెను:- "బ్రాహ్మణుఁడు జన్మచేతనా? లేక కర్మచేతనా?"

భగవానుఁ డిట్లనెను:- "ఉద్ధవా! జన్మ కర్మల రెండింటిచేతను బ్రాహ్మణుఁ డనఁబడుచున్నాఁడు. బ్రాహ్మణ వీర్యముచే బ్రాహ్మణ స్త్రీ యందు బుట్టినవాఁడు, బ్రాహ్మణోచిత సంస్కారములు గావింపఁబడిన వాఁడును, బ్రాహ్మణ కర్మ నొనర్చువాఁడును బ్రాహ్మణుఁడు?"

'ఉద్ధవుఁ డిట్లడిగెను:- "స్వామీ! ఒకానొకఁడు బ్రాహ్మణ వంశములోఁ బుట్టి, మ్లేచ్ఛకర్మల నొనర్చిన నాతఁడు బ్రాహ్మణుఁడా మ్లేచ్ఛుఁడా?"

భగవానుఁ డిట్లనెను:- "జన్మచే నాతఁడు బ్రాహ్మణుఁడే. కాని కర్మచే నాతఁడు పతితుఁడైనాఁడు. ఇట్టి బ్రాహ్మణుఁడు ధర్మభ్రష్టుఁడైనాఁడని, పతితుఁడైనాఁడని తెలియవలయును. రాజాతనిచేఁ జాకిరినిఁ జేయించుకొన వచ్చును. అయినను నాతని బ్రాహ్మణుఁడనియే పిలిచెదరు.

దానికి విపరీతముగ శూద్రుఁడు గుణములలో బ్రాహ్మణుని కంటె నధికుఁడైనచో నాతని బ్రాహ్మణునివలె నాదరింపవలయును, సత్కార మొనరింప వలయును, కాని ఆతఁడు తన వృత్తినిఁ పరిత్యజింపరాదు. శూద్రుఁ డెన్నఁడును నాపత్కాల మందైనను బ్రాహ్మణవృత్తిని జేపట్టరాదు.''

ఉద్ధవుఁ డిట్లనను:- ''వేదమును జదువుటయు, యజ్ఞ మొనర్చుటయును, దాన మొసంగుటయును ఈ మూఁడును బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులకును ధర్మములు. ఇప్పుడు బ్రాహ్మణుని వృత్తియేమి? ఆతఁడు తన యోగక్షేమము నెట్లు నెఱవేర్చుకొనును. ఎట్లు జీవించును?''

భగవానుఁ డిట్లనెను:- ''బ్రాహ్మణుఁడు తాను వేదమును జదివి యితరులకుఁ జెప్పవలయును. తనవద్దకు వేదము జదువుటకు వచ్చిన బ్రహ్మచారి తెచ్చిన మధుకరమును దానును శిష్యుఁడును దిని బ్రదుకవలయును. బ్రాహ్మణుఁడు జీతమును దీసికొని, వేఱొకనికి నౌకరై అధ్యాపన మొనర్పరాదు. తాను సమర్థుఁడై తన శాసనమున క్షత్రియులనుంచి చెప్పవలయును.''

ఉద్ధవుఁ డిట్లనెను:- ''స్వామీ! దీనివలన జరుగుబాటు లేకపోయినచో.''

భగవానుఁ డిట్లనెను:- ''అప్పు డొక్క పనిని జేయవలయును. ఎవరికైనను యజ్ఞమును జేయింపఁగా దాసి

వలన వచ్చిన దక్షిణచే జరుపుకొనవలయును. ద్విజులకు సంస్కార మొనరించి, నిత్య నైమిత్తిక కామ్యయజ్ఞములను జేయించి దానివలన వచ్చిన దక్షిణలతో నిర్వాహము కావించుకొన వలయును.''

ఉద్ధవుఁ డిట్లడిగెను:- ''దక్షిణ ద్రవ్యముచేతను జరుగక పోయినచో నేమిచేయ వలయును,''

భగవానుఁ డిట్లనెను:- ''అప్పుడు సత్పాత్రమునుండి శ్రద్ధాపూర్వకముగ దానమును గైకొని దానిచేఁ బనిని జరుపుకొన వలయును. బ్రాహ్మణుఁడు దానమును గ్రహించుట ఉత్తమపక్షము కాదు. నిత్యము దాన ప్రతిగ్రహమును గావించుటచే బ్రహ్మతేజము నశించిపోవును. కాని బ్రాహ్మణుఁడగు వాఁడు దానమును గ్రహించు నపేక్షను గావింపరాదు. సాధ్యమైనంత వఱకు దానమునకుఁ దప్పించుకొని తిరుగుచుండ వలయును, అధ్యాపనమునందును, యజ్ఞమును జేయించుట యందును, దానమును గ్రహించుట యందును బరావలంబనము కనఁబడినచో సర్వోత్తమ పక్షము శిలోంఛ వృత్తి నవలంబించుట.''

ఉద్ధవుఁ డిట్లనెను:- ''స్వామీ! శిలోంఛ వృత్తి యనఁగా నేమి?''

భగవానుఁ డిట్లనెను:- పొలములో రైతు పంటను గోసి తీసికొనిపోఁగా, దానిలో మిగిలినఁ బరిగను దెచ్చుకొని దానిమీఁద బ్రదుకుటకు శిలావృత్తియని పేరు. పొలములో మిగిలిన బరిగకు శిలాయనిపేరు. ఉచ్ఛ లేక ఉంఛ వృత్తి యనఁగాఁ బియ్యమును, ధాన్యమును అమ్మునప్పుడు, అటు నిటు రాలిన గింజలను పావురములవలె నేరుకొనుటకు ఉచ్ఛమనుపేరు. కపోతమువలె నేరుకొని దినుటకుఁ గపోత వృత్తి యనిపేరు. ఇట్టి కపోతవృత్తిగల బ్రాహ్మణులు చాల దుర్లభులు. వారియొక్క తపస్సు నిస్పృహతచే నిత్యమును బెరుగుచునేయుండును. కలియుగమున నట్టి బ్రాహ్మణులు దొరకరు. కేవలము కథామాత్రము శేషించియుండును.

ఉద్ధవుఁ డిట్లనెను:- "స్వామీ! బ్రాహ్మణుఁడు శిలోంఛవృత్తి చేతనే జీవింపఁదలఁచినచో నాతనికి గింజ లేరుకొనుటచేతనే దినము గడచిపోవును. ఇంక పూజాపారాయణము లెప్పుడు? పుస్తకములను వ్రాయుటెప్పుడు? ఇతరులకు మనోరంజనమును గలిగించు సాంసారిక కార్యము లెప్పుడు?"

నవ్వి భగవానుఁ డిట్లనెను:- "దిన మంతయు నట్లైనచో నేమి హాని? ఇదియును దపస్సే. ఆతని జీవితమే గొప్ప గ్రంథము. తపస్వియగు బ్రాహ్మణునకు సాంసారిక

భోగములుకా, మనో రంజనమును నవసర ముండదు. బ్రాహ్మణ శరీరము తపస్సుకొఱకే నిర్మింపబడినది. ఆతని సుఖము పరలోకమునకుం బోయిన తరువాత లభించును. ఈ విధముగ నే బ్రాహ్మణుడు సంతోష పూర్వకముగ దీనత్వమునను, బరావలంబన రహితముగనుండి, అతినిర్మల మగు దన ధర్మమును నిష్కామ భావముతోం బాలించునో, ఆతండు సర్వాత్మ భావముతో నాకే ఆత్మ సమర్పణమొనర్చి అనాసక్త భావముతోం దన గృహమందుండియే పరమ పదమునకధికారియగును. ఆతని జీవితము త్యాగ తపోమయ మగును. ఆతండు వాన ప్రస్థ సన్యాసాశ్రమములను ధరింపక పోయినను ఉత్తమ లోకములను బ్రాప్తించును."

ఉద్ధవుం డిట్లనెను:- "స్వామీ! ఇట్టి బ్రాహ్మణునకుం ప్రారబ్ధ వశమున విపత్తు సంభవించినచో సమాజముయొక్క కర్తవ్య మేమి!"

భగవానుం డిట్లనెను:- "ఆ సమయమున సమాజము ఆపత్తులోంబడిన భక్త బ్రాహ్మణునకు సహాయ మొనర్ప వలయును. అట్టి బ్రాహ్మణున కెవరు సహాయము చేయుదురో అట్టివారికి నేను సహాయ మొనర్చెదను వారిని సంసార దుఃఖములనుండి రక్షించెదను అట్టివారిని సంసారసాగరము నుండి శాశ్వతముగ రక్షించెదను విచారశీలుండగు శాసకుండిట్టి

తపస్వి జ్ఞానియగు బ్రాహ్మణుని ధ్యానమందుంచుకొనవల యును. ఏశాసకుని శాసనమున బుద్ధిజీవియు, తపస్వియు, సుయోగ్యుఁడగు నగు బ్రాహ్మణునకు ధనము కారణమునఁ గ్లేశము కలుగునో ఆశాసకుఁడు శీఘ్రముగనే నశించితీరును. ఏ రాజు ఇట్టి యోగ్యవ్యక్తిని ధ్యానములో నుంచుకొని సహాయ మొనర్చునో, ఆతఁడు సూర్యునివలెఁ బ్రకా శించును. ఈలోకమున నాతనికి విపుల కీర్తి కలుగను. చచ్చిన తరువాత స్వర్గమందు ఇంద్రునివలె సుఖములను బొందును."

ఉద్ధవుఁ డిట్లనెను:- "స్వామీ! స్వామీ! మీరు కృత, త్రేత, ద్వాపరయుగములలోని మాటను జెప్పు చున్నారు. కలియుగమందు పొలమందలి పరిగెను శూద్రుఁ డేరుకొనును. ఒక్క బియ్యపు గింజనైనను దపస్సులకు ముట్ట నీయరు. యజ్ఞముల నెవ్వరును జేయరు. చేయింపరు, వేద మును చదువరు. దాన మొసంగుటలో రుచియుండదు. ఇట్టి స్థితియందు బ్రాహ్మణుఁడు తన నిర్వాహము నెట్లొనర్పఁ గలఁడు ?

భగవానుఁ డిట్లనెను:- "ఉద్ధవా! అప్పుడు బ్రాహ్మ ణుఁడాపద్ధర్మము నాశ్రయింపవలయును. ఆతఁడు పొలమును వ్యవసాయమును జేసికొనియో, గోసేవ యొనర్చుకొనియో

జీవితమును గడుపుకొనవలయును. వ్యాపారము జేసికొని నచో విషమును తైలమును, ఇతర రసద్రవ్యములను అమ్మ రాదు. సాధ్యమైనంత వఱకు వడ్డీమీఁద బ్రదుకరాదు,"

ఉద్ధవుఁ డిట్లనెను:- "స్వామీ! దీనితోడను నిర్వాహము జరుగకుండిన నేమి చేయవలయును ?"

భగవానుఁ డిట్లనెను:- "అప్పుడు నిర్వాహముకొఱకు క్షత్రియ వృత్తి నవలంబింప వలయును. అస్త్ర శస్త్రములను గైకొని యుద్ధము చేయవచ్చును గాని నీచవృత్తి నెన్నడు నవలంభింపరాదు. కావలి వాని పనిచేయుటయు, నటు నిటు వస్తువులను జేరవేయుటయును, ధనికుల యిండ్లలో నీరు పోయుటయును, ఇట్టి హేయకర్మ లొనర్చుటవలన బ్రాహ్మణుఁడు పతితుఁడగును. శ్వానవృత్తి నొనర్చుటచే బ్రాహ్మణుని ఓజము. తేజమంతయును నశించును. కావున బ్రాహ్మణుఁడు సాధ్యమైనంత వఱకు దన బ్రాహ్మణత్వమును బాలించుచు నాపద్ధర్మమును బాలింపవలయును."

ఉద్ధవుఁ డిట్లనెను:- "స్వామీ! నేను బ్రాహ్మణుని స్వభావ, ధర్మ వృత్తులను గూర్చి వింటిని. ఇప్పుడు మీరు క్షత్రియ స్వభావ ధర్మమును గూర్చియుఁ జెప్పవలయును."

సూతుఁ డిట్లనెను:- "మునులారా! ఉద్ధవుఁడడుగఁగా భగవానుఁడు క్షత్రియ స్వభావమును గూర్చి యెట్లు వర్ణించెనో ఆ ప్రసంగమును మీకు జెప్పెదను సావధానులరై వినుఁడు.

# క్షత్రియ స్వభావము

శ్లో॥ తేజో బలం ధృతిః శౌర్యం తితిక్షౌదార్య ముద్యమః ।
స్థైర్యం బ్రహ్మణ్యతైశ్వర్యం క్షత్రప్రకృతయ స్త్విమాః॥
శ్రీ భాగ. ౧౧ స్కం. ౧౭ అ, ౧౭ శ్లో॥

వ. "ఉద్ధవా! తేజ, బల, ధైర్య, వీరత్వ, సహన శీలత, వీరత్వ, సహనశీలత, ఉదారత, ఉద్యోగ, స్థిరత్వ ములు, బ్రహ్మణ్యత, ఐశ్వర్యములు క్షత్రియ వర్ణ స్వభావ ములు."

ఇతరులను రక్షించుట బలముచేతనా, తపము చేతనా ? బలమును, దపస్సును లేనివాఁ డెంతటి బుద్ధి మంతుఁడైనను బరముఖాపేక్షియగును. అతఁడు తన జీవన నిర్వాహమున కితరుల సహాయమును గ్రహింప వలసి యుండును.

తపో బలములు, లేనివాని క్షమ వాస్తవిక క్షమ కాదు. అది నిర్బలత, నెవఁడు రాష్ట్రమును గాపాడు కొన వలసి యున్నదో అతఁడు ముందుగా శక్తి సంచయ మొనర్చు కొనవలయును. ఏ రాష్ట్రమందు క్షాత్ర ధర్మము న్యూనముగ నుండునో, ఆరాష్ట్రము ఉన్నతిలో నంతటి ముందంజ వేసినదనుకొనవలయును. సమస్త రాష్ట్రముల

సంగరన, విగరనములు దాని క్షాత్ర ధర్మము మీఁదనే అవలంబితమై యుండును.

సూతుఁడు నైమిశారణ్య నివాసులగు ఋషులతో నిట్లనెను:- "మునులారా! ఉద్ధవుఁడు భగవానునితో క్షత్రియ స్వభావ సంబంధమునఁ బ్రశ్నింపఁగా భగవానుఁ డిట్లనెను:- "ఉద్ధవా! క్షత్రియులలోఁ గొన్ని జన్మ జాత గుణములుండును. స్వాభావిక ప్రకృతి సంబంధమున నేగుణ ములుండునో, వానిని నేనత్యంత సంక్షేపముగ వర్ణించెదను.

(1) తేజము :- క్షత్రియులలో జన్మజాతమగు తేజ ముండును. దేనిని నాతతాయి చూడఁగనే భయము భీతుఁ డగునో, దానినిఁ దేజమందురు. వాని యెదుట పలుకుట కెవరికిని సాహసముండదు, ఒక రాజుండెను. ఆతఁ డేకాక్షి. ఆతని ముఖము మీఁద స్ఫోటకపు మచ్చలును గలవు. ఆతని సమీపమున నుండు నొక సేవకునితో నొకఁ డిట్లనెను:- "ఏమయ్యా! మీ యజమాని ఏకాక్షియా!"

ఆతఁ డిట్లనెను:- "ఏమో, ఆతని కొక కన్ను లేదని నాకు తెలియదు," అడిగిన వ్యక్తి యిట్లనెను:- "కాదు. ఆతఁడవశ్యము నేకాక్షియే."

సేవకుఁ డిట్లనెను.- "అవునేమో, నేనిన్ని దినముల నుండి ఆయన దగ్గఱ నుండినను, నాకాతని ముఖమును జూచుటకు సాహసము కలుగలేదు.."

ఈ కథను జెప్పుటకు గారణ మేమనఁగా—నిజమగు క్షత్రియునకుఁ దేజముండును. ఆతని యెదుటఁ గన్నెత్తి చూచుట కెవరికిని సాహసముండదు. నహుఁడమిత తేజస్వి. ఆతఁడెవరివైపునకుఁ జూచిన వారి తేజస్సును హరించును. ఋషులాతని కిచ్చిన శాపమును దాగియిచ్చిరి. క్షత్రియునిఁ గాంచఁగనే దస్యులు పారిపోవుదురు. వేనమహారాజు క్రూరుఁడును, నాస్తికుఁడు నైనప్పటికిని, ఆతని తేజస్సుచే దస్యులు పారిపోయెడువారు. తేజస్వికాని రాజు శాసన మెక్కువ రోజులు నిలువదు. ప్రజలు క్షాత్రధర్మముయొక్క తేజస్సు చేతనే లొంగియుండెదరు. క్షత్రియుని రెండవ స్వాభావిక గుణము "బలము".

(2) బలము :- బలమునకు సహ, ఓజ, బలములని మూఁడు విధములు. శారీరక బలమునకు బలమందురు. ఇంద్రియ బలమునకు ఓజమందురు. మానసిక బలమునకు సహమందురు. క్షత్రియునకు మూఁడు బలములును నుండును. ఆతఁడు శారీరక బలమునందును. అన్య ప్రాణులకంటె బల వంతుఁడుగ నుండును. భీమ, దుర్యోధన, కంస, జరాసం

ధాధులందు పదివేల యేనుఁగులకు సమానమగు బలమున్న దని వినుచుందుము. గ్రుడ్డివాఁడగు ధృతరాష్ట్రుఁడు పదివేల యేనుఁగుల బలముగల భీముని నలిపిన నాతఁడు పచ్చడి పచ్చడి యగునంత బలముండెడిదఁట. భీముఁడను భ్రమచే నాతఁడు ఇనుముతోఁ జేయఁబడిన భీమవిగ్రహమునుగట్టిగాఁ గౌగిలించుకొని వత్తఁగా నది ముక్కలు ముక్కలైనదఁట, రాజు బలవంతుఁడు కాకుండినచో నాతని నిర్బలు లెట్లు రక్షింపఁగలుగుదురు ?" క్షత్రియుని మూఁడవ గుణము "ధైర్యము",

(3) ధైర్యము:- విపత్తు సంభవించినను అత్యంత దుఃఖితుఁడుగాక, అది దైవవిధియని సహించువానిని ధైర్యవంతుఁడందురు. ఇట్టి క్షత్రియుల ఇతిహాసములు పురాణములలో ననేకములు కలవు. అతని పుత్రుని శిరస్సు తెగి వచ్చి సముఖమునఁ బడినను నాతఁడు ధర్మమునుండి విచలితుఁడు కాలేదు, స్వయముగ నడుమును బిగించి యుద్ధమునకు దుమికెను. విపత్సమయమున ధైర్యముగ నుండుటయే క్షత్రియునియొక్క పరమ గుణము. పాండవులు రాజకుమారులై యుండియును వనములఁ దిరుగుచుండిరి. కాని వారు ధైర్యమును వీడలేదు. ఒక రాజుయొక్క రాజ్యము హరింపఁబడెను. అంతయును బోయెను. ఒకానొక బ్రాహ్మణుఁడాతని నిట్లడిగెను.- "రాజా! ఇప్పుడు నీ దగ్గఱనున్న దేమి?

ఆతఁడిట్లనెను:- "స్వామీ! ఇపుడు నా వద్ద ఒక్క ధైర్యము మాత్రమున్నది."

బ్రాహ్మణుఁ డిట్లనెను:- "మహారాజా! నీ దగ్గఱ ధైర్యముండినచో నన్నియు నున్నట్లే. ఇప్పటికిని నీకు పోయిన దేమియును లేదు."

రాజుయొక్క ధైర్యముచే విడిపోయిన భార్యాపుత్రులు మరల కలిసికొనిరి. తనకు సంబంధించిన రాజుల సహాయముచే నాతఁడు మరలఁ దాను బోఁగొట్టుకొనిన రాజ్యమును బొందెను. రాజుయొక్క నాల్గవ గుణము 'వీరత్వము'

(4) వీరత్వము:- క్షత్రియ బాలకుఁడు జన్మచేతనే వీరుఁడుగ నుండును. అభిమన్యుఁడు తల్లిగర్భమున నుండియే వీరత్వమునకు సంబంధించిన కథలను విని పద్మవ్యూహమును భేదించు జ్ఞానమును బొందెను. క్షత్రియ బాలకులకు వీరతా వాక్యములను జెప్పవలసిన పనిలేదు. వారు పుట్టుకతోడనే నేర్చుకొని వచ్చెదరు. శకుంతలా పుత్రుఁడు మూఁడు నాలు గేండ్ల వాఁడైయుండఁగా సింహముయొక్క చెవులను బట్టుకొని చెట్లకు గట్టుచుండెడువాఁడు. ఏలననఁగా నాతఁడు వీరవరుఁడగు దుష్యంతుని వీర్యమునకుఁ బుట్టినవాఁడు. స్వాభావికముగ వీరత్వము లేనివానిని క్షత్రియుఁడనుటకు వీలులేదు. క్షత్రియునియొక్క అయిదవ గుణము 'సమానశీలత'

(5) సహనశీలత:- క్షత్రియుఁడు సుఖములలోఁ బెరిగి నను నాతఁడు సుఖదుఃఖములను సమానముగ భావించును. అవసరము వచ్చినపుడు సుఖదుఃఖములను నవ్వుచు నవ్వుచు ననుభవించును. యుద్ధములో బాణములమీఁద బాణములను గొట్టుచుండెదరు. శరీరమంతయును జర్జరితమగును. కాని ఆతఁడు తన వీరోచిత సహనశీలతచే వాని నిసుమంతైన లెక్క చేయఁడు. నేను నా కన్నులార భీష్మ పితామహుని సహనశీలతను గాంచితిని. ఆతని శరీరము నువ్వుగింజంత మేఱ యైనను బాణములు తగులనిచోటు లేదు. బాణముల శయ్య మీఁద నాతఁడు పరుండెను. గాయముల బాధ యెక్కువగానే యుండెను. కాని ఆతని ముఖమునుండి ఒక్క నిట్టూర్పైనను లేదు. ఇంతేకాదు. మేమందఱ మాతని చుట్టును గూర్చుండి నను, ఆ సహింపరాని వేదనయందును నాతని సహనశీలతను జూపించెను. ధర్మరాజడుగఁగా శాంతిపర్వమందలి కథనంతను జెప్పెను. క్షత్రియునిలో నాఱవ గుణము "ఉదారత"

(6) ఉదారత:- ఉదారత యనఁగాఁ దన నెవ్వరైనను యాచించినచో నత్యధికానందముతో నేది యడిగిన దాని నొసంగుట. భారతీయ రాజేతిహాసములందీ ఉదారతను గూర్చిన విషయములనేకములు కలవు. రాజులొక భిక్షువడు గఁగా నాతనికిఁ దన సర్వస్వము నొసంగెను. పావురమును

రక్షించుటకై తన శరీర మాంసమును గోసి యిచ్చెను. బలి చక్రవర్తి ముందే ఔదార్యాని విషయమును జ్ఞాపకము వచ్చుటలేదు. వామనుఁడైన విష్ణువని కెఱిగియును త్రైలోక్య రాజ్యము నొసంగి. తాను బంధితుఁడయ్యెను. ఉదారతయే క్షత్రియ రాజులయొక్క విశేషత. ఏడవ గుణము "ఉద్యోగము."

(7) ఉద్యోగము:- సర్వదా తనపనిలో నిమగ్నుఁడై యుండుటకు ఉద్యోగమందురు. క్షత్రియుడు ప్రజాపాలనము కొఱకు ఎల్లప్పుడేదియో ప్రయత్నించుచుండును. ఆతని యుద్యోగముచేతనే అర్థ, ధర్మ. విజయ పతాకలు దేశ విదేశములందు ఎగురుచుండును. యుద్ధకాలమందాతఁడు మిక్కిలి వీరత్వముతో బోరాడును. శాంతికాలమందు గొప్ప గొప్ప యాగాదుల నొనర్చును. ధర్మసంరక్షణమును, ధర్మ సంవర్ధనమును గావించుచుఁ బరలోకమును సాధించుకొనును. కలియుగమున క్షత్రియులు ఉద్యోగహీనులై యుండెదరు. అందువలన వారికి పతనము కలుగును. క్షత్రియునియొక్క యెనిమిదవ గుణము "స్థిరత్వము"

(8) స్థిరత్వము:- స్థిరత్వమనఁగా నెవరికైనను మాట యిచ్చినచో దానిమీఁద దృఢముగ నుండుటయును, ఏదైన సత్సంకల్పమొనర్చిన దానిమీఁద స్థిరముగ నుండుటయునై

యున్నది. రాజులు స్వభావమున వారేది పలికెదరో, దానినిఁ బ్రాణములొడ్డియైనను నెఱవేర్చెదరు. దశరథ మహారాజు కైకేయికి మాటనొసంగెను. దానికొఱకై తనకు ప్రాణప్రియుఁడగు రామచంద్రుని వదలవలసి వచ్చెను. తాను ప్రాణములను గూడ విడిచెను. కాని ఆతఁడు తన వచనమునుండి విచలితుఁడు కాలేదు. ఇట్టివి ఒక్కటికాదు. అనేకోదాహరణములు కలవు. క్షత్రియుని యొక్క తొమ్మిదవ గుణము "బ్రాహ్మణ్యత"

(9) బ్రాహ్మణ్యత :- బ్రాహ్మణులయందు భక్తి కలిగియుండుటకు బ్రహ్మణ్యత అనిపేరు. క్షత్రియులలో గల గొప్పగుణ మేమనఁగా వారింతటి బలవంతులై యుండియును బ్రాహ్మణులను గాంచి సదా భయపడు చుండెదరు. వారివద్ద బ్రాహ్మణుల కీయరాని వస్తువేమియును నుండదు. అనేకమంది రాజర్షులకు నేఁటివఱకు కీర్తియుండుట వారి బ్రహ్మణ్యత వలననే. ప్రహ్లాద పుత్రుఁడగు విరోచనుఁడు బ్రాహ్మణ వేషధారులగు దేవతలకు తన యాయువునే యొసంగెను. బలిచక్రవర్తి వామనుఁడైన భగవానునకు తన త్రైలోక్యరాజ్యమునే యొసంగెను. దానవీరుఁడగు కర్ణుఁడు బ్రాహ్మణుఁడైన నింద్రునకు తన సహజ కవచకుండలముల నొసంగెను. సమరభూమియందు చచ్చుచుఁ దన దంతములకు

పొదిగిన సువర్ణమును దీసి దానమొసంగెను. ఆతని సర్వస్వ మును బ్రాహ్మణులకే యొసంగెను. హరిశ్చంద్ర మహారాజు బ్రాహ్మణునకు దన సర్వస్వము నొసంగెను. సత్యసంధుఁడగు రాజు బ్రాహ్మణునకు దనశరీరము నొసంగెను. ఉశీనర నంద నుఁడగు శిబిచక్రవర్తి బ్రాహ్మణుని కొఱకు తన శరీరమును, పుత్రుని యొసంగెను. కాశీరాజగు ప్రతర్ధనుఁడు బ్రాహ్మణు నకై తన నేత్రము నొసంగెను. అంబరీషమహారాజు బ్రాహ్మ ణుల కసంఖ్యాకములగు గోవుల నొసంగె ననుచుందురు. విదేహ పుత్రుఁడగు నిమిచక్రవర్తి బ్రాహ్మణులకు తన దేశము నంతయు నొసంగెను. పరశురాముఁడు భూమండ లము నంతను జయించి, దానిని బ్రాహ్మణులకు దాన మొసంగెను. శాల్వ దేశాధిపతి ద్యుతిమంతుఁడు ఋచీక మహామునికిఁ దనరాజ్యము నర్పణము కావించెను. లోమపాద మహారాజు తనపుత్రియగు శాంతను ఋష్యశృంగునకును, మదిరాశ్వుఁడను మహారాజు తన కుమార్తెను హిరణ్యహస్తుఁ డను మునికిని, మాంధాత తన యేబదిమంది కన్యకలను సౌభరి మహర్షికిని, మరుత్తు తన పుత్రికను అంగిరసునకును, శర్యాతి మహారాజు తన పుత్రికయగు సుకన్యను చ్యవన మహర్షికిని, ఇంక నెందఱో రాజులు తమ సుకుమార కన్యక లరణ్యమందు ఘోర తపస్సు నొనర్చుచున్న ఋషుల కొసం గిరి, జరాసంధుని అసురుఁడనుచుందురు. కాని ఆతనికి

బ్రాహ్మణభక్తి యెక్కువ, బ్రాహ్మణుల నడుగక ఆకఁడే పనినిఁ జేసెడువాఁడు కాఁడు. ఆతని బ్రహ్మణ్యతా కారణము ననే నేనాతనిచేఁ బ[illegible]జితుఁడనై, నా పైతృక భూమిని విడి, యిచ్చట సముద్ర మధ్యమున ద్వారకాపురమును నిర్మించు కొనవలసి వచ్చినది. ఎంతమంది ప్రసిద్ధులగు రాజులు కలరో, వారందఱును బ్రాహ్మణుల కత్యంత భక్తులు. బ్రహ్మణ్యత వలననే నేను జగత్పూజ్యుఁడనై నాను. క్షత్రియులయొక్క పదియవ నైసర్గిక గుణము "ఐశ్వర్యము"

(10) ఐశ్వర్యము:- క్షత్రియుఁడు జన్మచేతనే ఐశ్వర్య శాలురుగ నుందురు. వారి యిండ్లనుండి రాజలక్ష్మి యెన్నటి కిని బోనేపోదు. ఏలననఁగా వారెల్లప్పుడు ధర్మాచరణ మొనర్చుచుందురు. కలియుగమందు రాజులుండనే యుండరు. ఉన్నవారు ఐశ్వర్య విహీనులై యుందురు. పూర్వపు రాజుల యైశ్వర్యమును గూర్చి యేమని చెప్పవలయును. వారిని గూర్చి చెప్పిన నిప్పటివారు విశ్వసింపరు.

శ్రీకృష్ణభగవానుఁ డుద్ధవునితో నిట్లనెను:- "ఉద్ధవా! ఈ విధముగఁ తేజ, బల, ధైర్య, వీరతా, సహనశీలతా, ఉదారతా, ఉద్యోగ, స్థిరతా, బ్రహ్మణ్యతా, ఐశ్వర్యము లనునవి క్షత్రియ వర్ణముయొక్క స్వభావ గుణములు. నేను సంక్షేపముగ క్షత్రియ స్వభావమును గూర్చి చెప్పితిని. క్షత్రియవృత్తి సంబంధమున నేను నీకు కొంత చెప్పెదను."

సూతుఁ డిట్లనెను:- "మునులారా! ఇప్పు డేవిధముగ భగవానుఁ డుద్ధవునకు క్షత్రియవృత్తి సంబంధమున జెప్పెనో దానిని నేను ముందు వర్ణింపఁగలను.

# క్షత్రియ వృత్తి

శ్లో॥ వైశ్యవృత్త్యా తు రాజన్యో జీవేన్మృగయయాపది।
చరేద్వా విప్రరూపేణ న శ్వవృత్త్యా కథం చన॥

శ్రీ భాగ. ౧౧ స్కం. ౧౭ అ. ౪౭ శ్లో॥

వ. "ఉద్ధవా! ఆపత్కాలమున క్షత్రియుఁడు వైశ్యవృత్తి నవలంబింపవచ్చును. లేదా మృగయా ద్వారా నైనను జీవన నిర్వాహము కావించుకొనవచ్చును. బ్రాహ్మణ వేషమును ధరించియైనను జీవింపవచ్చునుగాని శ్వానవృత్తి నవలంబింపరాదు."

క్షత్రియవృత్తి విషయమున మహాభారతముకంటె నుపయుక్తమగు నుదాహరణ మింకెక్కడను దొరకదు. ఇందులో క్షత్రియుల నాపదలయందును నెట్లు వ్యవహరింపవలయునో సర్వాంగోదాహరణము కలదు. పాండవులు కేవలము రాజ్యముకొఱకే యిందఱు రాజులను సంహరించిరని

లోకులనుకొనుచుందురు. ఈ వాదమును ధనము, శాస నము మాత్రమే సమస్తము ననుకొనువారు చేయుచుందురు. శుద్ధ సత్వమును ఘోర తమోగుణమును బయట కొక్కటి గనే కనంబడుచుండును. ఆధ్యాత్మిక జ్ఞానము లేనివారు, ఆ రెండు పరిస్థితుల నొక్కటిగనే భావించి వర్ణించుచుందురు. వారి ధర్మప్రచారమునకు సహాయపడుచుందురు. ఆది కృత యుగమున నిప్పుడున్నట్లు వర్ణభేదములుగాని, ఆశ్రమ భేద ములు గాని లేనిమాట నిజమే. ఆ సమయమున రాజును లేఁడు. ఇంతింత పెద్దపెద్ద భవనములును లేవు. భోగ్య సామ గ్రులును నింతగా లేవు. కాని యీ యసభ్యత లేదు. అజ్ఞాన జన్మస్థితి లేదు. ఘోర ఉన్నతి కలదు. జ్ఞానముయొక్క పరమ ప్రకాశముండెడిది. కణాదముని వృక్షముక్రింద నివ సించెడువాఁడు. కపోతమువలె నొక్కొక్క గింజ నేరుకొని తిని బ్రతికెడువాఁడు. వల్కల వస్త్రమునకు సంబంధించిన గోపీనముండెడిది. భోగసామగ్రి యేదియును దగ్గఱ లేకుండె డిది. ఇప్పుడజ్ఞాని దరిద్రుఁ డజ్ఞానియగు దరిద్రుడు నిర్ధనతా కారణమునఁ జినిఁగిన గుడ్డలను ధరించి గింజ లేరుకొనుటకు బయలుదేరుటయును, ఏదో చెట్టుక్రిందఁ బడియుండుటయును జూచినచోఁ గణాదుని స్థితియును వీని స్థితియును నొక్కటి గనే గనఁబడును; కాని వాస్తవమున నది జ్ఞానియొక్క

పూర్ణస్థితి. ఇది అజ్ఞానియొక్క పూర్ణస్థితి ఆతడపరిగ్రహము యొక్క స్వరూపము. ఈతఁడసమర్థత యొక్క స్వరూపము. పాశ్చాత్యుల యొక్క భ్రమ ఇప్పుడు నిత్యనూతన ఉన్నతినిఁ బొందుచున్నామని. నిత్యనూతన ఆవిష్కారములను గావించుచున్నాము. ఇదియే యున్నతి యందురు. యథార్థముగ నాలోచించినచో నిది ఉన్నతి కాదు, అవనతి. ప్రకృతికి జాలదూరముగఁ బోయితిమి. ఇదే విధముగ ఆది కృతయుగమున వర్ణవ్యవస్థ లేదనుట సత్యమే. కాని యిప్పుడు వర్ణాశ్రమ ధర్మమున గలుగు హ్రాసము అధర్మమునకును అజ్ఞానమునకును ద్యోతకమగుచున్నది. క్షత్రియుల ధర్మమేమనఁగా నాతఁడనాపద కాలమందు ప్రజారక్షణ మొనర్చి, దానివలన బన్నులమూలమున నేది లభించునో దానిద్వారా జీవింపవలయును. ఇంకొక విధమున నిర్వాహ మొనర్పరాదు. వర్ణాశ్రమ ధర్మమందు వృత్తికి చాల బలముకలదు, నిజమునకు వృత్తినిఁ గాంచియే వర్ణనిర్ణయ మొనర్పవలయును. శిల్ప, కళా సంబంధమగు కార్యములు సంకరవర్ణములవారి కార్యములు. ఇనుపవస్తువులను జేయుటయును, చిత్రములను వ్రాయుటయును, విగ్రహములను జేయుటయును, సంగీతమునకు సంబంధించిన కార్యములును, ఇతర చేతిపనులు, ఇండ్లు కట్టుటయును,

మృత్తిక తోడను, దారువు తోడను, అన్యధాతువుల తోడను వస్తువులను నిర్మించుటయును, గుడ్డలకు రంగు వేయుటయును, అద్దకములును, చాపలల్లుటయును, దారమును వడుకుటయును, నేయుటయును నివియన్నియు సంకర వర్ణములవారి కార్యములు. సేవా సంబంధమగు కార్యములన్నియును శూద్రులొనర్చెడువారు. కృషి, గోరక్షా వాణిజ్యములను వైశ్యులొనర్చెడువారు. రాజ్యసంబంధములగు కార్యములను క్షత్రియు లొనర్చెడివారు, భూమిపతి, భూమిధరుఁడు క్షత్రియుఁడుగనే యుండెడువాఁడు. దానమందును, ఇంకొక విధముగ గ్రామమును బొంది భూమిపతి బ్రాహ్మణుఁడు గావచ్చును. అసమర్థులైనపుడు ఆపద్ధర్మములచేఁ దమ ఆజీవికను నిర్వహించుకొనెడువారు. ప్రజాపాలన మొనర్చి ఆజీవికను నిర్వహించుకొనుటయే క్షత్రియ ధర్మము. అసమర్థుఁడైనపుడు బ్రాహ్మణవేషమును వేసికొని భిక్షమడుగుకొనుటయు, నధ్యాపనమును జేయవచ్చును. ఒకవేళ భిక్షమడుగుకొనుటలో లజ్జవేసినచో నరణ్యమున నుండవచ్చును. అచ్చట వేఁటాడి జీవింపవచ్చును. పాండవులీ ధర్మము నెంతటి యుత్తమముగ నిర్వహించిరో విచారింపుఁడు. దుర్యోధనుఁడు పాండవులను గొల్చుటకై లాక్షాగృహమునకుఁ బంపెను. అచ్చటి నుండి వారు తప్పించుకొని పోయిరి. ఇప్పుడు వారెట్లుజీవింపఁ గలరు? ఆ సమయమున వారి కాపద సంభవించినది. కావున

బ్రాహ్మణవేషములను ధరించి భిక్షముతో బ్రదుకుచుండిరి. వారెవరికిని సేవచేయలేదు. వారికి ద్రౌపదితో వివాహము జరుగఁగనే వారి ఆపత్తు తప్పిపోయెను. ఇప్పుడువారు భిక్ష మడుగుకొనుటను మానివైచిరి. వారు ప్రజాపాలన మొన ర్చుచు జీవించెడువారు. ధృతరాష్ట్రుఁ డర్ధరాజ్యము నొసం గెను. ధర్మపూర్వకముగఁ బ్రజాపాలన మొనర్చుచు రాజ్య మును జేయుచుండిరి.

ఆ రోజులలో క్షత్రియుని నింకొక క్షత్రియుఁడు యుద్ధ మునకు గాని, జూదమునకుగాని పిలిచినచోఁ బోకపోయిన నది పిరికితనముగ నెంచు సదాచారముండెడిది. క్షత్రియులు దానిని హాస్యాస్పదముగ నెంచెడువారు. దుర్యోధనుఁడు పిలువఁగా ధర్మరాజు క్షత్రియధర్మమని భావించి ద్యూత మాడుటకుఁ బోయి ఓడిపోయెను. తమ ప్రతిజ్ఞప్రకారము వనమునకుఁ బోయెను. ఇప్పుడు వారు బ్రాహ్మణవేషమును ధరించి భిక్షమడుగుకొనెడువారు కారు. వారి రాజ్యము హరింపఁబడెను. ఇప్పుడు వారికి వేఁటచే జీవించుటయే మిగిలి పోయెను. వారు హరిణములను జంపి వానినిఁ దినుచు, నా మాంసముతోడనే అతిథిసత్కార మొనర్చుచుండిరి. దీనివలన హరిణములు చాల దుఃఖించెను. అవి వారి నీ వనమును వీడి వెడలిపోవలసినదని ధర్మరాజుతో మొఱపెట్టుకొనెను. అంత

ధౌమ్య మహాముని చెప్పఁగా సూర్యారాధనమును గావించిరి. ఒక పాత్ర లభించెను. దానితోడనే జీవించుచుండిరి. వనవాస నిర్ణయము పూర్తికాఁగానే వారికి మరల ధర్మ చింత కలిగెను. వారికి యుద్ధము చేయుట యిష్టము లేదు. దుర్యోధనునితో నిట్లనిరి:- "నీవు మాకైదు గురకును నైదూళ్ళనిమ్ము. మేము నీ యధీనమున నుండి క్షాత్రధర్మ మును బాలించుకొనుచు దినములను గడిపెదము." దుర్యో ధనుఁడు దీనికిని అంగీకరింపలేదు. చివరకు ధర్మ రక్షణ కొఱకు, తాము రాజపుత్రులగుటచే భిక్షము నెత్తుకొనక, చివరకు యుద్ధమునకే సిద్ధపడిరి. వారు రాజ్యము కొఱకే పోరాడవలసి యుండిన శ్రీకృష్ణుని నేయిరువది గ్రామములనో, యీయవలసినదని కోరెడువారే. తమ మామయగు ద్రుప దుని నైదూళ్ళనిమ్మని కోరెడువారే, కాని యిట్టిది క్షత్రియ ధర్మమునకు విరుద్ధమైనది. సమర్థుఁడై యుండియును దన పైతృక రాజ్యమును వీడి యెవఁడు యాచించునో, అట్టి క్షత్రియునకుఁ బాపము సంభవించును. ఇదంతయు నాలో చించి వారు యుద్ధమును గావించిరి. చివరకు వారు జయించిన రాజ్యమును వదలి ధర్మరక్షణము కొఱకు వీరసన్యాస మును గ్రహించి వనమునకుఁ బోయిరి. వారికిరాజ్యలోభము లేదు. క్షత్రియ ధర్మలోభమే వారికి కలదు, తాము

క్షత్రియవృత్తి ద్వారా బ్రదుకవలయుననియే వారి అభిలాష."

సూతుఁ డిట్లనెను:- "మునులారా! క్షత్రియ వృత్తిని గూర్చి చెప్పుచు భగవానుఁ డుద్ధవునితో నిట్లనెను:- "ఉద్ధవా! క్షత్రియవృత్తి ప్రజలనుండి దండ శుల్కములను గ్రహించి జీవించుట. ఒకానొక రాజు యొక్క రాజ్యము శత్రువులచే హరింపఁ బడినచో నాతఁడు బ్రాహ్మణ వృత్తి చేతను నిర్వహించుకొనవచ్చును; కాని దానమును బట్టరాదు, యజ్ఞమును జేయింపరాదు. అధ్యయనమును జేయింపవచ్చును. ఇతరుల కస్త్ర శస్త్రములను నేర్పి జీవింపవచ్చును. శ్యమంతకమణి కారణమునఁ గ్రుద్ధుఁడై బలరాముఁడు మిథిలాపురియందు చాల సంవత్సరములుండి, అచ్చట రాజకుమారులకు యుద్ధ విద్యను, నస్త్ర శస్త్రములను నేర్పి జీవననిర్వాహము కావించుకొనెను దీనివలనను నిర్వాహము జరుగకుండినచో నడవులకుబోయి ఫలములను దెచ్చికొనియో, వేఁటాడియో బ్రదుకవలయును. చాల దరిద్రము వచ్చి, కుటుంబ భరణ పోషణములు జరుగకుండినచో నాపత్కాలమున వైశ్య వృత్తి నవలంబింప వలయును. వ్యవసాయ మొనర్చియు, గోపాలన మొనర్చియు, వ్యాపారమును జేసికొనియు దన జీవితమును నడుపుకొనవచ్చును. కాని శూద్ర వృత్తి నవలంబింపరాదు క్షత్రియుని పరమధర్మము

ఇతరులను రక్షించుట, యుద్ధమందు వీపు చూపకుండుట, యుద్ధమును గాంచి భయపడకుండుట, ప్రజలు తమ ఆదాయములో నాలవవంతును బన్నుగా నొసంగిన దానితోడనే జీవింపవలయును. ఏ క్షత్రియుండీ ధర్మమును పాలించునో, ఆతఁడింటిలో నుండియును స్వర్గమున కధికారియగును."



శ్రీకృష్ణ భగవానుఁ డుద్ధవునితోఁ నిట్లనెను:- "ఉద్ధవా! నేనత్యంత సంక్షేపమున క్షత్రియ స్వభావమును గూర్చియు, వారి వృత్తిని గూర్చియుఁ జెప్పితిని. ఇప్పుడు నీవేమి వినఁదలచుచున్నావు?"



ఉద్ధవుఁ డిట్లనెను:- "స్వామీ! ఇప్పుడు నేను వైశ్య వర్ణ స్వభావమును, వారి వృత్తినిఁ గూర్చి వినఁదలఁచుచున్నాను. కావున నాకు వైశ్య స్వభావమును వృత్తిని గూర్చి చెప్పుఁడు."



శౌనకాది మునులతో సూతుఁ డిట్లనెను:- "ఋషులారా! ఇప్పు డేవిధముగ భగవానుఁడు వైశ్య వర్ణము యొక్క స్వభావమును, వృత్తిని గూర్చి వర్ణించెనో దానిని గూర్చి మీకు జెప్పెదను. మీరందఱును సమాహిత చిత్తులరై వినుఁడు."

